శ్రీః

# కథాకాసారం

– సౌభాగ్య




**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః

**కథాకాసారం**

– సౌభాగ్య

ప్రథమముద్రణ : **03.07.2012** గురుపూర్ణిమ, నందననామ సం॥
ప్రతులు : **500**
పేజీలు : **220**
వెల రూ. : **135.00**


**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA - 523157
Cell :**94401 15411, 9052256311, 08594 - 234038**

**SOWBHAGYA**
**Hyderabad**
**Cell: 9848157909**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

*"జీవి*

*జీవించాలి.*

*జీవితమున్నది జీవించటానికే. ఆలోచించటానికి కాదు.*

*జీవితముంటే అన్నీ ఉన్నట్లే. జీవన రహస్యం ఆమోదం.*

*జీవితం నిరంతరం కాంతులీనుతుంది"*

*అని అంటాడు ఓషో*

*అధ్యయనం, అధ్యాపనం, అనుష్ఠానాలే జీవితం.*

**– రామోరా**





## ఓషో

మన ప్రాచీన గ్రంథాల్లో ఎన్నో అద్భుతమయిన కథలు, గాథలు ఉన్నాయి. వేదాల్లో, ఉపనిషత్తుల్లో, పురాణాల్లో అసంఖ్యాక కథలున్నాయి. అట్లాగే యితర మత గ్రంథాల్లోను ఉన్నాయి. వీటన్నింటినీ సందర్భోచితంగా తన ఉపన్యాసాల్లో ఓషో చెప్పారు. ఆయనకు చిన్నతనం నుంచీ కథలంటే ఎంతో ప్రాణం. ఏ ఆధ్యాత్మికవేత్తకూ లేని సాహిత్య, కళారంగాలతో ఓషోకు గాఢమైన పరిచయముంది. సైన్సు పరిజ్ఞానముంది. ఆయా రంగాల్లోని ఆ వ్యక్తుల పరిశోధనాంశాలు ప్రసక్తానుప్రసక్తంగా ఓషో ఆసక్తిగా వివరిస్తారు.

దేన్నయినా కథగా చెప్పడం ఆయన కళ. ఈ కథల్లో విజ్ఞానదాయక మయినవి, వినోదాత్మకమయినవి, వివేకాన్ని కలిగించేవి ఎన్నో ఉన్నాయి. మన మనసును వికసింపజేయడం ఆయన లక్ష్యం. అందుకని కొన్ని కథలు మనకు చురకలంటిస్తాయి. చురుక్కుమంటాయి.

సామాజిక నియమనిబంధనల్ని అతిక్రమించడం అన్నది ఓషో కథల్లో కనిపిస్తుంది. మనం ఈ అనంతవిశ్వంలో భాగాలం. స్వేచ్ఛ మన ఊపిరి. ఈ కథలన్నీ మనలో చైతన్యాన్ని మేలుకొలిపేవి. మనకు ధైర్యసాహసాల్ని యిచ్చేవి. ఎవరికీ తలవంచకుండా మనిషి జీవించాలి. వ్యక్తి కేవలం తనకు మాత్రమే బాధ్యుడు.

ప్రేమ ఉన్న వ్యక్తిలో స్వేచ్ఛ ఉంటుంది. నిజమైన స్వేచ్ఛలో వినయ ముంటుంది. **మనిషి సమాజం చెప్పినట్లు కాదు హృదయం చెప్పినట్లు నడుచుకోవాలంటాడు ఓషో.** ఆయన కథలన్నింటిలో అంతస్సారం అదే. మన ప్రాచీన గాథలే కాక సూఫీ, జెన్, హసీదిజం తదితర మతాలనుండి, మత శాఖల నుండి ఆయన అపూర్వ కథలను మనకు అందించాడు.

ఈ కథలేవీ ఆయనవి కావు. కానీ ప్రతి చిన్నదాన్నీ సొంతం చేసుకోవడం ఆయన ప్రతిభ. ఆయన జీవితం తెరిచిన పుస్తకం. 'ప్రపంచంలో అందరికన్నా ఎక్కువ మాట్లాడిన వాణ్ణయినా నేను మాటల మనిషిని కాను' అన్నాడాయన.

ఆయన చెప్పిన మణిపూసల్లాంటి కథల్ని నావిగా తీసుకుని మన తెలుగులో మనసారా చెప్పాను.

పూనాలోని ఓషో ఆశ్రమంలో ఆయన సమాధిపై యిలా రాసి ఉంది.

**'ఓషో జన్మించలేదు, మరణించలేదు. ఆయన ఈ లోకాన్ని డిసెంబరు 11, 1931 నుండి జనవరి 19, 1990 మధ్యకాలంలో సందర్శించారు'.**

ఆచార్య రజనీష్ తరువాత భగవాన్ రజనీష్‌గా మారి చివర్న తనపేరును 'ఓషో'గా మార్చుకున్నాడు. ఓషో అంటే 'ఆకాశం పూలవానతో ఆశీర్వదించిన వ్యక్తి' అని అర్థం. ఆనందకరమయిన బాల్యం, అపూర్వ చైతన్యం, జీవితాంతం మహాసాహసం, అంతులేని జ్ఞానం ఆయన్ని మహోన్నత వ్యక్తిగా నిలిపాయి.

ఓషో జీవితంలో లక్షగ్రంథాలు చదువుకున్నాడు. మత, తాత్త్విక, సాహిత్య, సామాజిక సంబంధమయిన గ్రంథాల్ని చదివాడు. ప్రపంచంలోని అన్ని మతాల్ని గాఢంగా పరిశీలించాడు. జీవన సారాంశం ఆనందమని; అభిప్రాయాలు, కుటుంబ సంబంధాలు సామాజిక నిబంధనలు ధూళిలాగా ఆ ఆనందాన్ని కప్పి ఉంటాయి. ఆ ధూళిని తప్పిస్తే ప్రతి మనిషీ ఆనందమే అన్నాడాయన. బుద్ధునితో తీవ్రంగా ప్రభావితుడయిన వ్యక్తి ఓషో. ఆధ్యాత్మికతకు శాస్త్రీయతను యిచ్చిన బుద్ధుడంటే ఓషోకి ప్రేమ.

ఓషో ప్రభుత్వాన్ని, ప్రపంచాన్ని లెక్కపెట్టని సాహసి. ఎన్నో వైరుధ్యాలకు, సంచలనాలకు కేంద్రబిందువుగా ఉన్నాడు. జీవితం ప్రవాహం లాంటిది. అనుక్షణం మారుతూ ఉంటుందన్నాడు. అంతరిక్షం వేసిన జోక్ జీవితమన్నాడు.

వేల కథలతో, వేల జోక్సుతో ఆయన ఉపన్యాసాలు సాగేవి. ఆయన ఉపన్యాసాలు 680 పుస్తకాలుగా వచ్చాయి. మతాలపై, వ్యక్తులపై, సాహిత్యకారులపై ఆయన ఉపన్యాసాలున్నాయి.

ఆధ్యాత్మికతకు కళని, కవిత్వాన్ని జోడించిన ప్రతిభాశాలి. ఆకర్షణ ఉత్సాహంగా మేళవించిన మేధావి. మనకు తెలియని ఎన్నో కథల్ని, ఎన్నో సందర్భాల్లో ఆయన చెప్పాడు. ఆ కథల్ని రేఖామాత్రంగా తీసుకుని నా స్వీయవ్యాఖ్యానంతో మీ ముందుంచుతున్నాను. ఆనందించండి.

ఆధ్యాత్మికత పట్ల అంతులేని మమకారమున్న **"రామోరా"**గారు అవ్యాజప్రేమతో అనంత శ్రమకోర్చి ఈ కథల్ని అందరికి అందుబాటులోకి తెస్తున్నారు. వారికి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను.

– సౌభాగ్య







## 1. మహావృక్షం

ఒక మహావృక్షం ఉండేది. దాని కొమ్మలు ఆకాశమంతా విస్తరించాయి. కొమ్మలు పూలతో పులకరించేవి. పిట్టల కేరింతలతో ఆ వృక్షం పులకరిస్తూ పరవశంగా ఉండేది. సీతాకోకచిలుకలు పాటల్లా దానిమీద తేలుతూ ఉండేవి.

ఒక పసివాడు రోజూ ఆ చెట్టు దగ్గరకు వచ్చేవాడు. ఆ చెట్టు తల్లిలా అతనికోసం కొమ్మల్ని అందించేది. సీతాకోకచిలుకల్తో ఆడుకునేవాడు. పిట్టల కేరింతలతో ఆనందించేవాడు. కొమ్మల్ని పట్టుకుని ఊయలలూగేవాడు.

చెట్టు రోజూ అతనికోసం ఎదురుచూసేది. అతను వస్తే తల్లిలా అతన్ని దగ్గరికి తీసుకునేది. కబుర్లు చెప్పేది. తినడానికి పళ్ళనిచ్చేది.

పసివాడు క్రమంగా పెద్దవాడయ్యాడు. హాయిగా చెట్టు క్రింద విశ్రాంతి తీసుకునేవాడు. పళ్ళు తినేవాడు. పూలను కోసి కిరీటంలా అలంకరించేవాడు. మరింత పెద్దవాడయ్యాక అతనికి స్నేహితులు ఏర్పడ్డారు. మెల్లమెల్లగా ఇతర వ్యాపకాలతో చెట్టు దగ్గరికి రావడం తగ్గించాడు. ఒకరోజు చెట్టుముందు నుంచీ వెళుతూ ఉంటే అది అతడ్ని చూసి నీకోసం ఎన్నో రోజులనుంచి ఎదురుచూస్తున్నాను. కానీ నువ్వు రావడం లేదు. ఎందుకని"? అంది.

అవును "నీ దగ్గరికి ఎందుకు రావాలి? నాకు అవసరాలు పెరిగాయి. నాకు డబ్బు కావాలి. నీ దగ్గర డబ్బు లేదు. నేను నీ దగ్గరకొచ్చి ప్రయోజనమేమిటి?" అన్నాడు.

ప్రేమ ఒక్కటే తెలిసిన వృక్షం అతని పరిస్థితికి బాధపడింది. "నువ్వంటే నాకు ప్రేమ. నువ్వు నా దగ్గరకి రావడం ఒకటే చాలు. ఇంకేమీ వద్దు. నా దగ్గర బోలెడు పళ్ళు ఉన్నాయి. అవన్నీ కోసి తీసుకెళ్ళు. అమ్ముకో. నీకు బోలెడు డబ్బులు వస్తాయి. తీసుకో" అంది.

అతను చెట్టుకు ఉన్న పళ్ళన్నీ కోసుకుని తీసుకెళ్ళి అమ్ముకున్నాడు. కనీసం కృతజ్ఞత చెప్పడం కూడా తెలుసుకోలేదు.

చాలా రోజులు గడిచిపోయాయి. మళ్ళీ అతను ఆ చెట్టువైపే రావడం మానేశాడు. ఏళ్ళు గడచిపోయాయి. చెట్టు మమకారంతో అల్లాడిపోయింది. అతని దగ్గర డబ్బులున్నాయి. వాటిని మరిన్ని డబ్బులు చేసుకునే ప్రయత్నంలో పడ్డాడు.

ఒకరోజు ఆ దారంటే వచ్చాడు. అతన్ని చూసి "చెట్టు పొంగిపోయి ఎన్నాళ్ళకి వచ్చావురా. నన్ను ఆలింగనం చేసుకో" అంది. అతను "నేను పసివాణ్ణి కాను. నేనిప్పుడు ఇల్లు కట్టుకునే ఆలోచనలో ఉన్నాను" అన్నాడు.





వృక్షం "నాయనా! నా కొమ్మలు నీకేమైనా పనికొస్తాయేమో వాటిని నరుక్కుని తీసుకెళ్ళు" అంది. అతను రెండో ఆలోచన లేకుండా చెట్టుకొమ్మలన్నీ నరుక్కుని కృతజ్ఞత కూడా ప్రకటించకుండా వెళ్ళిపోయాడు. వృక్షం కాండం మాత్రమే మిగిలింది.

ఎన్నో ఏళ్ళు గడిచిపోయాయి. అతను చెట్టు ముఖమే చూడలేదు. కాండం గుండెలా కొట్టుకుంది. అతన్ని చూడాలని తపించింది.

అతను కూడా వృద్ధుడయిపోయాడు. ఒకరోజు మళ్ళీ ఆ దారంటే వెళుతూ కనిపించాడు. వృక్షం అతన్ని చూసి పులకించి "ఎలా ఉన్నావు? ఎన్నేళ్ళయింది. నా దగ్గరికిరా" అంది.

అతను "నేను పడవ ప్రయాణం చేసి దూరదేశాలకు వెళ్ళి డబ్బు సంపాదించాలనుకుంటున్నాను. నా దగ్గర పడవలేదు. నువ్వు ఎలాంటి సాయం చెయ్యలేవు కదా!" అన్నాడు. వృక్షం "నా కాండం తీసుకెళ్ళి పడవ తయారుచేసుకో. కానీ ఎప్పుడయినా నా దగ్గరికి రా" అంది.

అతను కాండాన్ని కోసి పడవచేసుకుని సముద్రంపై దూరదేశాలకు వెళ్ళిపోయాడు. ఆ చెట్టు ఒక అరుగులాగా మాత్రమే మిగిలింది. అది అతనికోసం ఎంతగానో ఎదురుచూసింది. కానీ అతనెప్పుడూ తిరిగి రానేలేదు.

నేనొక రోజు దాని దగ్గరికి వెళితే "నా మిత్రుడు మళ్ళీ నా దగ్గరికి రానేలేదు. బహుశః అతనికి ఇవ్వడానికి నా దగ్గర ఏమీ లేదని అతను తెలుసుకున్నట్లున్నాడు" అంది.

**అతనికి తీసుకునే భాష మాత్రమే తెలుసు. ఇచ్చే భాష ప్రేమకు మాత్రమే తెలుసు.**

## 2. ప్రయోగం

ఎప్పుడూ బహిరంగంగా, ప్రయోగాత్మకంగా ఉండాలి. అంతకు ముందు అడుగు పెట్టని దారిలో నడవడానికి సిద్ధపడి ఉండాలి. ఎవరికి తెలుసు? ఒకవేళ ఆ ప్రయత్నం ఫలితం లేనిది. పనికి మాలింది కావచ్చు. ఐతే కానీ అదొక అనుభవంగా మిగుల్తుంది.

సుప్రసిద్ధ శాస్త్రవేత్త థామస్ ఆల్వా ఎడిసన్. దాదాపు మూడేళ్ళపాటు ఒక ప్రయోగం చేశాడు. ఆ ప్రయోగాన్ని ఏడువందల సార్లు చేశాడు. అన్ని సార్లూ ఆ ప్రయోగం విఫలమైంది. అతనితోటి శాస్త్రవేత్తలు, విద్యార్థులు విపరీతంగా విసిగిపోయారు. కానీ ఎడిసన్ అదేమీ పట్టనట్లు ప్రతిరోజూ ఉల్లాసంగా ల్యాబ్‌కు వచ్చేవాడు. మళ్ళీ ఆ ప్రయోగాన్ని మొదలుపెట్టేవాడు. నిజంగా అది మన ఊహకు అందదు. అప్పటికి

ఏడువందలసార్లు చేశాడు. మూడు సంవత్సరాలు వ్యర్థమయ్యాయి. ఇక ఈ ప్రయోగం ఎట్లాంటి ఫలితాన్నీ ఇవ్వదని అందరూ తీర్మానించుకున్నారు. ఇంతకు మించిన పనికిమాలిన పని ఉండదని అభిప్రాయపడ్డారు. కానీ ఎడిసన్‌లో ఎట్లాంటి చిరాకూ, విసుగూ లేదు.

ఇక ఓపిక నశించి శాస్త్రవేత్తలు, విద్యార్థులు అందరూ కలిసి ఎడిసన్ దగ్గరికి వెళ్ళి "సర్! ఇప్పటికి ఈ ప్రయోగం విషయంలో మనం ఏడువందలసార్లు విఫలమయ్యాం. ఎట్లాంటి ఫలితము రాలేదు. ఇంకా కొనసాగించడం అవసరమా? ఇక దీన్ని వదిలేస్తే మేలు" అన్నారు.

ఎడిసన్‌కు పట్టరానంత నవ్వు వచ్చింది. ఆయన వాళ్ళని చూసి మీరేమంటున్నారు? ఇక్కడ విఫలమయ్యామని మీరంటున్నారా? ఈ ప్రయోగంలో ఏడువందల విధానాలు పనికిరావని మనం తెలుసుకున్నాం కదా! ప్రతిరోజు ఫలితానికి మనం దగ్గరవుతున్నాం. సత్యాన్ని సమీపిస్తున్నాం. ఆ ఏడువందల తలుపులు తట్టకుంటే మనకు తెలుసుకునే మార్గం ఉండేది కాదు. ఇప్పుడు ఆ ఏడువందల తలుపులూ లాభం లేదని తెలిసింది. ఇదీ మనం సాధించిన గొప్ప విజయం!" అన్నాడు.

ఇది మౌళికమయిన శాస్త్రీయదృష్టి. ఒకటి తప్పని నువ్వు తెలుసుకుంటే సత్యానికి దగ్గరయ్యావన్న మాట. నువ్వు సరాసరి వెళ్లి ఆర్డరివ్వడానికి సత్యం మార్కెట్‌లో దొరకదు.

అది రెడీమేడ్‌గా దొరికే వస్తువు కాదు. నువ్వు ప్రయోగం చేయాలి. ఎప్పుడూ ప్రయోగాత్మకంగా ఉండాలి. సత్యం దొంగచాటుగా దొరికేది కాదు. **నువ్వు చేసేది సమగ్రమయిందని ఎప్పుడూ అనుకోవద్దు. ఎప్పటికీ సమగ్రం కాదు. ఎప్పుడూ దాన్ని అభివృద్ధి పరిచే వీలుంటుంది. దాన్ని మరింత సమగ్రం చేసే అవకాశముంటుంది.**

## 3. జీవితం సరళమైంది

జీవితం సరళమైంది. చెట్లు కూడా జీవిస్తాయి. జీవితం చాలా సామాన్యమైంది. కానీ ఆ జీవితం మనకెందుకని సంక్లిష్టంగా కనిపిస్తుంది. ఎందుకంటే దాన్ని మనం సంక్లిష్టంగా మార్చాం.

**చిక్కని జీవితంలో గాఢమయిన అనురాగభరితమైన జీవితంలో నువ్వు జీవితానికి సంబంధించిన అన్ని ఫిలాసఫీల్ని వదిలిపెట్టాలి. సిద్ధాంతాల్ని వదిలిపెట్టాలి. ఆదర్శాల్ని వదిలిపెట్టాలి. లేకుంటే నువ్వు మాటల మబ్బుల వెనక మసకబారిపోతావు.**

కాళ్ళ జెర్రికి సంబంధించిన కథ విన్నావా? అదొక మనోహరమయిన ఉదయం. లేత కిరణాలు భూమిని తాకుతున్నాయి. కాళ్ళజెర్రి ఉల్లాసంగా సాగుతోంది. బహుశః





మనసులో పాటపాడుకుంటూ ఉన్నట్లుంది. దగ్గర్లో ఒకరాతి మీద ఒక కప్ప కూచుని ఉంది.

అది కాళ్ళజెర్రి సరసరా పాక్కుంటూ వెళుతుంటే ఆశ్చర్యపోయి చూసింది. విస్తుపోయింది. తన రాతిమీదనే ముందుకు అతికష్టం మీద రెండడుగులు వేసి మళ్ళీ కాళ్ళజెర్రిని చూసింది. తన కాళ్ళని చూసింది. కాళ్ళజెర్రికున్న లెక్కలేనన్ని కాళ్ళను చూసింది. బహుశః ఆ కప్ప ఫిలాసఫరయి ఉంటుంది. ముందుకు సాగిపోతున్న కాళ్ళజెర్రిని చూసి "ఆగు! కాసేపు ఆగు!" అంది. కాళ్ళజెర్రి ఆగింది.

కప్ప దాంతో "నువ్వు గొప్ప అద్భుతాన్ని ఆవిష్కరిస్తున్నావు. వందకాళ్ళు! వంద కాళ్ళతో ఎట్లా నడుస్తున్నావు? ఏ కాలు ముందు కొస్తుంది? ఏ కాలు వెనక్కి వెళుతుంది. ఒక కాలుకు యింకో కాలు తగలదా? ఒకదాని తరువాత ఇంకో కాలు ఎలా ముందుకు వేయగలుగుతున్నావు?నాలుగు కాళ్ళున్న నాకే నడవాంటే నరకం కనిపిస్తోంది. నువ్వు అనాయాసంగా నడిచేస్తున్నావు. నీకు అయోమయం అనిపించదా? ఎట్లా మేనేజ్ చెయ్యగలుగుతున్నావు? నాకయితే ఇది అసాధ్యమనిపిస్తోంది" అంది.

అంతా విని కాళ్ళజెర్రి నివ్వెరపోయింది. "నేనెప్పుడూ దాన్ని గురించి ఆలోచించనే లేదు. నువ్వు చెప్పాకా తెలుస్తోంది. ఆ ఇబ్బందుల గురించి కాసేపు ఆలోచించుకోనీ" అంది. వణుకు పుట్టింది. కాలు కదలడం లేదు. కాలుతీసి కాలు ముందుకు వెయ్యలేకపోయింది. పైగా ఒకటి కాదు, వంద కాళ్ళు! ఎట్లా నడుస్తున్నాను అని నిశ్చేష్టంగా నిలబడిపోయింది.

**ఫిలాసఫీ మనుషుల్ని నిర్జీవుల్ని చేస్తుంది.** జీవితానికి ఫిలాసఫీ అక్కర్లేదు. తత్వచింతన అవసరం లేదు. **జీవించడానికి జీవితం చాలు.** దానికి ఎట్లాంటి ఊతకర్రలూ, చేతికర్రలూ అక్కర్లేదు. ఎట్లాంటి ఆధారమూ అక్కర్లేదు. ఎట్లాంటి నిరూపణలూ అవసరం లేదు. జీవించడానికి జీవితం చాలు.

అలాగే మనిషి తాను ఎలా జీవిస్తున్నాడో అలా జీవిస్తే చాలు. **ఒక మనిషి మరో మనిషికి బాధ కలిగించకపోతే చాలు. మనం జీవిస్తున్నట్టే అనుకోవచ్చు. అలా కాక మరో మనిషిని చంపి మనం జీవిస్తుంటే అంటే ఇంకో మనిషిని ఆందోళనకు గురిచేసి హాయిననుభవిస్తున్నామనుకుంటే ఈ జీవి జీవితాన్ని గురించి ఆలోచించి తీరాలి.** ఏ తత్వమైనా, హితోపదేశమైనా నీవు నన్ను తెలుసుకొని జీవించు అనే చెప్తుంది. దాన్ని అర్థం చేసుకుని జీవిస్తే ఆనందకరమైన జీవితం అవుతుంది. మనం సంతోషంగా ఉండాలి. ఇతరులను ఆనందంగా ఉండనీయాలి. **మనకు ఎదుటివారికి ఆనందం ఇవ్వలేకపోయినా**

**ఫర్వాలేదు కాని వారి ఆనందాన్ని చెరపివెయ్యకపోతే అదే పదివేలు.** ఇది అర్థం చేసుకుంటే చాలు మన జీవితం సరళమవుతుంది.

## 4. అవసరాలు - కోరికలు

కోరికలు లెక్కలేనన్ని ఉంటాయి. అవసరాలు కొన్నే ఉంటాయి. అవసరాల్ని తీర్చుకోవచ్చు. కానీ కోరికల్ని తీర్చుకోలేం. కోరిక అన్నది పిచ్చెక్కించే అవసరం. దాన్ని సంతృప్తి పరచడం అసంభవం. నువ్వు వాటిని తీరుస్తూ వెళ్ళేకొద్దీ అవి పెరుగుతూనే ఉంటాయి. వాటికి అంతముండదు.

ఒక అద్భుతమైన సూఫీ కథ ఉంది.

అలెగ్జాండర్ ద గ్రేట్ చనిపోయి స్వర్గానికి వెళ్లాడు. వెళుతూ తను లెక్కలేనన్ని యుద్ధాల్లో కొల్లగొట్టిన సంపదల్ని, బంగారాన్ని వజ్రాల్ని తనతోబాటు తీసుకెళ్లాడుట. ఇది నిజం కాదు. కథ. ఈ బరువుతో అలెగ్జాండర్‌కు భారంగానే ఉంది.

అవన్నీ చూసి అక్కడి ద్వారపాలకుడు నవ్వి "ఎందుకు నువ్వు ఇంత బరువును మోసుకొచ్చావు? నీకు కష్టంగా లేదా?" అన్నాడు. అలెగ్జాండర్ "కష్టమేముంది? ఇదంతా నేను ప్రపంచాన్ని జయించి సంపాదించింది" అన్నాడు. ద్వారపాలకుడు సరే! నీ సంపదని నువ్వు సాటిలేనిదని అంటున్నావు. చూద్దాం" అ త్రాసును తీసుకొచ్చి ఒక వేపు అలెగ్జాండర్ తెచ్చిన సంపదనంతా పెట్టాడు. ఒక కన్ను తీసుకొచ్చి మరోవేపు పెట్టాడు. ఆ కంట్లోంచి ఎడతెగని ఆశ కనిపిస్తోంది. అలెగ్జాండర్ సమస్త సంపదకన్నా కన్నే చాలా బరువుతూగింది. అలెగ్జాండర్ సంపద తేలిపోయింది.

ఇదంతా చూసి అలెగ్జాండర్ ఆశ్చర్యపోయాడు. ఏమిటిది? ఎందుకిలా జరిగింది?' అన్నాడు ద్వారపాలకుడు. ఇది మనిషి కన్ను. ఇది మనిషి కోరికకు ప్రాతినిధ్యం వహిస్తుంది. దానికి తృప్తి ఉండదు. దాన్ని సంతృప్తి పరచడం అసాధ్యం. ఎంతగొప్ప రాజ్యమయినా, ఎంత గొప్ప సంపదయినా, ఎంత గొప్ప ప్రయత్నమయినా దాన్ని తృప్తి పరచడం అసంభవం అంటూ కొంత దుమ్ముతీసి ఆ కంట్లో చల్లాడు. అప్పుడు ఆ కన్ను మూసుకుంది. వెంటనే బరువు కోల్పోయింది.

కేవలం అవగాహన అన్న చిన్న ధూళిని కోరిక అనే కంట్లో చల్లాలి. అప్పుడు కోరిక మాయమై అవసరాలే మిగిలి ఉంటాయి. అవి బరువుగా ఉండవు. తేలికగా ఉంటాయి. అవసరాలు కొన్నే. అవి అద్భుతంగా ఉంటాయి. కోరికలు అసహ్యంగా ఉంటాయి. అవి నరరూపరాక్షసుల్ని తయారుచేస్తాయి. అవి పిచ్చివాళ్ళని తయారు చేస్తాయి. దుర్మార్గుల్ని సృష్టిస్తాయి.



**ప్రశాంతతని ఎట్లా ఎన్నుకోవాలో నువ్వు తెలుసుకుంటే నీకో చిన్నగది చాలు. అంత అన్నం చాలు. కొన్ని బట్టలు చాలు. ఒక ప్రియమయిన వ్యక్తి చాలు.**

## 5. ఏకపాత్రాభినయం

మతభావనతో ఉండటం కష్టం. కారణం అక్కడ నువ్వు ప్రయోగంగా, ప్రయోగ వాదిగా ఉండాలి. శాస్త్రకారుడిగా, ప్రయోగంగా ఉండాలి.

లోపల ఎట్లాంటి ఏర్పాటు ఉండకూడదు. నువ్వు ఏకపాత్రాభినయం చేస్తున్నావు.

సాధారణంగా నాటకంలో చాలామంది నటులుంటారు. పాత్రలు వేరువేరుగా ఉంటాయి. ఏకపాత్రాభినయంలో నువ్వొక్కడివే ఉంటావు. అన్ని పాత్రలూ నువ్వే నటించాలి.

'బొకుజు' అన్న జైన్ గురువు ఉండేవాడు. ఆయన ప్రతిరోజూ ఉదయాన్నే నిద్రలేచి 'బొకుజు! ఎక్కడున్నావు?' అని పిలిచేవాడు. మళ్లీ తనే 'యస్ సర్! నేను యిక్కడే ఉన్నాను' అనేవాడు.

అప్పుడు మళ్ళీ 'బొకుజూ! గుర్తుంచుకో! నీకు ఇంకోరోజు ఇవ్వబడింది. జాగ్రత్తగా ఉండు. మెలకువతో ఉండు. చురుగ్గా ఉండు. తెలివితక్కువగా ప్రవర్తించకు' అనేవాడు. దానికి మళ్లీ తనే 'యస్ సర్! అలాగే!' నా శక్తి కొద్దీ మీరు చెప్పినట్లు ఉండడానికే ప్రయత్నిస్తాను" అనేవాడు.

అక్కడ ఆయన ముందు ఎవరూ ఉండేవాళ్ళు కారు.

ఆయన శిష్యులు రోజూ ఆ ప్రసంగాన్ని గమనించేవాళ్ళు. గురువుగారికి తలతిక్క అనుకునేవాళ్ళు. కానీ ఆయన ఏకపాత్రాభినయం చేస్తున్నాడు. అది ఆయన అంతరంగ స్థితి. చెప్పేవాడూ నువ్వే, వినేవాడూ నువ్వే! అధికారీ నువ్వే, బానిసా నువ్వే! అది నిజంగా చాలా కష్టం! కారణం పాత్రలు కలిసిపోతాయి. దాటిపోతాయి. ఎవరయినా అనుసరించే వాళ్ళుంటే లీడర్‌గా ఉండటం సులభం. పాత్రలు వేరయితే విషయాలు స్పష్టంగా ఉంటాయి. ఏదీ చేయిదాటి పోదు. నువ్వు నీ పాత్ర ముగించాలి. ఆవిడ ఆవిడ పాత్ర ముగించాలి. అది సులభం.ఇక్కడి పరిస్థితి నిర్హేతుకం.

నువ్వు రెండు పాత్రలు పోషించాల్సి వస్తే. పరిస్థితి సహజంగా ఉంటే, నిర్హేతుకం కాకుంటే విషయం మరింత సంక్లిష్టంగా మారుతుంది. కానీ క్రమక్రమంగా తెలుసుకుంటావు. బొకుజు చేసింది అదే. తన ఉద్వేగాల గురించి ఆయనకు తెలుసు. తన పరిమితులు తనకు తెలుసు. హద్దులు దాటకుండా తనని తాను హెచ్చరించుకోవడం ఆయన నేర్చిన విద్య.

## 6. నిత్యహరితం

ఏది మతం? మన మనకునేది ఏదీ మతం కాదు.

ఈ క్షణానికి చెందిన వాస్తవమే నిజమైన మతం.

నువ్వు విషాదాన్ని పొందితే అప్పుడు భవనసముదాయం మధ్యలో నిత్యహరిత వృక్షం ఉన్నట్లు ఛోఛో అన్న జెన్ మాస్టర్‌కు సంబంధించిన సుప్రసిద్ధమయిన కథ ఉంది.

ఒక శిష్యుడు ఛోఛో దగ్గరికి వచ్చి తనకొక సందేహం ఉందన్నాడు. గురువు "సందేహం మంచిదే. ఏమిటది?" అన్నాడు.

శిష్యుడు "నిజమైన మతమేది?" అని అడిగాడు.

గురువు చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. ఏమీ మాట్లాడలేదు.

అది పున్నమి రాత్రి. ఆకాశంలో మేఘాలు లేవు. చంద్రుడు మెల్లగా పైకి వస్తున్నాడు. గురువు ఆకాశాన్ని చూశాడు. తిరిగి "భవనసముదాయం మధ్యలో నిత్యహరిత వృక్షాన్ని చూడు" అన్నాడు. కొమ్మల్లో కదిలాడు. "అంత అపూర్వ సన్నివేశ ఆవిష్కారం అద్వితీయం. అసాధ్యం" అన్నాడు.

గురువు చెప్పిన సమాధానం శిష్యుడికి అర్థం కాలేదు. చిరాకు వేసింది. తను అడిగిందేమిటి? ఆయన చెప్పిందేమిటి? అనుకున్నాడు.

శిష్యుడు "గురువుగారూ! నేను అడిగిన ప్రశ్న వేరు. మీరు చెప్పిన సమాధానం దానికి సంబంధించింది కాదు. నేను నిత్యహరిత వృక్షం గురించి, అంటే సైప్రస్ చెట్టు గురించి అడగలేదు. లేదా చందమామ అందచందాల గురించి అడగలేదు. నా ప్రశ్నకు, మీరిచ్చిన సమాధానానికి సంబంధం లేదు. నేనడిగింది నిజమైన మతమంటే ఏమిటి? మీరు నా ప్రశ్నను మరచిపోయినట్లున్నారు" అన్నాడు.

మళ్ళీ గురువు చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. కాసేపయ్యాకా శిష్యుణ్ణి చూసి "భవనసముదాయం మధ్యలో సైప్రస్ చెట్టును చూడు" అన్నాడు.

మళ్ళీ అదే సమాధానం వచ్చేసరికి శిష్యుడికి దిక్కు తోచలేదు.

గురువు సమాధానాలుంటాయి. అవి ప్రశ్నలతో సంబంధం లేనివి. అవి వివరించలేనివి. విశ్లేషించలేనివి. చెప్పలేనివి. చెప్పడానికి అందనివి. నిజమైన మతం ఇప్పుడు ఇక్కడ ఉంటుంది. ఈ క్షణానికి సంబంధించిన యథార్థమైన నిజమైన మతం. కాబట్టి దిగులుగా ఉంటే "భవనసముదాయం మధ్య ఉన్న సైప్రస్ చెట్టును చూడు.





కేవలం దాన్ని చూడు. అంతకుమించి చెయ్యాల్సిందేమీ లేదు. చూడటమన్నదొకటే ఎన్నో రహస్యాల్ని బహిర్గతం చేస్తుంది. ఎన్నో ద్వారాల్ని తెరుస్తుంది" అన్నాడు.

## 7. విశ్రాంతి

మనుషులు అంతులేని శ్రమలో మునిగి ఉండడమే కాదు. విశ్రాంతి పొందే సమయముంటుంది. అనంత ఆహ్లాదాన్ని అందుకునే ఘడియలుంటాయి. **మనుషులు మరీ గంభీరంగా ఉండకూడదు. సీరియస్‌గా ఉండకూడదు. అది అనారోగ్య లక్షణం. నవ్వుతూ ఉండడం జీవలక్షణం.** విశ్రాంతి సమయంలో పద్ధతులు, ప్రణాళికలూ ఉండవు. విరామమే విస్తరించి ఉంటుంది.

ఒక గొప్ప జెన్ గురువు ఉండేవాడు. ఆయనకు దేశంలో ఎంతో గొప్ప పేరు ఉండేది. చైనా దేశ చక్రవర్తి కూడా ఆయన పట్ల భక్తి ప్రపత్తులు ప్రదర్శించేవాడు. ఒకసారి చక్రవర్తికి ఆ జెన్ గురువుని చూడాలన్న కోరిక కలిగింది. వెంటనే మందీ మార్బలంతో గురువుగారి ఆశ్రమానికి వెళ్లాడు. ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడి దృశ్యం చూసి చక్రవర్తి నిశ్చేష్టుడయి పోయాడు.

ఆయన నోటమాట రాలేదు. తనెక్కడికి వచ్చాను? పవిత్రమయిన ఆశ్రమానికేనా అని ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే ఆశ్రమంలోని హాల్లో గురువు నేలమీద పడి దొర్లుతూ బిగ్గరగా నవ్వుతున్నాడు. శిష్యులు కూడా పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతున్నారు. గురువు ఏదయినా జోకు చెప్పి ఉండాలి. లేదా శిష్యుడెవరైనా ఏదో నవ్వు పుట్టించేది చెప్పి ఉండాలి. ఏది ఏమయినా చక్రవర్తికి చాలా ఇబ్బంది కలిగింది. చిరాకు వేసింది. తనకళ్ళను తనే నమ్మలేకపోయాడు. ఎందుకంటే అక్కడి వాతావరణంలో సంస్కారం లేదు. ఆశ్రమ పవిత్రత లేదు. ఆ విషయాన్ని సూటిగా గురువుతోనే చెప్పాడు.

"ఇది అమర్యాదకరంగా ఉంది. మీలాంటి గురువు నుంచీ ఇది ఊహించ లేకుండా ఉన్నాను. గౌరవనీయమైన ప్రవర్తన మీరే నేర్పాలి. అట్లాంటిది మీరే నేలమీదపడి దొర్లుతున్నారు. పిచ్చివాడిలా పగలబడి నవ్వుతున్నారు. మీ శిష్యులంతా మీతో కలిసి అల్లరి చేస్తున్నారు" అన్నాడు.

గురువు చక్రవర్తిని పరిశీలించాడు. గురువు ఏం సమాధానం చెబుతాడా? అని చక్రవర్తి చూశాడు. గురువు చక్రవర్తి విల్లంబులు ధరించి ఉండడం గమనించాడు. ప్రాచీన కాలంలో రాజులకు అది ఆనవాయితీ. గురువు "చక్రవర్తి గారూ! నాకో విషయం చెప్పండి. మీరు ఈ వింటిని ఎప్పుడూ సంధించి అప్రమత్తంగా ఉంటారా? లేక మామూలుగా భుజానికి తగిలించుకుంటారా?" అని అడిగాడు.

చక్రవర్తి "దాన్ని అవసరమయినప్పుడు సంధిస్తాం. ఎప్పుడూ సంధించి పెడితే అది సాగేగుణాన్ని కోల్పోతుంది. వదులవుతుంది. అప్పుడెందుకూ పనికిరాదు. దాన్ని విశ్రాంతిగా వదలాలి. ఎప్పుడు కావాలో అప్పుడు సంధించి సిద్ధం చేయాలి" అన్నాడు.

రాజుగారు చెప్పిన మాటలు విన్నాడు గురువు.

గురువు ఒకే మాటలో సమాధానం చెప్పాడు. **"నేను చేస్తున్నది అదే!"**

## 8. ఇప్పుడేం చేయాలి

నువ్వేదయినా చేస్తున్నప్పుడు, ఏదయినా చెక్కుతున్నప్పుడు, ఏదయినా చిత్రిస్తున్నప్పుడు, ఏదయినా శిల్పీకరిస్తున్నప్పుడు నువ్వు దాంట్లో అదృశ్యమవుతావు. అది నీ ఆనందం. నీ ధ్యానం. అది ఎప్పుడు పూర్తవుతుందో అప్పుడు సహజంగా నువ్వు తిరిగి మనసు దగ్గరికి వెళతావు. మనసు **'ఏమిటి విషయం'** అని అడగడం మొదలు పెడుతుంది.

గిబ్బన్ ప్రపంచ ప్రసిద్ధ చరిత్రకారుడు. రోమన్ సామ్రాజ్య చరిత్ర రచన చేశాడు. దానికోసం ముప్పయ్యేళ్ళు శ్రమించాడు. ఎన్నో గ్రంథాల్ని పరిశీలించాడు. రోమనగరంలో ఉండి ఎన్నో పరిశోధనలు చేసి ఎంతో విషయసేకరణ చేశాడు. తన జీవితకాలంలో అధికభాగం ఆ రచన కోసమే గడిపాడు. రోజుకు నాలుగు గంటలు మాత్రమే పడుకునేవాడు. ఇరవై గంటలపాటు పనిచేసేవాడు. ముప్పయ్యేళ్ళు కష్టపడి ఆ రచన పూర్తి చేశాడు. ఆ పని పూర్తయ్యాకా అతను ఏడ్చాడు. అది చూసి అతని భార్య ఆశ్చర్యపోయింది. శిష్యులు విస్తుపోయారు.

వాళ్ళు "ఎందుకేడుస్తున్నారు?" అని అడిగారు. నిజానికి అందరూ అంతగొప్ప పని పూర్తయిందని ఆనందంగా ఉన్నారు. ఆయన శ్రమ ఫలించిందని సంతోషపడు తున్నారు. ఎందుకంటే అప్పటిదాకా తెలియని కొత్త విషయాల్ని ఆయన పరిశోధించి రోమన్ చరిత్రను ప్రపంచానికి అందించాడు. కానీ గిబ్బన్ ఏడుస్తూ "నేను చేస్తున్నపని పూర్తయింది. ఇప్పుడు నాకేమీ పనిలేదు. నేనేం చెయ్యాలి?" అన్నాడు. అతని రోమన్ చరిత్ర అతనికి గొప్ప కీర్తి ప్రతిష్టల్ని తెచ్చిపెట్టింది. కానీ? "తరువాత ఏం చెయ్యాలి?" అన్న తపనతో అతను తపించాడు. తరువాత మూడేళ్ళకే చనిపోయాడు. కారణం అతనికి చెయ్యాల్సిన పని ఏమీ లేకపోయింది. అతను ఎప్పుడూ యువకుడిగానే ఉన్నాడు. ఏరోజు అతని పని పూర్తయిందో అప్పుడు ముసలివాడయిపోయాడు. ప్రతి సృష్టికర్తకీ ఇది జరుగుతుంది. గొప్ప అనురాగంతో చిత్రకారుడు చిత్రాన్ని మొదలుపెట్టి అది పూర్తయ్యాకా, "ఇప్పుడేం చెయ్యాలి?' అనుకుంటాడు. చిత్రాన్ని చిత్రించడంలోనే





ఆనందాన్ని చూడగలిగే గొప్ప చైతన్యం, మెలకువ అవసరం. అక్కడ ఎట్లాంటి ఫలితమూ లేదు. అంతము, ఆరంభమూ రెండూ వేరు కావు.

నువ్వు దేన్నయినా ఆనందిస్తూ ఉంటే దానికి సంబంధించిన విషయం ఆనందమే. అంతకు మించి ఏమీ అడక్కు. ఆశించకు. అంతకు మించి నీకు ఏం కావాలి? చేసే విధానంలోనే సాధించడం కూడా ఉంది. నువ్వు దానిగుండానే ఎదిగావు. నువ్వు అందుకోవాల్సింది అదే. నువ్వు దానిగుండా లోతుకు వెళ్ళావు. నువ్వు అందుకున్నదదే. నీ అస్తిత్వానికి మరింత సన్నిహితంగా వచ్చావు. నువ్వు సాధించింది అదే. అందుకున్నది అదే.

**స్పృహతో ఉండు. మెలకువతో ఉండు. అర్థం లేని ఆలోచన అదృశ్యమై పోతుంది.**

## 9. నాగసేనుడు

నాగసేనుడు గొప్ప బౌద్ధ సన్యాసి. ఆయన జ్ఞానం దశదిశలా వ్యాపించింది. ఎన్నో దేశాల నుండి ఆయన బోధనల్ని వినడానికి జనం వచ్చేవాళ్ళు. ఆయన కీర్తివిని మిళింద చక్రవర్తి ఆయన్ని తన ఆస్థానానికి ఆహ్వానించడానికి తన మంత్రుల్ని పంపాడు. వాళ్ళు నాగసేనుని ఆశ్రమానికి వచ్చి మిమ్మల్ని మా మిళింద చక్రవర్తి సగౌరవంగా తన ఆస్థానానికి తీసుకురమ్మని చెప్పాడు. తన ప్రణామాల్ని మీకు తెలుపమన్నాడు. 'మీరు చక్రవర్తి ఆస్థానానికి తప్పక వచ్చి ఆయన్ని, మమ్మల్ని ఆశీర్వదించాలి' అన్నారు.

నాగసేనుడు వాళ్ళని చూసి "మీరు రమ్మంటే, మీ చక్రవర్తి కోరితే నేను మీతో ఆ స్థానానికి రావడానికి నాకు అభ్యంతరం లేదు. తప్పకుండా వస్తాను. ఐతే మీరు నాగసేనుణ్ణి రమ్మంటున్నారు. అట్లాంటి వ్యక్తి ఎవరూ ఇక్కడ లేరు. నాగసేనుడు అన్నది ఒక పేరు మాత్రమే. అది కూడా కొంతవరకే ఉనికిలో ఉంటుంది" అన్నాడు.

మొత్తానికి మంత్రులు సిద్ధం చేసిన రథం మీద నాగసేనుడు బయల్దేరాడు. మంత్రులు ముందుగా వెళ్ళి చక్రవర్తితో నాగసేనుని రాక గురించి చెప్పారు. నాగసేనుడు చెప్పిన విషయాల్ని వివరించారు.

"పిలిచారు కనుక తను వస్తానని, నాగసేనుడు అన్నది పేరు మాత్రమేనని అటువంటి వ్యక్తి లేదని, ఆ పేరు కూడా కొంతకాలమే ఉంటుందని అతను చెప్పిన మాటల్ని" చక్రవర్తికి వివరించారు. చక్రవర్తి ఆశ్చర్యపోయాడు. నాగసేనుడు చిత్రమయిన మనిషి అనుకున్నాడు.

అంతలో నాగసేనుడున్న రథం ఆస్థానద్వారం వద్ద ఆగింది. చక్రవర్తి మిళిందుడు స్వయంగా సింహాసనం దిగి ద్వారం దగ్గరకెళ్ళి నాగసేనుణ్ణి ఆహ్వానించాడు.

"నాగసేనులవారూ! దయచేయండి! మా అభివాదాలు స్వీకరించండి!" అన్నాడు చక్రవర్తి. ఆ మాటలు విని నాగసేనుడు నవ్వాడు. చక్రవర్తిగా చిత్రంగా "ఎందుకు మీరు నవ్వుతున్నారు?" అన్నాడు. నాగసేనుడు "మీరు నాగసేనుడు అన్న, అతన్ని ఆహ్వానిస్తున్నారు. కానీ ఇక్కడ నాగసేనుడు అన్నవాడు ఎవడూ లేడు" అన్నాడు. చక్రవర్తి "మరి నా ఆహ్వానాన్ని అంగీకరించింది ఎవరు? నా ఆస్థానానికి వచ్చింది ఎవరు?" అన్నాడు.

నాగసేనుడు చక్రవర్తిని ఆస్థానద్వారంలో ఉన్న రథం దగ్గరికి తీసుకుపోయి నేను వచ్చిన రథమిదే కదా!" అన్నాడు. చక్రవర్తి అవునన్నాడు'. గుర్రాల్ని విప్పేయండి" అన్నాడు. గుర్రాల్ని విప్పేశారు. నాగసేనుడు గుర్రాల్ని చూపించి 'రథం యిదా' అన్నాడు.

గుర్రాలు రథమెట్లా అవుతాయి స్వామీ" అన్నాడు చక్రవర్తి. గుర్రాల్ని దూరంగా పంపారు. రథానికున్న చక్రాల్ని తొలగించమన్నాడు. నాగసేనుడు, దాన్ని చూపి "ఇది రథమా?' అన్నాడు. చక్రవర్తి కాదన్నాడు. అట్లా ఒక్కో భాగాన్ని తొలగించి అడుగుతూ పోతే అవేవీ రథం కాదన్నాడు చక్రవర్తి.

అట్లా క్రమంగా రథం మాయమయిపోయింది.

అప్పుడు నాగసేనుడు చక్రవర్తిని చూసి దేనికదిగా విడదీసి చూస్తే రథం మాయమయిపోయింది. సంయోగం వల్ల రథానికి అస్తిత్వమేర్పడింది. అట్లాగే ఇక్కడ 'నాగసేనుడు' అంటూ లేడు. వివిధ శరీరాంగాల సమ్మేళనంతో అతనికి ఒక రూపు వచ్చింది. ఆ రూపానికి ఒక పేరు పెట్టబడింది. అది ఒక ఆహ్వానానికి ప్రతినిధి. ఒక ప్రత్యేకతకు ప్రతినిధి. అక్కడ నేను ఉంది. నేనుకు స్వతంత్రుడైన ఉనికి లేదు. అట్లాగే నాగసేనుడికి కూడా అన్నాడు.

నాగసేనుడి వివేకానికి చక్రవర్తి తలవంచాడు.

## 10. అదృష్టం

అతనికి చేపలు పట్టడం వృత్తి. రోజూ ఉదయాన్నే లేచి సరంజామానంతా సిద్ధం చేసుకుని నదీతీరానికి వెళతాడు. గాలం, వల, ఎరలు అన్నీ సిద్ధం చేసుకుంటాడు. అది అతని రోజువారీ కార్యక్రమం. సంవత్సరాలు తరబడి అతను చేస్తున్నపని. దొరికిన చేపల్ని ఊళ్ళోకి వెళ్ళి అమ్ముకోవడం. సరుకులు తీసుకుని ఇంటకి వెళ్లడం. కుటుంబ పోషణ భారమంతా అతని మీదే.





ఇట్లా ఉంటే ఒకరోజు ఎప్పట్లా చేపల వేటకు బయల్దేరాడు. నదీ తీరానికి వచ్చాడు. చుట్టూ చూశాడు. చాలా చీకటిగా ఉంది. మరీ ముందుగా నిద్రలేచి పరిగెత్తుకుంటూ వచ్చినట్లు తెలుసుకున్నాడు. తన తొందరపాటుకు తనే నవ్వుకున్నాడు. కాసేపయ్యాకా వల విసురుదామని ఆలోచనల్లో పడ్డాడు.

మనిషి ఆలోచనల్లో పడి మొదట అతని మనసులోకి వచ్చేది కుటుంబమే. తన భార్యాబిడ్డలు మనసులో మెదిలారు. తరువాత వృద్ధులయిన తన తల్లిదండ్రులు గుర్తుకొచ్చారు. ఇంకా సూర్యోదయం కాలేదు. చీకట్లో నదీ ప్రవాహ శబ్దం వినిపిస్తోంది. ఉట్టినే నదిలోకి రాయి విసురుదామని పక్కన ఏదయినా రాయి దొరుకుతుందేమోనని తడిమాడు. ఒక చిన్ని సంచిలాంటిది చేతికి తగిలింది. సాయంత్రాలు పిల్లలు నదీతీరంలో ఆడుకుంటూ రాళ్ళను సేకరిస్తూ ఉంటారు. ఎవరో కుర్రాడు సంచి మర్చిపోయినట్లున్నాడు అనుకుని ఆ చిన్ని సంచి విప్పి ఒకరాయి తీసి నదిలోకి విసిరాడు. బుడుంగుమని శబ్దం వచ్చింది. ఆ సంచిలో దాదాపు యాభై రాళ్ళదాకా ఉన్నట్లున్నాయి. ఒక్కోరాయి విసరడం. అది బుడుంగుమని శబ్దం చేయడం మనసులోని ఆలోచనలకు ఒకరకమయిన వెసులుబాటు కలిగినట్లనిపించింది.

ఎవరు ఎన్ని ఆలోచనలు చేసినా మనిషికి కొత్త ఆలోచనలంటూ రావు. ఆలోచనలంటేనే పాతవి. ఆ పాతవాటి నించీ తప్పించుకోవాలంటే మనిషి ఏదో చేయాలి. చర్యలోనే మార్పు ఉంటుంది.

అతను మెల్లిమెల్లిగా సంచిలోని రాళ్ళను ఒక్కొక్కటిగా విసురుతూ పోతున్నాడు. ఆకాశంలోని నక్షత్రాలు ఒక్కొక్కటిగా మాయమవుతున్నాయి. మెల్లమెల్లగా సంధ్యాకాంతులు మొదలయ్యాయి. పక్షుల కలకలం మొదలయింది. తనపని ఆరంభించే సమయం వచ్చిందని సంచిలోని చివరి రాయి నదిలోకి విసిరి పని ప్రారంభిద్దామనుకుని ఆ రాయిని నదిలోకి విసరబోయాడు. సూర్యకిరణం ఆ రాయిమీద పడి మెరుపులా మెరిసింది. చూస్తే అది రాయి కాదు వజ్రం. ధగధగలాడుతోంది. విసరబోయినవాడు ఆగాడు. ఆ వజ్రాన్ని చూసి ఇంతవరకూ తను నదిలోకి విసిరినవి వజ్రాలా అని బాధపడిపోయాడు. ఏడ్చాడు. అన్నిటినీ కోల్పోయినందుకు తల్లడిల్లిపోయాడు. తలబాదుకున్నాడు. నిజానికి అతని జీవితం బాగుపడడానికి ఆ వజ్రం చాలు. అతను తక్కినవన్నీ పోగొట్టుకున్నానే అని తపించిపోతున్నాడు. కానీ ఒకటున్నా మిగిలి ఉన్నందుకు అతను అదృష్టవంతుడనే చెప్పుకోవచ్చు.

**వ్యక్తి జీవితంలో అన్నీ కోల్పోయానని ఎప్పుడూ అనుకోకూడదు. అన్నీ కోల్పోయినా జీవితం ఉంటుంది. జీవితం ఉంటే అన్నీ ఉన్నట్లే. ఆ జీవితం దగ్గర వజ్రం లాంటి ఒక ఊహ ఉంటుంది. దాంతో మనిషి ఆనందంగా జీవితాన్ని గడపవచ్చు.**

## 11. ఎవరినైనా ప్రేమించావా?

రామానుజాచార్యులు భక్తి ప్రచారం చేస్తూ దేశం సంచారం చేశాడు. ఆ సందర్భంలో ఒకసారి ఒక గ్రామంలో బస చేశాడు. అప్పుడు ఒక వ్యక్తి వచ్చి ఆయనకు సాష్టాంగనమస్కారం చేశాడు. రామానుజుడు అతన్ని కూర్చోమన్నాడు. ఆ వ్యక్తిని చూశాడు. అతనిలో ఎంతో ఆవేశం ఆరాటం కనిపించాయి.

రామానుజుడు అతన్ని చూసి "ఎందుకు నీలో అంత ఆవేశం, అవిశ్రాంతి. ఇంతకూ నువ్వు ఏమి ఆశిస్తున్నావు?" అన్నాడు. ఆ వ్యక్తి రామానుజుడితో "స్వామీ! మీరు గొప్పవారు. దైవంతో సాన్నిహిత్యమున్న వారు. మీకు అనుకుంటే ఏదీ అసాధ్యం కాదు. మీరు ఏమైనా చెయ్యడానికి సమర్థులు. దయచేసి నాకు దేవుణ్ణి చూపించండి. నా జీవితలక్ష్యం అదే. దానికోసం నా సమస్తాన్ని వదులుకోవడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు.

రామానుజుడు అతన్ని నిర్మలంగా చూసి "నువ్వు ఎవర్నయినా ప్రేమించావా" అన్నాడు.

ఆ వ్యక్తి "స్వామీ! అట్లాంటి విషయాలపట్ల నాకు ఆసక్తి లేదు. నా జీవితలక్ష్యం దైవసాక్షాత్కారం మాత్రమే. దానికి మించి ఇంకో ఆలోచన లేదు" అన్నాడు.

రామానుజుడు నీకు తల్లిదండ్రులు, భార్యా పిల్లలు, స్నేహితులు, బంధువులు ఉన్నారా?" అని అడిగాడు.

అతను "స్వామీ! వీళ్ళందరూ అందరికీ ఉంటారు. దానికి నేను మినహాయింపు కాదు కదా!" అన్నాడు.

రామానుజుడు అందుకే అడుగుతున్నాను. "నువ్వు ఎవర్నయినా ప్రేమించావా?" అన్నాడు.

అతను "స్వామీ! మీరు మాటిమాటికీ అదే ప్రశ్న వేస్తున్నారు."

"నాకు ఈ ప్రాపంచిక విషయాలపట్ల ఆసక్తిలేదు. నేను దేవుణ్ణి చూడాలి. నా జన్మధన్యం చేసుకోవాలి. అల్ప విషయాలపట్ల నాకు దృష్టిలేదు. నా ఉన్నతలక్ష్యం దేవుడు" అన్నాడు.



అతని దృఢత్వం,మొండితనం చూసి రామానుజుడు "అయితే నువ్వు ఎవర్నీ ప్రేమించలేదంటావు?" అన్నాడు. అతను స్వామీ! నేను అట్లాంటి పనులు చెయ్యనని, చెయ్యలేదని చివరిసారిగా చెబుతున్నాను. దయచేసి ఇక ఆ విషయం వదిలి దేవుణ్ణి చూడగలిగే మార్గం చెప్పండి" అన్నాడు.

దానికి రామానుజుడు "అయ్యా! నన్ను మన్నించు. నేను నీ కోరిక తీర్చలేను. దైవాన్ని చూపగలిగే మరెవరి దగ్గరికయినా నువ్వు వెళ్ళు. ఎందుకంటే ఆ శక్తి నా దగ్గర లేదు. నువ్వు ఎవర్నయినా ప్రేమిస్తే, ప్రేమగురించి, నీకు తెలిస్తే దాన్ని మరింత అభివృద్ధిచేసి నువ్వు దేవుణ్ణి అందుకోడానికి నీకు సహకరించేవాణ్ణి. కానీ నీలో ప్రేమ అన్నది ఏ కోశానా లేదు. నీలో విత్తనమే లేకుంటే వృక్షమెలా పెరుగుతుంది. ప్రేమ లేకుంటే నువ్వు దైవాన్ని చేరుకోలేవు. అందుకో లేవు. **దేవుణ్ణి చేరే మార్గం ప్రేమ"** అన్నాడు. అతను నిరాశతో వెళ్లిపోయాడు. తల్లిదండ్రులు పిల్లల్ని ప్రేమించాలి. పిల్లలు తల్లిదండ్రుల్ని ప్రేమించాలి. కుటుంబంలో ప్రేమ వికసించాలి. ప్రపంచమే గొప్ప కుటుంబం. తన బిడ్డను ప్రేమించేవాడు ప్రపంచంలోని బిడ్డలందర్నీ ప్రేమిస్తాడు. కాబట్టి వ్యక్తి **'తను నిజంగా ఇతరులను ప్రేమిస్తున్నాడా? లేదా? అని ఆలోచించాలి. తన ప్రేమలో స్వార్థముందా? లేదా తను ఆనందంగా ఉంటూ ఇతరుల ఆనందానికి అవకాశమిస్తున్నాడా?"** అని ఆలోచించాలి.

## 12. మొదటి పాఠం

దొంగ ఎప్పట్లాగే తన సరంజామాన్ని సరి చేసుకుని దొంగతనానికి బయలు దేరాడు. అతనికి ఇరవయ్యేళ్ళ కొడుకు ఉన్నాడు. తండ్రి బయల్దేరడం చూసి కొడుకు నాన్నా! "నేను కూడా నీతో వస్తాను" అన్నాడు. తండ్రి సరే అన్నాడు.

ఇద్దరూ కలిసి బయల్దేరారు. అప్పటిదాకా కొడుకుకు దొంగతనంలోని మెలకువల్ని ఎప్పుడూ తండ్రి చెప్పలేదు. తండ్రి కొడుకుతో "ఈ రోజు పెద్ద బంగళాలో దొంగతనం చెయ్యబోతున్నాం" అన్నాడు. ఆ మాటతో కొడుకులో ఉత్సాహం రేకెత్తింది.

"నాన్నా! నువ్వు దొంగతనంలో ఎంతో ప్రావీణ్యమున్న వాడివి కదా! ఈ రోజు నాకు ఏదయినా కొత్తపాఠం చెప్పు. దొంగతనంలో మెలకువలు నేర్పించు" అన్నాడు.

"అలాగే తప్పకుండా నేర్పుతాను" అన్నాడు తండ్రి.

ఇద్దరూ కలిసి బంగళా దగ్గరకు చేరారు. నిశ్శబ్దంగా ఉంది. బాగా చీకటిగా ఉంది. దొంగ ఎంతో చాకచక్యంగా తలుపులు తెరిచి మెల్లగా లోపలికి అడుగులేశాడు. పిల్లిలా కొడుకు అనుసరించాడు. వాళ్ళిద్దరూ ఒక గదిలోకి వెళ్లారు. ఆ గదిలో మంచం

మీద ఎవరో గాఢ నిద్రలో ఉండడం చూశారు. దీపం మినుకుమినుకుమని వెలుగుతోంది. దీపం వెలుగులో కుర్చీకి ఒక చొక్కా వేలాడుతూ కనిపించింది. తండ్రి కొడుకువేపు చూసి జాగ్రత్తగా అలికిడి చెయ్యకుండా ఆ చొక్కా తీసుకురా" అన్నాడు.

కొడుకు మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఆ కుర్చీ దగ్గరికి వెళ్లాడు. తండ్రి మెల్లిగా గదినించీ జారుకుని గదికి గొళ్లెం పెట్టి బంగళాలోని ఇతర గదుల్లో తన నైపుణ్యంతో చేతికి దొరికింది తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

కొడుకు చొక్కా తీసుకుని గది బయట పడుదామంటే తలుపు గడియవేసి ఉంది. చెమటలు పట్టాయి. ఇది తన తండ్రి చేసిన పనే అని తెలుసుకున్నాడు. ఆగ్రహం కలిగింది. తమాయించుకుని బయటపడే మార్గం ఆలోచించాడు. తలుపుతట్టి గబుక్కున పక్కన నక్కాడు. పడుకున్న వ్యక్తి లేచి ఎవరో తలుపు తడుతున్నారని లేచాడు. నిద్రమత్తులో తలుపు తీశాడు. అదే అదునుగా దొంగ కొడుకు బయటపడ్డాడు. నిద్రమత్తులో ఉన్న వ్యక్తికి నిద్ర ఎగిరిపోయింది. కేకలేశాడు. ఇంట్లో జనం వచ్చారు. అందరూ కలిసి దొంగను పట్టుకోవడానికి అతని వెంట పడ్డారు.

మసక మసగ్గా ఉంది. దొంగ పరిగెడుతున్నాడు. అందరూ వెంబడిస్తున్నారు. అరుస్తున్నారు. తను దొరికిపోతానేమో అని దొంగ భయపడిపోయాడు. ఎదురుగా పెద్ద బావి ఒకటి కనిపించింది. దగ్గర్లో ఉన్న ఒక రాయిని తీసి బావిలో విసిరి సమీపంలో ఉన్న పిట్టగోడ ప్రక్కన దాక్కున్నాడు. ఆ శబ్దానికి వెంట పడిన జనం దొంగ బావిలో దూకాడని, పీడ విరగడయిందని అనుకుని వెళ్లిపోయారు. దొంగ బతికాన్రా దేవుడా అంటూ చెమటలు కక్కుకుంటూ ఇంటికి వెళ్ళి "ఎందుకలా చేశావు? తప్పించుకోవడం మీదనే దృష్టి పెట్టాను. కాబట్టి బతికి బయటపడ్డాను" అన్నాడు వగర్చుకుంటూ. దానికి తండ్రి "దొంగతనం చెయ్యడంలో ఇది మొదటి పాఠం" అన్నాడు.

## 13. అహం

చైనాని పాలించిన టుంగ్ వంశీయుల కాలంలో వాళ్ళ దగ్గర ఒక ప్రధానమంత్రి ఉండేవాడు. అతను గొప్ప రాజనీతిజ్ఞుడు. దేశవిదేశవ్యవహారాల్లో రాజుకు ఎంతో సహాయం చేసేవాడు. దేశాన్ని అల్లకల్లోలాలకు గురికాకుండా చూసేవాడు. సైనిక విషయాల్లోనూ ఎంతో నైపుణ్యం ప్రదర్శించేవాడు.

ఆ ప్రధానమంత్రికి ఎంతో గొప్ప పేరు ఉండేది. అందరూ ఆయన్ని గౌరవించే వాళ్ళు. పేరు ప్రఖ్యాతలు, గౌరవమర్యాదలు, ఐశ్వర్యం, అధికారం అన్నీ ఉన్నా ఆయనకు బుద్ధునిపట్ల భక్తి. బుద్ధుని ధర్మాలను తూచా తప్పకుండా ఆచరించేవాడు.





ఆ ప్రాంతంలో పేరుపొందిన బౌద్ధగురువు ఉండేవాడు. ఆ బౌద్ధగురువు బుద్ధుడి బోధనల్ని అకుంఠితదీక్షతో ఆచరించేవాడు. అతను బుద్ధుని బోధనల సారాంశాన్ని తెలిసినవాడు. దేశదేశాల నుంచి ఆయన దగ్గరకు ఎందరో శిష్యరికం కోసం వచ్చేవాళ్ళు.

దేశ ప్రధానమంత్రి కూడా ఆయన శిష్యుడే. ఒకరోజు గురువుగారిని దర్శించడానికి ప్రధానమంత్రి ఆశ్రమానికి వచ్చాడు. గురువుగారికి నమస్కరించాడు. పరామర్శలు అయ్యేకా ఇద్దరూ ధర్మచర్చల్లో దిగారు. ఎన్నో విషయాలు ప్రధానమంత్రి అడిగాడు. గురువు వాటన్నింటికి సమాధానం చెప్పాడు. ప్రధానమంత్రి ఎంతో ఆనందించాడు. ఇక తను బయల్దేరాల్సిన సమయం వచ్చింది. ప్రధానమంత్రి "గురువుగారూ! ఈరోజు ఎంతో హాయిగా గడిచింది. నాలో కలిగిన ఎన్నో సందేహాలకు మీరు సమాధానాలిచ్చారు. సంతృప్తి కలిగించారు. చివరిగా ఒక ప్రశ్న దానికి మీరు సరైన సమాధానమిస్తే ఈరోజు సంపూర్ణమయిందని నేను భావిస్తాను" అన్నాడు.

గురువు "దాందేముంది. అడగండి" అన్నాడు.

ప్రధానమంత్రి "అహం అంటే ఏమిటి?" అన్నాడు.

ఆ మాటతో గురువుగారి ముఖం ఎర్రబడింది. నిర్లక్ష్యంగా ప్రధానమంత్రి వేపు చూశాడు. గురువుగారి ముఖంలో రంగులు మారడం చూసి ప్రధానమంత్రి ఆశ్చర్యపోయాడు. గురువు ప్రధానమంత్రి కళ్ళలోకి చూసి "ఎంత తెలివితక్కువ ప్రశ్న వేశావు?" అన్నాడు.

ఆ సమాధానంతో ప్రధానమంత్రి షాక్ తిన్నాడు. ఊహించని ఆ సమాధానంతో ప్రధానమంత్రి ఉలిక్కిపడ్డాడు. గురువునుంచి అతను అట్లాంటి సమాధానాన్ని ఊహించలేదు. అప్పటిదాకా మర్చిపోయిన తన అధికారం, స్థాయి అన్నీ అతనికి గుర్తుకొచ్చాయి. అతన్ని ఆగ్రహం కట్టలు తెంచుకుంది. తన ఎదుట ఉన్నది తన గురువన్న విషయాన్ని కూడా అతను మరచిపోయాడు. ఒరలో ఉన్న కత్తి దగ్గరకు అతని చేయి కదిలింది. కళ్ళల్లో నిప్పులు కదిలాయి. అతని పరిస్థితి గమనించిన గురువు "ప్రధానమంత్రి గారూ! దీన్నే అహం అంటారు" అన్నాడు. దాంతో ఒక్కసారిగా ప్రధానమంత్రి ఆవేశమంతా చల్లబడిపోయింది. హఠాత్తుగా అతని పెదాలపై చిరునవ్వు కదిలింది.

## 14. మనస్సు

సుప్రసిద్ధుడయిన ఒక జైన్ గురువు ఉండేవాడు. ఆయన బోధనలు ఎందరినో ప్రభావితం చేశాయి. ఎందరో ఆయన దగ్గర శిష్యులుగా చేరి జ్ఞానోదయం పొందారు. ఆయన్ని సందర్శించడానికి దేశవిదేశాల నుంచీ ఎందరో వచ్చేవాళ్ళు.

ఆయన దగ్గరున్న శిష్యుల్లో ఒకతను చాలా శ్రద్ధగా గురువుగారు చెప్పిన మాటల్ని వినేవాడు. వాటిని అనునిత్యం ఆచరించేవాడు. ఎప్పుడో గురువుగారు చెప్పిన ఏదో ఒకమాట తనకు జ్ఞానోదయం కలిగిస్తుందని దాంతో తన జన్మ ధన్యమయిపోతుందని భావించేవాడు. ఒకరోజు శిష్యులకు గురువు బోధ చేస్తున్నాడు. అప్పుడు ఈ శిష్యుడు కూడా అక్కడ ఉండి గురువు చెబుతున్న మాటల్ని శ్రద్ధగా వింటున్నాడు.

అప్పుడు గురువు ఒక చిన్న వాక్యం చెప్పాడు. అది "బుద్ధుడే నీ మనస్సు!"

ఆ మాటతో శిష్యుడిలో ఏదో మెరుపు మెరిసినట్లయింది. దాంతో జన్మ ధన్యమయిందని భావించి ఆ ఆశ్రమాన్ని వదిలి అంతర్దృష్టి అన్వేషణలో పడి బయలుదేరాడు. ఒక పర్వతప్రాంతంలో ఒక గుడిసె నిర్మించుకొని నిరంతరధ్యానంలో నిమగ్నమయ్యాడు. సమీపగ్రామంలో భిక్షాటనకు వెళ్ళడం మినహా తక్కిన సమయమంతా ధ్యాననిమగ్నుడయి ఉండేవాడు.

ఆ రకంగా దాదాపు ఇరవై సంవత్సరాలు గడిపాడు. ఈ ఇరవై సంవత్సరాలూ ఆనాడు గురువు చెప్పిన 'బుద్ధుడే నీ మనస్సు' అన్న మాటల్ని మననం చేసుకుంటూ గడిపాడు. తన జీవితం పరిపూర్ణమయిందన్న భావన అతనిలో కలిగింది.

ఒకరోజు తన గుడిసె ముందుగా వెళుతూ ఉన్న ఒక బౌద్ధసన్యాసి విశ్రాంతి కోసం ఆగాడు. ఇద్దరూ మాట్లాడుకున్నారు.

మాటల్లో ఇద్దరూ ఒకే గురువుదగ్గర చదువుకున్నట్లు తెలుసుకున్నారు. గురువుగారు ఎలా ఉన్నారని ఇతను అడిగాడు. అతను గురువుగారి క్షేమసమాచారాలు చెప్పాడు.

మొదటి శిష్యుడు తనకు గురువుగారి బోధనలు ఎంత ప్రేరణనిచ్చిందీ చెప్పి గురువుగారు చెప్పిన 'బుద్ధుడే నీ మనస్సు' అన్న మాటలవల్ల తనకు జ్ఞానోదయమై, స్వతంత్ర చింతనతో ఇక్కడికి వచ్చి ధ్యాననిమగ్నుడయి ఇరవై సంవత్సరాలుగా ఉన్నానని అన్నాడు.

రెండో శిష్యుడు నేను కూడా గురువుగారి మాటలతో ప్రేరణ పొంది సత్యాన్వేషణలో సంచరిస్తున్నానన్నాడు. మొదటి శిష్యుడు ఆసక్తిగా "గురువుగారు నీకు ఏం చెప్పారు? నీకు ప్రేరణ కలిగించిన వాక్యాలేవి?" అని అడిగాడు.

రెండో శిష్యుడు మన గురువు 'బుద్ధుడు నీ మనస్సు కాదు' అని చెప్పారు అన్నాడు.





## 15. మానవుడు - దానవుడు

ఒకప్పుడు ఒక చిత్రకారుడుండేవాడు. అతనెంతో ప్రతిభావంతుడంటే అతను దేన్ని చూసినా యథావిధంగా చిత్రించేవాడు. అతని చిత్రాలు ఎంతో సజీవంగా ఉండేవి. అతను చిత్రకారుడేకాక ఉదాత్తమయిన ఉద్దేశాలు ఉన్నవాడు. అందర్నీ ఆనందపెట్టడమే కాదు. అందరూ మరిచిపోలేని మహోన్నతచిత్రాల్ని చిత్రించాలన్నది అతని ఆశయం. అవి మనుషులకు ఉపయోగపడాలి. వాళ్ళని ఆలోచింపచెయ్యాలి? అనుకునేవాడు.

ఓసారి ఆ చిత్రకారుడికి ఒక ఆలోచన వచ్చింది. ప్రపంచంలోకెల్లా ప్రశాంత మయిన వ్యక్తి రూపురేఖల్ని చిత్రించాలనుకున్నాడు. ఆ శాంతమూర్తిని ఎవరయినా చూస్తే వాళ్ల మనసులోని ఆందోళనలన్నీ మాయమయిపోవాలి. ఆ వదనం అంత నిర్మలంగా ఉండాలి. అతన్ని చూస్తే దైవం గుర్తుకురావాలి. అంత పవిత్రమైన రూపం కోసం అతను బయలుదేరాడు.

ఎన్నో నగరాలు చూశాడు. ఎన్నో పట్టణాలకు వెళ్లాడు. లెక్కలేనన్ని గ్రామాలు తిరిగాడు. ఎక్కడా అతనికి అతను ఊహించిన నిర్మలమయిన మనిషి కనిపించలేదు. అన్నీ ఆందోళ నిండినట్లున్న ముఖాలే. ఎక్కడా నిశ్చింతగా నిర్మలంగా ఉన్న ఒక్క ముఖం కూడా కనిపించలేదు. చాలా నిరాశతో తన ప్రయత్నం విరమించుకునే దశలో అతను ఒక గ్రామం గుండా వెళుతున్నాడు.

అక్కడ బీడు భూముల్లో గొర్రెల్ని కాచుకుంటూ ఒక కుర్రాడు కనిపించాడు. అతన్ని చూసి చిత్రకారుడు ఆగిపోయాడు. నిష్కపటమయిన, నిర్మలమయిన అతని వదనంలో గొప్ప దైవత్వం, తన్మయత్వం, సంతృప్తి కలిగించాయి. అన్నాళ్ళూ తను వెతుకుతున్న వ్యక్తి తనకు కనిపించడం తన అదృష్టంగా భావించాడు.

ఆ కుర్రాణ్ణి తన ముందు కూర్చోపెట్టుకొని తదేక దీక్షతో అతని చిత్రాన్ని వేశాడు. ఆ కుర్రాడు తన బొమ్మ చూసుకుని ఎంతో ఆనందించాడు. చిత్రకారుడు ఆ కుర్రాడికి కొంత ముట్టజెప్పి తన ప్రయత్నం సఫలమయినందుకు సంతోషించాడు. దేశవిదేశాల్లో అతని చిత్రానికి ఎన్నో బహుమతులు వచ్చాయి.

కాలం ఆగదు కదా! ఇరవయ్యేళ్ళు గడిచిపోయాయి. సృజనకారులకు ఏవో ఆలోచనలు వస్తూ ఉంటాయి. చిత్రకారుడికి ఈసారి ప్రపంచంలో కెల్లా కుర్రాడు, దుర్మార్గుడు అయిన వ్యక్తిని చిత్రించాలని కోరిక కలిగింది. అత్యంత దుర్మార్గుడు, దానవుడు ఎవరని వెతుక్కుంటూ బయల్దేరాడు.

మంచివాళ్ళని వెతకడం కష్టం. కానీ దుర్మార్గుల్ని వెదకడం కష్టంకాదు. అయితే అందరికన్నా దుర్మార్గుణ్ణి వెతకడం కష్టమే. గొప్ప దుర్మార్గుడు మన నగరంలోని జైల్లో ఉన్నాడని అతను నరరూప రాక్షసుడని ఎంతమందిని చంపాడో, ఎన్ని దోపిడీలు చేశాడో లెక్కలేదని ఎవరో చెప్పారు.

జైలు అధికారిని సంప్రదించి చిత్రకారుడు ఆ దుర్మార్గుణ్ణి చూశాడు. నల్లని కండలు తిరిగిన శరీరం, ఎర్రటి కళ్ళు, చూస్తూనే భయంవేసింది. అతన్ని మనముందు కూచోపెట్టుకుని లీనమై అతని చిత్రాన్ని గీశాడు. తను గీసిన చిత్రం చూసి తనకే భయం వేసింది. అక్కడ నించీవెళ్ళబోతుంటే ఎవరో సన్నగా ఏడుస్తున్న శబ్దం వినిపించింది.

చూస్తే ఆ దుర్మార్గుడు, గజదొంగ రోదిస్తున్నాడు. ఆ గజదొంగ చిత్రకారుడి కాళ్ళమీదపడి· స్వామీ నన్ను గుర్తుపట్టలేదా?ఇరవైఏళ్ళ క్రితం గొర్రెలు మేపుకుంటున్న నా బొమ్మగీశారు. ఇప్పుడు ఈ బొమ్మ గీశారు. ఈ ఇరవైయేళ్ళలో నేను ఎంతో పతనమయ్యానో తలచుకుని కుమిలిపోతున్నాను అని పశ్చాత్తాపపడ్డాడు. ప్రశాంత జీవితం గడిపే నేను పతనమయిపోయాను" అని పరితపించాడు.

**ప్రతి మనిషిలోనూ రెండు రూపాలుంటాయి. దేవుడుంటాడు. రాక్షసుడుంటాడు. మనిషిలో స్వర్గముంటుంది. నరకముంటుంది. మనిషి ఈ రెండింటి మధ్య వూగిసలాడుతూ ఉంటాడు. ఏది ఎన్నుకోవాలన్నది మన చేతుల్లో ఉంటుంది. మనిషికి వేరుగా మంచితనం, చెడ్డతనం ఉండవు. రెండూ మనిషిలోనే ఉంటాయి. మనం దేనికి ప్రాముఖ్యమిస్తామన్న దాని మీద జీవితం ఆధారపడి ఉంటుంది.**

## 16. చెప్పులకు నమస్కారం

ఒక వ్యక్తికి జీవితంలో ఎన్నో సమస్యలున్నాయి. కుటుంబ సమస్యలు, వ్యాపార సమస్యలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఎక్కడావేటికీ పరిష్కారం కనుచూపుమేరలో కనిపించ లేదు. ఎవరో పక్క ఊళ్ళో గొప్ప గురువులు బసచేశారని ఎందరో జీవిత సమస్యలకి ఆయన పరిష్కారమార్గాలు చూపారని, నీకు కూడా ఆయనదారి చూపిస్తాడని వెళ్ళి ఆయనను సందర్శించమని చెప్పారు.

ఆరాటంలో ఉన్న వ్యకి ఆధారం కోసం చూస్తాడు. అట్లాగే ఆ వ్యక్తికి ఆ గురువును సందర్శిస్తే తనకు శాంతి దొరక్కపోతుందా? అని ఆశ కలిగింది. ఆ ఆలోచన వచ్చిన వెంటనే బయలుదేరాడు. అది మధ్యాహ్నం. పక్కవూరికి కాలినడకన వెళ్ళినా అరగంటలో చేరుకోవచ్చు. కానీ అతనికి తక్షణం బయలుదేరాలనిపించింది. ఎండ తగ్గుముఖం పట్టాకవెళ్ళవచ్చు. కానీ అతను అప్పటిదాకా ఆగలేకపోయాడు. అంత





ఎండలోనే ప్రయాణమయ్యాడు. అరగంట ఎండలో నడిచేసరికి అతనికి చెమట పట్టింది. అలసట వచ్చింది. చిరాకు కలిగించింది. అయినా తప్పదు. ఆ ఊరు చేరి, వాకబు చేసి స్వామి వారు ఎక్కడున్నారో తెలుసుకున్నాడు.

ఒక ఇంటి ముందు తలుపు కొద్దిగా తెరిచి ఉంది. లోపల గురువుగారు గోడకు చేరగిలబడి విశ్రాంతి తీసుకుంటున్నాడు. గురువును చూసిన మరుక్షణం ఈ వ్యక్తి ఎంతో తొందరగా గురువుగారిని కలుద్దామా ఎంత తొందరగా తన జీవిత సమస్యలకు పరిష్కారం అందుకుందామా అన్న హడావుడిలో కాళ్ళకున్న చెప్పుల్ని మెల్లిగా తియ్యకుండా కాళ్ళనే విదిలించాడు.వాటిని విదిలించుకోవాలన్నంత తొందర అతన్లో కనిపించింది. ఆ విదిలించుకోవడంలో చెప్పులు పైకి లేచి తలుపుకు తగిలి పక్కనపడ్డాయి. లోపలనించీ గురువు ఆ వ్యక్తిని ఒక కంట గమనిస్తూ ఉన్నాడు. ఆ వ్యక్తి హడావుడిగా లోపలకి వచ్చి గురువు కాళ్ళమీద పడి నమస్కారం చేశాడు. గురువు కాళ్ళు ముడుచుకున్నాడు. ఆ వ్యక్తి ఆశ్చర్యపోయాడు.

గురువు "ముందు నువ్వు బయటకు వెళ్ళి నీ చెప్పులకూ క్షమాపణలు చెప్పిరా" అన్నాడు. ఆ మాటలకు ఆ వ్యక్తి గురువును చూసి "ఏమంటున్నారు? నేను చెప్పులకు, తలుపులకు నమస్కరించాలా? ప్రాణం లేని వాటికి ప్రణామం చెయ్యాలా?" అన్నాడు. గురువు వాటిని విసిరి కొట్టినప్పుడు వాటికి ప్రాణం లేదని నువ్వనుకోలేదు. వాటిని శత్రువుల్లా చూసావు. అంత కోపమెందుకు? మొదటవెళ్లి నీ అనుచితచర్య గురించి, వాటికి క్షమాపణ చెప్పిరా! లేకుంటే ఇక్కణ్ణించి వెళ్లిపో" అన్నాడు. ఆ వ్యక్తిలో కొంత ఆవేశం తగ్గింది. బయటకువెళ్ళి ఆ చెప్పులకు, తలుపులకు నమస్కరించి 'నన్ను మన్నించండి. అలసిపోయి ఆగ్రహంలో మిమ్మల్ని తక్కువగా చూశాను. నిర్లక్ష్యంగా ప్రవర్తించాను' అని వాటికి క్షమాపణ చెప్పాడు. కొంత నెమ్మదించాడు. లోపలకి వచ్చాడు.

గురువు అతన్ని ప్రేమగా చూసి ఇప్పుడు శాంతించావు. రా కూర్చో. "ప్రేమగా నువ్వు ఉంటే శాంతంతో ఉంటావు. శాంతంగా ఉంటే ఎవరేది చెప్పినా వింటావు. నీ **శాంతిలోనే నీ సమస్యలకు పరిష్కారాలు ఉన్నాయి.** మనుషుల్ని, చెట్లని, జంతువుల్ని, సమస్త ప్రకృతిని ప్రేమగా చూడు. అక్కడ నీకు శాంతి, సమన్వయం తప్ప ఏమీ కనిపించవు. ప్రేమ లేనప్పుడే సమస్యలుంటాయి. అహంకారముంటుంది. అహంకార ముంటే ఆనందముండదు. అన్నీ సమస్యలుగానే ఉంటాయి. సమస్యలు సృష్టించేది నువ్వే. పరిష్కారం నీ దగ్గరే ఉన్నాయి. నా దగ్గరికి రావడం ఒక నెపం మాత్రమే" అన్నాడు.

తన సందేహాల్ని నివృత్తి చేసిన గురువుకి అతను కృతజ్ఞతగా నమస్కరించాడు.

## 17. పరిచయం లేని స్నేహితులు

ఒక గ్రామంలో పేదవాడు ఉండేవాడు. అతనికి ఉన్న ఆస్తి అంతా ఒక గుడిసె. అందులో అతను, అతని భార్య ఉండేవాళ్ళు. కూలి చేసుకుని బతికేవాళ్ళు. ఆ పేదవాడు ఎంతో సౌమ్యుడు. ఆశలేనివాడు. పైగా తనకున్న దాంట్లో ఇతరులకు దానం చేసేవాడు. ఇతరులని ఆదుకునేవాడు.

ఒకరోజు చీకటి పడింది. భోంచేసి భార్యాభర్తలు నిద్రకు ఉపక్రమించారు. అంతలో ఉన్నట్లుండి ఉరుములు మెరుపులు మొదలయ్యాయి. వర్షం ఆరంభమయింది. అంతలో ఎవరో తలుపు తట్టారు. ఆ పేదవాడు లేచి కూచుని భార్యతో "బయట బాగా వర్షం పడుతున్నట్లుంది. ఎవరో తలుపు తడుతున్నట్లున్నారు. బహుశః పరిచయం లేని స్నేహితుడయి ఉంటాడు" అన్నాడు. అతను అందర్నీ ఆత్మీయుల్లాగే భావించే వ్యక్తి. అందుకనే "పరిచయం లేని స్నేహితుడు" అన్నాడు. భర్తతత్త్వం తెలిసిన ఆమె గుడిసె మనిద్దరం పడుకోడానికే సరిపోతుంది. ఇంకొకరు వస్తే ఇరుకవుతుంది" అంది.

పేదవాడు "అలా అనకు. నీ మనసు పెద్దయితే ఈ గుడిసె కూడా రాజభవనంలా ఉంటుంది. నీ మనసు సంకుచితమైతే రాజభవనం కూడా గుడిసెలా ఉంటుంది. వెళ్లి తలుపు తియ్యి. వర్షంతో అతను వణికిపోతున్నాడు. మనిషిని ఆదుకోవడం మనిషి ధర్మం" అన్నాడు. ఆమె వెళ్ళి తలుపు తీసింది. ముద్దగా తడిచిపోయిన ఆ వ్యక్తి లోపలికి వచ్చాడు. బట్టలు పిండుకున్నాడు. మంట రగిలిస్తే చలి కాచుకున్నాడు. మిగిలిన అన్నం పెడితే తిన్నాడు. ముగ్గురూ కూచుని మాట్లాడుకుంటూ ఉన్నారు.

వర్షం కురుస్తూనే ఉంది. ఇప్పట్లో ఆగే సూచనలు కనిపించడం లేదు. అంతలో ఎవరో తలుపు తట్టారు. ఈసారి పేదవాడి భార్య ఏమీ మాట్లాడలేదు. ఆశ్రయం పొందిన వ్యక్తి "ఇక్కడ మనం ముగ్గురు కూచోవడానికే స్థలం ఉంది. బయట ఇద్దరున్నట్లున్నారు. వాళ్ళు వస్తే మనం నిల్చోవాలి. కాబట్టి తలుపు తియ్యకపోవడమే మేలు" అన్నాడు. పేదవాడు "అయ్యా! అలా అనకు. ఈ ఇంట్లో ప్రేమ అలాగే ఉంది. కాబట్టి నీకు స్థలం దొరికింది. ఇప్పటికీ ఆ ప్రేమ అలాగే ఉంది. నువ్వు వచ్చావు కాబట్టి ప్రేమ తరిగిపోలేదు. ప్రేమ అన్నది ఇచ్చే కొద్దీ పెరిగేదే కాని తరిగేది కాదు. పైగావాళ్ళు లోపలికి వచ్చారనుకో. మనందరం దగ్గరగా ఇరుక్కున కూర్చోవచ్చు. బాగా చలిగా ఉండడం వల్ల మనకు వెచ్చగానూ ఉంటుంది. నువ్వు తలుపుకు దగ్గర ఉన్నావు కాబట్టి వెళ్ళి తలుపు తియ్యి" అన్నాడు.

అతను వెళ్ళి తలుపు తీశాడు. జోరున కురుస్తున్న వర్షంలో తడిచిన తక్కిన ఇద్దరూ లోపలికి వచ్చారు. తలలు తుడుచుకున్నారు. తినడానికి ఏమీ లేకున్నా ఒకరికి





దగ్గరగా ఒకరు కూచోవడం వల్ల వెచ్చదనం ఏర్పడింది. పరిచయాలు ఏర్పరుచుకున్నారు. ఒకరి జీవితం గురించి ఒకరు చెప్పుకున్నారు. మాటల్లోపడి మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. కూర్చునే కునుకు తీశారు.

అంతలో ఎవరో తలుపు తోస్తున్నట్లు శబ్దం వచ్చింది. అందరికీ మెలకువ వచ్చింది. తలుపు తోస్తున్నది గాడిద. అది వర్షం బారి నుంచి తప్పించుకోవాలనుకుంది. మార్గాంతరం లేదు. ఇంటి యజమాని తప్ప అందరూ ఎట్టి పరిస్థితుల్లోనూ తలుపు తీయడానికి వీల్లేదన్నారు. పైగా వచ్చింది మనిషి కాదు. జంతువు పైగా గాడిద" అన్నారు.

పేదవాడు "గొప్పవాళ్ళ యింటిముందు మనంవెళ్లి నిలబడితేవాళ్లు మనల్ని జంతువులకన్నా హీనంగా చూస్తారు. కానీ ఇది పేదవాడి గుడిసె. దీనిముందు జంతువు నిలబడినా మనిషి లాగానే చూస్తాను. కాబట్టి దయచేసి తలుపు తెరవండి" అన్నాడు.

తలుపు దగ్గరున్న వ్యక్తి 'తలుపు తెరిస్తే లోపలికి వస్తుంది. కనీసం ఒక మనిషి బయటకి పోతే కానీ గాడిద లోపలికి రాలేదు' అన్నాడు.

పేదవాడు "పరవాలేదు. అందరం కూచునే ఉన్నాం. నేను బయటికివెళతాను. అప్పుడు గాడిద లోపలికి రాగలుగుతుంది" అన్నాడు.

**ప్రేమ ఉన్న హృదయముంటే అది ప్రపంచానికే ఆశ్రయమివ్వగలుగుతుంది.**

## 18. సైకిల్

ఒక జెన్ గురువు, తన దగ్గర చదువుకునే ఐదుమంది విద్యార్థులు మార్కెట్ నుండి సైకిళ్ళు తొక్కుకుంటూ రావడం చూశారు. వాళ్ళందరి ముఖకవళికల్ని పరిశీలించాడు.వాళ్ళని ప్రశ్నించాలని అనిపించింది. వాళ్ళందరూ వచ్చి సైకిళ్ళు దిగారు. గురువుగారికి అభివాదం చేశారు.

గురువుగారు మొదట విద్యార్థులను చూసి అందర్ని కూచోమని చెప్పాడు.

విద్యార్థులు గురువుగారు ఏదో ఆసక్తికరమయిన విషయాన్ని వివరించ బోతున్నారనుకున్నారు. కాసేపయ్యాకా శిష్యులు విశ్రాంతి తీసుకున్నాకా గురువుగారు" మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. సూటిగా సమాధానమివ్వండి" అన్నాడు. శిష్యులు సరేనన్నారు.

గురువుగారు "మీరు సైకిల్ ఎందుకు తొక్కుతున్నారు" అని అడిగాడు.

ఊహించని ఆ ప్రశ్నకు అందరూ కాసేపు మౌనంగా ఉన్నారు. వారిలో మొదటి శిష్యుడు నోరు విప్పాడు.

ఈ సంచిలోని టాటోలని సైకిల్ మోస్తోంది. నేను మోసే బాధ తప్పింది. అందుకని నేను సైకిల్ తొక్కుతున్నాను" అన్నాడు.

గురువు మొదటి విద్యార్థిని అభినందించి నువ్వు చురకయినవాడివి. ముసలివాడయ్యాకా నాలాగా నీకు గూని రాదులే" అన్నాడు.

తరువాత రెండో విద్యార్థికేసి చూశాడు గురువు. రెండో విద్యార్థి "నేను దార్లో ఉన్న చెట్లని, పొలాల్ని చూస్తూ హాయిగా వెళ్లడానికి ఇష్టపడతాను. అందుకని సైకిల్ తొక్కుతున్నాను" అన్నాడు.

"గురువు నీ కళ్ళు తెరుచుకున్నాయి. నువ్వు ప్రపంచాన్ని చూశావు" అన్నాడు.

మూడో విద్యార్థి "నేను సైకిల్‌పై వెళుతూ 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ ఉంటే గాల్లో తేలుతున్నట్లుంటుంది. అందుకని సైకిల్ తొక్కాను" అన్నాడు.

గురువు "నీ మనసు ధ్యానంపై చక్రంగా సాగిపోతుంది" అన్నాడు.

నాలుగో విద్యార్థి "నేను సైకిల్‌పై వెళుతూ ఉంటే ప్రాణులన్నింటితో కలిసి పరవశంగా సాగుతున్నట్లుంటుంది" అన్నాడు.

గురువు "ఎవరికీ అపకారం చెయ్యని బంగారు బాటలో నువ్వు సాగిపోతావు" అని అభినందించాడు.

ఐదో విద్యార్థి "నేను సైకిల్‌పై వెళ్ళడానికే సైకిల్ తొక్కుతున్నాను" అన్నాడు.

ఆ మాటలు విన్న మరుక్షణం గురువు "లేచి శిష్యుడి పాదాలకు నమస్కరించి నేను నీ శిష్యుణ్ణి" అన్నాడు.

**జెన్ గురువుల మాటల్ని మన ఆలోచనల్తో అందుకోవాలంటే అవి అందవు. వాటి అర్థం కోసం మనం మన హృదయాన్ని అడగాలి.**

## 19. స్వామి రామతీర్థ

స్వామిరామతీర్థ మొదటిసారి విదేశాలకు ప్రయాణమయ్యాడు. ఆయన ఒక నౌకలో వెళుతున్నాడు. ఆ నౌకలో ఒక వృద్ధుడు కూడా ప్రయాణిస్తున్నాడు. అతను జర్మన్ దేశస్థుడు. అతని వయసు దాదాపు తొంభై ఏళ్ళుంటాయి. అతని తల నెరిసిపోయింది. చర్మం ముడతలు పడింది.

కళ్ళకు లావుపాటి అద్దాలు పెట్టుకున్నాడు. ఇవన్నీ చూసే వాళ్ళకు అతని వయసును చూపిస్తున్నాయి. కానీ దాంతో సంబంధం లేకున్నా ఆ జర్మన్ వృద్ధుడు తన పనిలో మునిగి ఉన్నాడు. రామతీర్థను ఆకర్షించిన విషయం అతన్లో ఒకటుంది.



ఏమిటంటే ఆ జర్మన్ నౌక డెక్‌మీద కూచుని చైనాభాషని నేర్చుకోవడంలో మునిగి ఉండటం. రామతీర్థను ఆకర్షించిన విషయమిది. దాదాపు తొంభైయేళ్ళ వయసులో ఈ వృద్ధుడు చైనా భాషని నేర్చుకుంటున్నాడు. స్వామిరామతీర్థకు ఎంతో ఆశ్చర్యమేసింది. ఆ వృద్ధుడు పిచ్చివాడిలా కనిపించాడు.

ఎందుకంటే చైనా భాష చాలా కష్టం. దాన్ని సమగ్రంగా నేర్చుకోవాలన్నా దానిపై అధికారం సంపాదించాలన్నా సంవత్సరాలు పడతాయి. ఆ భాషని ఈ వయసులో నేర్చుకుని అతనేం చేస్తాడు?

ఎందుకంత ఆసక్తిగా ఆ భాషను నేర్చుకుంటున్నాడు? ఇట్లా రామతీర్థ మనసులో ఎన్నో ఆలోచనలు మెదిలినా అడగడమెందుకులే అని తన ఉత్సుకతని తమాయించు కున్నాడు.

రెండ్రోజులు గడిచాయి. ఆ వృద్ధుడు ఎప్పట్లాగా డెక్‌మీదకు వచ్చి చైనా లిపిని ప్రాక్టీసు చేయడంలో మునిగిపోయాడు. ఇక ఆపుకోలేక మూడో రోజు ఆ వృద్ధుని దగ్గరకు వెళ్ళి నమస్కరించాడు. ఆ వృద్ధుడు ప్రతి నమస్కారం చేశాడు.

స్వామిరామతీర్థ 'సర్! అన్యథా భావించకండి. మీరు చేస్తున్న పని చూసి నాకు కొన్ని ప్రశ్నలడగాలనిపించింది. ఈ వయసులో మీరు చైనా భాష నేర్చుకుంటున్నారు. మంచిదే. దీన్ని నేర్చుకొని ఏం చేస్తారు? పైగా ఈ వయసులో. అవును ఇంతకూ మీ వయసెంత?' అన్నాడు.

ఆ జర్మన్ వ్యక్తి తలపైకెత్తి రామతీర్థను చూసి "భలే ప్రశ్నవేశారు. నాకు బుద్ధి తెలిసినప్పటినుండి నాకు వయసు ధ్యాస లేదు. నేను ఎంతగా ఎప్పుడూ పనిలో మునిగి ఉంటాను. నాకు ఆ ఆలోచనే రాదు. అయినా దానివల్ల లాభమేమిటి? ఎప్పుడో చావు వస్తుంది. దాన్ని గురించి ఆలోచించుకుంటూ బతుకును వదులుకోవడం ఎందుకు? బహుశః నాకు తొంభయ్యేళ్ళు ఉండవచ్చు" అన్నాడు.

రామతీర్థ "ఇప్పటికే మీరు వృద్ధులు. ఈ భాష ఎప్పుడు నేర్చుకుంటారు. ఎన్నేళ్ళు పడతాయి?" అన్నాడు.

ఆ వృద్ధుడు నేను ఈ భాషను నేర్చుకుంటున్నంతసేపు వయసు స్పృహ, మరణస్పృహ నాకు లేదు. నేను నేర్చుకుంటున్నాను. చాలా యిష్టంగా నేర్చుకుంటున్నాను. పసివాడిలా ఆహ్లాదంగా ఇష్టమయిన పని చేస్తున్నాను. **యిష్టమయిన పని చేయడమే పని ప్రయోజనం.** మరణానికి భయపడితే చేస్తున్న పని ఆపేస్తాం. తొంభై సంవత్సరాలుగా నేను నేర్చుకుంటూనే ఉన్నాను. పని చేస్తూనే ఉన్నాను. అంటే తొంభై సంవత్సరాలపాటు మరణాన్ని జయించాను.

ఏది ఎందుకు అన్న ప్రశ్నతో పనిలేదు. నచ్చిన పని చెయ్యాలి. ఆనందంగా చెయ్యాలి. అప్పుడే తొమ్మిదేళ్ళయినా తొంభయ్యేళ్ళయినా తేడా ఉండదు. చివరి క్షణం ఎప్పుడొస్తుందో ఎవరూ చెప్పలేరు.

ఆ ఆలోచన అసంగతం. తెలియని భయాన్ని కొని తెచ్చుకోవడం వెర్రితనం అని, "ఇంతకూ నీ వయసెంత?" అన్నాడు.

ఆ మాటలకు స్వామి రామతీర్థ ఖంగుతిన్నాడు.

అప్పుడు స్వామి రామతీర్థ వయసు ముప్పయి సంవత్సరాలే!

## 20. నేర్చుకోవడం

సోక్రటీసుకు మరణశిక్ష విధించారు. తన ఉపన్యాసాలతో యువకుల్ని నాశనం చేస్తున్నాడన్నది అభియోగం. ఆయన్ని జైల్లో పెట్టారు. ఆ వివేకవంతుడంటే అందరికీ గౌరవం. పేరుకు జైల్లో పెట్టారు కానీ అందరూ వచ్చి ఆయన్ని చూసి వెళుతున్నారు. శిష్య బృందమయితే అక్కడే ఉండి కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారు. కానీ ఆ తాత్వికుడు ఇదేమీ పట్టనట్లు నవ్వుతూ అందర్నీ పలకరిస్తూ కబుర్లు చెబుతూ ఉన్నాడు. అందరూ ఆయన్ని చూసి ఆశ్చర్యపోతున్నారు. మరణమంటే లక్ష్యపెట్టని ఆ మహానుభావుణ్ణి చూసి విస్తుపోతున్నారు.

మరణశిక్ష అమలుకావడానికి రెండు గంటల సమయముంది. ఆ శిక్ష విషం తాగి మరణించడం, సమయం సమీపించే కొద్దీ అభిమానుల గుండెలు కొట్టుకుంటు న్నాయి. సోక్రటీస్ ఆ సంగతే పట్టనట్లు, అది తనకు సంబంధించిన విషయమే కానట్లు ఉన్నాడు. అందరి ముఖాల్లో ఆందోళన... దిగులు... ఆయన ముఖంలో ఆనందం. వెలుగు... ఆయన కిటికీలోంచి బయటికి చూస్తూ కూచున్నాడు.

బయట చెట్టు కింద ఒక బిచ్చగాడు కూచుని లైర్ వాద్యం వాయిస్తున్నాడు. ఆ తీగల్ని మీటుతూ పాడుతున్నపాట సోక్రటీస్ మనసుని తాకింది. పరవశంగా కళ్ళు మూసుకున్నాడు. చల్లటి గాలి ఆ పాటను మోసుకొచ్చి పరిమళంలాగా సోక్రటీస్ హృదయాన్ని తాకింది. ఎప్పుడూ ఆనందంగా ఉండే అతను మరింత ఆనందపడ్డాడు.

సోక్రటీస్ మెల్లగా కళ్ళు తెరిచి జైలర్‌ని పిలిచాడు. జైలర్ ఎంతో గౌరవభావంతో దగ్గరికి వచ్చి ఏమికావాలన్నాడు. సోక్రటీస్ కిటికీలోంచి చూపించి "మీకు అభ్యంతరం లేకుంటే ఆ బిచ్చగాణ్ణి తీసుకొస్తారా?" అని అడిగాడు. జైలర్ "అయ్యో! దాందేముంది?" అని వెళ్ళి ఆ బిచ్చగాణ్ణి తీసుకొచ్చాడు.





సోక్రటీస్ ఆ బిచ్చగాణ్ణి తనకాపాట నేర్పమన్నాడు. అతని దగ్గరనుంచీ లైర్ వాద్యం తీసుకున్నాడు. ఆ బిచ్చగాడు పాటపాడాడు. సోక్రటీస్ ఆ పాట పాడుతూ లైర్ వాద్యం వాయించాడు. ఇట్లా అరగంట సాధన తర్వాత బిచ్చగాడి సాయం లేకుండానే ఆ పాట పాడాడు. సోక్రటీస్ కృతజ్ఞతలు చెప్పి బిచ్చగాణ్ణి పంపేశాడు. ఆయన శిష్యులు, జైలర్ ఆశ్చర్యపోయారు. మరణశిక్షకు ఇంకా గంట మాత్రమే ఉంది. కానీ సోక్రటీస్ ప్రవర్తన వాళ్ళకు వింతగా అనిపించింది.

శిష్యులు "గురువుగారూ! ఇక గంటలో విషపాత్ర మీ చేతికి వస్తుంది. అది తాగి మీరు ఈ లోకాన్ని వదిలిపెటి వెళ్లబోతున్నారు. కానీ ఇప్పుడు మీరు లైర్ వాయిద్యం మీద ప్రాక్టీసు చేసి పాట నేర్చుకున్నారు? ఏమిటిది?" అని కన్నీళ్ళపర్యంతమయ్యారు.

సోక్రటీస్ నవ్వి **"జీవితమంటే నేర్చుకోవడం.** మరణం గురించి ఆలోచించడం కాదు. నేను, నువ్వు ఇక్కడున్న అందరం ఎప్పుడో ఒకప్పుడో చనిపోతాం. కానీ జీవించినన్నినాళ్ళు ప్రతిక్షణం విలువైందే. ఎప్పటికప్పుడు తెలియంది తెలుసుకోవడంలోనే ఆనందముంది. గంటక్రింత నాకా పాట తెలీదు. ఇప్పుడు నేర్చుకున్నాను. ఇంకా నా జీవితంలో గంట సమయముంది. అంటే ఇప్పటికీ నేర్చుకోవడానికి నాకు అవకాశముంది" అన్నాడు.

శిష్యుల నోట మాట రాలేదు.

## 21. గుప్తనిధులు

ఒక యువకుడు ఒక సన్యాసిని దర్శించి నమస్కరించాడు. సన్యాసి ఆ యువకుణ్ణి చూశాడు. యువకుడి ముఖంలో ఎంతో నిరాశ, దిగులు కనిపించాయి. జీవితంపట్ల ఏ మాత్రం విశ్వాసం లేనట్లు నీరసించిపోయి కనిపించాడు.

సన్యాసి యువకుడితో "ఏమయింది? ఎందుకంత దిగులుగా ఉన్నావు? అన్నీ కోల్పోయినట్లు ఎందుకలా ఉన్నావు?" అని అడిగాడు.

యువకుడు "స్వామీ! నేను ఏం చేసినా కలిసి రాలేదు. ఉన్నవన్నీ పోగొట్టు కున్నాను. నా దగ్గర చిల్లిగవ్వ కూడా లేదు. దేవుడు నా దగ్గరున్నవన్నీ దోచేసుకున్నాడు. నా దగ్గర ఏమీ లేకుంటే నన్ను ఎవరూ లెక్కపెట్టరు. సంపద ఉన్నవాణ్ణే లోకం సత్కరిస్తుంది. ఇంత నిర్ధనుడిగా ఉండడం కన్నా చనిపోవడం మేలని నిర్ణయిచుకున్నాను" అన్నాడు.

సన్యాసి అంతా విన్నాడు "చూడు బాబూ! నీ దగ్గర ఎర్ర ఏగానీ లేదు. దేవుడు అంతా తీసేసుకున్నాడు. ఇక మరణం తప్ప మరో మార్గం లేదు అంటున్నావు కదా! నాకు నిన్ను చూస్తే అలా అనిపించడం లేదు. నీ దగ్గర ఎంతో సంపద ఉన్నట్లనిపిస్తోంది.

నీ దగ్గర నిధినిక్షేపాలున్నాయి. వాటిని గానీ నువ్వు అమ్మితే నీకూ లాభం ఉంటుంది. దేవుడికి కూడా చెడ్డపేరు రాకుండా ఉంటుంది." అన్నాడు. సన్యాసి మాటలకు యువకుడు ఆశ్చర్యపోయాడు. "స్వామీ! మీరేమంటున్నారు? నా దగ్గర పైసా కూడా లేకుండా నిరుపేదగా మారాను. మీరేమో నా దగ్గర నిధి నిక్షేపాలు ఉన్నట్లు చెబుతున్నారు" అన్నాడు.

సన్యాసి "లేదయ్యా! నీ దగ్గర గుప్తనిధులున్నాయి. నాకు తెలుసు. నాకు తెలిసిన ఒకరాజు ఉన్నాడు. మనం ఆయన దగ్గరకు వెళదాం, ఎందుకంటే ప్రతిదానికీ విలువ కట్టగలిగిన నైపుణ్యం ఆ రాజు దగ్గరుంది. ఆయన నీ దగ్గరున్న సంపదకు విలువ కడతాడు. దానికి సరిపడా నీకు ధనమిస్తాడు. నీకు అభ్యంతరం లేకుంటే మనం ఆయన దగ్గరకు వెళదాం" అన్నాడు.

యువకుడికి అంతా అయోమయంగా ఉంది. తన దగ్గర ఏమీలేదు. ఈ సన్యాసేమో తన దగ్గర నిధి ఉందంటున్నాడు. నాకు తెలీని నిధి నా దగ్గరెక్కడుంది? అని ఆశ్చర్యపోయాడు. చూద్దాం అని "సరే వెళదాం పదండి" అన్నాడు. దార్లో సన్యాసి నీ కళ్ళు రాజుకు నచ్చాయనుకో వాటికి యాభై వేలు ఇస్తాడు. అట్లాగే నీ మెదడు, కాలేయం, గుండె వీటికయితే లక్షరూపాయలు సరేనా?!" అన్నాడు సన్యాసి.

ఆ మాటలు వింటూనే యువకుడు ఈ సన్యాసికి పిచ్చెక్కిందని అనుకున్నాడు. "ఏమంటున్నారు? బుర్రున్న వాడెవడయినా మెదడు, గుండె అమ్ముకుంటారా? నేనే కాదు. ఎంత డబ్బిచ్చినా ఎవరూ అమ్మరు" అన్నాడు.

సన్యాసి నవ్వి "అయితే ఇంత విలువైనవి నీ దగ్గర పెట్టుకుని పేదవాడని ఎందుకు దిగులుపడతావు? ఇది అంతులేని సంపద. అమూల్యనిధి. "ఈ విలువైన సంపదను నువ్వు ఉపయోగించుకోలేకపోతే నీ దగ్గర ఎంత ధనమున్నా లాభం లేదు. ఉన్నవి ఉపయోగించుకోవడం నేర్చుకో" అన్నాడు.

ఇంకా దేవుడు మనిషికి అంతులేని సంపద నిండిన జీవితాన్ని ఇచ్చాడు. **జీవితం కంటే గొప్ప సంపద లేదు.** "జీవితంలో ఐశ్వర్యాన్ని చూడలేనివాళ్ళు బయట ఏమీ చూడలేరు!" అన్నాడు. ఆ మాటల్తో జ్ఞానోదయమై యువకుడు సన్యాసికి నమస్కరించి ఆనందంగా వెళ్ళిపోయాడు.

## 22. దయ్యం భాష

ఒక నౌక సముద్రంలో సాగుతోంది. అది దూరదేశాలు వెళుతోంది. దాంట్లో వివిధ దేశాల ప్రజలు ఉన్నారు. విదేశీయానంపట్ల ఆసక్తి కలిగినవాళ్ళు, సముద్ర





ప్రయాణాన్ని ఇష్టపడేవాళ్ళు, వ్యాపారస్థులు ఎందరో ఉన్నారు. పెద్దలు, పిల్లలు, స్త్రీలు అందరితో నౌక సందడిగా ఉంది.

వాళ్ళల్లో ఒక సన్యాసి కూడా ఉన్నాడు. ఆయన ఎన్నో ధర్మాల్ని అధ్యయనం చేసినవాడు. మనుషుల గురించి బాగా తెలిసినవాడు. ప్రశాంతచిత్తుడు. నౌక అంతా కలకలం నిండి ఉన్నా నిర్లిప్తంగా తన లోకంలో తను ఉండేవాడు. తన ఆలోచనల్తో తను మునిగి ఉండేవాడు. ఉదయం సముద్రాన్ని చూస్తూ దాని గాంభీర్యానికి తలవంచుతూ, ఆకాశాన్ని కలయజూస్తూ, సాయం సంధ్యల్ని పరిశీలిస్తూ కాలం గడిపేవాడు. దూరదేశం నించీ వచ్చిన ఆహ్వానం మేరకు అక్కడ ఉపన్యసించడానికి ఆయన వెళుతున్నాడు.

ఒకరోజు చీకటి పడబోతుంది. అది ఆయనకు ధ్యానసమయం. ఒక మూల ఎవరూ లేని చోటుకువెళ్ళి ధ్యానంలో కూర్చున్నాడు. నౌకలో రకరకాల జనం ఉంటారు. నౌక కూడా లోకం లాంటిది. ఒక కుర్రాళ్ళ గుంపు కూడా ఆ నౌకలో ఉంది. వాళ్ళు ఎప్పటినుంచో ఆ సన్యాసిని ఆటపట్టించాలని చూస్తున్నారు. ఒక మూలగా వెళ్ళి సన్యాసి కూచోవడం చూసారు. ఇది సమయమనుకున్నారు. దగ్గరగా వెళ్ళారు. సన్యాసి కళ్ళు మూసుకుని ఉండడం చూశారు. ఒక కుర్రాడు పిల్లికూతలు కూశాడు. సన్యాసి కళ్ళు తెరవలేదు. మరో కుర్రాడు కాగితపు ఉండల్ని సన్యాసిపై విసిరాడు. సన్యాసి పట్టించు కోలేదు. ఇద్దరు కుర్రాళ్ళు గంతులువేస్తూ పాటలు పాడారు. సన్యాసి పట్టించుకోలేదు. దాంతో కుర్రాళ్ళ అహం దెబ్బతింది. ఒక కుర్రాడు తన చెప్పుతీసి సన్యాసిపై విసిరాడు. సన్యాసి చలించలేదు. ప్రార్థనలో మునిగిపోయాడు.

ఇదంతా పైనించీ దేవుడు చూస్తున్నాడు. దేవుడికి ఆగ్రహం కలిగింది. వెంటనే "నాయనా! నువ్వు ఒక్క మాట చెబితే ఈ నౌకను తలకిందులు చేస్తా! వీళ్ళందర్నీ ముంచేస్తా!" అన్నాడు. ఆకాశం నించి వినిపించిన ఆ మాటలతో అల్లరిమూక అదిరిపోయింది. అందరూ సన్యాసి పాదాలపై పడి క్షమాపణలు కోరారు. సన్యాసి వాళ్ళను ఓదార్చి భయపడవద్దని చెప్పాడు. ఆకాశంలోకి చూసి "దేవా! దయామయులైన మీరు దయ్యం భాషలో మాట్లాడటం నాకు ఆశ్చర్యం కలిగిస్తుంది. కరుణాసింధువయిన నువ్వు ఇంత కఠిన భాషలో మాట్లాడకూడదు కదా! మీరు దేన్నయినా తలకిందులు చెయ్యదలచుకుంటే నౌకను కాదు. వీళ్ళ బుద్ధిని తలకిందులు చేయి. నౌకను తలకిందులు చేస్తే అంతా నాశనమవుతుంది. నువ్వు నాశనం చేసేవాడివి కాదు కదా! వెలుగులు నింపేవాడివి కదా!" అన్నాడు.

ఆకాశం నించే బదులు వినిపించింది.

"నాయనా! నువ్వు సత్యం చెప్పావు. నా స్వరంలో తేడాను గుర్తించావు. చాలా సంతోషం. ఎవరైతే దయ్యం భాషను గుర్తించగలరో నా నిజమైన స్వరాన్నీ వాళ్ళే గుర్తుపడతారు. నువ్వు నా స్వరాన్ని గుర్తుపట్టావు. నా తత్త్వాన్ని తెలుసుకున్నావు. నువ్వు చెప్పినట్లు నేను వీళ్ళ బుద్ధిని తలకిందులు చేస్తాను" అని దేవుడు ఆ అల్లరిమూకలో పరివర్తన తెచ్చాడు.

ఆ కుర్రాళ్ళు పశ్చాత్తాపంతో సన్యాసిని క్షమాపణలు కోరారు. సన్యాసి వాళ్ళని చిరునవ్వుతో ఆదరించాడు. మనసులు నిర్మలంగా మారాయి. నౌక నిశ్చలంగా సాగింది.

## 23. అపరాధ భావన

అపరాధభావన, ఆత్మన్యూనత ఉన్నవాళ్ళు మాత్రమే అధికారదాహంతో ఉంటారు. ఏదో సాధించాలని ఆరాటపడుతూ ఉంటారు. ఆ ఆత్మన్యూనతని తప్పించుకోవడానికి వ్యతిరేకదిశలో పరిగెడతారు. అక్కడే అసలు లోపం ఉంది. ఆంతరంగిక శూన్యాన్ని పూరించడానికి వాళ్ళు బతుకంతా ఆరాటపడుతూ ఉంటారు. ధనం, అధికారం, పేరు, పలుకుబడి వీటిలో పడతారు. బతుకంతా ఆ వేట కొనసాగుతుంది. ఆ ఆరాటం కొనసాగుతుంది. దాంతో వాళ్ళకు సంతృప్తి అనేది ఉండదు. బతుకు అలాగే ముగుస్తుంది.

తైమూర్ గొప్ప చక్రవర్తి. అతనికి అంతులేని సైన్యముంది. కావలసినంత కాంక్ష ఉంది. పరరాజులపై పడి దోచుకునేవాడు. ఇతర రాజ్యాల్ని ఆక్రమించేవాడు. ఆ క్రమంలో అతను బైజద్ అన్న సుల్తాన్ రాజ్యంపై దండెత్తాడు. హోరాహోరీ యుద్ధం జరిగింది. భీకరయుద్ధంలో ఎందరో సైనికులు చనిపోయారు. ఎవరూ ఓడిపోవాలని యుద్ధం చెయ్యరు కదా! కానీ ఎవరో ఒకరు ఓడిపోవడం తప్పదు కదా! ఆ యుద్ధంలో తైమూర్ గెలిచాడు. సుల్తాన్ బైజద్ ఓడిపోయాడు. సైనికులకు బందీగా చిక్కాడు. సైనికులు సుల్తాన్ బైజద్‌ను తైమూర్ ముందు సమావేశపరిచారు.

తైమూర్ ఆసీనుడయి ఉన్నాడు. అతనిముందు రెక్కలు విరిచికట్టిన బైజద్ ఉన్నాడు. బందీగా ఉన్న బైజద్ ఆగ్రహంతో ఉన్నాడు. ఆవేశంతో ఉన్నాడు. తైమూర్ మాత్రం విశ్రాంతిగా, విలాసంగా ఉన్నాడు. తైమూర్ నిర్లక్ష్యంగా చులకనగా బైజద్‌ని చూసి నవ్వాడు. ఆ నవ్వులో తిరస్కారం, తన సామర్థ్యం ప్రదర్శించాడు. అంతటి సుల్తాన్ తన ముందు బందీగా చూసి ఆవేశంతో బైజద్ "తైమూర్! నవ్వకు! విజయాన్ని చూసి వికటాట్టహాసం చేయకు. ఈరోజు నేను ఓడిపోయాను. రేపు నువ్వు ఓడిపోతావు. ఇతరుల ఓటమి చూసి నవ్వేవాడు ఒకరోజు తన ఓటమికి ఏడవాల్సి ఉంటుంది. గుర్తుంచుకో!" అన్నాడు.



"ఈ పనికిమాలిన మాటలు పక్కన పెట్టు. నేను గెలిచాను. నువ్వు ఓడావు" అన్నాడు తైమూర్.

తైమూర్ లేచి ఇటూ అటూ తిరిగాడు. తైమూర్ కుంటివాడు.

అతను తిరుగుతూ ఉంటే అతని నడక చూసి బైజద్‌కి పట్టలేని నవ్వు వచ్చింది. బైజద్ ఒంటి కన్నువాడు.

తైమూర్ "ఎందుకు నవ్వుతున్నావు?" అన్నాడు.

బైజద్ "నువ్వేమో కుంటివాడివి. నేనేమో గుడ్డివాణ్ణి. మన గెలుపు ఓటముల్ని పక్కనపెట్టు. నీలాంటి కుంటివాడికి, నాలాంటి గుడ్డివాడికి దేవుడెందుకు రాజ్యాలిచ్చాడా? రాచరికాలు ఇచ్చాడా అని ఆశ్చర్యపోతున్నాను" అన్నాడు.

అది వాస్తవం. కేవలం కుంటివాళ్ళకు, గుడ్డివాళ్ళకు మాత్రమే దేవుడు అధికారమిస్తాడు. భౌతికంగా కాదు. మానసిక అంగవైకల్యమున్న వాళ్ళే అధికార లంపటాలుగా ఉంటారు. వాళ్ళు తైమూర్లు కావచ్చు. బైజద్‌లు కావచ్చు. మరెవ్వరయినా కావచ్చు.

**అన్ని జబ్బులకన్నా ఏదో సాధించాలని, ఉన్నతస్థానాలకు ఎదగాలని అనుకుంటారో వాళ్ల జబ్బు పెద్దది.**

## 24. గుడిగంటలు

ఒక నగరంలో ఎన్నో దేవుడి ఆలయాలు ఉండేవట. దాన్ని 'దేవుని మందిరాల నగరం' అని పిలిచేవాళ్ళట. ఆ నగరం నీటిలో మునిగిపోయిందట. కానీ ఆ నగరంలో ఇప్పటికీ గుడిగంటలు వినిపిస్తాయని అన్నారు. ఆ గుడిగంటల్ని విని తరించాలని నేను ఆ నగరాన్ని అన్వేషించడానికి సముద్రతీరం చేరాను.

అక్కడ అలల శబ్దం తప్ప నాకు గుడిగంటలు వినిపించలేదు. అవిశ్రాంతంగా అలలు కదుల్తూ ఉన్నాయి. కానీ సముద్రతీరంలో నాకో నిశ్శబ్దం కనిపించింది. ఒక ఏకాంతం ధ్వనించింది. ఐతే ఆ నిశ్శబ్దం ఏకాంతం అవిశ్రాంతంగా కదుల్తున్న అలల కింద ఉన్నట్లు గమనించాను. అలల శబ్దాలలో ఆ నిశ్శబ్దం అడుగుభాగాన్నే ఆగిపోయినట్లు తెలుసుకున్నాను. ఆ నిశ్శబ్దసంగీతమే దేవుని ఆలయాలు చేసే గుడిగంటల మధుర నాదమని గ్రహించాను. ఎన్నిరాత్రులు సముద్రతీరానికి చెవి ఆనించినా అలల శబ్దమే వినిపిస్తుంది. అవిశ్రాంత సముద్ర ఘోషే వినిపిస్తుంది.

నేను అలసిపోలేదు. పట్టుదల వదిలి పెట్టలేదు. నేను వెనక్కి వెళ్ళదలచుకోలేదు. అసలు వచ్చిన దారినే మర్చిపోయాను. ఆ పరిచయం లేని సముద్రతీరమే నా నిలయంగా

మార్చుకున్నాను. నిజానికి వచ్చిన పనికూడా మరచిపోయాను. ఒకరోజు హఠాత్తుగా నాకో సంగీతం వినిపించింది.

ఏళ్ళ తరబడి నేను ఎదురుచూస్తున్న మధురనాదం నాకు వినిపించింది. ఆ సంగీతం నన్ను ఆనందలోకాలకు, ఆహ్లాదతీరాలకు తీసుకుపోయింది. నాలో ప్రతి అణువు ఆ పవిత్రభావంతో నిండిపోయింది. అది నాలోని చీకటిని వెడలగొట్టి నన్ను కాంతితో నింపింది. నాలోని అనంతచైతన్యాన్ని ఆవిష్కరించింది. అప్పటినించీ నన్ను ఎట్లాంటి మతం కమ్మలేదు. ఎట్లాంటి మాయా చుట్టుముట్టలేదు. నిత్యం మెలకువతో ఉండి నాలోని అంధకారాన్ని పారదోలాను. అప్పటినుంచీ ఆ మనోహరసంగీతాన్ని వింటూనే ఉన్నాను. నేను సంతోషంలో ఉన్నాను. నేనే ఆనందస్వరూపంగా మారిపోయాను. ఎక్కడ దేవుని గుడిగంటలు మోగుతాయో అక్కడ సంతోషసముద్రముంటుంది. దుః ఖముండదు కదా!

'మీరు కూడా ఆ సముద్రతీరానికి వెళ్లాలనకుంటున్నారా? సముద్రంలో మునిగిపోయిన దేవాలయాల గుడిగంటల సంగీతాన్ని వినాలనుకుంటున్నారా? అట్లా భావిస్తే మీ హృదయమనే సముద్రంలోకి వెళ్ళండి. మీ హృదయసముద్రం కోరికలనే అలల్తో అల్లకల్లోలంగా ఉంది. ఆ అలల అడుగున అనంతనిశ్శబ్దముంది. అంతులేని ప్రశాంతత ఉంది. ఆ నిశ్శబ్దాన్ని వినడానికి ప్రయత్నించండి. అదే దేవుని మందిరం. అక్కడ గుడిగంటలు వినిపిస్తాయి. కానీ ఒక సంగతి. గుడిగంటలు వినిపిస్తాయి. కానీ ఎవరి గుడిగంటలు వాళ్ళకు మాత్రమే వినిపిస్తాయి. ఎవరైతే దేవుని గుడిగంటల్ని వినాలనుకుంటారో వాళ్ళు మాత్రమే కోరికల అలల శబ్దాన్ని అర్థం చేసుకుంటారు. కోరికల అలలకి, సముద్రతరంగాలకి విశ్రాంతి, వెసులుబాటు ఉండదు. తృప్తి ఉండదు. అందుకనే మనిషి దుఃఖంలో ఉన్నాడు. పట్టుదలతో దేవుని గంటలు వినాలనుకుంటే మీరు ఆనందస్వరూపులుగా మారుతారు. కోరికల శబ్దాన్ని అర్థం చేసుకోకుంటే నిశ్శబ్దంలోని అందాన్ని, ఆనందాన్ని తెలుసుకోగలుగుతారు.

**కోరికల అలల్ని దాటలేని వాళ్ళు మనోహర నిశ్శబ్ద సంగీతాన్ని వినలేరు. ఆనందాన్ని అందుకోలేరు.**

## 25. నిజమైన సంపద

నేనొక సంపన్నుడి ఇంట్లో ఒకరోజు బసచేశాను. అతను రోజంతా సంపాదనలో మునిగి ఉండేవాడు. రాత్రంతా సంపాదించింది లెక్కబెట్టుకుని దాచుకునేవాడు. దాంతో అతనికి నిద్రా, నీళ్ళూ ఉండేవి కావు. ఉదయానికి అతని ముఖం పేలవంగా ఉండేది.





అశాంతిగా ఉండేవాడు. అవిశ్రాంతంగా ఉండేవాడు. అతన్ని చూసి నాకు జాలి కలిగింది. **ఎవరయితే డబ్బువెంట, కీర్తి వెంట పరుగులు పెడతారో వాళ్ళకు శాంతి ఉండదు.** అతనికో కథ చెప్పాను.

ఒక గొప్ప సన్యాసి ఒక నగరానికి వచ్చాడు. సన్యాసులు ఎక్కడ బడితే అక్కడ ఉంటారు. ఇతను భిన్నమైనవాడు. అతని ముఖంలో గొప్ప ప్రశాంతత రూపుకట్టి ఉండేది. ఎవరు ఆయన దగ్గరికి వెళతారో ఆయన ప్రశాంతత వాళ్ళను కూడా చుట్టుముట్టేది. ప్రాపంచిక రాగద్వేషాలను దాటిన గొప్ప ఆనందమేదో ఆయన్లో ఉండేది. అందరూ మంత్రముగ్ధులయి ఆయన మాటల్ని వినేవారు. ఆయన్లో ఉన్న ఆనంద పరిమళం ఎలాంటిదంటే అది నిశ్చల అరణ్యాలలో ఉంటుంది. నిర్మల నక్షత్రాకాశాలలో ఉంటుంది. నిర్మల నక్షత్రాకాశంలో మాత్రమే ఉంటుంది. స్వర్గ సంబంధమయిన స్వచ్ఛత, ఆహ్లాదం ఆయన వర్చస్సులో కనిపిస్తుంది. ఆయన గొప్ప సంపన్నుడు. ఆ సంపద భౌతిక సంపదకాదు. అది ఆత్మధనం. మన దగ్గరున్న సంపద ఇస్తే తరిగిపోతుంది. ఆయన దగ్గరున్న సంపద అలాంటిది కాదు. అది యిస్తూ ఉంటే పెరుగుతూ పోతుంది. ఆయన శ్వాసలో ఆయన దగ్గరున్న సంపాదన అలాంటిది కాదు. అది యిస్తూ ఉంటే పెరుగుతూ పోతుంది. ఆయన మాట్లాడినా, మౌనంగా ఉన్నా ఆనందం తాండవించేది. మామూలు మనుషుల మనసు గర్వంతో నిండిపోయి ఉంటుంది. డబ్బుతో, కీర్తితో, పదవుల్తో నిండిపోయి ఉంటుంది. కానీ అవన్నీ పసివాళ్ళ చేష్టలు.

ఆ సన్యాసి మధుర వాక్కులు వినడానికి ఎందరో వచ్చేవాళ్ళు. విని తరించేవాళ్ళు. ఆ నగరంలో కాత్యాయని అన్న సంపన్నురాలయిన స్త్రీ ఉండేది. ఆమె తన చెలికత్తెలతో కలిసి వచ్చి ఆ సన్యాసి ప్రవచనాలని విని పరవశించింది. సాయంత్రం కావస్తోంది. ఆయన మధురవాక్కులు వింటా ఆమె మైమరచిపోయింది. ప్రాపంచిక బంధనాలన్నీ పటాపంచలయిపోయాయి. అర్థనిమీలత నేత్రాలతో ఆమె ఆనందలోకాల్లో తేలిపోతోంది. చీకటి పడుతోంది. తనువెళ్ళి ఇంట్లో దీపం వెలిగించి వస్తానని చెలికత్తెలతో వెళ్ళింది. వెళ్ళిందల్లా కాసేపటికి పరిగెత్తుకుంటూ వచ్చి "అమ్మా! ఘోరం జరిగిపోయింది. మనం లేనిది చూసి దొంగలు ఇల్లంతా దోచుకున్నారు" అంది. కాని కాత్యాయని అవేమి వినే స్థితిలో లేదు. సన్యాసి మాటలు వింటూ ఆనందబాష్పాలు రాలుస్తోంది. చెలికత్తె "అమ్మా! వాళ్ళు మన బంగారు నగలన్నీ దోచుకెళ్ళారు" అని ఆందోళనగా అంది. కాత్యాయని చెలికత్తె కేసి చూసి నువ్వు అంతగా బాధపడాల్సిన పనిలేదు. ఎందుకంటే వాళ్ళు దోచుకెళ్ళినవి నిజమైన బంగారు ఆభరణాలు కావు. అవి నిజమైన సంపద కాదు. ఈ మహానుభావుడు ఏం చెబుతున్నాడో అది నిజమైన ఐశ్వర్యం. మన నగలు దోచుకున్న దొంగలు ఈరోజు కాకపోయినా రేపయినా ఆ సంగతి తెలుసుకుంటారు. ఏది

దోచుకోవడానికి వీలుపడదో అదే నిజమైన సంపద. ఆ సంపద ఈ మహాపురుషుడి దగ్గర ఉంది. అది మనకందరకు పంచుతున్నాడు" అంది.

అక్కడే ఉన్న దొంగల నాయకుడు ఆమె మాటలు విని దిగ్భ్రమ చెందాడు. ఆ మాటలు అతని గుండెల్లో గుచ్చుకున్నాయి. పరివర్తన తెచ్చాయి.వెంటనే తన తోటి దొంగలతో దోచుకున్నదంతా తీసుకెళ్ళి కాత్యాయని ఇంట్లో వదిలిపెట్టి రమ్మని చెప్పాడు.

ఈ కథ విని నేను బస చేసిన ఇంటి యజమాని తన దగ్గరున్న సంపద నిజమైన సంపద కాదని గ్రహించాడు. అతని జీవితంలో మొదటిసారి ప్రశాంతంగా నిద్రపోయాడు.

## 26. సత్యకామ జాబాలి

సతాన్వేషణకు మౌలిక లక్షణం ధైర్యం. నిష్కాపట్యం. సహజంగా ఉండడం. నటించకపోవడం. అట్లా ఉంటే ఎన్నో ఆటంకాలు అవరోధాలు ఎదురవుతాయి. వాటిని ధైర్యంతో ఎదుర్కోవాలి. అట్లాంటి సత్యాన్వేషికి సంబంధించిన కథ సత్యకామ జాబాలి కథ.

సత్యకామ జాబాలి కథ భారతీయుల సత్యాన్వేషణకు అద్దం పడుతుంది. ఒక యువకుడు సత్యాన్వేషణలో గౌతమ మహర్షి దగ్గరకు వచ్చాడు. మహర్షికి పాదాభివందనం చేశాడు. అతనికి సత్యమంటే ఏమిటి? బ్రహ్మమంటే ఏమిటి? అని తెలుసుకోవాలన్న జిజ్ఞాస. గౌతమమహర్షి "ఏమి నాయనా! ఎందుకు వచ్చావు? నీకేం కావాలి" అని అడిగాడు.

ఆ యువకుడు "స్వామీ! నేను సత్యమంటే ఏమిటో? బ్రహ్మమంటే ఏమిటో తెలుసుకోవాలన్న కాంక్షతో వచ్చాను. నా అంతరంగం నిరంతర తపనతో అల్లాడుతోంది. మీరు దయదలిస్తే కానీ నాకు శాంతి దొరకదు. దయచేసి నాకు బ్రహ్మ విద్యను ప్రసాదించండి. నేను అంధుణ్ణి. నాకు చూపునివ్వండి. నా అజ్ఞానమనే అంధత్వాన్ని పోగొట్టండి" అన్నాడు.

ఆ యువకుడు చెప్పిందంతా విని గౌతమ మహర్షి "నాయనా! నువ్వు చెప్పినట్లే నీకు బ్రహ్మవిద్య బోధిస్తాను. నీ పేరేమిటి? నీ తండ్రి పేరేమిటి? నీ గోత్రమేమిటి?" అని అడిగాడు.

ఆ యువకుడికి తన పేరేమిటో? తండ్రి పేరేమిటో? గోత్రం ఏమిటో తెలీదు. నాకు తల్లి ఒకటే తెలుసు. తక్కినవేవీ తెలీవు."వెళ్ళి నా తల్లినడిగి తెలుసుకుని వస్తాను" అనివెళ్లాడు. తల్లిని అడిగాడు. ఆమె "నాయనా! నీ తండ్రి ఎవరో నాకూ తెలీదు. నేను





యవ్వనంలో ఉన్నప్పుడు ఎందరినో ఆనందపెట్టాను నువ్వు ఎవరివల్ల నాకు పుట్టావో చెప్పలేను" అంది.

ఆ యువకుడు గౌతమమహర్షి దగ్గరకు తిరిగి వచ్చి "స్వామీ! మీరు చెప్పినవన్నీ నా తల్లిని అడిగాను. ఆమెకు ఏవీ తెలియవని చెప్పింది. కారణం ఆమె యవ్వనంలో ఉన్నప్పుడు ఎందరో పురుషులతో గడిపింది. అందువల్ల నేను ఎవరివల్ల కలిగానో చెప్పలేనంది. ఆ కారణం వల్ల నాకు గోత్రనామం కూడా లేదు. నాకు తెలిసిందల్లా నేను నా తల్లికి జన్మించాను. నా తల్లి పేరు జాబాలి. నాకు తెలిసింది అదే" అన్నాడు.

ఆ మాటలకు గౌతమమహర్షి ఆశ్చర్యపోయాడు. నిష్కపటమైన ఆ యువకుడి మాటలకు నివ్వరపోయాడు. అతని నిజాయితీకి ఆనందించాడు. గౌతముడు ఆ యువకుణ్ణి ఆనందబాష్పాలతో కౌగిలించుకొని "నాయనా! నువ్వే నిజమైన బ్రాహ్మణుడివి. సత్యంపట్ల నిజమైన, తీవ్రమైన కాంక్ష ఉండడమే బ్రాహ్మణుని లక్షణం. ఇంత గొప్ప శ్రద్ధ, ఆసక్తి ఉన్న నువ్వే బ్రాహ్మణుడివి. ఎందుకంటే ఎవరైతే కపటం లేకుండా హృదయపూర్వకంగా అన్వేషిస్తారో వాళ్ళనే సత్యం వెతుక్కుంటూ వస్తుంది. సత్యంపట్ల ఇంతకోరిక కలవాడివి కాబట్టే నీ పేరు 'సత్యకామజాబాలి' అని పెడుతున్నాను" అన్నాడు.

సత్యకామజాబాలి గౌతమ మహర్షికిఅభివాదం చేశాడు.

**నిష్కపటమైన మనిషినే సత్యం వరిస్తుంది.**

అందుకనే తరాలు గడిచినా సత్యకామ జాబాలి ప్రాతఃస్మరణీయుడిగా మిగిలాడు. **నిష్కపటం నుంచే నిజాయితీ, ధైర్యం వస్తాయి.**

## 27. సన్యాసం

ఓసారి ఒక యువకుడు నా దగ్గరికి వచ్చాడు. అతను సత్యాన్వేషణలో ఉన్నాడు. సన్యాసాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాడు. అతను "స్వామీ! నేను సన్యాసం స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. అన్ని రకాలయిన అర్హతలూ సంపాదించాను. నాకు సన్యాసాన్ని ఇప్పించండి" అని అడిగాడు.

"నేను మనుషులు సంసారం కోసం సిద్ధపడడం విన్నాను. సన్యాసం కోసం సిద్ధపడడమంటే?" అన్నాను. "ఇంకా ఇట్లా అన్నీ సిద్ధం చేసుకున్న సన్యాసం సన్యాసం ఎలా అవుతుంది? సన్యాసమంటే వేషం మార్చుకోవడం, పేరు మార్చుకోవడం కాదు. సంసారాన్ని వదిలి పారిపోవడం కాదు. **సన్యాసమంటే ఆలోచనల్లో మార్పు రావడం పరివర్తన కలగడం.** ఈ పరివర్తన అన్నది సంసారంలో విఫలమయితే తప్ప సంసారంలో

సాధించలేకపోతే తప్ప చివరి అంచయిన సన్యాసానికి రాలేవు. **సంసారం, సన్యాసం వేరు కావు. అవి ఒకే నాణానికి రెండు వేపులు"** అన్నాను.

ఆ మాటల్తో ఆ యువకుడు ఖిన్నుడయ్యాడు. తను అడియాసలో కూరుకు పోయాడు. కన్నీళ్ళ పర్యంతమయ్యాడు. నిస్సహాయంగా మాటా, పలుకూ లేకుండా వెనుదిరిగాడు. అతన్ని ఆపి అతనికో కథ చెప్పాను. "నువ్వీ కథ విను. విన్న తరువాత అప్పటికీ సన్యాసం స్వీకరించాలని ఉంటే నీకు సన్యాసమివ్వడానికి నాకు అభ్యంతరం లేదు. సన్యాసం తీసుకోవాల్సిన అవసరం లేదని నువ్వు భావించినా ఫరవాలేదు" అని కథ చెప్పాను.

అజర్కైన్ అని పేరుపొందిన ఫకీరు ఉండేవాడు. ఆయన బోధనలు వినడానికి దేశదేశాల నుంచి జనం వచ్చేవాళ్ళు. ఎన్నో సందేహాలతో, సమస్యలతో వచ్చేవాళ్ళు. తమ బాధలన్నీ ఆయన్తో చెప్పుకునేవాళ్ళు. ఆయన శాంతంగా వాళ్ళ బాధల్ని వినేవారు. విశ్లేషించేవాడు. వీలయినంతగా వాటికి పరిష్కారాలు చెప్పేవాడు. వాటిని విని జనం సంతృప్తిగా వెళ్ళేవాళ్ళు.

ఒకరోజు ఒక ధనవంతుడు ఆ ఫకీరు దగ్గరకు వచ్చాడు. ఆ ధనవంతుని వద్ద అంతులేని సంపద ఉంది. తరతరాలు కూచుని తిన్నా తరగని సంపద ఉంది. తన సంపదవల్ల అతనికి శాంతి సుఖాలు లేవు. ఆనందం లేదు. ఉన్నట్లుండి వాటిపట్ల అతనికి విరక్తి కలిగింది. అతను ఫకీరు దగ్గరికి వచ్చి "అయ్యా! నేను జీవితంలో విసిగిపోయాను. అలిసి పోయాను. నిరంతరం శ్రమించి అంతులేని సంపదను కూడబెట్టాను. నాకు ఆస్తులు, అంతస్తులు అన్నీ ఉన్నాయి. పేరు, పలుకుబడి అన్నీ ఉన్నాయి. కానీ ఇవేవీ నాకు శాంతిని ఇవ్వడం లేదు. పైగా ఆటంకంగా ఉన్నాయని పిస్తోంది. నా ధనం, భూములు, నగలు వీటన్నింటినీ వదిలేస్తున్నాను. చివరికి నా భార్యాబిడ్డల్నీ కూడా వదలిపెట్టాలనుకుంటున్నాను. సన్యాసం స్వీకరించాలను కుంటున్నాను. మీరేమంటారు? దయచేసి మనవి చేయండి" అన్నాడు.

ఫకీరు అంతా విన్నాడు. "మంచిదే! మంచిపని చేస్తున్నావు" అన్నాడు. ఆ మాటలకు ధనవంతుడు ఆనందపడిపోయి తన జన్మ ధన్యమయిందనుకుని అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

పదిరోజులు గడిచాయి. ఆ ధనవంతుడు మళ్ళీ ఫకీరు దగ్గరకు వచ్చాడు. "స్వామీ! నేను నా ఆస్తిపాస్తులన్నీ పంపకం చేశాను. అన్నీ పద్ధతిగా నిర్వహించాను. ఇప్పుడు నేను ధరించే సన్యాసి వస్త్రాల్ని, బొంతని అన్నీ సిద్ధం చేయిస్తున్నాను. అవి పూర్తికాగానే సన్యాసాన్ని స్వీకరించడానికి వస్తాను" అన్నాడు. ఫకీరు ఏమీ మాట్లాడలేదు.





నేను ఆ యువకుడితో ఈ కథ చెప్పి "ఇప్పుడు చెప్పు. నువ్వు సన్యాసాన్ని స్వీకరించడానికి అర్హుడివా?" అన్నాను. ఆ యువకుడు మౌనంగా వెళ్ళిపోయాడు.

## 28. అంటరానితనం

అంటరానితనం అన్నమాటే నాకు కంపరం పుట్టిస్తుంది. ఒకరోజు నేను ఎక్కువకులం వాళ్ళు ఏర్పాటుచేసిన సభకు వెళ్ళాను. అంటరానివారు అన్న పదంతో నా మనసు అల్లకల్లోలమవుతుంది. ఆ సభకెళ్ళి కూడా నేను మౌనంగా కూర్చున్నాను. ఇట్లాంటి విభజన చేసిన వాళ్ళని ధార్మికులనడానికి నాకు మనస్కరించలేదు. అందువల్లే ధర్మం పతనమయింది. అంతులేని శాస్త్రాలు అందుకనే గహనంగా మారాయి.

నిజానికి ధర్మమన్నది విడగొట్టేది కాదు. కలిపేది. ధర్మం గోడలు కట్టదు. గోడల్ని పడగొడుతుంది. అంతరాల్ని తొలగిస్తుంది. ఒక సామాజిక నిర్మాణాన్ని ఉద్దేశించి చేసిన కుటిల ప్రయత్నమిది. మనుషుల్లో స్థాయీభేదాల్ని పెంచడానికి చేసిన వంచన ఇది. మనుషులంతా ఒకటిగా ఉన్నారనుకోండి. అప్పుడు అధికారానికి, అధఃకరించడానికి అవకాశం ఉండదు. అందుకని అసమానతలు అవసరం. ఫలితంగా వర్ణాలు, వర్గాలు ఏర్పడాలి.

మనుషుల మధ్య అంతరాలు లేందే సంఘముండదు. సంప్రదాయముండదు. తేడాలు ఉన్నప్పుడే భయం, పగ, ప్రతీకారం, ద్వేషం, శత్రుత్వం మొదలవుతాయి. శత్రుత్వం వల్లే సంఘాలు ఏర్పడతాయి. సంఘాలకు శత్రుత్వమే కారణం. కానీ దేవుణ్ణి చేరడానికి ఇవేవీ అక్కర్లేదు. ప్రేమ ఒక్కటే మార్గం. సామాజిక నిర్మాణానికి దైవాన్ని అందుకోవడానికి ఏమీ సంబంధం లేదు. కానీ దైవం కూడా తమ చెప్పుచేతల్లో ఉంటాడని, దైవాన్ని దర్శించాలన్నా తమ అనుమతి లేనిదే వీలుపడదని కొందరు అహంకరిస్తారు. సామాన్య జనం అదంతా నిజమే అని విశ్వసిస్తారు. ప్రగల్భించే వాళ్ల పట్ల భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తారు.

పూర్వం ఒక గ్రామంలో తెల్లారుతున్నప్పుడు పూజారి గుడితలుపులు తెరిచాడు. వెంటనే ఎప్పట్నించో ఎదురుచూస్తున్న ఒక అంటరానివాడు హడావుడిగా ఆతృతపడుతూ గుడిలోకి అడుగుపెట్టబోయాడు. అది చూసిన పూజారి "ఆగు! లోపలికి రాకు. అడుగు ముందుకు వేశావంటే అపచారం. భగవంతుని మందిరం పవిత్రమైంది. నువ్వు అంటరానివాడివి. నీ స్పర్శతో పవిత్రమైన దైవమందిరం పాపపంకిలమైపోతుంది. ఈ ఆలయంలో అడుగుపెట్టే అర్హత నీకు లేదు. వెళ్ళు" అన్నాడు.

ఆ మాటల్తో అంటరాని వ్యక్తి మనసు నలిగిపోయింది. తాను చేసిన అపచారం ఏమిటి? తాను తక్కువ కులంలో పుట్టడమన్నది తాను చేసుకున్న పాపమా? అని బాధపడ్డాడు. కానీ ధైర్యం తెచ్చుకుని "నేను పవిత్రుణ్ణి కావడానికి సాధన చేస్తాను. రహస్యాన్ని కనిపెడతాను. కానీ దేవుణ్ణి దర్శించకుండా మాత్రం జీవితం ముగించను" అని పూజారితో చెప్పి ఊరు వదిలి వెళ్ళిపోయాడు.

రెండు, మూడు సంవత్సరాలు గడిచాయి. పూజారి ఆలయం బయట ఉన్నాడు. అంటరాని వ్యక్తి హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. అతని కళ్ళల్లో ఉన్న గొప్ప కాంతి, అతని ముఖంలో గొప్ప వర్చస్సు, అతను గుడిలోకి రాకుండా గుడిముందుగా వెళ్ళడం చూసి పూజారి "నువ్వు పవిత్రతను పొందడానికి వెళ్ళానన్నావు. గుడిలోకి రాకుండానే వెళ్ళిపోతున్నావే" అన్నాడు.

అంటరాని వ్యక్తి పూజారిని చూసి నవ్వి స్వామీ! నేను సత్యాన్ని కనిపెట్టాను. దైవాన్ని దర్శించాను. పవిత్రతను సాధించాను. దేవుడు నాతో "పిచ్చివాడా! గుడికి ఎందుకు వెళ్ళావు? నా మటుకు నేను ఎప్పుడూ గుడికెళ్ళలేదు. ఒకవేళ నేను వెళ్ళినా పూజారి నన్ను రానివ్వడు. అందుకనే నేను వెళ్ళను. నాకోసం నువ్వు ఆలయంలో వెతక్కు. నీ అంతరంగంలో వెతుకు. నేను మందిరాలలో లేను. నీ మనసులో ఉన్నాను" అన్నాడు. అందుకునే నేను ఆలయానికి రాకుండా వెళ్ళిపోతున్నాను అన్నాడు.

**దైవం ప్రతి మనిషిలో ఉన్నాడు. విగ్రహాల్లో లేదు.**

## 29. హత్య

ఒకరోజు మాయింటి ప్రక్కన ఓ హత్య జరిగింది. చనిపోయినవాడు, చంపినవాడూ ఇద్దరూ నాకు తెలుసు. వాళ్ళిద్దరూ ఎప్పటినుంచో శత్రువులు. ఒకర్నొకరు చంపుకోవాలనే చూశారు. ఒకడు చనిపోయాడు. కానీ జనమంతా ఆ విషయం గురించే చర్చించుకుంటున్నారు. జనాల కళ్ళు మెరిసిపోతున్నాయి. ఎవళ్ళ కళ్ళల్లోనూ దయ, సానుభూతి కనిపించడం లేదు. ఆ చర్య అందర్లో ఉత్సాహాన్ని నింపినట్లుంది. ఏదో మార్పును అందరూ ఆనందిస్తున్నట్లుంది. కారణమేమిటి? ఎవరి జీవితాలు సహజంగా సాగవో వాళ్ళ ఆలోచనలు విధ్వంసకరంగా ఉంటాయి. అందరూ అంటే సమాజంలో ఉన్న దాదాపు అందరూ అసహనంగానే జీవిస్తూ ఉంటారు. పర్యవసానమిది.

కానీ ఇక్కడ ఒక విషయం. శత్రువు చనిపోయినంత మాత్రాన శత్రుత్వం చనిపోదు. ప్రేమతో జీవించేవాళ్ళు అతి తక్కువగా ఉంటారు. పగతో ఉన్నవాళ్ళే ఎక్కువ ఉంటారు. దీనికి కారణమేమి? మన మనసు గురించి తెలుసుకోకపోవడమే దీనికి





కారణం. కానీ ఆ బాధ్యతని సాధారణంగా ఇతరుల మీదకు తోస్తూ ఉంటాం. స్నేహం, విరోధం అన్నవి బయట ఉంటాయనుకుంటాం. నిజానికి అవి మనలో ఉంటాయి. ఆ విషయాన్ని మనం తెలుసుకుంటే అంతా స్పష్టమయిపోతుంది. ప్రతిబింబాలు బయట ఉంటాయి. ప్రతిబింబాలు నశించిపోయినంత మాత్రాన బింబాలు నాశనం కావు. ఒక సంఘటన.

ఒక హంతకుడు తన ప్రత్యర్థిని అమావాస్య అర్ధరాత్రి హత్య చేయాలని నిర్ణయించుకున్నాడు. దానికి సరంజామాతో సిద్ధం చేసుకున్నాడు. తుపాకీలో గుండ్లు దట్టించాడు. ప్రత్యర్థి ఇంటి దగ్గరికి వెళ్ళాడు. ఇటూ అటూ చూశాడు. అంతా నిశ్శబ్దం. పరిస్థితి తనకు అనుకూలంగా ఉందని నిర్ణయించుకున్నాడు. ప్రత్యర్థిని ఎట్లా చంపాలో ఆలోచించుకున్నాడు. ప్రత్యర్థి బహూశః నిద్రపోతూనే ఉంటాడు. అతన్ని నిద్రలో చంపాలా? నిద్ర లేపి చంపాలా? అని తర్కించుకున్నాడు. నిద్రలేపి చంపడమే సరయిన చర్య అనుకున్నాడు. ఎందుకంటే నిద్రపోతూ ఉన్నప్పుడు చంపితే అతనికి తానువచ్చి ప్రతీకారం తీర్చుకున్నానని తెలీదు. నిద్రలేపి చంపితేనే తన ప్రతాపం తెలుస్తుందని నిశ్చయించుకున్నాడు.

ఇంటిని సమీపించాడు. కీచురాళ్ళ శబ్దం తప్ప ఏమీ లేదు. ఇప్పుడున్న సమస్యల్లా తలుపు తియ్యడం. లోపల గడియపెట్టి ఉంటారు. తలుపుకు రంధ్రం చెయ్యడానికి సరంజామా అంతా సిద్ధం చేసుకుని వచ్చాడు. చాలా శ్రమపడి తలుపుకు రంధ్రం చేసి దానిగుండా వేళ్ళు చొప్పించి మొత్తానికి తలుపు తెరిచాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ హాలు దాటి వెళ్ళాడు. పడగ్గదిలోకి వెళ్ళాడు. పడగ్గది తలుపులు తెరిచే ఉన్నాయి. పడగ్గదిలోకి వెళ్ళి లైటు తీశాడు. అక్కడి దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు. అప్రమత్తమయ్యాడు. ఎదురుగా శత్రువు తుపాకీ పట్టుకుని తనని కాల్చడానికి సిద్ధంగా ఉన్నాడు. అది ఊహించని పరిణామం. తను తప్పకవస్తానని ఊహించి శత్రువు తుపాకీ గురిపెట్టుకుని ఉన్నాడన్నమాట. శత్రువు తనపై తుపాకీ పేల్చేంతలో ఇతనే తుపాకీ పేల్చాడు. ఆ శబ్దానికి గది అదిరిపోయింది. భళ్ళున పగిలిన శబ్దం వచ్చింది. కాసేపటికి ఎదురుగా ఉన్న అద్దం పగిలి ముక్కలన్నీ కిందపడ్డాయి. అంటే ఆ గదిలో అతని ప్రత్యర్థి లేడు .ఎదురుగా ఉన్న పెద్ద అద్దంలో తనని చూసుకుని శత్రువుగా భావించి అతను తుపాకీ పేల్చాడు.

**పచ్చకామెర్ల రోగికి లోకమంతా పచ్చగా కనిపించినట్లు పగతో నిండిన వ్యక్తికి లోకమంతా పగతో నిండినట్లే కనిపిస్తుంది. స్నేహం, విరోధం ఈ రెండూ వ్యక్తి మనసుకు ప్రతిబింబాలే. మనిషి ఆ సత్యాన్ని గుర్తించాలి.**

## 30. శాస్త్ర చర్చ

నేనొక సమావేశానికి వెళ్ళాను. అక్కడ గొప్ప చర్చ జరుగుతోంది. ఆ లోకం, పరలోకం, ధర్మం, అధర్మం, ముక్తి, సత్యం, అసత్యం మొదలయిన వాటిమీద గొప్పశాస్త్ర చర్చ జరుగుతోంది.

**మనిషి చైతన్యమే ధర్మం.** తర్కవితర్కాలతో దానికి పనిలేదు. అట్లా అని ఎవరూ ఊరుకోరు. ఫలానా గ్రంథంలో ఫలానా విషయముంది అని మొదలుపెడతారు.

వాళ్ళల్లో ఒక వ్యక్తి ఎన్నో కోట్ల జన్మ తపస్సువల్ల ముక్తి దొరుకుతుందన్నాడు. ఇంకో వ్యక్తి ముక్తికి జన్మలతో, తపస్సులతో సంబంధం లేదని అది భగవంతుని కరుణాకటాక్షాల్తో దొరుకుతుందని మొదటి వ్యక్తి వాదనని ఖండించాడు. మరో వ్యక్తి ముక్తి అన్నమాటే భ్రమ. దాన్ని తపస్సుతో సాధించడమంటూ జరగదు. కేవలం జ్ఞానమనే మెరుపు మనసులో మెరిస్తే చాలు అన్నాడు. ఇట్లా ఎడతెగని వాదనల్తో చర్చ కొనసాగింది. అందరూ అలిసిపోయారు. వాళ్ళకున్న శాస్త్రజ్ఞానం నాకు లేదు. మౌనంగా వింటున్నాను. అందరూ నావేపు తిరిగారు. మౌనంగా ఉన్న నన్ను మాట్లాడాలని కోరారు. అప్పటిదాకా శ్రోతగా ఉన్న నేను మాట్లాడాల్సి వచ్చింది. తప్పని సరయి నేను వాళ్ళకో కథ చెప్పాను.

ఒక ఊర్లో అందరూ సంపన్నులు. ఆ ఊరి ఆచారాన్ని బట్టి ఎవరికయినా పెళ్ళి జరిగితే ఆ పెళ్ళికి తప్పనిసరిగా ఐదువేలరూపాయలు ఖర్చుపెట్టాలి. అది ఆ ఊరికి సంబంధించిన శాస్త్రగ్రంథాల్లో కూడా నిరూపణ అయింది.

చివరికి ఆ ఆచారం ఎలా అయిందంటే ఐదువేల రూపాయలు ఖర్చు చేయకపోతే ఆ పెళ్ళి పెళ్ళే కాదన్నంతవరకూ వచ్చారు. ఆ రోజుల్లో ఐదువేల రూపాయలంటే చాలా ఎక్కువ. దానికి ఎక్కువ ఖర్చు పెట్టినా ఎవరికీ అభ్యంతరం లేదు. కానీ దానికి తక్కువ ఖర్చు పెట్టడానికి మాత్రం వీల్లేదు. ఆ రకంగా ఆ వూరి జనం ఆ ఆచారాన్ని తప్పకుండా పాటిస్తూ వచ్చారు. చాలాకాలం దానికి సంబంధించిన ఎట్లాంటి వివాదమూ రాలేదు.

ఇంతలో ఆ ఊరిలో ఒక యువకుడికి పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి కేవలం ఐదువందల రూపాయలు మాత్రమే ఖర్చయ్యాయి. ఆ యువకుడు పేదవాడేమీ కాదు. కానీ అతను పెళ్ళికి ఐదువందల రూపాయలు మించి ఖర్చు పెట్టలేదు. పెళ్ళి బాగా జరిగింది. భార్య కాపురానికి వచ్చింది.

అంతలో ఆ పెళ్లికి ఐదువందలు మాత్రమే ఖర్చయ్యాయని అందరికీ తెలిసింది. వూరి పెద్దలు హడావుడిగా యువకుడి ఇంటికి వచ్చారు. "పెళ్ళికి ఎంత ఖర్చయింది" అని అడిగారు. యువకుడు ఐదువందలన్నాడు. పెద్దలు "అదెలా వీలవుతుంది? ఐదువేలు ఖర్చుపెట్టాలంటే ఖర్చుపెట్టి తీరాల్సిందే. ఐదువేలు ఖర్చుకాకపోతే పెళ్ళి పెళ్ళే కాదు" అన్నారు.

ఆ యువకుడు "ఐదువందల్లో పెళ్ళి అవుతుందా? కాదా? తప్పనిసరిగా ఐదువేలు ఖర్చుపెట్టాలి అని పనికిరాని విషయాల గురించి మీరు చర్చించకండి. ఐదువందలతో నాకు పెళ్ళి జరిగింది. అందమైన భార్య వచ్చింది. ఆనందంగా కాపురం చేసుకుంటున్నాం మీ గోలకు ఏమైనా అర్థం ఉందా?" అన్నాడు.

నేను ఈ కథ చెప్పి సమావేశంలోని జనాల్తో మీ చర్చ కానివ్వండి' అని వెళ్ళిపోయాను.





## 31. త్యాగం - లోభం.

పేరు ప్రతిష్టలు పొందిన ఒక చక్రవర్తి ఉండేవాడు. అంతులేని సంపద ఉన్న ఒక వ్యక్తి చక్రవర్తికి ఎంతో స్నేహితుడిగా ఉండేవాడు. చక్రవర్తి, సంపన్నుడు మంచి మిత్రులు. కానీ వాళ్ళ తత్వంలో చాలా భేదముండేది. చక్రవర్తి గొప్ప దానశీలి. ఉదార గుణమున్నవాడు. ఆయన ధర్మాలవల్ల ఎంతో కీర్తి గడించాడు. దేశ విదేశాల కవులు, కళాకారులు ఆయన దాతృత్వాన్ని వేనోళ్ళ పొగడారు.

అందరూ చక్రవర్తిని ఆకాశాని కెత్తారు. దాంతో చక్రవర్తి తనను మించిన దానశీలి ప్రపంచంలో ఎవరూ లేరని విర్రవీగాడు. ఆ మత్తులో మునిగిపోయాడు. లోకంలో పేరు తెచ్చుకోవడం చాలా సులభం. కానీ భగవంతుని దృష్టిలో పడడం చాలా కష్టం. తన త్యాగశీలంతో ఒళ్ళు మరచిన చక్రవర్తి వయసు పెరిగే కొలది దేవుడికి దూరంగా అహంకారానికి దగ్గరగా చేరాడు. తను జీవితంలో ఇక చేయాల్సింది ఏమీ లేదని, స్వర్గద్వారాలు తనకోసం తెరిచి ఉంటాయని తీర్మానించుకున్నాడు.

చక్రవర్తి మిత్రుడయిన సంపన్నుడు పరమలోభి. ఎవరికీ ఎర్రగానీ దానం చేసేవాడు కాదు. ఖచ్చితంగా చెప్పాలంటే కాకికి కూడా చెయ్యి విదిలించేవాడు కాదు. అట్లా కూడబెట్టీ కోట్లు గడించాడు. కాలం సాగుతోంది కదా! చక్రవర్తి, సంపన్నుడు ఇద్దరూ ముసలి వారయ్యారు. చక్రవర్తేమో తన త్యాగమనో మత్తులో అహంకారం అంచులో మునిగి తనను తాను మరచిపోయాడు. సంపన్నుడేమో అంతులేని సంపద ఉన్నా అశాంతిలో మునిగిపోయాడు. ఏదో కావాలని ఆరాటపడ్డాడు. అది ధనం కాదు. అది తనకు కావలసినంత ఉంది. దేనికోసమో వెతుకులాట మొదలయింది. ఏదో కావాలని ఆరాటపడడం కూడా అహంకారంలో భాగమనే కారణం వల్లే భోగి యోగి

అవుతాడు. లోభి దానశీలిగా మారతాడు. క్రూరుడు దయాళువవుతాడు. కానీ వాళ్ళ అంతరంగంలో ఎట్లాంటి మార్పు ఉండదు.

ఆ సంపన్నుడు ఆ వెతుకులాటలో ఒక గురువును ఆశ్రయించాడు. తనకు శాంతి కావాలని కోరాడు. ఇంత సంపద ఉన్న నీకు అన్నీ ఉన్నాయి కదా? ఇంకేం కావాలి?' అన్నాడు గురువు. సంపన్నుడు "స్వామీ! ధనం వల్ల అశాంతి తప్ప యింకేమీ దొరకదని అనుభవం వల్ల తెలుసుకున్నాను. నాకు శాంతి దొరికే మార్గం చెప్పండి" అన్నాడు. గురువు "వెంటనే వెళ్ళి నీ దగ్గరున్న సమస్త సంపదనీ దానధర్మాలు చేసిరా. నీ దగ్గర చిల్లిగవ్వ కూడా మిగలకూడదు. అన్నీ వదులుకుని నువ్వు వస్తే నీకు శాంతి మార్గం చెబుతాను" అన్నాడు. ఆ సంపన్నుడు వెళ్ళి తన సమస్త సంపదను దానధర్మాలు చేసి కట్టుబట్టలతో గురువు ఆశ్రమానికి వచ్చాడు. తాను చాలా గొప్పపని చేశానన్న గర్వం సంపన్నుడి కళ్ళల్లో కనిపించింది. అతన్ని చూస్తూనే గురువు "ఎందుకొచ్చావు. వెళ్ళు. నీకిక్కడ స్థానం లేదు. నాకు నీ ముఖం చూపించకు వెళ్ళు" అని అతన్ని బయటికి తోసి తలుపు వేసుకున్నాడు.

గురువు చర్యతో సంపన్నుడు హతాశుడయ్యాడు. నేనేం చేశాను. గురువు చెప్పినట్లే అన్నీ వదులుకుని వచ్చాను కదా! ఇప్పుడు నా దగ్గర ఇల్లు లేదు. డబ్బు లేదు. వట్టి చేతుల్తో ఉన్నాను. ఇట్లాంటి నిస్సహాయ స్థితిలో గురువు నన్ను వెళ్ళమన్నాడు. అనుకుని ఒక చెట్టు కింద కన్నీళ్ళు పెట్టుకుని అలసి పడుకున్నాడు. ఇప్పుడు అతనిలో తాను సంపన్నుడని, తన దగ్గరున్నదంతా దానం చేశానని అన్న భావన కూడా ఎగిరిపోయింది. కేవలం తనకి తానొక్కడే ఉన్నాడన్న భావన ఒక్కటే మిగిలింది. **ధనాన్ని వదులుకోవచ్చు. త్యాగలక్షణాన్ని వదులుకోవడం కష్టం.**

సంపన్నుడు నిద్రలేచేసరికి అతని మనసంతా ఉల్లాసంతో ఆనందంతో నిండి ఉంది. ఏదో పోగొట్టుకున్నానని, ఏదో పొందాలని అతనికి అనిపించలేదు. కానీ ఏదో సత్యం తనకు అవగాహన పొందాను అనుకున్నాడు. లేచి గురువుగారికి కృతజ్ఞతలు చెప్పుకుందామని బయల్దేరడంతో గురువే వచ్చి అతన్ని చూసి అతనిలో పరివర్తన గ్రహించి అతన్ని కౌగలించుకున్నాడు.

## 32. ప్రధానమంత్రి

ఒక రాజ్యానికి గొప్ప తెలివితేటలుగల ప్రధానమంత్రి ఉండేవాడు. అతను అనారోగ్యంతో కన్నుమూశాడు. తన పరిపాలనలో అన్ని విధాలా తనకు మార్గం చూపించే ప్రధానమంత్రి చనిపోవడంతో రాజుకు చాలా ఇబ్బంది కలిగింది. కొత్త ప్రధానమంత్రి నియామకం కోసం ప్రయత్నాలు జరిగాయి. రాజుకు తన ఆస్థానంలో ఉన్నవాళ్ళెవరూ





అంత అర్హత కలిగిన వాళ్ళుగా అనిపించలేదు. అందుకని ప్రధానమంత్రి నియామకం కోసం దేశంలో చాటింపు వేశాడు. దేశంలో ఉన్న మేధావులు, ప్రతిభావంతులు ఎందరో వచ్చారు. వాళ్ళందరికీ ఎన్నో విధాలయిన పరీక్షలు నిర్వహించారు. వాళ్ళ మేధో స్థాయికి పరీక్షలు పెట్టారు.

వివిధ స్థాయిల్లో వాళ్ళను ఎంపిక చేయడానికి ఎన్నెన్నో పరీక్షలు నిర్వహించారు. మొదటి స్థాయిలోనే వడబోత ప్రారంభమయింది. రెండో దశకు వందమంది మిగిలారు. ఇట్లా పది దశలు దాటేసరికి ఎవర్ని ప్రధానమంత్రిగా నియమించాలో తెలియక నిపుణులు తికమకపడ్డారు. ఎందుకంటే ముగ్గురూ తెలివితేటల్లో ఒకరికొకరు తీసిపోనివారే.

అది పెద్ద సమస్య అయి కూచుంది. నిపుణులు రాజుగారితో సమావేశమై విషయం వివరించారు. ముగ్గురికీ ఏదయినా గొప్ప పరీక్ష పెడితేనే కానీ వాళ్ళల్లో ఒకర్ని ఎంపిక చేయడం కష్టం అన్నారు. రాజు ఆలోచించి సరే! కొంతకాలం ఆలోచించి నిర్ణయిద్దాం. "మొదట వాళ్ళ ముగ్గుర్నీ స్వస్థలాలకు వెళ్ళమనండి. సమయం వచ్చినపుడు పిలుస్తామని చెప్పండి" అన్నాడు.

ఆ ముగ్గురూ తమ స్వస్థలాలకు వెళ్ళిపోయారు. నెలరోజులు గడిచాయి. రాజుగారినుంచి ఎట్లాంటి పిలుపూ రాలేదు. ఇంతలో జనం ఏదో చెప్పుకోవడం విన్నారు. ఆ విషయమేమిటంటే రాజుగారు ఆ ముగ్గుర్నీ విడివిడిగా గదుల్లో వేసి బంధిస్తారని, ఆ గదులకు తాళం వేస్తారని, ఆ తాళాలపై గణిత సంబంధమయిన అంకెలు ఉంటాయని, ఎవరయితే గణితవిజ్ఞానంతో సమన్వయించి, ఆ తాళాన్ని తెరుచుకుని ముందుగా బయటకు వస్తారో వాళ్ళనే రాజు ప్రధానమంత్రిగా నియమిస్తాడని వాళ్ళ చెవిన పడింది.

పదిరోజులు గడిచాయి. రాజుగారి నుంచి వాళ్ళకు పిలుపు వచ్చింది. అందరూ అనుకున్నట్లుగానే వాళ్ళని గదుల్లో బంధించి తాళం వేశారు. ఆ తాళాలమీద గణితసంబంధమైన అంకెలు ఉన్నాయి. "తెల్లారేలోగా ఆ అంకెల్ని సమన్వయించి ఒక దగ్గర నొక్కితే తాళం తెరుచుకుంటుంది. ఎవరు ముందుగా బయటకి వస్తే వాళ్ళే ప్రధానమంత్రి" అన్నాడు రాజు.

మొదటి ఇద్దరూ అప్పటికే పదిరోజుల నుండి వివిధ గణితశాస్త్రాల్ని సేకరించి లెక్కల్ని సరిచేస్తూ కలుపుతూ, విడదీస్తూ ఉన్నారు. తాళంపై చిత్రించిన అంకెల్ని రాసుకుని వాటిని సమన్వయించే పనిలో మునిగారు. మూడోవ్యక్తి నిశ్చింతగా నిద్రపోయి తెల్లవారి లేచి తాళం లాగాడు. అది వచ్చింది. బయటకు వచ్చాడు. అతని కోసం ఎదురుచూస్తున్న రాజు అతన్ని ఆహ్వానించాడు. రాజు అతనితోబాటు తక్కిన రెండు గదుల దగ్గరకువెళ్ళి తాళాలు లాగాడు. అవీ వచ్చాయి. లోపల ఇద్దరూ గణిత సమన్వయంలో తలమునకలై

ఉన్నారు. రాజు మూడోవ్యక్తితో ఎందుకు నువ్వు వాళ్ళల్లా శ్రమించలేదు?" అని అడిగాడు. దానికతను రాజా! "మీరు ప్రధానమంత్రికి పరీక్ష పెట్టదలుచుకుంటే దాన్ని లోకమంతా తెలిసేలా చాటింపు వెయ్యరు. పైగా తాళం వేసి ఉందో లేదో మొదట నేను పరీక్షించి చూశాను." అన్నాడు. అతని సమయస్ఫూర్తిని మెచ్చి రాజు అతన్ని ప్రధానమంత్రిగా నియమించాడు.

## 33. నువ్వు నువ్వుగా ఉండు

ఒక సందర్భంలో ఒక వృద్ధబాలుడు నా దగ్గరకు వచ్చాడు. "నేను జ్ఞానాన్ని పొందాలనుకుంటున్నాను. బుద్ధుడిగా మారాలనుకుంటున్నాను. దయచేసి నాకు మార్గం చూపిస్తారా?" అని అడిగాడు. అతనికి దాదాపు అరవై సంవత్సరాలుంటాయి. నేను అతణ్ణి వృద్ధబాలుడు' అన్నాను. ఎందుకన్నానో తెలుసా? అతని మనసు ఎదగలేదు. **తను తనుగా కాకుండా ఇతరుల్లా మారాలని ఎవరనుకుంటారో వాళ్ళల్లో పరిణతి ఉండదు.** అందువల్ల వాళ్ళు పసివాళ్ళే. అందుకనే అతను అరవయ్యేళ్ళ వాడయినా అతణ్ణి బాలుడన్నాడు. వయసు వృద్ధత్వాన్ని తెచ్చింది. కానీ మనసు ఎదగలేదు. కనక వృద్ధబాలుడన్నాను.

అతని మాటలు విని నేను "మిత్రమా! ఎవరయితే ఇంకొకరిలా మారాలను కుంటారో వాళ్ళు తమ అసలయిన తత్వాన్ని పోగొట్టుకుంటారు. విత్తనంలో వృక్షం నిక్షిప్తమయి ఉన్నట్లే ప్రతివ్యక్తిలో అతని తత్త్వం నిగూఢంగా ఉంటుంది. దానికి సహజమయిన ఎదుగదల అవసరం. అట్లా కాకుండా ఇంకేదోగా మారాలనుకుంటే అది ఆత్మహత్యా సదృశం. **మనది కాని తత్వాన్ని అనుసరిస్తే అనుకరిస్తే మన వ్యక్తిత్వం దెబ్బతింటుంది.** అప్పుడు కృత్రిమత్వం అలవడుతుంది. **అనుకరణంలో ఔన్నత్యం లేదు.** స్వాభావికమయిన ఎదుగుదల ఉన్న వాళ్ళలోనే సత్యం వెలుగుతుంది. వాళ్ళే దైవాన్ని అందుకోగలరు. అంతే కాని రాముణ్ణి, కృష్ణుణ్ణి, బుద్ధుణ్ణి, మహావీరుణ్ణి, ఇంకెవరినో అనుకరించాలనుకుంటే వాళ్ళు ఆదర్శమనే ముసుగు వేసుకుంటారు. ఆ ముసుగులో స్వీయస్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కోల్పోతారు" అంటూ ఒక కథ చెప్పాను.

ఒకానొకప్పుడు ఒక గ్రామంలో ఒక వ్యక్తి ఉండేవాడు. అతను అనుకరణ కళలో ఆరితేరినవాడు. ప్రత్యేకించి పక్షుల స్వరాన్ని అపురూపంగా అనుకరించేవాడు. ధ్వని అనుకరణ నైపుణ్యం సాధించాడు. జనం అతని అనుకరణ కళని అభినందించారు. అతన్ని ఆకాశానికి ఎత్తారు. అతని అనుకరణ కళ ఏ స్థాయికి చేరిందంటే పక్షుల స్వరాల్ని అనుకరిస్తూ క్రమక్రమంగా అతను తన సొంత స్వరాన్ని మరచిపోయాడు. తనకొక స్వరముందన్న విషయమే విస్మరించాడు.



జనాల అభినందనలు మాత్రం నిరంతరం అందుకునేవాడు. దానివల్ల అతనికి తనమీద అంతులేని విశ్వాసం పెరిగింది. అతని ప్రతిభ తమ గ్రామపరిసర ప్రాంతాలకే కాక దేశమంతా విస్తరించాలని భావించి గ్రామప్రజలు నువ్వు రాజు దగ్గరికి వెళ్ళి నీ విద్యను ప్రదర్శించు. రాజు గొప్ప ఔదార్యమున్నవాడు. ఆయన నిన్ను సత్కరిస్తాడు. సన్మానిస్తాడు. తన ఆస్థానంలో నిన్ను నియమించుకుంటాడు అని ప్రోత్సహించారు. గ్రామప్రజల ప్రోత్సాహంతో అతను రాజధానికి చేరి రాజసభలో ప్రవేశానికి అనుమతి సంపాదించాడు. సభలో ప్రవేశించాడు. సభ జనాలతో నిండి ఉంది. రాజు సింహాసనాన్ని అధిరోహించి ఉన్నాడు. అతను తన ప్రావీణ్యాన్ని ప్రదర్శించి, పక్షుల వివిధ స్వరాల్ని ప్రతిభావంతంగా వినిపించాడు. సభాసదులంతా హర్షధ్వానాల్ని ప్రకటించారు. రాజుమాత్రం వివేకవంతుడు. జ్ఞాని. అతను ఆ వ్యక్తిని చూసి "నీ అనుకరణ కళ చాలా బాగుంది. కానీ పక్షుల స్వరాల్ని వినిపించడానికి పక్షులున్నాయి. ప్రత్యేకంగా వాటిని నువ్వు వినిపించాల్సిన పనిలేదు. కానీ ప్రకృతిసిద్ధంగా నీకో స్వరం ఉంది. ఆ స్వరాన్ని నువ్వు ఆలపించు. ఆ స్వరం నీ తత్వాన్ని మాకు అందించి మమ్మల్ని తన్మయుల్ని చేస్తుంది" అన్నాడు.

ఆ వ్యక్తి ఎంత ప్రయత్నించినా అతని స్వరం పెగల్లేదు. అనుకరణకు అలవాటయిన అతని స్వరం స్వీయతత్వాన్ని కోల్పోయింది. ఈ కథ విని వృద్ధబాలుడిలోని బాలుడు మాయమయ్యాడు.

## 34. కర్మ - విశ్రాంతి

చైనా తాత్వికుడయిన కన్‌ఫ్యూషియస్ దగ్గరకు ఒక వ్యక్తి వెళ్ళి నమస్కరించి "అయ్యా! నేను జీవితంలో ఎంతో అలసిపోయాను. ఎన్నో పనులు చేసి విసిగిపోయాను. ఇప్పుడు విశ్రాంతి కోరుకుంటున్నాను. విశ్రాంతికి ఏదయినా మార్గముంటే తెలపండి. విశ్రాంతి ఉంటేనే నా జీవితానికి ఓదార్పు దొరుకుతుంది. మీలాంటి మహాపురుషులు మాత్రమే దానికి మార్గం చూపించగలరని నమ్ముతున్నాను" అన్నాడు.

కన్‌ఫ్యూషియస్ ఆ వ్యక్తి చెప్పినవన్నీ విన్నాడు. ఏమీ మాట్లాడలేదు. లేచి ఆ వ్యక్తిని తనవెంట రమ్మన్నాడు. ఇద్దరూ కొంత దూరం నడిచారు. నడిచేంత సేపూ కూడా కన్‌ఫ్యూషియస్ ఏమీ మాట్లాడలేదు. వెంట నడుస్తున్న వ్యక్తికి అంతా అయోమయంగా ఉంది. ఏమీ మాట్లాడకుండా ఈ వ్యక్తి ఎక్కడకు తీసుకెళుతున్నాడా? అని ఆశ్చర్యపోయాడు.

కొంతదూరం నడిచి వెళ్ళాకా కన్‌ఫ్యూషియన్ ఆగాడు. ఎదురుగా ఉన్న శ్మశానాన్ని చూపించాడు. ఆ వ్యక్తికి ఏమీ అర్థం కాలేదు. "ఎందుకు నన్ను శ్మశానానికి తీసుకొచ్చారు. ఎందుకు దాన్ని చూపుతున్నారు?" అని అడిగాడు. కన్‌ఫ్యూషియన్ విశ్రాంతి అన్నది శ్మశానంలో మాత్రమే ఉంది. సమాధిలో మాత్రమే ఉంది. శాంతి కావాలన్నా, విశ్రాంతి కావాలన్నా చనిపోవాలి. అనుదిన జీవన మన్నది విశ్రాంతికి పూర్తిగా వ్యతిరేకమైంది. కర్మ, విశ్రాంతి ఒకదానికొకటి వ్యతిరేకమయినవి. కర్మజీవికి విశ్రాంతి ఉండదు. జీవితానికి అర్థం పని. జీవితానికి విశ్రాంతి అన్నది వ్యతిరేకమయినది. నీకు జీవితం కావాలా? మరణం కావాలా? తేల్చుకో. మరణంలోనే విశ్రాంతి ఉంది" అన్నాడు.

ఆ మాటలు విని ఆ వ్యక్తి బిత్తరపోయాడు.

కన్‌ఫ్యూషియన్ చెప్పిందానికి నేను పూర్తిగా వ్యతిరేకిని. జీవితానికి మరణమన్నది వ్యతిరేకం కాదు. మరణం జీవితానికి ఆఖరి మజిలీ. మృత్యువు విశ్రాంతి కాదు. బతుకులో ఉన్న అశాంతి మరణంలో కూడా వెంబడిస్తుంది. వెంటపడుతుంది. పీడిస్తుంది. మరణం జీవితానికి వ్యతిరేకం కాదు. అది జీవన సారాంశం. జీవితంలో కర్మమాత్రమే ఉంటుందని, విశ్రాంతి ఉండదని అనడం సరికాదు. కర్మ అన్నది బాహ్య ప్రపంచానికి సంబంధించింది. శరీరానికి సంబంధించింది. బయటి ప్రపంచానికి సంబంధించినంత మేరకు దేహికి సంబంధించినంత మేరకు కర్మ అనివార్యం.

పనిచేయడం తప్పనిసరి. కానీ మనిషి కేవలం శరీర మాత్రుడు కాదు. మనిషికి శరీరం ఒక్కటే లేదు. లోపల ఆత్మ ఉంది. అస్తిత్వముంది. చైతన్యముంది. అవి విశ్రాంతి కేంద్రాలు. తన బాహ్య కర్మని వ్యక్తి ఎప్పుడయితే సంపూర్ణంగా నిర్వహిస్తాడో అతడు అస్తిత్వపు కేంద్రాన్ని ఉపసంహరించుకుంటాడు. అక్కడ విశ్రాంతి పొందుతాడు. జీవితంలో ద్వంద్వాలు ఉన్నాయి. ప్రకృతిలో ఉన్నాయి. రాత్రి, పగలు. పగలు శ్రమిస్తాం. రాత్రి విశ్రాంతి తీసుకుంటాం.

మనిషికి శరీరం ఉంది. ఆత్మ ఉంది. **శరీరం కర్మను నిర్వహిస్తుంది. ఆత్మ విశ్రాంతి నిస్తుంది.**

## 35. ప్రార్థన

అవి యుద్ధం రోజులు. రెండు దేశాల మధ్య భయంకరమయిన యుద్ధం జరుగుతున్న రోజులు. సైనికులు ఊళ్ళమీదపడి దోచుకుంటున్నారు. కనిపించిన వాళ్ళని కాల్చేస్తున్నారు. అంతా అల్లకల్లోలంగా ఉంది. ఆ దేశం విమానాలు ఈ దేశం మీద బాంబులు కురిపిస్తున్నాయి. ఈ దేశం విమానాలు ఆ దేశం మీద బాంబుల వర్షం





కురిపిస్తున్నాయి. విమానాల శబ్దం వింటేనే జనం హడలెత్తిపోతున్నారు. అన్ని వైపులా అరాచకం. భయమొక్కటే రాజ్యమేలుతోంది. ఏ క్షణం ఏం జరుగుతుందో అని అందరికీ ఆందోళన.

ఎవరికీ యుద్ధమంటే ఇష్టముండదు. ఎవరూ యుద్ధం చెయ్యాలనుకోరు. అధికారంలో ఉన్నవాళ్ళ అధికార దాహం వల్లనే యుద్ధం వచ్చి పడుతుంది. యుద్ధమన్నది ప్రపంచానికి వారసత్వంగా వచ్చిన జబ్బు. అది ప్రపంచంలో ఎప్పుడో ఎక్కడో జరుగుతూనే ఉంటుంది. దానికి మంచీ, చెడ్డా, ధర్మం, అధర్మం అంటగడుతూ ఉంటారు. మంచి యుద్ధమైనా, చెడ్డ యుద్ధమయినా మనుషులయితే చనిపోతారు.

అట్లా విమానాలు బాంబులు కురిపిస్తున్న రోజుల్లో ఒక సన్యాసి ఊరికి దూరంగా ఎక్కడికో వెళుతున్నాడు. అతనిపై విమానం దూసుకుపోయింది. ఆ విమానం వెనక మరిన్ని విమానాలు రావడం చూశాడు. దగ్గర్లో ఒక గుహ కనిపించింది. ఆ గుహలోకి దూరాడు. సన్యాసికయినా, సంసారికయినా ప్రాణభయం తప్పదుకదా!

సన్యాసి గుహలోకి వెళుతూనే అప్పటికే ఒక సైనిక అధికారి ఉన్నాడు. అతని బట్టల్ని బట్టి అతను సాధారణ సైనికుడు కాదని, అధికారని తెలుస్తోంది. బయట బాంబుల మోత వినిపిస్తోంది. సైనికాధికారి పక్కకు జరిగి సన్యాసికి చోటిచ్చాడు. చెవులు చిల్లులు పడే శబ్దాలకు సన్యాసి వణికిపోతున్నాడు. భగవన్నామస్మరణ చేశాడు. ప్రార్థన మొదలుపెట్టాడు. అతను మౌనంగా ఏదో అనుకుంటూ చేతులు జోడించడం చూసి సన్యాసి "అయ్యా! మీరు ధైర్యవంతులయిన సైనికాధికారి కదా! మీరు కూడా భయంతో వణుకుతూ ప్రార్థిస్తున్నారు. ఏమని ప్రార్థిస్తున్నారు? మీకు దైవభక్తి ఉందా? ఆస్తికులా?" అని అడిగాడు. వాళ్ళున్న గుహపేరు 'నక్కల గుహ'.

సైనికాధికారి సన్యాసిని చూసి "అయ్యా! నక్కల గుహలో నాస్తికులు ఉంటారా?" అన్నాడు. అంటే ప్రాణభయం కలిగినప్పుడు ప్రతిఒక్కడూ ప్రార్థన చేస్తారని అర్థం.

అట్లాగే అందరూ దేవుడంటే భయం ఉండాలంటారు. దైవభీతి ఉండాలంటారు. దేవుడు దయాళువు. కరుణాళువు. ఆయన ప్రేమమూర్తి. ఆయన్ని చూసి మనం ప్రేమించాలి కానీ భయపడడమెందుకు? ప్రార్థన అంటే పరిపూర్ణమయిన ప్రేమ. దానికి భయంతో పనిలేదు. భయంవల్ల వచ్చేది ప్రార్థన కాదు. అది స్వార్థం. నాకు ఇది కావాలి, అది కావాలి అని కోరుకుంటే అది బేరసారాల్లో భాగమవుతుంది. కానీ మనిషి కట్టిన మందిరాలన్నీ భయమనే ఇటుకల్తో కట్టినవే. వాటిల్లో భగవంతుడు ఉండడు. **ప్రేమతో నిండిన హృదయమే దేవాలయం.** అక్కడ మాత్రమే దేవుడుంటాడు.

## 36. స్వేచ్ఛ

మాటల్ని వల్లించడం సత్యం కాదు. శాస్త్రాల్ని తెలిసి ఉండడం సత్యం కాదు. మనిషి మాటల్లో మునిగిపోయాడు. మనిషి చెరసాలలో ఉన్నాడు. కానీ తాను స్వేచ్ఛగా ఉన్నానని అనుకుంటున్నాడు. అట్లాంటి మనిషికి స్వేచ్ఛనిచ్చినా అతను దాన్ని అనుభవించలేడు. బానిసత్వానికి అలవాటు పడితే మనిషికి స్వాతంత్ర్యమిచ్చినా స్వీకరించలేడు.

వాదాలతో, శాస్త్రాలతో, మాటలలో సత్యం మరుగున పడిపోయింది. అందువల్ల మనం వాటికి అలవాటు పడిపోయాం. సత్యాన్ని గుర్తించే అర్హతను కోల్పోయాం. దీన్నిబట్టి ఎవరయితే తమ అస్తిత్వాన్ని గుర్తించలేరో, తమ లోలోతుల్లోకి వెళ్ళి తమ అసలు స్వరూపాన్ని చూడలేరో వాళ్ళు సత్యాన్ని గ్రహించలేరు.

ఒక పర్వతం మీద ఒక సత్రం ఉండేది. దూరప్రయాణాలు చేసేవాళ్ళు అందులో బసచేసేవాళ్ళు. పుణ్యక్షేత్రాలు దర్శించుకునే వాళ్ళు ఆ మార్గం గుండా వెళ్ళేవాళ్ళు. ఎందుకంటే ఆ పర్వతం మీద గొప్ప ఆలయముంది. ఆలయాన్ని సందర్శించాలనుకున్న వాళ్ళు ఆ సత్రంలో దిగేవాళ్ళు.

ఆ సత్రం యజమాని దగ్గర ఒక చిలుక ఉండేది. దాన్ని పంజరంలో పెట్టి సత్రం ముందు పంజరాన్ని వేలాడదీశాడు. దాన్ని ఎంతో ముద్దుగా చూసుకునేవాడు. దానికి పళ్ళు, ఫలాలు తినిపించేవాడు. దానికి స్వేచ్ఛ అన్నమాట నేర్పించాడు. అది ఎప్పుడూ 'స్వేచ్ఛ! స్వేచ్ఛ' అన్న మాటల్ని వల్లిస్తూ ఉండేది. సత్రంలో దిగిన వాళ్ళకు గొప్ప వినోదంగా ఉండేది. వాళ్లు కూడా దానికి తినడానికి ఏమైనా పెట్టేవాళ్ళు. వాళ్ళు పెట్టినది తింటూ అది 'స్వేచ్ఛ, స్వేచ్ఛ' అని అరిచేది. వినేవాళ్ళకు వినోదంగా ఉండేది.

ఎవరు ఉన్నా లేకున్నా అది పంజరంలో ఇటునుంచి అటు గెంతుతూ 'స్వేచ్ఛ! స్వేచ్ఛ' అని అరుస్తుండేది. రాత్రయిన పగలయినా అదే మాటల్ని వల్లిస్తూ ఉండేది. నిజానికి ఆ పక్షికి స్వేచ్ఛ అనేమాటకు అర్థం తెలియదు. అది ఉన్నది పంజరంలో. తాను స్వేచ్ఛగా లేనని, పంజరంలో ఉన్నానని, స్వేచ్ఛ అనేమాటకు తనకు అర్థం తెలియదని దానికి స్పృహ లేదు.

ఇట్లా ఉంటే ఒకసారి వివేకవంతుడయిన ఒక వ్యక్తి ఆ సత్రంలో దిగాడు. చీకటిపడుతుండగా 'స్వేచ్ఛ! స్వేచ్ఛ' అన్న మాటలు వినిపించడంతో చుట్టూ చూశాడు. సత్రం ముందు పంజరంలో చిలుక ఆ మాటలు వల్లిస్తున్నట్లు తెలుసుకుని విస్తుపోయాడు. పంజరం దగ్గరకు వచ్చి నిలుచున్నాడు. అతన్ని చూసి చిలుక 'స్వేచ్ఛ! స్వేచ్ఛ!' అంది.





అది స్వేచ్ఛగా లేదని, ఆ మాటకు దానికి అర్థం తెలీదని, అది పంజరంలో ఉందని అతనికి తెలుసు. అతనికి స్వేచ్ఛ అంటే ఏమిటో స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలుసు. అతను వెంటనే పంజరం తలుపు తెరిచి చిలుకను బయటకు లాగడానికి ప్రయత్నించాడు. ఆ చిలుక బయటకు రావడానికి ఇష్టపడలేదు. అతను బలవంతంగా బయటకు తీసి వదిలిపెట్టినా మళ్ళీ పంజరంలోకెళ్ళింది. ఎప్పటిలా 'స్వేచ్ఛ! స్వేచ్ఛ' అని అరవడం మొదలు పెట్టింది. రెండు మూడు సార్లు అతను ప్రయత్నించాడు. చివరకు నాలుగోసారి దాన్ని పట్టుకుని దూరంగా వెళ్ళి ఆకాశంలోకి వదిలిపెట్టాడు. అది 'స్వేచ్ఛ! స్వేచ్ఛ' అంటూ ఎగిరిపోయింది.

ఆ వ్యక్తి ఆనందంతో సత్రానికి వచ్చి ప్రశాంతంగా నిద్రపోయాడు. తెల్లవారు జామునే 'స్వేచ్ఛ! స్వేచ్ఛ!' అన్న మాటలు వినిపించాయి. నిద్రమత్తు వదిలించుకుని అతను లేచి సత్రం ముందుకు వచ్చి చూశాడు. చిలుక పంజరంలో దూరి 'స్వేచ్ఛ! స్వేచ్ఛ!' అంటూ ఉంది.

## 37. ప్రేమ మందిరం

వేదవేదాంగాలు చదివిన పండితుడు ఉండేవాడు. అతను సకలశాస్త్రాల్నీ ఔపాసన పట్టాడు. ఎంతో శ్రద్ధగా ఎన్నో గ్రంథాల్ని సేకరించాడు. వాటిలోంచి విలువైనవన్నీ ఒక దగ్గర రాసి పెట్టుకున్నాడు. ఆ విలువైనవి కూడా అన్నీ కలిపితే ఒక బరువైన సంచి నిండుగా ఉండేవి. ఎక్కడికి వెళ్ళినా ఆ పండితుడు వాటిని మోసుకెళ్ళేవాడు. అది చాలా కష్టంగా ఉండేది. కానీ ఆయన ఆ సంచిని వదిలిపెట్టేవాడు కాదు. ఎందుకంటే ఏళ్ళ తరబడి శ్రమించి, సాధించిన సంపద అది.

ఎంతో జ్ఞానాన్నీ సంపాదించినా, ఎంత అధ్యయనం చేసినా ఆ పండితుడికి భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవాలన్న కోరిక కోరికగానే మిగిలిపోయింది. తన జ్ఞానం తనకు ఎంతో ఆనందాన్ని, వివేకాన్ని ఇస్తుంది. తన అధ్యయనం కావలసినంత పాండిత్యాన్ని ఇస్తోంది. ఎన్నో వాదోపవాదాల్లో తనని విజేతగా నిలిపింది. కానీ ఇవేవీ తనకు భగవంతుణ్ణి చేరే మార్గాన్ని చూపడం లేదు. దైవసాక్షాత్కారానికి ఇవి ఉపయోగ పడడం లేదు. దేవుణ్ణి చూడకుండా ఎంత జ్ఞానముండి ఏమి లాభం? అనుకున్నాడు.

ఆ ఊరి చివర ఒక గుడిసెలో ఒక సన్యాసి ఉన్నాడని, దేవుడి గురించి అతనికి ఎంతో తెలుసునని, అతన్ని దర్శిస్తే సందేహాలన్నీ పటాపంచలవుతాయని ఎవరో చెప్పారు. ఎప్పటినించో ఎదురుచూస్తున్న పండితుడికి ఆ సన్యాసిని దర్శిస్తే తనకు మార్గం దొరుకుతుందని ఆశ కలిగింది.

ఎప్పట్లాగా తన గ్రంథాల సంచి నెత్తిన పెట్టుకుని చెమటలు కక్కుకుంటూ ఆ సన్యాసి గుడిసె దగ్గరికెళ్ళాడు. సన్యాసి ఆ పండితుణ్ణి చూసి 'ఏమిటా సంచి?' అన్నాడు. 'మహాగ్రంథాల సారాంశం' అన్నాడు పండితుడు. "ఎందుకంత బరువు మోస్తావు కిందకు దించు' అన్నాడు. పండితుడు కష్టపడి కిందకు దించాడు. కానీ ఆ సంచిపై చేయిపెట్టి కూచున్నాడు. సన్యాసి 'ఎందుకు దానిపై చేయిపెట్టడం? చేయి కూడా తీసెయ్...?' అన్నాడు. పండితుడు సత్యాన్వేషి కనుక చేయి తీసేశాడు. సన్యాసి 'నీకేం కావాలి?' అన్నాడు. పండితుడు 'నేను దైవాన్ని దర్శించా'లన్నాడు. సన్యాసి 'నీకు ప్రేమ గురించి తెలుసా?' దాని మందిరాన్ని అన్వేషించు. దాన్ని కనిపెట్టు." అన్నాడు.

"తరువాత నా దగ్గరికి వచ్చావంటే" నీకు దైవాన్ని చూపిస్తాను. అయితే ఆ అన్వేషణలో ఈ గ్రంథాలేవీ నీకు ఉపయోగపడవు' అన్నాడు. పండితుడు సరేనని ఆ సంచి సన్యాసి దగ్గరే వదిలేసి వెళ్లాడు. దేన్నయినా వదులుకోవచ్చు. కానీ జ్ఞానాన్ని వదలుకోవడం కష్టం. కానీ ఆ పండితుడు దాన్ని కూడా వదిలిపెట్టి వెళ్ళాడు. అతను సాహసి.

సంవత్సరం గడిచినా పండితుడు రాకపోయేసరికి అతణ్ణి వెతుక్కుంటూ సన్యాసి వెళ్ళాడు.

పండితుడు కనిపించాడు. ఉల్లాసంగా, ఆనందంగా ఉన్నాడు. 'ఎందుకు నువ్వు దేవుణ్ణి తెలుసుకోవడానికి మళ్లీ రాలేదు?' అన్నాడు సన్యాసి. పండితుడు 'స్వామీ! మన్నించండి. మీరు ప్రేమను అన్వేషించమన్నారు. నా హృదయమే 'ప్రేమ మందిరమని' తెలుసుకున్నాను. దాంట్లోనే నేను దైవాన్ని దర్శించాను. అందుకని నేను మీ దగ్గరకు రాలేదు. **'నా జ్ఞానం నాకు అవసరం లేదు. ప్రేమస్వరూపులైన మనుషుల్లో దైవాన్ని చూస్తూ గడుపుతున్నాను'** అన్నాడు. సన్యాసి అతని పరివర్తనకు సంతోషించాడు.

## 38. సహజత్వం

అది వర్షాకాలం. నేను ఉద్యానవనంలో ఉన్నాను. వర్షం మొదలైంది. చెట్లన్నీ చినుకుల్లో నాట్యం చేస్తున్నాయి. ప్రకృతి పరవశంతో నాట్యం చేస్తుంది. అందమంతా ఆకాశం నించీ దిగివచ్చినట్లుంది. నాతో ఉన్న మిత్రులకు ఆ వృక్షాలు ఎంత అందంగా ఉన్నాయో ఆనందంగా ఉన్నాయో చూపించాను.

"అవి ఎందుకంత ఆనందంగా ఉన్నాయో మీకు తెలుసా?" అని అడిగాను. వాళ్ళు తెలీదన్నారు. నేను "అవి ఎందుకంత ఆనందంగా ఉన్నాయంటే అవి సహజంగా ఉన్నాయి. అవి ఎట్లా వుండాలో అట్లా ఉన్నాయి. కనుక ఆనందంగా ఉన్నాయంటే అవి





మరోలా ఉండాలనుకోవడం లేదు. పక్షుల్లాగానో, మనుషుల్లాగానే ఉండాలనుకోవడం లేదు. అవి చెట్లలా సహజసిద్ధంగా ఉండాలనుకుంటున్నాయి. అందుకే అవి చినుకులతో తడిసి పులకిస్తున్నాయి. వర్షం వాటిని హర్షంలో ముంచుతోంది. గాలి వాటిని లాలిస్తోంది" అన్నాను.

వృక్షాలకు ఆదర్శాలు లేవు. సిద్ధాంతాలు తెలీవు. అందుకే అవి వేటినీ అనుకరించాలనుకోవు. వాటికి ఏరకమయిన ఆశలూ, ఆశయాలూ లేవు. అందువల్లే అవి ఉల్లాసంగా ఉన్నాయి. కానీ **మనిషి ఆదర్శాలతో, అనుకరణలల్తో దుఃఖాన్ని కొని తెచ్చుకుంటున్నాడు. తన సహజస్వభావాన్ని, సహజగుణాన్ని కోల్పోయి బాధలు పడున్నాడు. తను తనలాగా ఉండక ఇతరుల్లాగా ఉండాలనుకుని రెంటికీ చెడ్డ రేవడిలా మారుతున్నాడు. అనుకరణలో ఆనందం ఉండదు.** ఈ సంఘర్షణలో వ్యక్తి తన అస్తిత్వాన్ని విస్మరిస్తున్నాడు.

ఒకసారి ఒక గ్రామీణుడు నగరానికి వచ్చాడు. అతను నిష్కపటమైన సహజమైన గ్రామీణ జీవితం గడిపినవాడు. నటనలు, మోసకారితనాలు అతనికి తెలియవు. నగరం చూస్తూ పోతూ ఉంటే అతనికి ఒక ఫోటో స్టూడియో కనిపించింది. ఫోటో తీయించుకోవాలనుకున్నాడు. స్టూడియోలోకి వెళ్ళబోతూ బయట ఉన్న ఒకబోర్డు చూశాడు. అందులో రాసిన విషయం చూసి అతనికి చిత్రంగా అనిపించింది.

అందులో – 1. మీరు ఎట్లా ఉన్నారో అట్లాంటి ఫోటో ధర 10/– రూపాయలు.

2. ఎట్లా ఉన్నారని మీరు భావిస్తారో ఆ ఫోటో ధర 15 రూపాయలు.

3. మీరు ఇతరులకు ఎట్లా కనిపించాలనకుంటున్నారో ఆ ఫోటో ధర 20 రూపాయలు.

4. మీరు ఏ రకంగా ఉండాలని ఆలోచిస్తున్నారో ఆ ఫోటో ధర 25 రూపాయలు.

ఆ గ్రామీణుడు ఆశ్చర్యపోయాడు. ఇదేదో వింతగా ఉందే అనుకొని లోపలికి వెళ్ళాడు. స్టూడియో యజమానితో... "నువ్వు పెట్టిన బోర్డు చిత్రంగా ఉందయ్యా. మనిషి ఎట్లా ఉన్నాడో అట్లా కాక ఇంకోలా ఫోటో తీయించుకునేవాళ్ళు కూడా ఉంటారా?" అని అడిగాడు.

స్టూడియో యజమాని గ్రామీణుణ్ణి చిత్రంగా చూసి 'ఇప్పటిదాకా ఈ ప్రశ్న వేసినవాణ్ణి నిన్ను ఒక్కణ్ణే చూస్తున్నాను. ఎందుకంటే ఇప్పటిదాకా మీరు ఎట్లా ఉన్నారో అట్లాంటి ఫోటో అంటూ బోర్డులో ఉన్న మొదటి రకం ఫోటోను తీయమని అడిగినవాణ్ణి నేను చూడలేదు. అట్లాంటి వ్యక్తి స్టూడియోకి రాలేదు." అన్నాడు. గ్రామీణుడు "ఎందుకని?" అన్నాడు. స్టూడియో అతను డబ్బులేవనుకో అది వేరే సంగతి. డబ్బులుంటే

ప్రతివ్యక్తి “ఇతరుల దృష్టిలో మనం ఎలా ఉంటే బావుంటుంది. అలాంటి ఫోటో కావాలంటాం. ఇంతకూ నీకు ఎలాంటి ఫోటో తియ్యాలి?” అన్నాడు.

గ్రామీణుడు “అయ్యా! నాకు వేరే రకమయిన ఫోటోలు వద్దు. నేను ఎలా ఉంటానో అలాంటి ఫోటోనే కావాలి” అన్నాడు.

మనిషి ‘తనది కాని పరుగులాటలో పడిపోయాడు. ఇతరుల దృష్టిలో ఎలా ఉంటే బావుంటుందో అదే అతనికి ముఖ్యమయిపోయింది. **ప్రకృతి తనకు ఏది ఇచ్చిందో అదే సహజమైంది. సహజమైందే ఎప్పుడూ సంతోషాన్నిస్తుంది.**

## 39. రామ! రామ!

పూర్వం ఒక నగరంలో ధనవంతులయిన అన్నదమ్ములు ఉండేవాళ్ళు. కలిసే ఉండేవాళ్ళు. అన్న గొప్ప ధర్మాత్ముడిగా పేరుపొందాడు. దానధర్మాలు చేస్తూ గుళ్ళూ, గోపురాలు తిరుగుతూ గొప్ప భక్తుడిగా పేరుపొందాడు. అతని చుట్టూ ఎప్పుడూ సన్యాసులూ, సాధువులూ గుంపుగా ఉండేవాళ్ళు. అతడిని పొగుడుతుండేవాళ్ళు. అతనికి స్వర్గంలో స్థానం ఖాయం అని నమ్మకంగా చెప్పేవాళ్ళు. అతను పురాణగాథలు వింటూ పరవశించేవాడు. రంతిదేవుడు, శిబిచక్రవర్తి, కర్ణుడు మొదలయిన వాళ్ళ దానగుణం వింటూ తానూ అంతటివాడననుకునేవాడు. అతనికి రామనామమంటే ఎంతో ప్రాణం. నిత్యం రామనామ స్మరణలో లీనమయి ఉండేవాడు.

కానీ అతనికి తమ్ముడు దీనికి పూర్తిగా వ్యతిరేకం. అతనికి భక్తీగిక్తీ ఉండేదికాదు. అతను ఆనందంగా, హాయిగా తిరుగుతూ ఉండేవాడు. విందులు, విలాసాలలో మునిగి తేలుతూ ఉండేవాడు. అన్నగారు ఏర్పాటుచేసే భక్తి సమావేశాలవేపు కన్నెత్తి కూడా చూసేవాడు కాదు. అన్నకు ఎప్పుడూ తమ్ముడు గురించి దిగులు. తన తమ్ముడు చెడిపోతున్నాడని. కాని తమ్ముడు ఇవేవీ పట్టించుకోకుండా హాయిగా ఉండేవాడు. భగవన్నామస్మరణ లేకుండా జీవితానికి ఎలా ముక్తి వస్తుందని అన్న బాధ. జీవిస్తే చాలు. తక్కినవన్నీ అర్థం లేనివని తమ్ముడి ఉద్దేశ్యం.

అన్న డబ్బులు సంపాదించడానికి జనాన్ని పీడించేవాడు. సన్యాసులు అతన్ని పీడించేవాళ్ళు. దానం చెయ్యందే పుణ్యం రాదు. దానం చెయ్యాలంటే ధనం కావాలి. ధనం కావాలంటే జనాన్ని పీడించక తప్పదు. ఎందుకంటే ఎవర్నీ బాధపెట్టకుండా డబ్బు సంపాదించలేం. కాబట్టి దానం చేసేవాళ్ళు, తీసుకునేవాళ్ళు ఒకే రకం.

తమ్ముడు ఉల్లాసంగా సంపాదించడం, దానం చెయ్యడం వీటికి దూరంగా గడిపేవాడు. అన్నకు తమ్ముడు గురించి దిగులు పట్టుకుంది. అతనికి దైవభీతి ఉండేలా





చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు. అతనిచేత రామరామ స్మరణ చేయిస్తే తన జన్మధన్యమవుతుందని భావించాడు. అప్పుడు ఆ నగరానికి ఒక మహాత్ముడు వచ్చాడని, ఆయన గొప్ప శక్తి సామర్థ్యాలున్నవాడని విన్నాడు. వెంటనే వెళ్ళి ఆ గురువుకు నమస్కరించి తన సమస్య చెప్పాడు.

ఆ గురువు పూర్వాశ్రమంలో బలమైన వస్తాదు. వస్తాదుగా ఉండడం కన్నా సన్యాసిగా ఉండడం లాభసాటి వ్యాపారం అనిపించడం వల్ల సన్యాసిగా మారాడు. అన్న చెప్పినవన్నీ విని గురువు ‘నీకెందుకు? మీ తమ్ముడినోట రామనామం చెప్పించాలి. అంతేకదా!” అన్నాడు. అన్న ‘స్వామీ! మీరాపని చేసి పుణ్యం కట్టుకోండి. మీకు జన్మాంతరం రుణపడి ఉంటాను” అన్నాడు. గురువు ఆ ధనవంతుని ఇంటికి అతిథిగా వచ్చాడు. ఎప్పట్లాగే సాధువులు చుట్టూ చేరారు.

సత్కాలక్షేపంతో వారం రోజులు గడిచిపోయాయి. తమ్ముడు గమనించాడు. కానీ దూరం నుంచీ చూస్తూ వెళుతూ ఉండేవాడు. ఒకరోజు గురువు తమ్ముణ్ణి పిలిచాడు. తమ్ముడు వచ్చాడు. గురువు కూచోమని చెప్పి హితబోధ చేశాడు. తమ్ముడు పట్టించుకోలేదు. లేచి వెళ్ళబోతుంటే గురువు అతన్ని రెండు చేతుల్తో ఒడిసిపట్టి కిందకు తోసి పైన కూచుని “మర్యాదగా రామ రామ! అంటావా లేదా?” అన్నాడు. ధైర్యం ఉన్న తమ్ముడు “మీరు నా పీక నొక్కినా నేను రామరామ అనను. నా ప్రాణం తీసినా రామరామ అనను” అన్నాడు. గురువు వదిలేశాడు. తమ్ముడు దుమ్ము దులుపుకొని లేచి వెళ్ళిపోయాడు. గురువు అన్నవేపు తిరిగి చూశారా? ఒక్కసారి కాదు మీ తమ్ముడిచేత రెండుసార్లు రామరామ అనిపించాను” అన్నాడు. గురువు సామర్థ్యానికి సంతోషించిన అన్న గురువును సత్కరించాడు.

## 40. ఎవడు రాజు?

ఒక రాజు ఎప్పుడూ దిగులుగా ఉండేవాడు. రాజ్యాన్ని రక్షించుకునే ఆలోచనల్తో అశాంతిగా ఉండేవాడు. ప్రతిమనిషి అధికారం కోసం అర్రులు చాస్తాడు. అందర్నీ బానిసలు చేసుకున్నవాడు అధికారానికి బానిస అవుతాడు. అహంకారంతో అందుకున్న దానిలో స్వర్గముండదు. నరకముంటుంది. దూరం నించీ చూస్తే అది స్వర్గంలా అనిపిస్తుంది. దగ్గరికి వెళితే సింహాసనంలో ముళ్ళుంటాయి.

రాత్రింబవళ్ళు రాజు నిరంతరం ఆందోళనలో గడిపేవాడు. తన మనసుపడే బాధల నుండి విముక్తి పొందాలని తపించేవాడు. ఈ బాధల నుంచీ విముక్తి పొందాలంటే

తను చక్రవర్తి కావాలి. అన్ని ఇతర రాజ్యాల్ని ఆక్రమించుకోవాలి. అప్పుడు తనకు ప్రశాంతత దొరుకుతుందేమో అని ఆ పనిలో పడి యుద్ధాలు చేస్తూపోయాడు.

కాలం గడుస్తోంది తన సామ్రాజ్యాన్ని విస్తరిస్తూ పోతున్నాడు. దాంతోబాటు అతనికి అశాంతి, ఆందోళన పెరుగుతూ పోతున్నాయి. అతను కలలు కంటూ పోతున్నాడు. లేని భవిష్యత్తు కోసం, రాని భవిష్యత్తు కోసం ఆరాటంతో సాగిపోతున్నాడు. అధికారకాంక్ష అతన్లో అశాంతితో బాటు రోజురోజుకూ పెరుగుతూ పోతోంది.

రాజు నడివయస్సు దాటాడు. బలం తగ్గింది. పెద్దవాడయ్యాడు కదా! అందుకోవలసింది మరణమొక్కటే. ఆ ఆలోచనల్తో అతన్లో మరింత గుబులు రేగింది.

మనిషి యవ్వనదశలో ఏ విత్తనాల్ని నాటుతాడో మలిదశలో ఆ పంటనే అందుకోవాలి. అధికార కాంక్ష, ఆధిపత్యం రాజు యవ్వనాన్ని ఆక్రమించుకుని ఉండేవి. ఇప్పుడు పెద్దవాడయ్యాకా అవే విషఫలాల్ని అందిస్తున్నాయి. ఎక్కడో మనసు పొరల్లో దిగులు, బాధ. ఏదో సాధించాలని తపన. భౌతికమయిన సంపదలతో, సామ్రాజ్యాలతో ఆ తపన మరింత ఎక్కువవుతుంది. కానీ కాంక్షల్ని వదులుకోవడానికి సిద్ధంగా లేడు. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాడు. కానీ ఆశ అతన్ని చావనివ్వలేదు.

ఒకరోజు ఎవరికీ తెలియకుండా ఏకాంతానికి నగరాన్ని వదిలాడు. ఒంటరిగా గ్రామసీమల వేపు వెళ్ళాడు. తనతోబాటు తన ఆలోచనల్ని, ఆరాటాలని మోసుకెళ్లాడు. దూరంగా పచ్చికబయల్లో పిల్లంగోవి శబ్దం వినిపిస్తే అటువేపు వెళ్ళాడు. అక్కడ ఆనందంగా ఒక పశువుల కాపరి పిల్లంగోవి ఊదుతూ కనిపించాడు. పశువులు పచ్చిక మేస్తూ ప్రశాంతంగా ఉన్నాయి.

రాజు అతన్ని చూసి "నువ్వు పశువుల కాపరివి. పేదవాడివి. కానీ సామ్రాజ్యాన్ని జయించినంత సంతోషంగా పిల్లనగోవిని ఊదుతున్నావు. ఇంత ప్రశాంతంగా, ఆరాటం లేకుండా ఉండడం నీకెలా వీలయింది?" అన్నాడు.

దానికి యువకుడయిన ఆ పశువుల కాపరి "అయ్యా! నాకు రాజ్యాలు వద్దు. ఇవ్వవద్దని కూడా దేవుణ్ణి కోరుతాను. రాజ్యం లేకుండానే నేను రాజుని. కానీ రాజ్యం వస్తేమటుకు నేను రాజును కాను" అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా "నీ మాటల్లో ఏదో అంతరార్థం ఉంది. కానీ నువ్వు రాజువు అంటున్నావు. ఏవిధంగా నువ్వు రాజువు?" అన్నాడు.

పశువుల కాపరి "అయ్యా! నేను రాజ్యంవల్ల, ఐశ్వర్యంవల్ల రాజుని కాను. స్వేచ్ఛతో, స్వాతంత్ర్యంతో రాజునయ్యాను. నేను నేనుగా ఉన్నాను. నా కళ్ళతో ఈ





మనోహరమైన ప్రకృతి ఆస్వాదించే వీలు, వెసులుబాటు నాకు ఉంది. హృదయపూర్వకంగా ప్రేమించే నిర్మలత్వం నా దగ్గరుంది. సూర్యుడు రాజుకిచ్చిన కాంతినే నాకూ ఇస్తాడు. పూలు రాజుకోసం విచ్చుకున్నట్లే నాకోసం కూడా విచ్చుకుంటాయి. వాటిని చూసి ఆనందించే కళ్ళు, మనసు నాకున్నాయి. కానీ రాజుకు అహంకారంతో వీటిని ఆస్వాదించే సమయముండదు. అతను రాజ్యకాంక్షలో అన్నీ కోల్పోతాడు. అందువల్ల రాజుకంటే నేనే గొప్పవాణ్ణి" అన్నాడు.

పశువుల కాపరి మాటల్తో రాజు అహంకారం అదృశ్యమైంది.

## 41. సన్యాసి - వేశ్య

భౌతికంగా జరిగే మార్పులవల్ల మనుషుల్లో ఎట్లాంటి పరివర్తనా జరగదు. మానసికమయిన మార్పులవల్లే మనుషుల్లో పరివర్తన కలుగుతుంది. మనసులో కాంతి ఉంటే ఆవరణలో కూడా ఉంటుంది. తమని తాము మార్చుకోవాలని ఆశించే వాళ్ళని ఆశ వెంటాడుతుంది. వాళ్ళు హృదయ పరివర్తన గురించి ఆలోచించరు. పైపై మార్పులతో తృప్తి పడిపోతారు.

**మనిషి నిత్యచైతన్యంతో ఉండాలి.** తాను బాహ్యమయిన మార్పుల్ని కోరుకుంటున్నాడా? ఆంతరింగికపరివర్తనని కోరుకుంటున్నాడా? అన్న స్పృహతో ఉండాలి. అప్పుడు అంతా సవ్యంగానే ఉంటుంది. లేకుంటే అంతా అస్తవ్యస్తమవుతుంది.

ఒక పట్టణంలో ఒకేసారి ఒక సన్యాసి, ఒక వేశ్య చనిపోయారు. ఆ సన్యాసి ఆశ్రమం చాలా పేరుపొందింది. దేశవిదేశభక్తులు వచ్చేవాళ్ళు. ఆశ్రమంలో యజ్ఞాలు, యాగాలు జరుగుతూ ఉండేవి. ఆ సన్యాసి గొప్పజ్ఞానిగా పేరుపొందాడు. ఆయన సర్వశాస్త్ర పారంగతుడు. తన బోధనల్తో జనాల్ని ఊగించేవాడు. తన ప్రతిభతో ఆకట్టుకునేవాడు.

అతని ఆశ్రమానికి సమీపంలోనే వేశ్య ఉండేది. ఎందరో విటులు ఆమె ఇంటికి వెళుతూ ఉండేవాళ్ళు. సన్యాసి ఇదంతా గమనిస్తూ ఉండేవాడు. తన బోధనలు వినిపిస్తున్నా, ప్రార్థనలు చేస్తూ ఉన్నా వాటి వెనక వేశ్యకు సంబంధించిన ఆలోచనలు మెదుల్తూ ఉండేవి. నేను శాస్త్రాల గురించి, సర్వసంగపరిత్యాగం గురించి చెప్పుకుంటూ కాలం గడుపుతూ ఉంటే... ఆ వేశ్య మాత్రం ఎందరో విటులతో ఆనందాన్ని పొందుతుంది. సుఖాన్ని అనుభవిస్తోంది. జీవితమంటే ఆమెది కదా! అదృష్టమంటే ఆమెది కదా! అని అనుకుంటూ ఉండేవాడు.

ఆ వేశ్య ఎప్పుడయినా ఆ ఆశ్రమం ముందు నడిచిపోతూ "ఈ సన్యాసి ఎంత పవిత్రజీవితం గడుపుతున్నాడు? నిత్యం భగవన్నామసంకీర్తనతో ఎంత ప్రశాంతంగా

ఉన్నాడు. జీవితమంటే ఆయన్దే కదా! నాది నీచమయిన బతుకు. హీనమయిన బతుకు. పూర్వజన్మలో పాపం చేసుకుని నేను ఈ వేశ్య జన్మను ఎత్తాను" అని పశ్చాత్తాపంతో కుమిలిపోయేది.

సన్యాసి, వేశ్య ఏకకాలంలో మరణించారు. దేవదూతలు వేశ్యని స్వర్గానికి తీసుకెళ్ళారు. యమభటులు సన్యాసిని నరకానికి తీసుకెళ్ళారు. అప్పుడు సన్యాసి యమభటుల్ని ఆపి "ఆగండి! ఎక్కడో ఏదో పొరబాటు జరిగింది. నిత్యం ప్రవచనాలతో నిర్మలమైన జీవితం గడిపిన యోగిని నేను. నేను ఎట్లాంటి పాపకార్యాలు చేయలేదు. నన్నెందుకు నరకానికి తీసుకెళుతున్నారు? అనునిత్యం వేశ్యావృత్తిలో ఉంటూ పాప పంకిల జీవితం గడిపిన వేశ్యను దేవదూతలు స్వర్గానికి తీసుకు వెళుతున్నారు ఎందుకు? నేను దేవదూతలతో స్వర్గానికి, ఆమె యమభటుల్తో నరకానికి వెళ్ళాలి" అన్నాడు.

యమభటులు కిందకు చూడమన్నారు. ఆ సన్యాసి శవం పూలరథంలో ఊరేగిస్తూ వేలమంది జనం వెంట వెళుతున్నారు. భగవన్నామసంకీర్తనతో పరిసరాలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ దృశ్యం చూసి సన్యాసి ఆనందించాడు. మరోవేపు వేశ్య శరీరాన్ని ఖననం కూడా చెయ్యకుండా శ్మశానంలో ఒక మూల పడేశారు. ఎవరూ పట్టించుకోలేదు. కాకులు, గద్దలు పీక్కుతింటున్నాయి.

సన్యాసి యమభటుల్తో "చూశారు కదా నా గొప్పతనం నా పవిత్రత" అన్నాడు.

యమభటులు "ప్రపంచంలో కనిపించడానికి, మనసు లోపల ఉన్నదానికి చాలా తేడా ఉంటుంది. ప్రపంచం పైపైన జరిగే దాన్నే పట్టించుకుంటుంది. నువ్వు బతికి ఉన్నన్ని రోజులు వేశ్య గురించే ఆలోచించావు. ఆమె అంతులేని సుఖాలతో ఓలలాడుతుందనే అనుకున్నావు. నీ జీవితంలో ఆనందం లేదని, అర్థం లేదని అనుకుంటూ గడిపావు. కానీ ఆ వేశ్య తాను నీచవృత్తిలో ఉన్నా పవిత్రమైన హృదయంతో పరితపించింది. నువ్వు పైపైన దేవుణ్ణి భజన చేస్తే ఆమె పరవశంగా భగవంతుణ్ణి కీర్తించింది. నిన్ను అదృష్టవంతుడని నీది ఉత్తమ జీవితమని తలపోసింది. అందుకే ఆమెకు స్వర్గప్రాప్తి, నీకు నరకప్రాప్తి" అన్నాడు. సన్యాసి స్థాణువైపోయాడు.

## 42. అమాయకత్వం

స్వాములనే వాళ్ళు, గురువులనే వాళ్ళు మనిషిలో అమాయకత్వాన్ని , అజ్ఞానాన్ని నిలిపి ఉంచడానికే ప్రయత్నిస్తారు. వాళ్ళు చెప్పింది వింటూ, వాళ్ళు చెయ్యమన్నది చేస్తూ ఉంటేనే వాళ్ళ పనులు జరుగుతాయి. ఎవరయినా సందేహిస్తే, ప్రశ్నిస్తే, వాళ్ళ బండారం బయటపడుతుంది. వాళ్ళకు కావలసిందల్లా జనం వాళ్ళు చెప్పినట్లు వినాలి.





రాజకీయ నాయకులయినా అంతే. వాళ్ళకు అనుచరులు కావాలి. స్వాములయినా అంతే వాళ్ళకు శిష్యులు కావాలి. అంతా గురువులకే తెలుసునని సామాన్యజనం అనుకోవాలి. అంతే కానీ తమకెంత తెలుసో గురువులకూ అంతే తెలుసునని జనం తెలుసుకుంటే గురువుల ప్రత్యేకత ఉండదు. వాళ్ళు జనంపై అజమాయిషీ చెయ్యలేరు. జనానికి సలహా లివ్వలేరు.

సలహాలు తీసుకోవడానికే సాధారణజనం ఇష్టపడతారు. స్వతంత్రంగా ఆలోచించడానికి, నిర్ణయాలు తీసుకోవడానికి ఇష్టపడరు. అది శ్రమతో కూడుకున్న సంగతి. పరిస్థితుల్ని సూటిగా, సరాసరి ఎదుర్కోవాలి.

ఒక గ్రామంలో ఉన్న జనం అమాయకులు. వాళ్ళు ఎవరు ఏది చెబితే అది నమ్మేవాళ్ళు. పైగా వాళ్ళకు దేవుడంటే ఎంతో భక్తి. నిత్యం పూజలు, భజనలు చేసేవాళ్ళు. ఎందరో వచ్చి వాళ్ళకు బోధలు చేసేవాళ్ళు. గ్రామస్థులు వాళ్ళను సత్కరించి, గౌరవించి పంపేవాళ్ళు. స్వాములు మోసగాళ్ళని, తమని వంచిస్తున్నారని, ఆ కపటం లేని గ్రామప్రజలు ఎప్పుడూ అనుకోలేదు.

ఆ గ్రామం ముందు ఒక దేవుని విగ్రహం ఉండేది. అది వానకు తడుస్తూ , ఎండకు ఎండుతూ ఉండేది. పూర్వకాలంలో అక్కడ గుడి ఉండేది. అది కూలిపోయి విగ్రహం ఒకటే మిగిలింది. పూజాపునస్కారాలు లేకుండా పడి ఉండేది. ఎవరూ దాన్ని పట్టించుకోలేదు.

ఒకరోజు ఆ దారంటే వస్తున్న ఒక గురువు ఆ విగ్రహాన్ని చూశాడు. పూజకు నోచుకోకుండా దుమ్ము పట్టిన ఆ విగ్రహాన్ని చూసి అతను కదిలిపోయాడు. వెంటనే గ్రామంలోకివెళ్ళి గ్రామస్థుల్ని ఒక దగ్గర చేర్చి "మీ గ్రామం ముందు ఒక దేవుని విగ్రహం ఉంది. ఎప్పుడయినా చూశారా? ఎవరూ పట్టించుకోకుండా ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ ఉంది. ఇది అపచారం. మీరు వెంటనే ఆ విగ్రహం చుట్టూ కర్రలు నాటి, పందిరేసి, రక్షణ కల్పించండి. మీకు పుణ్యం వస్తుంది. ఆ పందిరి కిందనే నేను బోధలు చేస్తాను. మీరు భజనలు చేయండి. ఈ సత్కార్యాన్ని ఇప్పుడే మొదలుపెట్టి పుణ్యం కట్టుకోండి" అన్నాడు.

వెంటనే గ్రామప్రజలు ఆ విగ్రహం చుట్టూ శుభ్రం చేసి గుంజలు నాటి పందిరి వేశారు. ఆరోజు నుంచీ అక్కడే భజనలు మొదలుపెట్టారు. ఆ గురువు గ్రామం వదిలి మరోచోటికెళ్ళిపోయాడు. కొంతకాలానికి మరో సన్యాసి ఆ గ్రామానికి వచ్చాడు. విగ్రహం చుట్టూ గుంజలు, పందిరి చూసి విస్తుపోయాడు. గ్రామస్థుల్ని చూసి "అయ్యా! మీరు చేస్తున్నదేమి? విగ్రహం చుట్టూ గుంజలు నాటి పందిరి వేశారు. పగలు మీరు

ఇక్కడ భజనలు చేసినా రాత్రిళ్ళు మీ ఇళ్ళకు మీరు వెళ్ళిపోతారు. ఇది వేసవికాలం. ఏ క్షణాన్నయినా ప్రమాదవశాత్తు ఒక నిప్పురవ్వ పడినా ఈ పందిరి క్షణంలో దగ్ధమయిపోతుంది. అప్పుడు విగ్రహం కూడా మాడి మసవుతుంది. వెంటనే ఈ గుంజలు పీకి, పందిరి పీకి, ఈ విగ్రహానికి రక్షణ కల్పించండి" అన్నాడు.

వెంటనే గ్రామస్థులంతా ఆ గుంజలు పీకి, పందిరి పీకి, విగ్రహానికి గాలీ, ఎండా సోకేలా చేశారు. ఆ సన్యాసి తన దారంటే తను వెళ్ళాడు. మరో గురువు గ్రామానికి వచ్చాడు. ఆ సంగతి తెలిసి గ్రామ ప్రజలంతా తలుపులు బిడాయించుకుని ఇళ్ళల్లో ఉండిపోయారు. కారణం ఈ గురువు ఏమి చెబుతాడో అని వాళ్ళ భయం!

## 43. భక్తి బేరం

నేనొక ఊరికెళ్ళాను. ఆ ఊరిమధ్య ఒక మందిరం ఉంది. ఆ ఊరిజనం ధర్మాత్ములుగా పేరుపొందినవాళ్ళు. అందుకనే చూడ్డానికెళ్ళాను. జనం సాయంత్రం కల్లా గుడికి చేరేవాళ్ళు. భజనలు, ప్రార్థనలు మొదలయ్యేవి. శక్తికొద్దీ దేవుణ్ణి ప్రార్థించి, కీర్తించి ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళేవాళ్ళు. వాళ్ళని పరిశీలించాను. వాళ్ళ ప్రవర్తనకు, ప్రార్థనకూ ఏమీ సంబంధం లేదన్న సంగతి తెలిసి వచ్చింది. అనుదిన జీవితంలో అందరూ నిర్దయగా ఉండేవాళ్ళు. ప్రార్థన నించే వాళ్ళు ఏమీ నేర్చుకున్నట్లు కనిపించలేదు. భక్తి భక్తే. బతుకు బతుకే. ఒకదాని ప్రభావం ఇంకో దాని మీద కనిపించదు. ధర్మమన్నది జీవితంలోకి అడుగుపెట్టడం కనిపించలేదు.

చివరికి తెలిసిందేమిటంటే అందరివీ అధర్మజీవితాలే. పైకి మాత్రం సన్మార్గులుగా, భక్తులుగా కనిపిస్తున్నారు. తమ అధర్మాన్ని, తమ లోపలి కపటాన్ని కప్పి పుచ్చుకోవడానికి వాళ్ళు భక్తి అనే ముసుగును కప్పుకున్నారు. అది వాళ్ళకెంతో అనుకూలంగా ఉంది. ఆలయాలు, పూజా గృహాలు వాళ్ళకు ఎంతగానో ఉపయోగపడు తున్నాయి. అట్లా అని వాళ్ళకు దైవంమీద ప్రేమ ఉందా? అంటే అదీ లేదు. ప్రేమ ఉన్నప్పుడు కోరికలుండవు. వాళ్ళు భగవంతుణ్ణి ప్రార్థించినా ఆ ప్రార్థన ఐహికసుఖాల్లో భాగంగానే ఉంది. ప్రార్థన అంటే ప్రేమ, త్యాగం, కృతజ్ఞత ఆ లక్షణాలు వాళ్ళల్లో అణుమాత్రం లేవు. వాళ్ళని చూసి నాకో కథ గుర్తుకు వచ్చింది.

ఒక హంతకుడికి ఉరిశిక్ష పడింది. నెల తరువాత అతన్ని ఉరి తీస్తారు. అంతవరకూ అతన్ని జైల్లో పెట్టారు. ఉరిశిక్ష విధింపబడినట్లు తెలుస్తూనే ఆ హంతకుడిలో అపూర్వ పరివర్తన కలిగింది.

అతనిలో దుర్మార్గ ప్రవర్తన హఠాత్తుగా అదృశ్యమయిపోయింది. శాంతిమూర్తిగా మారిపోయాడు. ఉదయాన్నే లేచి పరిశుభ్రంగా తయారై, ప్రసన్నవదనంతో తోటి ఖైదీలకు,





జైలు అధికారులకు అభివాదం చేసి భగవన్నామస్మరణ మొదలుపెట్టేవాడు. రామనాసంకీర్తనతో చెరసాల నిండిపోయేది. గొప్పగొప్ప తత్త్వగీతాలు ఆలపించే వాడు. అతని నిరంతర చింతన దైవికం అయిపోయింది. గొప్ప ప్రేమమూర్తిగా మారిపోయాడు. తోటిఖైదీలతో ఎంతో దయగా ప్రవర్తించేవాడు.

ఉదయం మొదలు అతను ప్రార్థన చేస్తూ ఉంటే మెల్లగా తోటి ఖైదీలందరూ అతని దగ్గరకు వచ్చి అతని పక్కన కూర్చునేవారు. వాళ్ళు కూడా ప్రార్థన అందుకునే వాళ్ళు. వాళ్ళు కూడా భక్తులుగా మారిపోయారు. నిత్యభజనలతో చెరసాల ఆలయమయిపోయింది. అంత గొప్ప హంతకుడు ఇంత గొప్ప భక్తుడిగా మారిపోవడం చూసి జైలు అధికారి కదిలిపోయాడు. అతను కూడా హంతకుడి శిష్యుడయ్యాడు.

అతను కూడా ఖైదీలతోబాటు కూర్చుని భజనలు చేసేవాడు. ఆ హంతకుడిలో వచ్చిన పరివర్తన పై అధికారులకు కూడా తెలిసింది. చెరసాలలు పరివర్తనా శాలలుగా మారడం వాళ్ళకు పరమానందం కలిగింది. జైలు అధికారి ఉదయాన్నే హంతకుడికి అభివాదం చేసి తన కార్యక్రమాలు ఆరంభించేవాడు. అతని అవసరాల్ని కనిపెట్టేవాడు.

ఒకరోజు ఉదయం అంతా నిశ్శబ్దంగా ఉంది. జైలు అధికారి "ఎందుకు ఇంకా అతను నిద్రలేచి ప్రార్థన ప్రారంభించలేదు" అని ఖైదీల్ని అడిగాడు. ఖైదీలు అతనింకా నిద్ర లేవలేదన్నారు. జైలు అధికారి బహుశః ప్రార్థనలతో రాత్రి అలసి పోయాడనకుని వెళ్ళాడు.

ఖైదీలు హంతకుడితో "ఎందుకింకా మీరు ఈ రోజు ప్రార్థన ఆరంభించలేదు?" అని అడిగారు. దానికి హంతకుడు "నా భక్తి బేరం కుదిరింది. నాలో మార్పు చూసి పై అధికారులు నా ఉరిశిక్ష రద్దుచేసి దాన్ని ఏడు సంవత్సరాలు జైలుశిక్షగా మార్చారు. అనుకున్న పని పూర్తయింది. అమాయకుడయిన దేవుణ్ణి ఇంకా నేను ఇబ్బంది పెట్టదలచుకోలేదు" అన్నాడు.

## 44. ప్రేమ ప్రచారం

ఒకరోజు నేను దారంటే వెళుతూ ఉంటే ఒక గుడికడుతూ ఉండడాన్ని చూశాను. దేశంలో ఎక్కడపడితే అక్కడ గుళ్ళూ, గోపురాలు పెరిగిపోతున్నాయి. జనంలో ఇంతగా భక్తి ఎక్కువయిందా? అని సందేహం కలిగింది. ఆ గుడి వెనుక ఒక రాతిని చెక్కుతున్న వృద్ధుడి దగ్గరకు వెళ్ళి "ఈ గదిని నిర్మిస్తున్నందుకు కారణమేమిటి? కావలసినన్ని గుళ్ళు ఈ ప్రాంతంలో ఉన్నాయి కదా?" అన్నాను.

ఆ వృద్ధుడు ఏమీ మాట్లాడకుండా ఆ రాయిని చూపించాడు. ఆ రాయిమీద గొప్పదానశీలి అయిన ఫలానా వ్యక్తి ఆ గుడిని కట్టిస్తున్నట్లు శిలాఫలకం చెక్కుతున్నారు. అప్పుడు నాకు అర్థమయింది. ఆ గుడి ఫలానా వ్యక్తి కోసం కడుతున్నారు. దేవుడి కోసం కాదు. ఆ వ్యక్తి పేరు శాశ్వతంగా నిలిచిపోవాలంటే అతను ఏమయినా చేయాలి. అందుకని గుడి కట్టిస్తున్నాడని అర్థమయింది.

ఆ విషయం గురించే ఆలోచించుకుంటూ వెళుతూ ఉంటే దారిలో పెద్ద ఊరేగింపు కనిపించింది. విషయమేమిటా అని విచారిస్తే ఒక వ్యక్తి సంసారాన్ని వదలి పరిత్యాగి అవుతున్నాడట. అతన్ని గొప్ప ఆసనంలో కూర్చోబెట్టి జనం ఊరేగిస్తున్నారు. మేళతాళాలు, నాట్యాలతో పరిసరాలు హోరెత్తుతున్నాయి. నేను సన్యాసం స్వీకరించిన ఆ వ్యక్తిని చూశాను. అతను కళ్ళల్లో వినయం లేదు. త్యాగభావం లేదు. గొప్ప గర్వం. అహంకారం, తానేదో అపూర్వవిషయాన్ని సాధించానన్న అహంకారం కనిపించాయి. అతనికీ, రాజకీయనాయకుడికీ తేడా ఏమీ కనిపించలేదు. సన్యాసానిక్కూడా ప్రచారమా? అనిపించింది.

పక్కల జనం కూడా చూడ్డానికి వచ్చారు. యాగం కూడా చేశారు. వచ్చిన జనం తృప్తిగా భోజనాలు కూడా చేసి వెళ్ళారు. అని ఉపవాస దీక్ష గురించి గొప్పగా ప్రచారం జరిగింది. పదిరోజుల అనంతరం ఆ ఉపవాసదీక్షకు అతను చాలా ఖర్చుపెట్టుకున్నట్లు చెప్పుకున్నారు. ప్రచారానికి పరిమితులు ఉండవు. ప్రచారం రకరకాలుగా ఉంటుంది. నిజానికి విషప్రచారమన్న మాటను వాడుతూ ఉంటారు. అది తప్పు. ప్రచారమేదయినా విషయమే. ఒక కథ గుర్తుకొచ్చింది.

ఒక సంపన్నుడు దేవుడికి పదివేల బంగారు నాణేలు సమర్పించాడు. ఆ కార్యక్రమం చాలా అట్టహాసంగా జరిగింది. ఊరి జనమంతా గుడి దగ్గరికి చేరారు. మండపంలో పెద్దలు ఆసీనులయ్యారు. సంపన్నుడు తాను తెచ్చిన బంగారు నాణేల సంచిని అక్కడుంచాడు. సంచి విప్పి నాణేల్ని లెక్కపెట్టడం ప్రారంభించాడు. లెక్క పెట్టడంలో నాణేల శబ్దం అందరినీ అలరించేలా ఆలకించేలా వాటిని గలగలలాడించాడు.

అందరూ నిశ్శబ్దంగా చూస్తున్నారు. తాను ఎంత గొప్ప త్యాగశీలో? ఎంత ప్రేమపూరితుడో అందరూ గుర్తించాలన్నట్లు ఒక్కో నాణాన్ని లెక్కపెడుతూ దేవుడి విగ్రహాన్ని చూస్తూ, బంగారు నాణేల శబ్దాన్ని పంచుతూ తాను లెక్కించే కార్యక్రమాన్ని ముగించి పూజారికి సమర్పించబోయాడు.

ఆ పూజారి సాధువు, సహృదయుడు.



పూజారి సంపన్నుణ్ణి చూసి "అయ్యా! నేను ఇస్తున్నాను. ఆ విషయం అందరికీ తెలిస్తే నాకు పేరు వస్తుంది" అన్న అహం మీలో ఉంది. **ప్రేమ, త్యాగం అన్నవి ప్రచారాన్ని కోరుకోవు.** మీరు వాటికి ప్రచారమివ్వాలని అనుకుంటున్నారు. అట్లాంటి ఉద్దేశ్యాలు నింపిన మీ బంగారు నాణేలు భగవంతుని సేవకు పనికిరావు. తీసుకుపొండి" అన్నాడు.

సంపన్నుడి ముఖం వెలవెలబోయింది.

## 45. స్వర్గ ప్రవేశం

స్వర్గద్వారం దగ్గర చాలా రద్దీగా ఉంది. తాను ముందు వెళ్ళాలంటే తాను ముందని ఒకర్నొకరు తోసుకుంటున్నారు. స్వర్గద్వారాలు మూసే ఉన్నాయి. ద్వారపాలకులు అందర్నీ అరవవద్దని చెబుతున్నారు. ఎవరి అర్హతల్ని బట్టి వాళ్ళు అర్హులో కాదో నిర్ణయించి మాత్రమే స్వర్గంలోకి అనుమతిస్తామని తక్కినవాళ్ళకు ప్రవేశం దొరకదని వాళ్ళన్నారు.

అంతలో అందర్నీ తోసుకుని సకలశాస్త్రపారంగతులయిన పండితుల గుంపు ముందుకు వచ్చింది. "మేము సత్సంప్రదాయంలో జీవించిన వాళ్ళం. సమస్త వేదవేదాంగ జ్ఞానసంపన్నులం. అందువల్ల మొదట మాకే స్వర్గప్రవేశ అర్హత ఉంది. ఈ జనాన్నంతా వెనక్కినెట్టి మొదట మమ్మల్ని స్వర్గంలోకి పంపండి" అన్నారు.

ద్వారపాలకులు "అయ్యా! సకల శాస్త్రాలూ అభ్యసించినంత మాత్రాన స్వర్గానికి గ్యారంటీ లేదు. ఎందుకంటే స్వర్గప్రవేశానికి జ్ఞానం పనికిరాదు. అది ప్రపంచానికి పనికొస్తుందేమో కానీ ఇక్కడ పనికి రాదు" అన్నాడు.

అంతలో ఒక సన్యాసి ముందుకు వచ్చి ఇక్కడ ఉన్నవాళ్ళల్లో స్వర్గంలో ప్రవేశించడానికి నాకంటే అర్హత ఉన్న వ్యక్తి ఇంకెవరూ లేరు. ఎందుకంటే నేను సర్వసంగ పరిత్యాగిని. నిత్యం దైవధ్యానంలో ఉపవాసదీక్షతో నా జీవితాన్ని పునీతం చేసుకున్నాను. పైగా ఇటీవలి కాలంలో నన్ను మించిన తపోసంపన్నుడు ఎవడూ లేడు" అన్నాడు.

దానికి ద్వారపాలకులు "అయ్యా! అంతా బాగానే ఉంది. కానీ, మీరు ఏ ప్రయోజనాన్ని ఆశించి తపస్సు చేశారు. ఏదయినా ఫలితాన్ని ఆశించి తపస్సు చేస్తే అది తపస్సు కాదు. స్వార్థమవుతుంది" అన్నారు.

కొంతమంది రాజకీయ నాయకులు ముందుకు వచ్చారు. "దేశసేవలో మమ్మల్ని మించిన వాళ్ళు లేరు. ప్రజల కష్టసుఖాల్ని పట్టించుకున్నాం. ప్రజాసేవలో మా జీవితం తరించింది" అన్నారు.

ద్వారపాలకులు "ప్రజలకు సేవ చేయడం మంచిదే. అది అధికారం కోసం పొగడ్తలు కోసం చేస్తే అర్థం లేనిది. ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా మీరు ప్రజాసేవ చేశారా?" అన్నారు.

ఇట్లా జనం ఒకర్నొకరు తోసుకుంటూ తాము ముందుగా స్వర్గంలోకి వెళ్ళాలని తన్నుకుంటూ, తోసుకుంటూ ఉన్నారు.

అందరిని వెనక అనవసరంగా ఇక్కడికి వచ్చానేమో అనుకుంటూ పశ్చాత్తాప పడుతున్నట్లు ఒక వ్యక్తి ఉండడాన్ని ద్వారపాలకులు చూశారు. అందర్నీ పక్కకు జరగమని చెప్పి ఆ వ్యక్తిని ముందుకు పిలిచారు. "నీ అర్హతలేమిటి?" అని అడిగారు.

ఆ వ్యక్తి చేతులు జోడించి "అయ్యా! పొరపాటున నేను ఇక్కడికి వచ్చినట్లున్నాను. ఇక్కడికి రావడానికి నాకు ఏ అర్హతలూ లేవు. ఎందుకంటే నాకు ఎలాంటి శాస్త్రజ్ఞానమూ లేదు. నేను ఎట్లాంటి ప్రజాసేవ చెయ్యలేదు. ఎట్లాంటి సంఘసంస్కరణలు చెయ్యలేదు. నేను సన్యాసిని కాను. ఎట్లాంటి తపస్సూ చేయలేదు. దాన్ని గురించి నాకు ఏమీ తెలియదు. పైగా దానధర్మాలు చెయ్యడానికి నా దగ్గర ఏమీలేదు. నేను పేదవాణ్ణి. నా దగ్గర ప్రేమ మాత్రమే ఉంది. ఇక్కడి పరిస్థితిని చూస్తే ప్రేమకు స్వర్గంలో స్థానంలేదని తెలుస్తుంది. దయచేసి నరకానికి వెళ్ళేదారి ఏదో చూపిస్తే వెళతాను. నాకా ఉపకారం చెయ్యండి" అన్నాడు.

ఆ మాటలతో ద్వారపాలకులు ఎంతో ఆనందించారు.

"అయ్యా! ఇక్కడ ఇంతమంది పడిగాపులు కాస్తున్నారు. కానీ ఇంతమందిలో ఒక్కరికీ స్వర్గంలో ప్రవేశించే అర్హత లేదు. స్వర్గంలోకి అడుగు పెట్టడానికి అర్హత ఉన్న వ్యక్తి మీరొక్కరే. స్వార్థం లేని వ్యక్తి మీరు ఒక్కరే" అని అతన్ని సగౌరవంగా స్వర్గద్వారాలు తెరిచి లోపలికి ఆహ్వానించారు.

## 46. గురువు

అతను యువకుడు. అన్ని అనుకూలలూ ఉన్నవాడు. ఏ యిబ్బందులూ లేవు అట్లాంటిది అతనికి హఠాత్తుగా సత్యాన్వేషణపైకి దృష్టి మళ్ళింది. సత్యాన్ని అన్వేషించాలన్న వాడికి గురువు అవసరం అందుకని తగిన గురువుని అన్వేషించడానికి బయల్దేరాడు. గ్రామం వదలివెళుతూ ఉంటే పొలిమేరలో ఒక పెద్ద చెట్టు క్రింద రచ్చబండపైన ఒక సన్యాసి ఉండడం చూశాడు. అతని దగ్గర ఏదయినా సమాచారం దొరకవచ్చని అనుకుని ఆ యువకుడు ఆ సన్యాసి దగ్గరకెళ్ళి "నమస్కరించి నువ్వు ఎన్నో ప్రదేశాలు తిరిగి ఉంటావు. ఎంతో అనుభవాన్ని గడించి ఉంటావు. నేను సత్యాన్వేషణలో ఉన్నాను.





సరయిన గురువుని వెతికే పనిలో ఉన్నాను. నీ ప్రయాణంలో నీకు గొప్ప గురువు తటస్థపడే ఉంటాడు. అతని గురించి చెబితే నీకు రుణపడి ఉంటాను. గురువు లేకుండా నా జీవితం సంపూర్ణం కాదు" అన్నాడు.

ఆ సన్యాసి వృద్ధుడు. అరవయ్యేళ్ళు ఉంటాయి. అతను తప్పకుండా నీకు గురువు వివరాల్ని అందిస్తాను. దాన్ని బట్టి అతన్ని నువ్వు గుర్తుపట్టవచ్చు" అని ఆ గురువు రూపురేఖల్ని వర్ణించాడు. ఈ వివరాల్ని మాత్రం విస్మరించకు. అట్లాంటి వ్యక్తి ఎక్కడయినా నీకు ఎదురయితే అతనే గురువు" అన్నాడు.

ఆ యువకుడు వృద్ధుడికి కృతజ్ఞతలు చెప్పి అన్వేషిస్తూ సాగిపోయాడు. ముప్పయి సంవత్సరాలు గడిచిపోయాయి. యువకుడు కూడా పెద్దవాడయ్యాడు. అన్వేషణలో అలిసిపోయాడు. వృద్ధుడు చెప్పిన పోలికలున్న వ్యక్తి ఎక్కడా అతనికి తటస్థపడలేదు. చివరికి విసిగిపోయి "బహుశః అట్లాంటి గురువు లేడేమో" అనుకుని తన గ్రామానికి తిరిగి వచ్చాడు. గ్రామ పొలిమేరల్లో ఒక వృక్షం, రచ్చబండ. తను గ్రామాన్ని వదిలి పెట్టినప్పుడు ఉన్న రచ్చబండ. ఆ రచ్చబండపై అదే సన్యాసి మరింత వృద్ధుడయ్యాడు. పండు ముసలివాడయ్యాడు.

ఆ తొంభై సంవత్సరాల వృద్ధుణ్ణి చూసి యువకుడు నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే ముప్పయి సంవత్సరాల క్రింత ఆ సన్యాసి వర్ణించిన లక్షణాలన్నీ ఆ వృద్ధుడిలోనే ఉన్నాయి. యువకుడి కళ్ళల్లో నీళ్ళు కదిలాయి. ఆవేశంలో ఆ సన్యాసి దగ్గరకు వచ్చి "ఎందుకు నన్ను మోసం చేశావు? నా ముప్పయి సంవత్సరాల జీవితాన్ని నాశనం చేశావు? నువ్వే గురువని చెప్పి ఉంటే ఇలా జరిగేది కాదు కదా!" అన్నాడు.

దానికి ఆ వృద్ధుడు నవ్వుతూ...

"మొదట నీ కోపాన్ని ఉపసంహరించుకో అప్పుడు అసలు సంగతి చెబుతాను. ముప్పయి సంవత్సరాల క్రితం నువ్వు యువకుడివి. ఆవేశంలో ఉన్నావు. నేనే గురువని చెప్పి ఉంటే నువ్వు నవ్వేవాడివి. విశ్వసించే వాడివి కావు. పైగా మా గ్రామానికి వచ్చి నేనే గురువు వంటా?" అని హేళన పట్టించేవాడివి. అయినా అన్నీ నీకు వివరంగా చెప్పాను. వర్ణించాను. కానీ "నువ్వు ఇక్కడ కాకుండా ఎక్కడో వెతుకుతున్నావు. ముప్పయి సంవత్సరాల నీ అన్వేషణ వ్యర్థం కాలేదు. నువ్వు పరిణతి చెందావు. నన్ను గుర్తించావు. పైగా నీ ముప్పయి సంవత్సరాలు వ్యర్థమయ్యాయని నాపై ఆరోపణలు చేస్తున్నావు. కానీ నా సంగతి ఆలోచించు. ముప్పయి సంవత్సరాలుగా నేను ఈ వృక్షాన్ని వదలిపెట్టలేదు. యిక్కడే ఉన్నాను. నీకోసం ఎదురుచూస్తున్నాను. నీకు చెప్పిన మాటల్లో అణువంత కూడా అసత్యం లేదని గ్రహించు" అన్నాడు.

ఆ మాటలతో యువకుడికి జ్ఞానోదయమైంది.

## 47. విశ్వాసం

జునాయిడ్ సూఫీ మతగురువు. ఆయన ప్రతిరోజూ ప్రార్థనానంతరం ఆకాశంలోకి చూసి "దేవా! నీ అనురాగం సాటిలేనిది. మమ్మల్ని ఎప్పుడూ కనిపెట్టి ఉంటావు. నీ పట్ల కృతజ్ఞత ప్రకటించడానికి నాదగ్గర మాటల్లేవు. కానీ నా మనసును నువ్వు అర్థం చేసుకుంటావని తెలుసు" అనేవాడు.

ఆయన ఒకసారి శిష్యులతో కలిసి తీర్థయాత్రకు బయల్దేరాడు. వాళ్ళు ఎన్నో గ్రామాల గుండా వెళ్ళాల్సి వచ్చింది. మొదటి మూడురోజులు వెళ్ళిన గ్రామాల్లో వాళ్ళు ఎన్నో యిబ్బందులు ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆ గ్రామాలు సాంప్రదాయక ఇస్లాం మతస్థులవి. వాళ్ళు సూఫీ మతస్థుల్ని తక్కువగా చూసేవాళ్ళు. ఆ గ్రామస్థులు వీళ్ళకు తిండి, నీళ్ళు యివ్వకపోగా తమ గ్రామాల్లో విశ్రాంతి తీసుకోవడానికి కూడా వాళ్ళు అనుమతించలేదు. దానివల్ల వాళ్ళందరూ ఎన్నో యిబ్బందులకు లోనయ్యారు. మూడురోజులు తిండి, నీళ్ళు లేక అలసిపోయారు. కానీ జునాయిడ్ ఎప్పట్లాగే దైవాన్ని ప్రార్థించడం చూసి విస్తుపోయారు. జునాయిడ్ "దేవా! నీ అనురాగం సాటిలేనిది. మా పట్ల నీకు ఎంతో శ్రద్ధ. మమ్మల్ని కనిపెట్టి వుండడంలో నీలో కరుణ కదలాడుతుంది. మేము నీ దయకు తగినవాళ్ళం కాము. నిజానికి నీ పట్ల కృతజ్ఞత ప్రకటించడానికి నా దగ్గర మాటల్లేవు. కానీ కృతజ్ఞత నిండిన నా మనసును అర్థం చేసుకుంటావని ఆశిస్తాను" అన్నాడు.

ఆరోజు సాయంత్రం ఎప్పట్లా ఆయన భగవంతుణ్ణి ఆ విధంగా ప్రార్థించేసరికి శిష్యులు ఆశ్చర్యపోయి గురువుగారూ! మూడురోజుల నించి తిండీ, నీళ్ళూ లేకుండా మనం అల్లాడుతున్నాం. ఆ గ్రామస్థులు మనల్ని అవమానపరిచారు. తరిమికొట్టారు. యిన్ని జరిగినా మీరు ఎప్పట్లా ప్రార్థించారు. 'నువ్వు దయగలవాడివి అన్న మాటలు ఉపసంహరించి ఉంటే బావుండేది' అన్నారు.

జునాయిడ్, శిష్యుల వంక చూసి చిరునవ్వు నవ్వాడు.

మీరు అలా అనకూడదు. **నా విశ్వాసానికి నియమనిబంధనలు లేవు. నా కృతజ్ఞత ప్రయోజనాల్ని ఉద్దేశించింది కాదు.** దేవుడోదే యిచ్చాడని ఆయనపట్ల వినయం ప్రదర్శించాలనుకోను. **దేవుడు మనకు ఈ భూమిపై ఉనికిని కల్పించాడు. ఆయనపట్ల కృతజ్ఞత ప్రకటించడానికి అది చాలు.** ఎందుకంటే ఆ ఉనికి నేను కష్టపడి సాధించుకున్నది కాదు. అయాచితంగా వచ్చిన అదృష్టమిది. మనం గడిపిన ఈ మూడురోజులూ గొప్ప





సౌందర్యంతో తొణికిసాలాడాయి. ఈ మూడురోజులూ నాలో కోపం మొలకెత్తుతుందా? లేదా? అని పరిశీలించే గొప్ప అవకాశం నాకు దొరికింది. దేవుడి దయవల్ల నాలో కోపమే లేదు. ఫలితంగా ఉనికికి సంబంధించిన నా ఉద్దేశంలో ఎట్లాంటి వ్యతిరేకతా లేదు. నా కృతజ్ఞతలో ఎట్లాంటి కదలికా లేదు. ఇదొక అగ్నిపరీక్ష. దాన్నించి ఎటువంటి ఆటంకం లేకుండా నేను బయటపడ్డాను. అంతకుమించి నాకేం కావాలి? జననంలోనూ, మరణంలోనూ నేను వునికిని సందర్శిస్తాను. ఇది నా ప్రేమ వ్యవహారం. ఇది కొంతమంది ఐశ్వర్యవంతులు, కొంతమంది పేదవాళ్ళు అన్న వ్యవహారానికి సంబంధించిన విషయం కాదు. కొంతమంది విజేతలు, కొంతమంది పరాజితులు అన్న విషయం కాదు. ఈ విషయం ఎవరికీ సంబంధించింది కాదు. ఎవరూ దీంతో ఏమీ చెయ్యలేరు. ఇది పూర్తిగా నా వ్యక్తిగతమయిన విషయం. యథార్థంతో నాకున్న సన్నిహితసంబంధం. ఇక్కడ ఒక మహాసమన్వయముంది. మహాశాంతి ఉంది. నేను చాలా విశ్రాంతిగా నా నిలయంలో ఉన్నాను. దేవుడు నాకు యిది ఇచ్చాడని, అది యిచ్చాడని నేను ఆయనపట్ల కృతజ్ఞతగా వుండాలని అనుకోను. ఇది వ్యాపారం కాదు. ఆయన మనకు ఉనికిని ఇచ్చాడు. ఆయనపట్ల కృతజ్ఞత ప్రకటించడానికి అది చాలు" అన్నాడు.

శిష్యులు నిర్ఘాంతపోయారు.

## 48. వర్తమానం

ఒక పున్నమిరాత్రి నేను మిత్రుల్తో కలిసి ఒక పడవలో ఒక సరోవరం మధ్యలోకి వెళ్ళాం. అప్పుడు అర్ధరాత్రి కావస్తోంది. అంతా నిశ్శబ్దంగా, నిర్మలంగా ఉంది. పడవని సరస్సు మధ్యలో ఆపేశాం. ఆరబోసిన వెన్నెల్ని చూస్తూ ఉంటే అది మనోహరస్వప్నంలా ఉంది. నిశ్చల సరోవరంలో ప్రతిఫలించే నిండు చంద్రుడు మాతో మాట్లాడుతున్నట్లున్నాడు. నేను ఆకాశంలోని చంద్రుణ్ణి, సరోవరంలోని ప్రతిఫలించే చంద్రుణ్ణి చూస్తున్నాను.

కానీ నా మిత్రులకు అదేమీ పట్టలేదు. వాళ్ళు ఏవో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ జీవితంలోని ఆదాయ వ్యయాల గురించి, సమస్యల గురించి ప్రణాళికల గురించి చర్చించుకుంటూ చుట్టూ ఉన్నది ఏమీ పట్టనట్లు ఉన్నారు.

అది నిండు పున్నమిరాత్రి. పిండారబోసినట్లు లోకమంతా వెన్నెల వ్యాపించిన రాత్రి. ప్రకృతి అపూర్వసౌందర్యాన్ని అలంకరించుకున్న రాత్రి. ఆ సరోవరం కేసి ఆకాశం కేసి వాళ్ళు కనీసం చూడడమయినా లేదు. గడిచిపోయిన విషయాల్ని గురించో, రాబోయే సంగతుల గురించో మాట్లాడుకుంటున్నారు. అంతమందిలో నేను ఒంటరిగా ఉన్నాను. కానీ ఒంటరిని కాను. ప్రకృతి నాకు తోడుంది. ప్రకృతి ఆస్వాదనలో పరవశించి పోతున్నాను.

ఇంతలో మిత్రుల సంభాషణ దేవుడిపైకి మళ్ళింది. దేవుడి గురించి చర్చ చేయని మనిషి ఉండడు. ఆయన నోరు లేనివాడు కదా! అందరి కాలక్షేపానికి పనికి వస్తాడు. మిత్రుల్లో కొందరు దేవుడు వున్నాడన్నారు. మరికొందరు దేవుడు లేడన్నారు. చర్చ కొనసాగింది.

ఎప్పటికీ తెగని, తేలని తెమలని చర్చల్లో అది ఒకటి. అందరూ మౌనంగా ఉన్న నాకేసి తిరిగారు. ఎక్కడో ఏదో లోకంలో ఉన్నట్లున్నావు. మాకు సమాధానం చెప్పు. దేవుడున్నాడా? లేడా?" అని అడిగారు.

వాళ్ళ ప్రశ్న గురించి ఆలోచించాను. వాళ్ళకు ఎట్లాంటి సమాధానమివ్వాలా? అని ఆలోచనలోపడ్డాను. వాళ్ళకు ఏం చెప్పాలి?

**ఎవరయితే వర్తమానంలో జీవిస్తారో వాళ్ళకు మాత్రమే దేవుడితో సాన్నిహిత్యం ఉంటుంది. వాళ్ళు మాత్రమే దేవుణ్ణి చూడగలరు. గతంలో, భవిష్యత్తులో జీవించే వాళ్ళకు దేవుడి గురించి తెలీదు. తెలుసుకోలేరు.**

వాళ్ళని చూసి 'మీకో సంఘటన' చెబుతాను. ఒక ఆఫీసులో ఉద్యోగాల కోసం యింటర్వ్యూ జరుగుతోంది. ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ళందరికీ నెంబర్లిచ్చారు. అందరూ హాల్లో ఉన్నారు. అందరూ ఉద్యోగంలోని లాభనష్టాల గురించి, యితర ఉద్యోగాల గురించి, యింకా ఎన్నెన్నో విషయాల గురించి తీవ్రంగా చర్చించుకుంటూ ఉన్నారు.

వాళ్ళ నెంబర్లని మైకులో అనౌన్సు చేసిన విషయం కూడా వాళ్ళు గుర్తించలేదు.

ఇవేవీ పట్టని వ్యక్తి "తన నెంబర్ వస్తూనే వెళ్ళి సెలక్ట్ అయి అప్పాయింట్‌మెంట్ ఆర్డరు పట్టుకుని బయటకు వచ్చాడు. అందరూ ఆశ్చర్యపోయారు" అన్నాను.

నా మిత్రులు మేము దేవుణ్ణి గురించి అడిగితే "నువ్వు యిదంతా ఎందుకు చెప్పావు" అన్నారు. నేను ఇక్కడ సరోవరం ఉంది. ఆకాశంలో పండు వెన్నెల విరగబూస్తోంది. మనం పడవలో ఉన్నాం. అంతా ప్రశాంతంగా, ఆహ్లాదంగా, మనోహరంగా ఉంది. మీరేమో వీటితో సంబంధం లేకుండా ఏవో పనికిమాలిన విషయాల్లోపడి కొట్టుకుపోతున్నారు. ఈ సరోవరంలో దేవుడున్నాడు. ఆ నిండుచంద్రుడిలో దేవుడున్నాడు. ఈ నిర్మలత్వంలో దేవుడున్నాడు. దేవుడు మీతో మాట్లాడటానికి మిమ్మల్ని తాకుతున్నాను. మిమ్మల్ని పిలుస్తున్నాను. యిప్పుడు, యిక్కడ, ఈ క్షణం దేవుడున్నాడు. మీరేమో నిన్న గురించి, రేపు గురించి, దేవుడి గురించి చర్చించుకుంటున్నారు. వర్తమానంలో దేవుడున్నాడు. మీరేమో గతంలో, భవిష్యత్తులో జీవిస్తున్నారు. **భగవంతుని సందేశం, పిలుపు ప్రతిక్షణంలో ప్రతిధ్వనిస్తుంది. ప్రకృతి పులకరింతలో ఉండి, వినేవాళ్ళకి అది వినిపిస్తుంది"** అన్నాను.





మిత్రులు మౌనంగా ఉండిపోయారు.

## 49. ఆనందం

అప్పుడప్పుడే తెల్లారుతోంది. వూరిలో జనం మేలుకుంటున్నారు. వున్నట్లుండి ఆకాశం నించి ఏవో మాటలు వినిపించాయి. వూళ్ళో జనమంతా వులికిపడి బయటకు పరుగులు తీశారు. అందరూ ఆకాశంలోకి చూశారు. ఆకావాణి తన అపూర్వస్వరంతో వాళ్ళను ఆశీర్వదిస్తూ పలికింది.

'మీరందరూ తరతరాలుగా కష్టపడుతున్నారు. బాధలు పడుతున్నారు. శ్రమ పడుతున్నారు. కానీ మీ పేదతనం అలానే ఉంది. మీ కష్టాలు తీరలేదు. అందుకు భగవంతుడు మిమ్మల్ని దయదలచాడు. మిమ్మల్ని ఆదుకోవాలనుకున్నాడు. మీరు చెయ్యాల్సిందల్లా ఒకటే. మీ దుఃఖాలన్నింటిని మూటగట్టి తీసుకురండి. ఊరి పొలిమేరకు తీసుకురండి. అక్కడ వదిలి పెట్టండి. అక్కడ కావలసినన్ని సుఖాలు కుప్పలు పోసి ఉంటాయి. వాటిని సంచుల్లో నింపుకుని ఎవరికి కావలసినన్ని వారు తీసుకుపోండి".

ఆ మాటల్తో వూరిజనం వుక్కిరి బిక్కిరయ్యారు. తమ అదృష్టానికి పొంగి పోయారు. అది వాళ్ళు కలలో కూడా ఊహించలేనిది. దేవుడు యింత హఠాత్తుగా దయదలుస్తాడని, తమ కష్టాలన్నీ తీరిపోతాయని వాళ్ళు ఊహించలేదు.

అందరూ తమ దుఃఖాన్ని మూటకట్టడం మొదలుపెట్టారు. దేన్నీ వదిలి పెట్టకుండా మరిచిపోయిన బాధల్ని కూడా మళ్ళీమళ్ళీ గుర్తు చేసుకుని మూటల్లో కుక్కారు.

ఆ వూళ్ళో ఒక సన్యాసి ఉన్నాడు. వూరి చివర గుడిసె వేసుకుని ధ్యానంలో మునిగి ఉండేవాడు. అందరూ దుఃఖాల్ని మూటగట్టుకుని వెళుతూ ఆ గుడిసె దగ్గర ఆగారు. ధ్యానముద్రలో ఉన్న సన్యాసిని లేపి జరిగిన విషయం చెప్పారు. అంతా విన్నాడు. కానీ ఆయన ఏమీ బదులివ్వలేదు.

జనం 'స్వామీ! ఈ దెబ్బతో నీ దరిద్రం వదలిపోతుంది. నీ బాధలన్నీ మూటగట్టి మాతోబాటు తీసుకురా. అక్కడ వదిలి నీకు కావలసిన సుఖాల్ని మూటకెత్తి తెచ్చుకో" అన్నారు.

సన్యాసి 'ససేమిరా' అన్నాడు. "మీరువెళ్ళండి. తెచ్చుకోండి. సంతోషంగా ఉండండి. ఏ లంపటాలు లేనివాణ్ణి. నాకెందుకవన్నీ" అన్నాడాయన. ఎందరు ఎంత బతిమిలాడినా అతను రాలేదు.

"ఈ సన్యాసి ఖర్మ" అనుకుని వూరి జనం దుఃఖాల్ని మోసుకుని పొలిమేరకు వెళ్ళారు. అక్కడ సంచీలు ఖాళీ చేశారు. ఒక్క దుఃఖం కూడా మిగలకుండా సంచీలు

మరీ విదిలించారు. కుప్పలు పోసిన సుఖాల్ని సంచీలు నిండుగా కూరారు. కావలసినవన్ని లేదా అక్కర్లేనన్ని లేదా అవసరానికి మించినన్ని సుఖాలతో సంచీలు నింపి తలకెత్తు కున్నారు. పిల్లాజెల్లా అందరూ చచ్చేంత బరువులు మోసుకుంటూ ఊళ్ళోకి వచ్చారు. వస్తూ సన్యాసి, గుడిసె ముందు కూచుని ఉంటే "చూశావా? రమ్మంటే నువ్వు రాలేదు" అన్నారు.

ఆ సన్యాసి చిరునవ్వు నవ్వాడు. భగవంతుడు మనిషికి ఆనందాన్ని మాత్రమే యిస్తాడు. దుఃఖాలు మనం కల్పించుకున్నవి. అవి అతనికి తెలుసు. దుఃఖాన్ని వదిలించుకోవాలని, సుఖాల్ని పొందాలని అతనికి లేదు. తన దగ్గర ఏది ఉందో అదే ఆనందమని అతనికి తెలుసు. పైగా అందరికీ తెలియని, చెప్పినా అర్థం కాని ఒక సంగతి అతనికి తెలుసు. బయట ఏది ఉందో అది ఆనందం కాదు. ఆనందం కోసం బయట వెతకాల్సిన పనిలేదు. అది లోపల ఉంది. అప్రయత్నంగా అతను దాన్ని అందుకున్నాడు.

జనాలు సన్యాసిని పరిహసించి వూళ్ళోకి అడుగుపెట్టారు. అక్కడ అన్నీ భవనాలే ఉన్నాయి. గుడిసెలున్నచోట మేడలు ఉన్నాయి. కానీ అన్నీ ఒకేలా ఉన్నాయి. పక్కవాడి యిల్లుకూడా తన యిల్లులాగానే ఉండడం, తనకెంత ఐశ్వర్యమున్నదో ఎదుటివాడికి అంతే ఉండడం చూసి మనుషులకు కొత్త బాధలు మొదలయ్యాయి.

## 50. చల్లని మరణం

ఒక అమాయకుడయిన శిష్యుడు ప్రతి విషయం గురించి ప్రశ్నిస్తూ ఉండేవాడు. గురువుగారు ఓపిగ్గా సమాధానాలిచ్చేవాడు. ఒక్కోసారి యిబ్బంది పడేవాడు. గురువు చెప్పిన వాటిని ఆలోచనలతో సంబంధం లేకుండా శిష్యుడు యథాతథంగా స్వీకరించేవాడు. ఒకసారి శిష్యుడికి "చావంటే ఏమిటి?" అన్న సందేహం కలిగింది. వెంటనే గురువు దగ్గరకెళ్ళి "గురువుగారూ! చావంటే ఏమిటి?" అని అడిగాడు.

గురువుగారు చిరునవ్వు నవ్వి "ఏ పనీ చెయ్యలేనప్పుడు, చలనం లేకుండా ఉన్నప్పుడు నువ్వు చనిపోయావని అనుకోవాలి" అన్నాడు. అప్పుడు శిష్యుడు "ఆ సంగతి నాకెలా తెలుస్తుంది" అని అడిగాడు.

గురువుగారు కాస్త ఆలోచించి "నీ చేతులు చల్లబడతాయి. అప్పుడు నువ్వు కదల్లేవు. నీ కళ్ళు మూతబడతాయి. ఐనా ఆ పరిస్థితి వస్తే నీకన్నీ తెలిసి వస్తాయి. దాన్ని గురించి తొందరపడవద్దు. అది అందరికీ తప్పక వచ్చి తీరుతుంది" అన్నాడు. గురువుగారి సమాధానంతో శిష్యుడు సంతృప్తి పడిపోయాడు. మరణం గురించి తనకు





తెలిసినందుకు మహానందపడిపోయాడు. తనకు 'జ్ఞానం' పెంచినందుకు గురువుపట్ల శిష్యుడికి కృతజ్ఞత పెరిగిపోయింది.

శిష్యుడు చలికాలంలో గొర్రెలు తోలుకుని అడవి కెళ్ళాడు. గొర్రెలు మేస్తూ ఉంటే శిష్యుడు కట్టెలు కొట్టడం మొదలుపెట్టాడు. చలికాలం మంచు కురవడం మొదలుపెట్టింది. సాయంత్రానికి కట్టెలు కొడుతున్న శిష్యుడి చేతులు మంచుకు చల్లబడ్డాయి. శిష్యుడు ఉన్నట్లుండి మరణం గురించి గురువు నుంచి తెలుసుకున్న మహా రహస్యం గుర్తుకొచ్చింది. మరణం తనని సమీపిస్తోంది అనుకున్నాడు. మరణం వచ్చినప్పుడు కదలలేని స్థితి వస్తుందని గురువు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. చలికి అతని శరీరం బిగుసుకుపోయి కదలలేని స్థితి వచ్చినట్లనిపించింది. నేలమీద పడుకున్నాడు. కట్టెలు కొడుతున్నప్పుడు శరీరంలో ఉన్న వేడి మాయమైపోయింది. కాబట్టి తనకు చావు వచ్చేసిందని, తాను చనిపోయానని తీర్మానించుకున్నాడు.

కళ్ళు మూతలు పడుతున్నట్లనిపించింది.

తన కళ్ళముందు గొర్రెలు మేస్తూ కనిపించాయి. మంచు కురుస్తోంది. మెల్లగా చీకటి పడుతోంది. ఆ క్షణంలో ఒక తోడేలు పొదనుంచి గొర్రెల మందపైకి దూకింది. ఒక గొర్రెను చంపి పొదల్లోకి లాక్కుపోయింది.

శిష్యుడు యిదంతా చలనం లేకుండా చూస్తూనే ఉన్నాడు. గొర్రెలు చెల్లా చెదురయ్యాయి. కాని చనిపోయినప్పుడు చేతులు చల్లబడిపోతాయని అప్పుడు నువ్వు ఏమీ చెయ్యలేవని గురువు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. తాను చనిపోయాను కాబట్టి ఏమీ చెయ్యలేక పోతున్నానని, బతికి ఉంటే ఆ తోడేలు పని పట్టేవాడినని అనుకున్నాడు. తన గొర్రెను లాక్కుపోతున్న తోడేల్ని చూస్తూ "ఓ మోసకారి తోడేలా! నేను చనిపోయాను కాబట్టి సరిపోయింది. నేను బతికి ఉంటే నిన్ను వదిలిపెట్టేవాణ్ణా? నీకింత ధైర్యం ఉండేదా? నా గొర్రెను నువ్వు లాక్కుపోవడం చూసి నిన్ను బతకనిచ్చేవాడినా? మా గురువుగారు చెప్పినట్లు నేను చనిపోయాను. కాబట్టి సరిపోయింది. కానీ లేకుంటే నీ పని పట్టేవాణ్ణి" అన్నాడు.

ఆ రకంగా శిష్యునికి 'మరణానుభవం' కలిగింది.

## 51. ముసుగు

కాషాయం బట్టలు కట్టుకున్నంత మాత్రాన ఎవడూ సన్యాసి కాడు. కాని జనం భ్రమల్లో ఉంటారు. బట్టలు మార్చినంత మాత్రాన మరిదేన్నో పొందడానికే అయి ఉంది. అన్నింటినీ వదులుకోవడం అంత సులభం కాదు. మనుషులు అభిప్రాయాల్ని

మార్చుకుంటారు కానీ అభిప్రాయాల్ని వదులుకోరు. పైపైన మారడం సులభం. లోపలి మార్పు కష్టం. మార్పు లేనితనాన్ని కప్పిపుచ్చుకోవడానికి మనుషులు ముసుగు వేసుకుంటారు. ముసుగులు మారుస్తారు. మారిన ముసుగుల్ని చూసిన జనం వీళ్ళు మారిపోయారనుకుంటారు.

సత్యాన్ని గ్రహించాలనుకున్న వ్యక్తి దాన్ని తెలుసుకునేదాకా వదిలిపెట్టడు. సత్యాన్ని తెలుసుకోవడమంటే, ఏది సత్యమో, ఏది కాదో దాన్ని తెలుసుకోవడం. ఉన్నదాన్ని దర్శించడంవల్ల సత్యం ఆవిష్కరామవుతుంది. తనను తాను తెలుసుకోవడమే సత్యం. ఆ అన్వేషి మార్పుల వెంట పరుగు తీయడు. ఇప్పుడు ఈ క్షణం జీవిస్తాడు.

ఒక నగరంలో గొప్ప ధనవంతుడు ఉండేవాడు. అతను దేశంలోనే గొప్ప సంపన్నుడు. నిరంతరం ధన సంపాదనలోనే మునిగి ఉండేవాడు. సంపాదించడం, సంపాదించిన దాన్ని కూడబెట్టుకోవడం తప్ప అతనికి మరో చింతన లేదు. సాధారణంగా సంపన్నులకు గొప్ప వాళ్ళతో సంబంధాలుంటాయి. అట్లాగే ఆ ధనవంతుడికి ఆ దేశం రాజుతో సంబంధాలున్నాయి. ఒక సందర్భంలో ఎవరికీ ఏ లోటూ కలగకుండా ధనవంతుడు అన్ని సదుపాయాలు ఏర్పాటు చేశాడు. అతని ఐశ్వర్యానికి విస్తుపోతూ రాజు పరివారం విందు వినోదాల్లో మునిగి ఉంది.

రాజ కుటుంబానికి ప్రత్యేక ఏర్పాట్లు ఉంటాయి కదా! తన మందిరంలో ధనవంతుడు రాజుగారికి బస కల్పించాడు. తను కూడా రాజుగారితో బాటు కూచున్నాడు. సేవకులందరూ సపర్యలు చేస్తున్నారు. పంచభక్ష్య పరమాన్నాలు వడ్డిస్తున్నారు. యింతలో ఒక పనివాడి చేతిలోంచి వేడి పళ్ళెం అన్నంతో సహా కింద పడింది. ఆ పడడం ధనవంతుడి కాలిమీద పడింది. ఆ వేడికి ధనవంతుడి కాలుకాలి బొబ్బలు లేచాయి. ధనవంతుడి కోపం కట్టలు తెంచుకుంది. ఆ పనివాణ్ణి చంపాలన్నంత కోపం వచ్చింది. తన పని ముగిసిపోయిందనుకున్న పనివాడు ధనవంతుడు ఆగ్రహాన్ని చూసి తన ప్రయత్నం తాను చేద్దామనుకుని "ఎవరయితే తన కోపాన్ని జయిస్తాడో అతను స్వర్గానికి వెళతాడు" అన్నాడు. అందరికీ వినిపించేంతగా, ఆ మాటతో ధనవంతుడు కోపాన్ని దిగమింగుకుని చిరునవ్వు నటించాడు. అతని సహనానికి రాజుకూడా అభినందించాడు. పనివాడు "క్షమించే తత్త్వమున్న వాళ్ళకే స్వర్గప్రాప్తి" అన్నాడు. ధనవంతుడు అహాన్ని అణచిపెట్టి అందరూ వినేలా "నిన్ను క్షమించాను" అని పనివాడితో అన్నాడు. పనివాడు ఊపిరి పీల్చుకుని "దయాగుణం ఉన్న వాళ్ళనే దైవం ప్రేమిస్తాడు" అన్నాడు.

ధనవంతుడు "నీకు స్వేచ్ఛనిస్తున్నాను. ఈ ధనం తీసుకుని వెళ్ళు. నీ యిష్టం వచ్చినట్లు జీవించు" అని ఒక డబ్బు సంచి యిచ్చి పంపించాడు. అందరి దృష్టిలో





ధనవంతుడు మహాపురుషుడయ్యాడు. ఆ నగరంలోనే కాదు దేశమంతా ధనవంతుని కీర్తి వ్యాపించింది. అప్పటిదాకా అతన్లో ఉన్న కోపం, అహంకారం, పగ, లోభి గుణం హఠాత్తుగా రంగుమార్చుకున్నాయి. శాంతం, దానగుణం, దయాశీలంగా మారిపోయాయి. లోకమే అతని పరివర్తనకు విస్తుపోయింది.

అనుకూలాన్ని బట్టి అతని ముసుగులు మారిపోయాయి. కోపం శాంతంగా మారింది. ప్రతీకారం దయాగుణంగా మారింది. యీ మార్పులు నిజమైన మార్పులా? అన్నీ అహం కేంద్రంగా వున్నవి కావా? అభినందనల్ని ఆధారం చేసుకున్నవి కావా? ధర్మమన్నది అంత చవగ్గా దొరికితే ప్రతివాడూ ధర్మాత్ముడయి పోతాడు. మనిషి చెయ్యాల్సింది ముసుగులు తగిలించుకోవడం కాదు. రకరకాల ముసుగుల్ని మార్చుకోవడం కాదు. క్రమక్రమంగా అన్ని ముసుగుల్ని వదిలించుకోవడమన్నదే నిజమైన వైరాగ్యం. సన్న్యాసం.

## 52. ఒంటరి దేవుడు

ఒక సన్యాసి నిరంతర దైవధ్యానంలో గడిపేవాడు. భిక్షాటనతో జీవించేవాడు. కోరికలు లేనివాడు. జీవితం గురించి అతనికి ఏ ఆరాటమూ లేదు. ఒకరోజు అతను నిద్రపోతూ ఉంటే అతనికి ఒక కల వచ్చింది. ఆ కలలో అతను అనాయాసంగా గాల్లో లేచి స్వర్గద్వారాల వద్దకు వెళ్లాడు. ద్వారాలు ఎప్పుడు తెరుచుకుంటాయా? దేవుడు ఎప్పుడు వస్తాడా? ఎప్పుడు ఆయన దర్శనం చేసుకుంటానా? అని ఎదురుచూస్తున్నాడు.

అంతలో పెద్ద శబ్దంతో స్వర్గద్వారాలు తెరుచుకున్నాయి. సన్యాసి ఆశ్చర్యంగా చూశాడు. మేళతాళాలతో ఒక గుంపు వచ్చింది. జనం పరవశంతో "కృష్ణ పరమాత్మకి జై' అంటూ కదిలారు. అంతలో మురళీగానంతో కృష్ణుడు ఒక తెల్లగుర్రంపై వచ్చాడు. భజనలు, కీర్తనలతో పరిసరాలు హోరెత్తాయి. నదీప్రవాహంలా జనం ఆయన్ని అనుసరించారు. కృష్ణుడితో బాటు లక్షలమంది జనం కదిలిపోయారు. మెల్లగా నిశ్శబ్దం ఏర్పడింది. సన్యాసి ఆశ్చర్యంతో అంతా చూస్తూ నిలబడ్డాడు.

అంతలో మళ్ళీ ఆకాశాన్ని తాకే శబ్దాలు విని వులిక్కిపడ్డాడు. మళ్ళీ ఎవరు వస్తున్నారా? అని చూశాడు. ఏసుక్రీస్తుకు జయజయధ్వానాలు పలుకుతూ జనం కదలివచ్చారు. గుర్రం మీద ఏసుప్రభువు వచ్చాడు. కరుణార్ద్రదృష్టుల్తో జనాల్ని చూశాడు. గుర్రం ముందుకు కదిలింది. ఏసుప్రభువు వెంట లక్షలమంది జనం తరలి వెళ్ళారు. అందరూ కదిలి వెళ్ళాక మళ్ళీ నిశ్శబ్దం.

సన్యాసి అన్నింటికీ సాక్షిగా ఉన్నాడు.

అంతలో నిశ్శబ్దం బద్ధలవుతూ గుర్రపుడెక్కల శబ్దం. మహాతేజంతో మహమ్మద్ ప్రవక్త రంగంలోకి వచ్చాడు. ఆవేశంతో వూగిపోతూ అసంఖ్యాకజనం ఆయన అడుగుజాడల్లో నడిచింది. లక్షలమంది మహమ్మద్‌ని కీర్తిస్తూ సముద్రంలా సాగిపోయారు.

అంతా సద్దుమణిగింది. సన్యాసి ఒక దృశ్యం తరువాత యింకో దృశ్యం చూస్తూ నివ్వెరపోయాడు. గంట గడిచినా ఎక్కడా ఎట్లాంటి అలికిడి లేదు.

సన్యాసికి ఏమీ తోచలేదు. ఎంతసేపు ఎదురుచూడాలో, ఎవరికోసం ఎదురు చూడాలో తోచలేదు. అంతలో స్వర్గద్వారాలు గుండా ఒక గుర్రం రావడం కనిపించింది. ఆ గుర్రం మీద ఒక వృద్ధుడున్నాడు. ఆ గుర్రం ఎంత మెల్లగా మెల్లగా వస్తుందంటే అది వస్తున్నట్లు కూడా అనిపించలేదు. గుర్రం మీద వృద్ధుడు ప్రశాంతంగా ఉన్నాడు. వెనక ఎవరూ లేరు. ఒక్కడే వున్నాడు. గుర్రం వచ్చి సన్యాసి ముందు ఆగింది.

సన్యాసి చేతులు జోడించి వృద్ధుడికి నమస్కరించి “స్వామీ! మీరెవరు?” అన్నాడు.

దానికి ఆ వృద్ధుడు “నేనే దేవుణ్ణి!” అన్నాడు.

ఆ మాటలకు సన్యాసి అదిరిపోయాడు.

“మీరే దేవుడయితే మీ వెనక మందీ మార్బలం లేదు. హడావుడి లేదు. కనీసం మీ వెంట ఒక్కమనిషయినా లేదు. యింతకుముందు వెళ్ళిన కృష్ణుడు, జీసస్, మహమ్మద్ వెంట లక్షలమంది తరలివెళ్ళారే” అన్నాడు.

దానికి దేవుడు చిరునవ్వు నవ్వాడు.

“నువ్వు చెప్పింది నిజమేనయ్యా! జనమంతా వాళ్ళ వెంట వెళ్ళిన మాట నిజమే. వాళ్ళ ముగ్గుర్నీ నా ప్రతినిధులుగా ప్రపంచంలోకి పంపాను. జనం వేలం వెర్రితో వాళ్ళనే అనుసరించి పోతున్నారు. నన్ను పట్టించుకున్నవాడు ఒక్కడూ లేడు. అందుకే ఒంటరిగా మిగిలాను” అన్నాడు.

అంతలో సన్యాసికి మెలకువ వచ్చింది.

## 53. సాహసి

అలెగ్జాండర్ తన జైత్రయాత్ర ప్రారంభించినప్పుడు అతని మిత్రులు “భారత దేశంలోని చిత్రవిచిత్రాల గురించి విన్నాం. అక్కడ గొప్ప సన్యాసులుంటారని, వాళ్ళ దగ్గర ఎన్నో శక్తులుంటాయని విన్నాం. వాళ్ళకు ఏదీ అసాధ్యం కాదని విన్నాం. నువ్వు భారతదేశాన్ని జయించి వచ్చేటప్పుడు అట్లాంటి ఒక సన్యాసిని తీసుకురా” అన్నారు. ఎందుకంటే అలెగ్జాండర్ మహావీరుడని, అతను తప్పక ఆ పని చెయ్యగలడని వాళ్ళ





నమ్మకం. “తప్పకుండా అట్లాంటి వ్యక్తిని తీసుకొస్తా”నని అలెగ్జాండర్ మిత్రులకు హామీ యిచ్చాడు.

అలెగ్జాండర్ జైత్రయాత్ర కొనసాగింది. ఈజిప్టుని జయించాడు. అలెగ్జాండ్రియా నగరాన్ని నిర్మించాడు. సాటిలేని పర్షియా సామ్రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. భారతదేశంలోకి అడుగుపెట్టి అరివీర భయంకరంగా ఎదిరించిన పురుషోత్తమ చక్రవర్తిని ఓడించాడు. భారతదేశ హృదయంలోకి గంగానదిని దాటి ప్రవేశించానికి సైనికులు ససేమిరా అన్నారు. సంవత్సరాల తరబడి స్వదేశాన్ని వదిలిన సైన్యం అలసిపోయింది. స్వదేశం చేరాలని మొరాయించింది. గత్యంతరం లేక అలెగ్జాండర్ వెనుదిరిగాడు. భారతదేశం వదిలి బయలుదేరుతూ ఉంటే ఒక విషయం గుర్తొచ్చింది.

తన సైనికుల్ని పిలిచి సరిహద్దు గ్రామానికి వెళ్ళి అక్కడ ఎవరయినా సర్వసంగ పరిత్యాగి ఐన సన్యాసి ఉన్నాడేమో చూసి రమ్మన్నాడు. సైనికులు గ్రామానికి వెళ్ళి వాకబు చేస్తే అక్కడ గొప్పసన్యాసి వున్నాడని గ్రామ సమీపంలో నదీతీరంలో ఉంటాడని చెప్పారు. అలెగ్జాండర్ సైనికులతో వెళ్ళి సన్యాసిని వెంట తీసుకురమ్మన్నాడు.

సైనికులు నది దగ్గరకు వెళ్ళారు. నది గట్టున సన్యాసి నగ్నంగా ఉన్నాడు. అతని శరీరం కాంతివంతంగా, ఆకర్షణీయంగా ఉంది. సైనికులు అలెగ్జాండర్ చక్రవర్తి మిమ్మల్ని సకల మర్యాదలతో తీసుకురమ్మన్నాడు. తనవెంట మిమ్మల్ని గ్రీసు దేశానికి తీసుకువెళతానన్నాడు”అన్నాడు.

ఆ సన్యాసి “నేను రానని చెప్పండి” అన్నాడు నిష్కర్షగా. సైనికులు చేసేదేమి లేక ఆ విషయం అలెగ్జాండర్‌కు చెప్పారు. ఆ మాటలకు ఆగ్రహించిన అలెగ్జాండర్ తళతళ మెరిసే తన ఖడ్గాన్ని ఝుళిపిస్తూ సన్యాసి దగ్గరకు వచ్చాడు. ఆ సన్యాసి వర్చస్సు చూసి అలెగ్జాండర్‌కు ఈర్ష్య కలిగింది. “నువ్వు రాకుంటే నిన్ను చంపాల్సి ఉంటుంది” అన్నాడు.

ఆ మాటలకు సన్యాసి చిరునవ్వు నవ్వాడు.

“నువ్వు బలవంతంగా తీసుకుపోలేవు. నీ వల్లకాదు. కత్తిని ఎందుకు అనవసరంగా పైకి ఎత్తావు? కిందకు దించు. నీ కత్తి నా శరీరాన్ని చంపగలదు. కానీ నే నెప్పుడో నా శరీరాన్ని త్యజించాను. ఒకవేళ నీ కత్తితో నా తల నరికితే అది నేలపై పడుతుంది. నేలమీద పడిన నా తలను నేను చూస్తాను. నువ్వే ఆ తలను చూడగలనను కుంటున్నావు. కాదు నేను కూడా చూస్తాను” అన్నాడు నిర్భయంగా.

ఆ సన్యాసి ధైర్యానికి, సాహసానికి విస్తుపోయిన అలెగ్జాండర్ కత్తిదించి మౌనంగా వెనుదిరిగిపోయాడు. అలెగ్జాండర్ తన సన్నిహితులకు జరిగినదంతా చెప్పి

"ఆ సన్యాసి అసాధారణమైనవాడు. ప్రపంచాన్ని జయించిన నేను అతనిముందు తలవంచక తప్పలేదు. చావుకు భయపడిన వాణ్ణి చంపవచ్చు. మరణాన్ని లెక్కపెట్టని వాణ్ణి ఎట్లా చంపడం? చంపినా ఓటమి నాదే అవుతుంది. ఆ నిర్దయిడయిన సన్యాసి ఔన్నత్యం ముందు వెలవెలబోయాను. తలవంచాను." అంటూ తన నిస్సహాయతను ప్రకటించాడు.

**ఆత్మవిశ్వాసం, ఆత్మశక్తి ఎంత ఉన్నతమయినవో అలెగ్జాండర్ తన ఆత్మీయులతో చెప్పాడు.**

## 54. చూసే దృష్టి

జునాయిడ్ సూఫీ మార్మికుడు. లోకమంతా ఆయన్ని గౌరవించేది. ఆయన గొప్ప వివేకవంతుడని, జ్ఞాని అని ఆయన్ని పూజించేది. ఓసారి ఆయన ఒక అరణ్యం దగ్గర ఉన్న నదిని దాటడానికి పడవకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు. ప్రవాహం ఉద్ధృతంగా ఉంది. గాలి వీస్తోంది. అంతలో అతనికి ఒక దృశ్యం కనిపించింది.

కొంత దూరంలో ఒక పురుషుడు, ఒక స్త్రీ నిల్చున్నారు. బహుశః వాళ్ళు కూడా పడవకోసం ఎదురుచూస్తున్నట్లున్నారు. పురుషుడు బలంగా ఉన్నాడు. యువకుడు, స్త్రీ మేలి ముసుగులో ఉంది. వాళ్ళిద్దర్నీ చూడగానే జునాయిడ్‌లో సందేహం మెదిలింది. యువకుడు, యువతి పైగా ఏకాంతం – అరణ్యం.

ఆ స్త్రీ ఆ యువకుడికి ఏదో అందించింది. అతను తాగాడు. మగువ! మధువు! ప్రజలు ఎలా నీతినియమాల్ని అధఃకరించి యిష్టం వచ్చినట్లు బరి తెగిస్తున్నారో అని జునాయిడ్ ఎంతో ఆవేదన చెందాడు. ఆవేశం కట్టలు తెంచుకుంది. నిర్మల జీవితం, సంఘం, కట్టుబాట్లు, సన్యాసి జీవితం అతని మనసులో మెదిలాయి. ఆ కనిపిస్తున్న స్త్రీని, పురుషుణ్ణి నిలదీసి మంచీ, మానవత్వం మర్యాద గురించి వాళ్ళకు ఉపన్యసించాలనుకున్నాడు.

అంతలో గాలి మరింత వేగంగా వీచింది. చెట్లను భీకరంగా కదిలించింది. నదీ ప్రవాహం అల్లకల్లోలమైంది. నీళ్ళు పొంగి గట్లను ఒరుసుకుంటూ ప్రవహించాయి.

ఒక్కసారిగా ఆలోచనలు స్తంభించి జునాయిడ్ నదీ ప్రవాహం కేసి చూశాడు. ఆ ప్రవాహవేగంలో పడి ఓ పడవ కొట్టుకుంటూ వచ్చింది. అందులో ఏడుగురు ప్రయాణికులున్నారు.

వాళ్ళు ప్రాణభయంతో ఆర్తనాదాలు చేస్తున్నారు. ప్రవాహవేగంలో పడి పడవ కొట్టుకుపోతుంది. దృశ్యాన్ని చూసిన యువకుడు, జునాయిడ్ యిద్దరూ ఆదుర్దాగా గమనించారు. చూస్తూ ఉండగానే ఆ పడవ తలకిందులైంది. అందులోని ఏడుగురు





నీళ్ళల్లో మునుగుతూ హాహాకారాలు చేశారు. వెంటనే ఆ యువకుడు నీళ్ళల్లోకి దూకాడు. జునాయిడ్ ఆశ్చర్యపోయాడు.

ఆ యువకుడు నీళ్ళల్లో కొట్టుకుపోతున్న ఆరుగురిని తన శక్తివంచన లేకుండా శ్రమించి కాపాడాడు. ఆ యువకుడిపట్ల జునాయిడ్‌కి ఉన్న దురభిప్రాయం క్రమంగా మాయమైంది. ఆరుగురిని రక్షించి అలిసిపోయిన యువకుడు జునాయిడ్‌ని చూసి "నేను బాగా అలసిపోయాను. నీళ్ళల్లో కొట్టుకుపోతున్న ఆ వ్యక్తిని కాపాడండి" అన్నాడు. జునాయిడ్ నిస్సహాయంగా నిలబడ్డాడు. వెంటనే ఆ యువకుడు మళ్ళీ శక్తిని కూడదీసుకుని నీళ్ళల్లోకి దూకి ఆ ఏడోవ్యక్తిని కూడా ఒడ్డుకు చేర్చాడు.

చలనం లేని వాడిలా జునాయిడ్ ఆ కుర్రాణ్ణి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు. అంతలో అతని కోసం అల్లాడిపోతున్న స్త్రీ ఆ యువకుడి దగ్గరకు వచ్చి అతని తల తుడిచింది. గాలికి ఆమె మేలిముసుగు తొలగింది. ఆమె వృద్ధురాలు. తన దగ్గరున్న పాత్రలోని నీళ్ళని యువకుడికిచ్చింది. యువకుడు నీళ్ళు తాగాడు.

ఆ దృశ్యం చూసి జునాయిడ్‌లో పశ్చాత్తాపం రేగింది. మనసులో పేరుకున్న దురభిప్రాయాలు, అనుమానాలు అన్నీ పటాపంచలయ్యాయి.

ఆ తల్లీ కొడుకులు, ఆ తాగిన నీళ్ళు అదే దృశ్యాన్ని అరగంట క్రితం తనెలా ఊహించుకున్నాడో తలచుకుని జునాయిడ్ సిగ్గు పడ్డాడు. తనమీద తనకే అసహ్యమేసింది. **ఏ సంగతయినా దేన్ని గురించయినా ముందుగా ఎలాంటి అభిప్రాయాన్ని ఏర్పరచుకోవడం తప్పని నిర్ణయించుకున్నాడు.**

## 55. లోపలికి పరిగెత్తడం

ఒక గృహస్థుడు ఒక జెన్ గురువును తన యింటికి అతిథిగా ఆహ్వానించాడు. కొంతమంది స్నేహితుల్ని కూడా పిలిచాడు. విందుకు సిద్ధం చేశాడు. అందరూ నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ విందు భోజనాలు ఆరగిస్తూ ఉన్నారు. వాతావరణం ఆహ్లాదంగా ఉంది.

అంతలో హఠాత్తుగా భూకంపం వచ్చింది. అదొక బహుళ అంతస్థుల భవనం. విందు ఏడవ అంతస్థులో జరుగుతోంది. ఒక్కసారిగా భూకంపం రావడంతో పరిస్థితి అంతా తారుమారయింది. తల్లకిందులయింది.

పైగా వాళ్ళంతా ఏడో అంతస్థులో ఉండడంవల్ల ప్రాణభయంతో అల్లాడిపోయారు. ప్రతిఒక్కరూ అక్కణ్ణించి తప్పించుకోవడానికి, బయటపడడానికి ప్రయత్నించారు. మెట్లు దిగి భవనం నించి బయటపడే పనిలో పడ్డారు.

అందర్నీ ఆహ్వానించిన గృహస్థుడు కూడా అందరితోబాటు పరిగెట్టాడు. రెండు అంతస్థులు దిగాడు. కానీ వెంటనే తాను ఆహ్వానించిన జెన్ గురువు గుర్తుకొచ్చాడు. ఆయన్ని పట్టించుకున్న వాళ్ళెవరూ లేరు.

ఎవరి ప్రాణాల్ని వాళ్ళు కాపాడుకునే పనిలో ఉన్నారు. తను కూడా అందరిలా పారిపోవడం తప్పనిపించి గృహస్థుడు దిగిన రెండు అంతస్థులు ఎక్కి జెన్ గురువు ఉన్న ఏడో అంతస్థుకి వచ్చాడు.

వచ్చి చూస్తే జెన్ గురువు తన ఆసనంపై ధ్యాననిమగ్నుడయి నిశ్చలంగా కూచుని ఉన్నాడు. ఆయన్లో ఎలాంటి చలనమూ లేదు. ఆందోళనా లేదు. ఆ జెన్ గురువును చూసి గృహస్థుడు తప్పు చేసిన వాడిలా చిన్నబోయాడు. తాను చేసింది తప్పని పశ్చాత్తాపపడ్డాడు. ఒక సుప్రసిద్ధ గురువుని అతిథిగా ఆహ్వానించి ఆయన్ని పట్టించుకోకుండా ప్రాణభయంతో పరుగులు తియ్యడం తప్పు అనుకున్నాడు. అప్పటికే అతని స్నేహితులందరూ కిందకు దిగేశారు. గృహస్థుడు భయపడుతున్నా జెన్ గురువు పక్కనే కూచున్నాడు.

భూకంపం ఎలా వచ్చిందో అలా వెళ్లింది. జెన్ గురువు నిర్మలంగా కళ్ళు తెరిచి తన పక్కన వణుకుతూ కూచున్న గృహస్థుని ఏమి జరగనట్లే పలకరించాడు. భూకంపం వచ్చినట్లు, వెళ్ళినట్లు కూడా ఆయన పట్టించుకోలేదు. గృహస్థుని గుండె గుబులు యింకా తగ్గనే లేదు. గురువు చెబుతున్న మాటల్ని పట్టించుకునే పరిస్థితిలో లేడు. ఎందుకంటే ఆ అల్లకల్లోలం తగ్గి ఐదునిమిషాలు కూడా కాలేదు.

గృహస్థుడు "గురువుగారూ! యిప్పుడు ఏమీ చెప్పకండి. ఎందుకంటే మీరు యిప్పుడు ఏమి చెప్పినా నా బుర్రకెక్కదు. నేను గ్రహించలేను. నేను నేనుగా లేను. భూకంపం నన్ను భయకంపితుణ్ణి చేసింది. నేనూ అందరితో బాటు కిందకు పరిగెత్తాను. కానీ మధ్యలో మీరు గుర్తుకువచ్చి వచ్చాను. వచ్చి చూస్తే మీరు ఏమి జరగనట్లు నిర్మల ధ్యానంలో ఉన్నారు. నేను మిమ్మల్ని అతిథిగా ఆహ్వానించాను. మిమ్మల్ని కనిపెట్టుకొని ఉండడం నా బాధ్యత. అందుకని అంత భయంలోనూ తిరిగివచ్చి మీ పక్కన కూచున్నాను.

కానీ నాకో సందేహం. మేమందరం తప్పించుకోవాలని పరిగెడుతూ ఉంటే మీకు పరిగెత్తాలనిపించలేదా? ప్రాణభయం లేదా? అంత నిర్మలంగా ఎలా కూచున్నారు?" అన్నాడు. దానికి జెన్ గురువు చిరునవ్వు నవ్వుతూ "నేను కూడా పరిగెట్టాను. తప్పించుకున్నాను. మీరు బయటకి పరిగెడితే నేను లోపలికి పరిగెట్టాను. కానీ మీరు భూకంపం నుంచి తప్పించుకోవడానికి భవనం దిగి భూమ్మీదకి పరిగెట్టారు. కానీ అక్కడ కూడా భూకంపం ఉంది. నేను లోపలికి పరిగెట్టాను. అంతరంగంలోకెళ్ళాను.





అక్కడ భూకంపం లేదు. మీరు ఏ అంతస్థు దిగినా... ఎక్కడికి వెళ్ళినా...నేలపై పరిగెత్తినా... అక్కడంతా భూకంపం ఉంది. కానీ మనసు లోలోపల భూకంపం లేదు. భూకంపం అక్కడకి రాలేదు. నా మనసు కేంద్రంలో నేను నిశ్చలంగా నిలబడ్డాను" అన్నాడు.

గృహస్థుడు గురువుగారికి ప్రణామం ఆచరించాడు.

## 56. జ్ఞానోదయం

ఒకరోజు సూఫీగురువు చుట్టూ శిష్యులు కూచున్నారు. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. సృష్టిలో మధురమయింది. మనోహరమైంది నిశ్శబ్దం. నిశ్శబ్దం నుంచి శబ్దం ప్రవహిస్తుంది. అది మనసువేపే సాగుతుంది. అందరూ నిశ్శబ్దంలో నిమగ్నమై ఆనంద పరవశంలో ఉన్నారు. అప్పుడే చంద్రుడు కిటికీలోంచి తొంగి చూశాడు.

ఆ రోజు పౌర్ణమి. నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణాన్ని వెలిగిస్తూ చంద్రుడు చిరునవ్వు నవ్వాడు. వెన్నెల ఆ గదంతా నిండింది. మౌనాన్ని వెన్నెల మరింత మనోహరం చేసింది.

అంతదాకా మౌనంగా ఉన్న గురువు కిటికీ దగ్గరికి కెళ్ళి చంద్రుణ్ణి చూశాడు. చంద్రుడు ఆయన్తో ఏం మాట్లాడాలో ఆ సంగతి వాళ్ళిద్దరికే తెలుసు. గురువు చూపులు చంద్రుణ్ణి దాటి చాలా దూరం సాగాయి. మళ్ళీ వెన్నెల వ్యాపించిన లోకం వేపు మళ్ళాయి. శిష్యుల్ని చూశాడు. ఒక శిష్యుణ్ణి దగ్గరకు రమ్మన్నాడు. అతను వెళ్ళి వినయంగా గురువు దగ్గర నిల్చున్నాడు. గురువు "నా దగ్గరికి జరుగు" అన్నాడు. శిష్యుడు దగ్గరికి జరిగాడు. తక్కిన శిష్యులందరూ ఉత్సాహంగా చూశారు. యింతమంది ఉండగా అతన్నే ఎందుకు పిలిచారా? అని ఆలోచనలో పడ్డారు.

గురువుగారు చెయ్యెత్తి కిటికీలో చంద్రుణ్ణి చూపి 'చూడు!' అన్నారు అంతే శిష్యుడి మనసులో ఏదో వెలిగింది. ఆ రోజునుంచీ అతనిలో పరివర్తన కలిగింది. తక్కిన శిష్యులంతా ఆశ్చర్యపోయి "ఇంతకీ విషయమేమిటి? అప్పుడేమీ జరగలేదు. మేమంతా చూస్తూనే ఉన్నాం. పౌర్ణమి. రాత్రి మనోహరంగా ఉంది. అంతేకదా! మాకు తెలియకుండా మంత్రోపదేశం పొందావా?" అన్నారు. కాంతివంతమైన వదనంతో ఉన్న శిష్యుడు "నేను ఆ రోజు నిశ్శబ్దంగా కూచున్నాను. నా నిశ్శబ్దం గురువుగారికి నచ్చింది. నన్ను పిలిచారు. అప్పుడు నాలో ఎట్లాంటి ఆలోచనలూ లేవు. నేను ఎంతో ప్రశాంతంగా ఉన్నాను. గురువుగారు చంద్రుణ్ణి చూపించగానే నా మనసు కలువపువ్వులా విచ్చుకుంది. నాకే తెలియని ఏదో పరివర్తన నాలో కలిగింది. ఆ అనుభవం నాకు అపూర్వం. నేను

కొత్తకళ్ళతో చంద్రుణ్ణి చూశాను. వెన్నెల్ని జీవితంలో మొదటిసారి చూస్తున్న అనుభూతి కలిగింది."

ఏదో సత్యం ఎన్నాళ్ళనించో, ఎన్నేళ్ళనించో నిరంతరం ఎదురుచూస్తున్నది నా ముందుకు వచ్చి నిలుచున్నట్లుంది. సత్యం సంపూర్ణంగా, సమగ్రంగా నా ముందు ఆవిష్కరింపబడింది. ఎందుకంటే ఆ సత్యాన్ని నేను గురువుగారి కళ్ళద్వారా చూశాను. ఆ కళ్ళు నా కళ్ళు కావు. ఆయన క్షణకాలం ఆయన్ని నాకిచ్చాడు. నేను తీసుకున్నాను. నేను ఆయన ఉనికి ద్వారా దర్శించాను. అది నా అస్తిత్వం కాదు. ఆ కిటికీ నాది కాదు. ఆ కిటికీ ఆయన్ది కాదు. కానీ ఆ కిటికీ గుండా చూడమని ఆయన నాతో అన్నాడు.

నేను చూడడానికి ఆయన అనుమతించాడు. ఇప్పుడు నాకు తెలిసివస్తోంది. అట్లాంటి ప్రత్యేకమయిన సందర్భం, సావకాశం, సన్నివేశం సంభవమని తెలిసొచ్చింది. అది సంభవమే కాదు. సత్యం కూడా... ఆ లక్ష్యాన్ని నేను అందుకునేలా గురువుగారు చేశారు. ఇప్పుడు నా గుండా ఎందరో ఆ లక్ష్యాన్ని అందుకునే అవకాశం ఏర్పడింది. లక్ష్యం స్పష్టంగా ఉంది. నిశ్చయంగా ఉంది. అది నాలో ఉనికి కలిగి ఉంది. ఎట్లాంటి సందేహమూ దాన్ని కదిలించలేదు. నాకు ఆటంకం కలిగించలేదు. నా మార్గం స్పష్టం. విస్పష్టం" అన్నాడు.

అతనిలో వింత కాంతికి అందరూ విస్తుపోయారు.

## 57. నిగ్రహం

ఒక గొప్పరాజు తాను అనుకున్నవన్నీ సాధించాడు. కావలసినవన్నీ అందుకున్నాడు. ఇక ఏం చెయ్యాలో తెలీక అతన్లో విసుగు మొదలయింది. అన్నీ పొందిన వాళ్ళు అందుకోలేని దానికోసం ఆరాటపడతారు. విజయం సాధించిన వాళ్ళని ఓటమి నిలదీస్తుంది. విజయానికి మించిన వైఫల్యం ప్రపంచంలో ఉండదు. రాజు అసంతృప్తితో, అశాంతితో ఒక సూఫీ గురువుని కలిశాడు.

కానీ అశాంతితో బాటు రాజు దగ్గర అంతులేని అహంకారం ఉంది. అందువల్ల అతను సూఫీ గురువుతో "నేను శాంతికోసం ఏం చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాను. అయితే నువ్వు ఒక విషయం గుర్తుంచుకోవాలి. నేను ఓటమి ఎరుగని వాణ్ణి. ప్రయత్నించిన ప్రతిదానిలోనూ విజయం సాధించిన వాణ్ణి" అన్నాడు.

సూఫీ గురువు "మీరు ప్రపంచంలో ప్రతిదానిపైనా విజయం సాధించి ఉండవచ్చు. కానీ మీరు అక్కడ సాధించిన విజయాలన్నీ యిక్కడ మీకు అపజయం

42



అనివార్యమని చెబుతున్నాను. ఒక్కోచోట ఒక్కో రకమయిన పద్ధతులుంటాయి. ఒక దగ్గర ప్రయోగించిన పద్ధతి ఇంకో దగ్గర పనికిరాదు. ఎందుకంటే ప్రపంచాన్ని జయించిన వ్యక్తి తనని తాను మరచిపోయి ఉంటాడు. అసలు సంగతి అది" అన్నాడు. యింకా "విజయం పొందిన రాజకీయవాది ఉన్మత్తుడితో సమానం. అతన్ది నరాల జబ్బు. ఈ ప్రపంచంలో అంటే ఈ సూఫీ ప్రపంచంలో ప్రతిదీ ప్రపంచసూత్రాలకు వ్యతిరేక దిశలో ఉంటుంది. ప్రతి మనిషి యిక్కడ స్పృహతో ఉండాలి" అన్నాడు.

రాజు ఆ మాటలకు నవ్వి "నీవి ఎట్లాంటి నిబంధనలయినా అంతిమ విజయం నాదే. సరే! ముందు నేను ఏం చెయ్యాలో చెప్పు" అన్నాడు.

సూఫీ గురువు "ఐదు నిమిషాల్లో నేను కొన్ని మాటలు చెబుతాను. మీరు కేవలం వాటికి ఆమోదం తెలపాలి. "అవును. మీరు చెప్పే మాటల్ని నేను విశ్వసిస్తున్నాను అనాలి" అన్నాడు. రాజు ఇంతేనా?" అన్నాడు.

సూఫీ గురువు "నువ్వు పుట్టినప్పుడు నేను అక్కడ ఉన్నాను" అన్నాడు. రాజు ఆలోచనలో పడ్డాడు. రాజుకంటే సూఫీ గురువు చిన్నవాడు. దానితో సూఫీ గురువు అబద్ధమాడుతున్నాడనిపించింది. మెల్లగా రాజులో అసహనం మొదలయింది. ఐనా అవును. మీరు చెప్పిన మాటల్ని నమ్ముతున్నాను" అన్నాడు.

సూఫీ గురువు మారుతున్న రాజుగారి ముఖ కవళికల్ని పరిశీలించాడు. మెల్లగా "మీ నాన్న బిచ్చగాడు" అన్నాడు. అంతవరకు ఓపిక పట్టిన రాజుగారు ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఒళ్లు మరచిపోయాడు "ఎవరు నీకు చెప్పింది. నువ్వు చెప్పిన ఒక్క విషయాన్ని కూడా నేను నమ్మడం లేదు" అన్నాడు.

సూఫీ గురువు ఇచ్చిన సమయం ఐదు నిమిషాలు. అప్పటికి రెండు నిమిషాలు కూడా కాలేదు.

ఆవేశంతో ఊగిపోతున్న రాజును చూసి సూఫీ గురువు **"రాజుగారూ! కేవలం రెండు నిమిషాలు మిమ్మల్ని మీరు నిగ్రహించుకోలేకపోయారు. మిమ్మల్ని మీరు అదుపులో పెట్టుకోలేకపోయారు. ప్రపంచాన్ని జయించారు. నిజమే. కానీ మిమ్మల్ని మీరు జయించలేకపోయారు"** అన్నాడు.

ఆ మాటలకు రాజు నిరుత్తరుడయ్యాడు.

## 58. పరివర్తన

ఆ నగరంలో గజదొంగ ఉండేవాడు. అతనికి ఒకే కొడుకు. కొడుకుని కూడా గజదొంగని చేయాలని తండ్రి కోరిక. అతను తనతోబాటు దొంగతనాలకు తీసుకెళుతూ

మెలకువలు నేర్పేవాడు. ఆ నగరంలోనే మహావీరుడు ఉండేవాడు. దొంగ తన కొడుకుతో ఎవరింట్లోనయినా దొంగతనం చేయి. కాని మహావీరుడి యింటికి మాత్రం వెళ్ళకు. అతని మాటల్లో ఏదో ఇంద్రజాలముంది. అవి వింటే మారిపోతాం. జాగ్రత్త! అని హెచ్చరించాడు. కొడుకు సరేనన్నాడు.

కానీ వద్దన్న దానిపట్ల మనిషి ఆకర్షింపబడతాడు కదా!

ఒకరోజు అతను మహావీరుడి యింటివేపు వెళ్ళాడు. లెక్కలేనంత మంది శిష్యులతో ఉన్న మహావీరుణ్ణి చూశాడు. మహావీరుడు స్వర్గంలో దేవతలు ఉంటారు. వాళ్ళ కాళ్ళు వెనక్కి తిరిగి ఉంటాయి అన్నాడు. ఆ మాటలు విని అతను వెళ్ళిపోయాడు. తన తండ్రి మాటలు గుర్తుకొచ్చి అతను నవ్వుకున్నాడు. "మా నాన్న అనవసరంగా భయపడ్డాడు కానీ మహావీరుడు కల్పన నిండిన కబుర్లు చెబుతున్నాడు" అనుకున్నాడు.

అదే రోజు గజదొంగని, అతని కొడుకుని దొంగతనం చేస్తుంటే పట్టుకున్నారు. ఎంత హింసించినా గజదొంగ ఏమీ చెప్పలేదు. వాళ్ళని రాజుగారి దగ్గరకి తీసుకుపోయారు. రాజు వాళ్లని పరిశీలించి అతని కొడుకుపై దృష్టి నిలపమని సేవకులతో అన్నాడు.

రాజభటులు గజదొంగ కొడుక్కి మత్తు మందిచ్చారు. మెలకువ వచ్చేసరికి అతను అంతఃపురంలో అందమయిన అమ్మాయిల మధ్య ఉన్నాడు. అతను ఆశ్చర్యపోయాడు. తను చనిపోయి స్వర్గానికి వచ్చాననుకున్నాడు. వీళ్ళు దేవకన్యలని అమ్మాయిల్ని చూసి అనుకున్నాడు. వాళ్ళకాళ్ళకేసి చూశాడు. కాళ్ళువెనక్కి తిరిగి లేవు. మహావీరుడు అంతా అబద్ధం చెప్పాడనుకున్నాడు. అదే సంగతి అక్కడున్న అమ్మాయిల్ని అడిగాడు. వాళ్ళు "ఇది స్వర్గద్వారం మాత్రమే. స్వర్గంలోకి వెళ్తే అంతా నువ్వు చెప్పినట్లే ఉంటుంది. కానీ నువ్వు స్వర్గంలోకి వెళ్ళాలంటే ఈ జీవితం గురించి అంతా నిజమే చెప్పాలి. ఏదీ దాచుకోకూడదు" అన్నారు. అతను తను, తన తండ్రి చేసిన హత్యలు, దోపిడీలు, దొంగతనాలు అన్నీ వివరించాడు.

అవన్నీ చెబుతూ అతని మత్తంతా దిగిపోయింది.

చుట్టూ చూసి "ఇది స్వర్గం కాదు. రాజభవనం. నన్ను మోసగించలేరు. నేను మహావీరుడి శిష్యుణ్ణి" అన్నాడు. ఆ అమ్మాయిలు ఆశ్చర్యపడి "నువ్వు మహావీరుడి శిష్యుడవు ఎప్పుడయ్యావు?" అన్నారు.

అతను "నేను మహావీరుడి ఇంటి ముందుగా వెళుతూ ఒక వాక్యం విన్నాను. ఆ వాక్యం నా జీవితాన్ని కాపాడింది" అన్నాడు. చివరికి సాక్ష్యాలు లేకపోవడంతో తండ్రీ కొడుకులు విడుదలయ్యారు.





కొడుకు తండ్రితో "నాన్నా! ఇక నీ మాటలు వినను. నీ మాటల్ని విని ఉంటే నేను మహావీరుడి మాటల్ని వినే అదృష్టాన్ని కోల్పోయి ఉండేవాణ్ణి. ఈ పాటికి మనల్ని వురితీసి ఉండేవాళ్ళు. ఆయన చెప్పిన మాటలవల్ల మనం బతికి బయటపడ్డాం. ఆయన ఆకర్షణ నన్ను లొంగదీసింది. నేను ఆయన దగ్గరకు వెళుతున్నాను" అని తండ్రి దగ్గర సెలవు తీసుకుని మహావీరుడి దగ్గరకు వెళ్ళాడు. మహావీరుడికి నమస్కరించి "నువ్వు నన్ను రక్షించావు. నాకు కొత్త జీవితాన్నిచ్చావు. నేను దొంగగా, హంతకుడిగా బతకలేను. నా గత జీవితం ముగిసింది. కొత్త జీవితం ప్రారంభమైంది. నన్ను ఒక పసివాడిగా స్వీకరించు" అని ప్రాధేయపడ్డాడు.

**గురువుని సమీపించినపుడు మనం పసితనంతో, అమాయకత్వంతో ఉండాలి..**

## 59. నేనే దేవుణ్ణి

సూఫీ గురువయిన జునాయిడ్‌కు మన్సూర్ శిష్యుడు. సత్యాన్ని నిర్భయంగా ప్రకటించే మన్సూర్ అందరిముందు 'నేనే దేవుణ్ణి' అనేవాడు. జునాయిడ్ శిష్యుడితో 'నాయనా! అది సత్యం కావచ్చు. నీ గదిలో ఒంటరిగా ఉన్నప్పుడు నువ్వు గోడలు ప్రతిధ్వనించేలా చెప్పుకో. జనం ముందు చెప్పకు. ఎందుకంటే జనం మూర్ఖులు. క్రూరులు. వాళ్ళు నీకు ప్రమాదం తలపెడతారు" అనేవాడు.

కానీ మన్సూర్ "గురువుగారూ! మీకు యథార్థం తెలుసు. కానీ నాకు ఆ అనుభవం కలిగింది. నేను అందరి ముందూ చెప్పడానికి భయపడను. మీరు రాజీపడ్డారు" అన్నాడు.

ఆలోచన లేని జనమున్నప్పుడు సత్యసంధులకు కష్టాలు తప్పవు. అట్లా మన్సూర్ బహిరంగంగా 'నేనే దేవుణ్ణి' అని ప్రకటించడంతో జనాలు అతన్ని బంధించి ప్రభువయిన ఖలీఫా దగ్గరకు తీసుకొచ్చారు. అతన్ని చూసి ఖలీఫా "నీకెంత ధైర్యం. నేనే దేవుడని అనడం మానెయ్యకపోతే మరణదండన తప్పదు" అన్నాడు.

మన్సూర్ "ప్రభూ! మీరు నాకు మరణదండన విధించండి. నాకు అభ్యంతరం లేదు. కానీ ఈ విషయంలో నేను ఏ మాత్రం రాజీపడను. ఎందుకంటే నాకు ఆ అనుభవం కలిగింది. అవగాహన ఏర్పడింది. "నేనే దేవుణ్ణి! అంతేకాదు. మీరు కూడా 'దేవుడే! కానీ మీలో దేవుడు నిద్రపోతున్నాడు. నాలో దేవుడు నిద్ర లేచాడు' అన్నాడు. మన్సూర్‌కి మరణశిక్ష విధించి జైల్లో బంధించారు.

జునాయిడ్ జైల్లో ఉన్న శిష్యుణ్ణి చూడడానికి వచ్చి "నువ్వు యువకుడివి. నీకెంతో భవిష్యత్తు వుంది. తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నావు. నువ్వు గొప్ప ఉపాధ్యాయుడు

కావాల్సిన వాడివి. జ్ఞానివి. నువ్వంటున్నది నిజమే కావచ్చు. కానీ ప్రపంచంతో రాజీపడి ప్రాణాల్ని నిలుపుకో" అని చెప్పాడు.

మన్సూర్ "మరణం గురించి నేను లెక్కపెట్టను. కానీ మీలా నేను రాజీ పడలేను. మీరు చెబుతున్నది తప్పని మీకు తెలుసు. మీలాగా నన్ను రాజీపడమంటున్నారు" అన్నాడు. గురువు దుఃఖంతో వెనుదిరిగాడు.

మన్సూర్‌కు మరణశిక్ష అమలు జరిగే ఘడియ వచ్చింది. బహిరంగస్థలంలో వేలాదిమంది వున్నారు. వాళ్ళు రాళ్ళతో అతన్ని కొట్టి చంపుతారు. ఆ దృశ్యాన్ని చూడడానికి బాధతో జునాయిడ్ కూడా వచ్చాడు.

అందరూ మన్సూర్ మీద రాళ్ళు విసరడం ఆరంభించారు. గురువయిన జునాయిడ్ గులాబీ పూలు తీసుకొచ్చాడు. అందరూ రాళ్ళు విసురుతూ వుంటే జునాయిడ్ శిష్యుడిపై పూలు విసిరాడు. జునాయిడ్ 'రాజీ' పడ్డాడు. జనాలు రాళ్ళు విసురుతున్నారు. జునాయిడ్ పూలు విసురుతున్నాడు. జునాయిడ్ 'విసరడం'తో రాజీ పడ్డాడు.

మన్సూర్ తనపై రాళ్ళ వర్షం కురుస్తూ వుంటే చిరునవ్వు నవ్వుతున్నాడు. ఒక్కో రాయి శరీరానికి తగిలి రక్తం చిమ్ముతూ వుంటే బిగ్గరగా నవ్వుతున్నాడు.

అప్పుడు జునాయిడ్ శిష్యుడిమీద గులాబీలు విసిరాడు. పూలు తగిలిన వెంటనే మన్సూర్ బాధతో ఏడవడం ప్రారంభించాడు. "ఎన్నో రాళ్ళు తగిలితే నవ్వావు. పువ్వు తగిలితే ఎందుకు ఏడుస్తున్నావు" అన్నాడు. దానికి మన్సూర్ నా మీద రాళ్ళు విసురుతున్న వాళ్ళకు నాగురించి ఏమీ తెలీదు. నా మీద పూలు విసురుతున్న వ్యక్తికి నా గురించి బాగా తెలుసు. సత్యం అతనికి తెలుసు. కానీ అతను పిరికివాడు. అట్లాంటివాడికి నేను శిష్యుణ్ణి అయినందుకు సిగ్గుపడుతున్నాను. కాబట్టే రాళ్ళు నన్ను గాయపరచలేవు. బాధ పెట్టలేవు. అతను విసిరిన పూలే నన్ను చిత్రహింస పెడుతున్నాయి" అన్నాడు.

## 60. నిజమైన గురువు

ఒక వ్యక్తి జునాయిడ్ దగ్గరకు వచ్చి 'మీరు ఎంతో వివేకం గల సూఫీ గురువు. మీకు యింత వివేకం ఎలా వచ్చింది? మీరు ఎంత గొప్ప గురువుగారి దగ్గర జ్ఞానం పొందారో? మీరు గురువును ఎట్లా అన్వేషించారో చెప్పండి" అన్నాడు.

ఆ ప్రశ్నలకు చిరునవ్వు నవ్వి జునాయిడ్ తన అనుభవాల్ని వివరించాడు.

"నేను ఒకప్పుడు గురువుల అన్వేషణలో ఉండేవాణ్ణి. ఒక గురువు దగ్గరకు వెళ్ళి వినయంగా భక్తితో ఆయన కాళ్ళకు నమస్కరించాను. ఆయన ప్రతిస్పందనల్ని గమనించాను. నేను వినమ్రంగా ఆయనకు నమస్కరించినా తాను గొప్పవాణ్ణి కనుక యితను నా దగ్గరికి శిష్యరికానికి వచ్చాడన్న అహంకారం అతన్లో కనిపించింది. వెంటనే అక్కడనుంచి నిష్క్రమించాను. మళ్లీ గురువు అన్వేషణలో పడ్డాను. నాకు యింకో రకమయిన గురువులు తటస్థపడేవాళ్ళు. ఒక గురువు దగ్గరకు వెళ్ళి ఆయన పాదాల్ని స్పర్శించాను. వెంటనే ఆ గురువు నా పాదాలమీద పడి ప్రణమిల్లాడు. కానీ వెంటనే అతన్ని వదిలి యింకో గురువును వెతుక్కుంటూ బయల్దేరాను" అన్నాడు.

ఆ మాటలకు ఆ వ్యక్తి ఆశ్చర్యపడి "మొదటి గురువును వదలిపెట్టావంటే అర్థముంది. అతన్ని అహంకారంవల్ల వదిలిపెట్టావు. రెండో గురువు నీ వినయానికి సమానంగా వినమ్రతని ప్రశంసించారు కదా! అతన్ని ఎందుకు వదిలిపెట్టావు?" అన్నాడు.

జునాయిడ్ "ఆధిపత్యభావన రకరకాలుగా ఉంటుంది. అది నిర్లక్ష్యరూపంలోనే, వినయరూపంలోనే ఉంటుంది. ఆ గురువు నా పాదాల్ని స్పర్శించడం వెనుక వినమ్రత, సమానత్వం వంటివేమీ లేవు. వినయం నీకన్నా నాకే ఎక్కువ ఉంది" అన్న ఆధిపత్య భావన ఉంది. అందువల్ల అతన్ని వదిలిపెట్టాను" అన్నాడు.

"మరి మీ గురువు అన్వేషణలో మూడోవ్యక్తి ఎవరు?" అన్నాడతను.

జునాయిడ్ "ఒక గురువు దగ్గర నేను శిష్యుడిగా చేరి నిర్లక్ష్యంగా, అహంకారంగా ప్రవర్తించాను. అతని కన్నా నాకే ఎక్కువ తెలిసినట్లు గర్వం ప్రదర్శించాను. ఫలితంగా అతను తన శిష్యుల్ని పిలిచి యితన్ని వెంటనే నా దగ్గర నుండి తరిమెయ్యండి" అన్నాడు. ఆ మాటల్ని వింటున్న వ్యక్తిలో ఆసక్తి పెరిగింది. జునాయిడ్ "ఒకతని దగ్గరికి వెళ్ళి నీ అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తిస్తే అతన్తో నీకు అభిప్రాయభేదం కలుగుతుంది. అతని అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తించినా అప్పుడూ కూడా వైరుధ్యానికి, ఘర్షణకు అవకాశముంది.

**ముందుగా ఏర్పరచుకున్న అభిప్రాయాలు అవగాహనకి అవకాశమివ్వవు.** నిశ్చితాభిప్రాయాలు నిలువ ఉన్న నీళ్ళ లాంటివి. **అర్థం చేసుకోవాలన్న మనిషికి అభిప్రాయాలుండకూడదు.** ఉంటే అర్థం చేసుకోలేడు. అవగాహన చేసుకునే మనిషి ఆ క్షణంలో జీవిస్తాడు. స్వేచ్ఛగా ఉంటాడు. బుర్రలేని వాళ్ళకే అభిప్రాయాలుంటాయి. చైతన్యం లేనివాళ్ళే అనుయాయులుగా ఉంటారు" అన్నాడు.

"మరి గురువు ఎలా ఉండాలి?" అన్నాడా వ్యక్తి.

జునాయిడ్ "గురువన్నవాడు ఎట్లాంటి చర్యకీ ప్రతిస్పందించని వాడయి ఉండాలి. ఆగ్రహించేవాడు, అతి వినయం ఉన్నవాడు కాకూడదు. స్థితప్రజ్ఞుడయి ఉండాలి. అన్నింటినీ సమానంగా స్వీకరించేవాడయి ఉండాలి. ప్రతిస్పందించే వాడికి

మనసుంటుంది. మనసు లేనివాడికి ఆలోచనలుండవు. అట్లాంటి వ్యక్తిని మనం ఎట్టి పరిస్థితుల్లోనూ, అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ మలచుకోలేం" అన్నాడు.

## 61. మృత్యుద్వారం

ఆ దేశంలో గొప్ప సంపన్నుడున్నాడు. ఆ దేశంలోనే కాదు. చుట్టుపట్ల ఉన్న ఏ దేశంలోనూ అంత సంపద, ఐశ్వర్యం ఉన్నవాడు యింకొకడు లేడు. రాజులకు కూడా కన్నుకుట్టేంత సంపద అతన్ది. అందరూ తన గురించి గొప్పగా చెప్పుకుంటూ ఉంటే ఆ సంపన్నుడికి ఎంతో సంతోషంగా ఉండేది. తన అనంతరం కూడా పదికాలాల పాటు తనను అందరూ తలచుకోవాలని, అందరికీ ఆశ్చర్యం కలిగించే పని ఏదయినా చేయాలని సంకల్పించాడు.

తన సంపదలో సగం వెచ్చించి ఒక అపురూపమయిన భవనం నిర్మించడం ఆరంభించాడు. అది మొదలయినప్పటినుచీ అందరూ దాని గురించే చెప్పుకునేవాళ్ళు. దేశదేశాలనుంచీ ఎందరో శిల్పుల్ని, వాస్తుశాస్త్రనిపుణుల్ని రప్పించాడు. వాళ్ళు రాత్రింబవళ్లు శ్రమించి ఆ అపూర్వమయిన పాలరాతి భవనాన్ని నిర్మించారు. దాంట్లో ఎన్నో శిల్పాలు మనోహరంగా చెక్కారు. ఆ భవనం పూర్తి కావడానికి ఇరవై సంవత్సరాలు పట్టింది.

అందరికీ ఆ భవనమే చర్చనీయాంశమైంది. తన ఔన్నత్యానికి ఆ సంపన్నుడు గాల్లో తేలుతుండేవాడు. ఆ భవనం అతని అహంకారానికి ప్రతిబింబం. అహంకారమన్నది సాధారణమైన దానితో సాదాసీదా విషయంతో సంతృప్తి పడదు. దానికి సాటి లేనిదనిపించుకోవాలి. అద్వితీయమనిపించుకోవాలి. అహం తనకన్నా యింకొకదాన్ని గొప్పదని అంగీకరించదు. అందరూ తనకు తలవంచాలనుకుంటుంది.

ఆ భవనం పూర్తయింది. సంపన్నుడి స్థాయికి దాని ప్రారంభోత్సవం ఆ దేశాన్ని పాలించే రాజుగారే చెయ్యాలి. సంపన్నుడు రాజుగారిని ఆహ్వానించాడు. అప్పటికే ఆ సంపన్నుడి గురించి రాజుగారికి తెలుసు. సంపన్నులకే ఎప్పుడూ ప్రభువులతో సత్సంబంధాలుంటాయి.

రాజుగారు సంపన్నుడి ఆహ్వానాన్ని అంగీకరించి వచ్చాడు. ఆడంబరంగా ప్రారంభోత్సవం జరిగింది. విందులు, వినోదాలతో పరిసరాలు కళకళలాడాయి. రాజుగారు ఆ సంపన్నుడి వైభవాన్ని చూసి మనసులో ఎంతో ఈర్ష్యపడ్డాడు. రాజుగారి అంతఃపురం కూడా ఆ భవనం ముందు వెలవెలబోతున్నట్లు రాజుగారికి అనిపించింది. మనసులో ఎంత అసూయ ఉన్నా, ఈర్ష్య ఉన్నా పైకి మాత్రం నవ్వుతూ రాజు ఆ





సంపన్నుణ్ణి అభినందించాడు.

సంపన్నుడు రాజుగారిని పరిశీలిస్తూనే ఉన్నాడు. రాజుగారి కళ్ళల్లో మెదిలే ఈర్ష్యను గమనిస్తూనే ఉన్నాడు. రాజుగారి పెదాల నుంచీ వచ్చిన ప్రశంసకన్నా, రాజుగారి మనసులో మెదులుతున్న ఈర్ష్యనే అభినందనగా స్వీకరించాడు. సంపన్నుడు మరింతగా తన భవనం గురించి చెబుతూ "ఈ భవనంలో ఒక విశేషముంది. ఇన్ని వందల గదులున్న ఈ విశాలభవనానికి ద్వారం ఒకటి ఉంది" అన్నాడు.

వింటున్న వాళ్ళంతా విస్తుపోయారు. రాజు, పరివారం ఆశ్చర్యానికి లోనయ్యారు. సంపన్నుడు "ఎందుకు ఒకే ద్వారం పెట్టానంటే ఎవరయినా దాని గుండానే లోపలికి వెళ్ళాలి. దీని గుండానే బయటకి రావాలి. అందువల్ల విలువైన వస్తువులేవీ దొంగతనానికి గురయ్యే వీలుండదు" అన్నాడు.

అక్కడ అదంతా వింటున్న జనంతోబాటు ఒక వృద్ధుడున్నాడు.సంపన్నుడి మాటలకు అతను పెద్దగా నవ్వాడు. అందరూ చిత్రంగా చూశారు. రాజు "ఎందుకు నవ్వుతున్నావు?" అన్నాడు.

ఆ వృద్ధుడు "ఈ సంపన్నుడు ఈ భవనానికి ఒక ద్వారమని, దానివల్ల దొంగతనానికి తావుండదని అన్నాడు. ఈ ద్వారం మనుషులకు మాత్రం ద్వారం కాదు. మృత్యువు కూడా ఈ ద్వారం గుండానే వస్తుంది. తీసుకువెళుతుంది. మనుషుల్ని బంధిస్తాం. మృత్యువును బంధించలేం కదా! ఆ సంగతి గుర్తుకు వచ్చి నవ్వు వచ్చింది" అన్నాడు.

**అహంకార భవనానికి మృత్యువే ద్వారం.**

## 62. మనసు

బృహస్పతి కొడుకయిన కచుడు గురుకులానికి వెళ్ళి విద్యాభ్యాసం చేసి వచ్చాడు. ఏవి అవసరమో అవన్నీ చదువుకున్నాడు. తిరిగి వచ్చాడు. కానీ అతని మనసు ఎప్పుడూ అశాంతితో నిండి ఉండేది. అసంతృప్తితో తపిస్తూ ఉండేవాడు. అంతులేని కాంక్షతో ఎప్పుడూ అల్లాడుతూ ఉండేవాడు. పైగా గురుకులంలో తను అభ్యసించిన విద్యలవల్ల తనకు చాలా తెలుసునని, తను జ్ఞానవంతుడనని అహంకరించేవాడు. కానీ ఆ అహంకారం అతనికి ఆనందాన్ని గానీ, శాంతిని కానీ యివ్వలేదు.

ఒకవేపు అశాంతి, మరోవేపు అహంకారం. అవి ఒకే నాణేనికి రెండు వేపులు. తన అశాంతిని జ్ఞానం పోగొడుతుందని ఆశించి వెళ్ళి అతను మరింత జ్ఞానాన్ని సముపార్జించాడు. ఎన్నెన్నో శాస్త్రగ్రంథాల్ని అధ్యయనం చేశాడు. ఎంతో జ్ఞానాన్ని

సంపాదించాడు. అంతులేని జ్ఞానం అతనికి అదనపు భారంగా తయారయింది తప్ప దానివల్ల అతనికి శాంతి చేకూరలేదు. బాధ మరింత పెరిగింది.

**మనిషికి జ్ఞానంవల్ల అహంకారం పెరుగుతుంది. యితరులకన్నా తనకు ఎక్కువ తెలుసునన్న గర్వం యితరుల్ని తక్కువగా చూసేలా చేస్తుంది. మన అహంకారాన్ని పోగొట్టని జ్ఞానాన్ని మనం జ్ఞానమని అనకూడదు.** శాస్త్రజ్ఞానం విషయ సేకరణలాంటిది. ధనాన్ని కూడబెట్టడానికి, దానికి తేడాలేదు.

తాను ఏ శాంతిని, ఆనందాన్ని కోరుకుంటున్నాడో అది గ్రంథాల్లో దొరకలేదు. అతనికి అశాంతి అణువంతకూడా తగ్గలేదు. తండ్రి దగ్గరకు వెళ్ళి "నాన్నా! మీరు చెప్పినట్లు సకలశాస్త్రాలు అభ్యసించాను. జ్ఞానం సంపాదించాను. కానీ ఆ జ్ఞానంవల్ల నాకు శాంతిలేదు. ఆనందం అందనంత దూరంలోనే ఉంది. నన్నేం చెయ్యమంటారు?" అన్నాడు.

బృహస్పతి "నువ్వు చెప్పినమాట నిజమే. శాస్త్రజ్ఞానానికి, శాంతికి సంబంధం లేదు. పైగా శాంతి అన్నది ఎప్పుడూ బయట దొరకదు. దాన్ని గురువు నుంచీ సంపాదించలేవు. గురువే కాదు. యితరులు ఎవ్వరూ దాన్ని నీకు యివ్వలేరు. అది త్యాగం ద్వారా మాత్రమే లభిస్తుంది" అన్నాడు.

తండ్రి మాట శిరసావహించి కచుడు సర్వసంగపరిత్యాగిగా మారి నిత్యం ఉపవాసాలతో, తపస్సుతో కాలం గడిపాడు. నిత్యం ధ్యానంలో నిమగ్నమయ్యాడు. ఎన్నాళ్ళు గడిచినా, ఎన్నేళ్ళు గడిచినా ఏమీ ప్రయోజనం కనిపించలేదు. శరీరం శుష్కించింది తప్ప అణువంత కూడా అతని తత్త్వంలో మార్పు రాలేదు. మనసులో కోరికలు, అశాంతి ఎప్పటిలాగే తిష్ఠ వేసుకుని ఉన్నాయి.

చివరికి యిక లాభం లేదు. ఈ కాంక్షలనుంచీ, అశాంతినుంచీ విముక్తి కలగాలంటే ఒకటే మార్గం. ప్రాణత్యాగం తప్ప గత్యంతరం లేదు. నాతోబాటే నా కోరికలు కాలిపోతాయనుకుని చితిమంట పేర్చి ప్రాణత్యాగానికి సిద్ధపడ్డాడు. మంట సిద్ధం చేశాడు. చివరిసారిగా తండ్రి అనుమతి తీసుకుని ప్రాణత్యాగానికి సిద్ధమయ్యాడు.

కొడుకుని చూసి తండ్రి "నువ్వు చేస్తున్నపని ఏమిటి? శాస్త్రజ్ఞానం ద్వారా నీకు మనశ్శాంతి దొరకలేదని తెలిసివచ్చింది. ఉపవాసాల ద్వారా, తపోనిష్ఠ ద్వారా ప్రయోజనం లేదని అనుభవమయింది. యిప్పుడు ఆత్మత్యాగంతో కాంక్షలు కాలిపోతాయనుకుంటున్నావు. కానీ నువ్వు మళ్లీ జన్మిస్తావు. నీ శరీరం యిప్పుడు నశించినా, నువ్వు కొత్త శరీరాన్ని పొందినా నీ కాంక్షలు నిన్ను వదలిపెట్టవు. నీ అశాంతి నీకు ఎప్పుడూ తోడుంటుంది. నువ్వు త్యాగం చెయ్యాల్సింది శరీరాన్ని కాదు. మనసుని...





నీ కోరికలు ఉన్నంతవరకు ఏదో సాధించాలన్న తపన ఉన్నంతవరకు నీకు అశాంతి తప్పదు. వాటివల్ల మనసు రూపొందుతుంది. అవి లేకపోవడమంటే మనసు లేకపోవడమే. **"మనసు లేని చోట మహానందముంటుంది"** అన్నాడు. తండ్రి మాటలతో కచుడు తన ప్రయత్నం విరమించుకున్నాడు.

## 63. ఆనందం

వర్షం బాగా పడుతోంది. చీకటిరాత్రి మెరుపులు మెరుస్తున్నాయి. ఉరుములు ఉరుముతున్నాయి. ఆ రాత్రిలో ఒక యువకుడు ఏదో ఆరాటంతో దేన్నో వెతుకుతున్నాడు. ఆ వర్షపు రాత్రి ఎంత సంక్షోభంగా ఉందో అతని అంతరంగం దాన్ని మించి కల్లోలంగా ఉంది.

ఆ యువకుడు ఒక గుడిసె దగ్గరికి వచ్చి ఆగాడు. ఆ గుడిసెలో ఒక వృద్ధుడు ఉన్నాడు. అతనెప్పుడూ ఆ గుడిసెను వదిలి బయటకి రాలేదు. అందరూ అతన్ని వింతగా చూసేవాళ్ళు. లోకంలో ఏం జరుగుతుందో ఎప్పుడూ పట్టించుకునేవాడు కాదు. అందరూ వింత మనిషి అనేవాళ్ళు. ఎవరయినా "మీరు ప్రపంచాన్ని చూడరా?" అని అడిగితే "ఎందుకు చూడను? ఆ ప్రపంచమంతా నా లోనే ఉంది" అనేవాడు. సాధారణ జనానికి అంతు బట్టదు. కానీ అతణ్ణి చూడటానికి కొంతమంది వివేకవంతులు వచ్చేవాళ్ళు. ఆయన్తో ఎన్నో విషయాలు చర్చించి ఎన్నో తెలుసుకుని వెళ్ళేవాళ్ళు.

అట్లా ఆ వృద్ధుని గురించి ఆ యువకుడు విన్నాడు. ఎప్పటినించో ఆ వృద్ధుణ్ణి దర్శించాలని, తన సందేహాల్ని నివృత్తి చేసుకోవాలని, శాంతి పొందాలని అనుకునేవాడు. యిన్నాళ్ళకు బయల్దేరాడు. అనుకోకుండా వర్షం ఆరంభమయింది. వర్షంలో తడుస్తూ గుడిసె ముందు కాసేపు నిలబడ్డాడు. "ఇంత రాత్రిలో వృద్ధుణ్ణి ఆటంకపరచడం బావుంటుందా?" అని ఆలోచనలోపడ్డాడు. తలుపు తట్టాడు. లోపల్నించి "ఎవరు?" అన్న స్వరం వినిపించింది.

దానికి యువకుడు "నేనేవరో నాకు తెలీదు. కానీ ఆనందం కోసం అన్వేషిస్తున్నాను. ఆ ప్రయత్నంలో మీ దగ్గరికి వచ్చాను. ఆ విషయంలో మీరు నాకు సాయం చేయగలరని నమ్ముతున్నాను" అన్నాడు. దానికి లోపల నుంచే వృద్ధుడు "నీ గురించి నువ్వు తెలుసుకోకుండా ఆనందం గురించి ఎలా తెలుసుకుంటావు? కానీ నీ గురించి తెలుసుకోవాలన్న సందేహం కలగడం కూడా గొప్ప విషయమే. నువ్వే కాదు. నా గురించి కూడా నాకు తెలీదు. నా గురించి నాకు తెలియనప్పుడు నీ గురించి ఎలా తెలుస్తుంది?" అన్నాడు.

మొత్తానికి వృద్ధుడు తలుపు తెరిచాడు.

ఆ యువకుడు నిర్మలవదనంతో ఉన్న ఆ వృద్ధుని పాదాలపై పడి "స్వామీ! మిమ్మల్ని శరణుకోరుతున్నాను. ఆనందమెక్కడుంది?" అన్నాడు.

వృద్ధుడు "శరణుకోరడం వల్ల శాంతి దొరకదు. ఆనందం నీలోనే వెతకాలి" బయట వెతికితే కనిపించదు" అని తన సంచినించీ రెండు పళ్ళు తీశాడు. అవి యువకుడికి చూపించి ఈ "పళ్ళు చాలా గొప్పవి. వీటిలో గొప్ప మహిమ ఉంది. మొదటి పండు తింటే ఆనందమంటే ఏమిటో తెలుస్తుంది. రెండో పండు తింటే నువ్వే ఆనందంగా మారిపోతావు. కానీ ఒకటే షరతు. వీటిలో ఏదో ఒక పండునే తినాలి. రెండూ తినకూడదు. ఏ పండు తినాలో నువ్వే నిర్ణయించుకో" అన్నాడు.

యువకుడు ఆలోచించి "స్వామీ! నేను మొదటి పండును తింటాను. ఎందుకంటే దానివల్ల ఆనందమంటే ఏమిటో నాకు తెలుస్తుంది. అట్లా తెలుసుకోకుండా ఏం చేసి ఏం లాభం?" అన్నాడు.

ఆ మాటలకు వృద్ధుడు నవ్వి "నువ్వు కాంక్షతో అలమటిస్తున్నావు. అది ఆనందాన్వేషణ అనుకుంటున్నావు. యిట్లా నీ జీవితమంతా అన్వేషించినా నీకు ఆనందం దొరకదు. ఎందుకంటే ఆనందం గురించి జ్ఞానం సంపాదించడమన్నది ఎప్పుడూ ఆనందం కాలేదు. ఆనందానికి సంబంధించిన జ్ఞానం. ఆనందానికి సంబంధించిన అనుభూతి పూర్తిగా ఒకదానికొకటి వ్యతిరేకమైనవి. ఆనందం గురించిన జ్ఞానం ఆనందం కాదు దుఃఖమే.

**మనం ఆనందంగా మారిపోవడమే నిజమైన ఆనందం.** అక్కడ దూరం నించీ ఆనందాన్ని చూడటమంటూ ఉండదు. మనం ఆనందంలో లీనం కావడముంటుంది" అన్నాడు.

## 64. సముద్రం

మనకు అతాటయిన వాటిని, సన్నిహితమయిన వాటిని మనం గుర్తించం. వాటిని మరచిపోతూ ఉంటాం. వాటిని పట్టించుకోము. మనకు సన్నిహితంగా ఉన్నది మనకెంత దగ్గరగా ఉంటుందంటే దాని స్పృహే మనకు ఉండదు. అది మన అలవాటులో ఒక భాగమవుతుంది. అలవాటుగా ఉన్నవాటి గురించి మనకు పట్టింపు ఉండదు.

దేన్నయినా మనం చూడాలంటే పరిశీలిచాలంటే అది మనకు కొంత దూరంగా ఉండాలి. మరీ దగ్గరయింది మనకు కనిపించదు. అది మనల్ని ఆక్రమిస్తుంది. దాని గురించిన విస్మృతి మనకు ఏర్పడుతుంది. అంటే మనకూ మనం చూసే దానికీ మధ్య





కొంత స్థలం ఉండాలి. వ్యవధానం ఉండాలి. అప్పుడే అది అక్కడ ఉందన్న విషయం మనకు తెలుస్తుంది. ఒక సూఫీ కథ.

సముద్రంలో ఒక చేపపిల్ల నివసించేది. ఎవరో దాంతో సముద్రం గురించి చెప్పారు. సముద్రం ఎంతో విశాలమయిందని, ఎంతో లోతయిందని చెప్పారు. దాంట్లో తుఫాన్లు వస్తాయని, గొప్ప అల్లకల్లోలం ఏర్పడుతుందని, ఆది, ఆద్యంతాలు లేనిదని చెప్పారు. అప్పటినించీ ఆ చేపపిల్ల సముద్రాన్ని అన్వేషించడం మొదలుపెట్టింది. సముద్రం గురించిన వర్ణన దాని మనసంతా నిండిపోయింది. దాని వైశాల్యం, గంభీరం, ఔన్నత్యం గురించే ఎప్పుడూ ఆలోచించేది. ఎట్లాగైనా, ఎప్పుడయినా ఆ సముద్రాన్ని తాను చూసి తీరాలని పట్టుదలను పెంచుకుంది. దాని గురించి సమాచారం కోసం అన్వేషించడం మొదలుపెట్టింది.

తనకు ఎదురయిన ప్రతి ఒక్కర్నీ సముద్రం ఎక్కడుందో దయచేసి చెప్పమని అడిగేది. వాళ్ళు మేమెప్పుడూ సముద్రం గురించి వినలేదు. దాన్ని గురించి నీకు ఏమని చెప్పారు? అనేవాళ్ళు.. ఆ చేపపిల్ల "సముద్రం చాలా విశాలంగా అల్లకల్లోలంగా ఉంటుందిట. ఆద్యంతాలు లేనంతగా విస్తరించి ఉంటుందట. దయచేసి దాన్ని నాకు చూపగలరా?" అనేది.

వాళ్ళు "నువ్వు చెబుతూ ఉంటే మాకూ ఆశ్చర్యంగా ఉంది. అంత గొప్పదాన్ని గురించి మాకు అసలు తెలీదు. కనీసం దాన్ని గురించి నువ్వు విననయినా విన్నావు. మేము వినను కూడా లేదు'' అన్నారు. కానీ చిన్న చేప పట్టుదల కలిగింది. నిరాశపడకుండా పెద్ద చేపల్ని, పిల్ల చేపల్ని, ముసలి చేపల్ని ఎన్నింటినో అడుగుతూ పోయింది. అట్లా అడుగుతూ పోతూ కొన్ని చేపపిల్లలు ఒక విషయం చెప్పాయి. అదేమిటంటే తమ పూర్వీకులు సముద్రం గురించి తెలుసుకున్నారని, పురాణ గ్రంథాల్లో ఆ సముద్రం గురించి చెప్పారని, ఐతే సముద్రం గురించి తమకు మాత్రం తెలియదని చెప్పాయి.

అంత పట్టుదల కలిగిన చేపపిల్ల కూడా దిగులుపడింది. సముద్రాన్ని తాను చూడగలనో లేదో అని దిగులుపడింది. అంతలో ఒక వివేకం కలిగిన వృద్ధ చేప దాన్ని దగ్గరకి పిలిచి "ఒకసారి సముద్రంపైకి తీసుకెళ్ళి విశాలంగా వ్యాపించిన సముద్రాన్ని చూపించి మనమున్నదే సముద్రం. మన చుట్టూ వ్యాపించి ఉన్నదే సముద్రం. మనం సముద్రగర్భంలోనే ఉన్నాం" అని సత్యాన్ని బోధించింది. తాను మహాసముద్రంలోనే ఉన్నట్లు, సముద్రంలోనే జీవిస్తున్నట్లు తెలుసుకుని చేపపిల్ల ఇన్నినాళ్ళు ఎంత అనవసరంగా అన్వేషించాను" అని విస్తుపోయింది.

సముద్రంలో అలలాగా చేపకూడా ఒక భాగమే. మనమయినా అంతే. ఈ అనంతవిశ్వంలో మనం అంతర్భాగాలం. ఈ అనంత అస్తిత్వంలో మనం భాగాలం. ఎంతసేపూ మనం దేవుడున్నాడా? లేడా? ఉంటే ఎక్కడున్నాడు? ఆయన దర్శనం కోసం నేను అల్లాడుతున్నాను. వెతుకుతున్నాను. ఎప్పటికయినా ఆయన దర్శనభాగ్యం కలగాలంటే నేను ఏం చెయ్యాలి? అంటూ ప్రశ్నిస్తూ ఉంటాం. నమ్మకాలలో, అపనమ్మకాలలో పడికొట్టుకుపోతూ ఉంటాం.

**మనల్ని మనం తెలుసుకోవడమే దైవాన్ని తెలుసుకోవడం.** ఎక్కడో వెతికితే ఆయన మీకు కనిపించడు. కారణం దేవుడు ఎక్కడో బయట లేడు. దేవుడు నీలో ఉన్నాడు. నాలో ఉన్నాడు. మనం బయట వెతకడం మాని లోపలికి చూస్తే సత్యం అవగాహన అవుతుంది.

## 65. బరువు

మనుషులు నిత్యం సమస్యల్తో సతమతమవుతూ ఉంటారు. కొత్త సమస్యల్ని కావలసినన్ని సృష్టించుకుంటారు. ఎడతెగని ఆలోచనలతో మనసు బరువెక్కి ఉంటుంది. మనిషి పడుకున్నా అతని ఆలోచన మేలుకునే ఉంటుంది. కలలతో మనసు నిండిపోతుంది.

నిజానికి మనుషులు వస్తువులతోబాటు ఆలోచనల్ని సేకరిస్తూ ఉంటారు. ఎంత విషయసేకరణ చేస్తే అంత జ్ఞానమనుకుంటూ ఉంటారు. అది సామాజిక విషయ సేకరణ కావచ్చు. ఆధ్యాత్మిక విషయ సేకరణ కావచ్చు. నిజానికి మనుషులు చేయాల్సింది బరువు పెంచుకోవడం కాదు. బరువు దించుకోవడం. **ఎన్నో తెలుసుకోవడంలో ఆనందం లేదు. ఎన్నో వదిలించుకోవడంలో ఆనందముంది.**

మనలోపలే కిటుకు ఉంది. మనకు ఏది ఆనందాన్నిస్తుందో అది చేస్తే అర్థవంతంగా ఉంటుంది. మనకు ఏది బాధ కలిగిస్తుందో అది చెయ్యకుంటే హాయిగా ఉంటాం. కానీ మనుషులు కాంక్షలవెంట పరిగెడతారు. మనుషుల్ని కోరికలే నడిపిస్తాయి. కోరికల్ని అదుపు చెయ్యాల్సిన పనిలేదు. కోరికలు అర్థవంతమయినా అని పరిశీలిస్తే వాటి ఆంతర్యం అవగతమవుతుంది.

హోటాయ్ అన్న పేరుగల ఒక జెన్ గురువు ఉండేవాడు. ఆయన భుజం మీద ఎప్పుడూ ఒక సంచి ఉండేది. ఆ సంచిలో ఎన్నో బొమ్మలు, మిఠాయిలు, చిరుతిళ్ళు, ఆట వస్తువులు ఉండేవి. ఆయన వెంట ఎప్పుడూ పిల్లలు ఉండేవాళ్ళు. వాళ్ళతో ఆయన





ఎన్నో రకాలయిన ఆటలు ఆడేవాడు. వాళ్ళకు బొమ్మలు యిచ్చేవాడు. తినడానికి యిచ్చేవాడు. వాళ్ళు తింటూ ఉంటే వాళ్ళని చూసి ఆనందించేవాడు.

హోటాయ్ ఎప్పుడూ పిల్లల గురించి తప్ప ఏమీ ఆలోచించేవాడు కాదు. ఎవరినయినా ఏదయినా అడిగినా ఆ డబ్బుతో పిల్లలకోసం అన్ని వస్తువులూ కొనేవాడు. ఆయనది పిల్లల లోకం. వాళ్ళతో ఆనందంగా గడుపుతూ వాళ్ళతో ఆడుతూ ఉండేవాడు.

ఒకరోజు ఆయన్ని ఎవరో "ఏమయ్యా! నిన్ను అందరూ జెన్ గురువంటున్నారు. నాకు చూస్తే జెన్ గురించి నీకు ఏమీ తెలియదని అనిపిస్తుంది. నువ్వు ఎట్లాంటి పవిత్ర వాక్యాలు వల్లించవు. ఎవరికీ ఎలాంటి బోధనలు చెయ్యవు. ఎప్పుడూ ఆ సంచి భుజాన వేసుకుని పిల్లల్ని వెంటేసుకుని పిచ్చాడిలా తిరుగుతూ ఉంటావు. ఇట్లా పిల్లల్తో తిరుగుతూనే సమయం వృథా చేసుకుంటున్నావు. ఇదంతా నటనా? అసలు నీకు జెన్ అంటే తెలుసా? అని నాకు సందేహం కలుగుతోంది. నిజంగా నీకు జెన్ అంటే ఏమిటో తెలిస్తే జెన్ అంటే ఏమిటో నాకు చూపించు" అన్నాడు. అతని మాటలు శ్రద్ధగా విన్న హోటాయ్ హఠాత్తుగా తన సంచిని కిందపడేశాడు. అతని చర్య ప్రశ్నించిన వ్యక్తికి అర్థం కాలేదు. "ఇంతకూ దాని అర్థమేమిటి" అని అడిగాడు.

హోటాయ్ "ఇది అంతే. ఈ రకంగా బరువును వదిలించుకోవాలి" అన్నాడు.

ఆ వ్యక్తి ఐతే "తరువాత ఏం చెయ్యాలి?" అన్నాడు.

హోటాయ్ తన సంచిని తీసుకుని భుజాన తగిలించుకుని "తరువాత చెయ్యాల్సింది ఏమీలేదు. ఇప్పుడు నేను ఈ బరువును మొయ్యడం లేదు. ఈ బరువు నాది కాదని నాకు అర్థమైంది. ఈ బరువు పిల్లలది. ఈ ఆట వస్తువుల్తో, తినుబండారాల్తో పిల్లలే ఈ బరువును మోస్తారు" అన్నాడు.

ఏ బరువును వదిలించుకోవాలో, ఏది బరువు కాదో హోటాయ్‌కి తెలుసు. అంటే **హృదయపూర్వకంగా చేసేది ఏది బరువు కాదని తెలుస్తుంది.** జెన్ అంటే ప్రత్యేక సిద్ధాంతం కాదని, అది జీవితమని ఆయన చెప్పకనే చెప్పాడు.

దీన్నిబట్టి మనం ఏ బరువుల్ని భారంగా మోస్తున్నామో మనంత మనం ఆలోచించాలి. వేటిని వదిలించుకోవాలో, దించుకోవాలో తెలుసుకోవాలి. నిరాడంబర, ప్రేమపూర్తి జీవితం జీవించడం హోటాయ్‌లాంటి వివేకవంతులకే వీలవుతుంది.

## 66. భావన

ఇది ఖలీల్‌జీ బ్రాన్ కథ. ఆ కథలో ఒక వ్యక్తి లెబనాన్ వెళతాడు. అతనికి లెబనీస్ భాష తెలీదు. అతను మొదటిసారి వచ్చాడు. ఇతను మాట్లాడే భాష వాళ్ళకు

అర్థం కాదు. వాళ్ళు మాట్లాడే భాష ఇతనికి అర్థం కాదు. అతను దారంటే వెళుతూ ఉంటే ఒక పెద్ద భవనం కనిపించింది. అంతా హడావుడిగా ఉంది. జనం లోపలికి వెళుతున్నారు. బయటకి వస్తున్నారు. అంతా కోలాహలంగా ఉంది.

ఆ దేశానికి సంబంధించిన రాజు ఏదో గొప్ప విందు చేస్తున్నట్లున్నాడని, ఆ ఉత్సవం సందర్భంగా దేశవిదేశాల్లో అతిథుల్ని ఆహ్వానించి ఆతిథ్యమిస్తున్నాడని ఆ వ్యక్తి అనుకున్నాడు. ఎందరో వచ్చి పంచభక్ష్య పరమాన్నాలు ఆరగించి తృప్తిగా వెళ్తున్నారు. యింతమంది వెళుతున్నారు కదా! "నేను వెళితే ఎవడేమనుకుంటాడు? నేను కూడా ఒక విదేశీ అతిథిననే అనుకుంటారు" అని ఆ వ్యక్తి హుందాగా లోపలికి వెళ్ళాడు. అతన్ని చూసి సగౌరవంగా ఆహ్వానించారు. అతనికి సముచిత ఆసనం చూపించారు. అతనికి రకరకాల భోజనాలు వడ్డించారు. ఏం కావాలని అడిగి మరీ వడ్డించారు. ఆ వంటలన్నీ అతనికి ఎంతో నచ్చాయి. ఫలానా కావాలని మరీ అడిగి తెప్పించుకుని తిన్నాడు.

భోజనం ప్రశాంతంగా తిని నీళ్ళు తాగి మూతి తుడుచుకున్నాడు. తాను భోంచేస్తున్నంతసేపు అక్కడ వినయంగా నిల్చున్న చూస్తున్న వ్యక్తికి కృతజ్ఞతలు చెప్పాడు. ఇతని భాష అతనికి అర్థం కాలేదు. ఆ వ్యక్తి అతను ఎంత తిన్నాడో బిల్లు రాసి పట్టుకొచ్చాడు. అది ఊరిలో చాలా పెద్ద హోటల్. అతను ఆ బిల్లు చూసి మీరు మా ఆతిథ్యాన్ని స్వీకరించినందుకు మా కృతజ్ఞతలు అని వాళ్ళ భాషలో పేపరుమీద రాసుకువచ్చారని భావించాడు. ఎందుకంటే తన భాష వాళ్ళకి తెలియదు. ఆ కాగితాన్ని మడతపెట్టి జేబులో పెట్టుకుని కృతజ్ఞతాపూర్వకంగా తలవంచి నమస్కరించాడు. హోటల్ సర్వర్‌కి అతని చేష్టలు అంతుబట్టలేదు. అతన్ని హోటల్ మేనేజర్ దగ్గరకు తీసుకెళ్ళాడు. మేనేజర్ అతన్తో "నువ్వు డబ్బు కట్టాలి" అన్నాడు, మేనేజర్ "వీడు పిచ్చివాడయినా అయి ఉండాలి లేదా దొంగయినా అయి ఉండాలి" అనుకున్నాడు. మేనేజర్ యిక లాభం లేదనుకుని కోర్టుకు తీసుకెళ్ళాడు. కోర్టు ఆ హోటల్ రూం కన్నా చాలా పెద్దగా ఉంది. ఆ వ్యక్తి సంబరపడిపోయాడు. బహుశః నన్ను రాజుగారికి పరిచయం చేయడానికి తీసుకొచ్చినట్లు ఉన్నారు" అని పొంగిపోయాడు. ఉన్నతస్థానంలో ఉన్న జడ్జిని చూసి ఈ వ్యక్తి ఎన్నోసార్లు తలవంచి నమస్కరించాడు. హోటల్ మేనేజర్ ఆ వ్యక్తి చెప్పింది విని జడ్జి అతని నేరానికి తగిన శిక్ష విధించాడు. ఆ దేశ ఆచారం ప్రకారం అట్లాంటి నేరం చేసిన వ్యక్తిని గాడిదమీద వెనక్కి తిప్పి కూచోబెడతారు. ఎర్రరంగు పూస్తారు. మెడకు ఓ బోర్డు వేలాడదీసి దాంట్లో వీడు మోసగాడు. వీడిపట్ల జాగ్రత్తగా ఉండండి అని రాస్తారు. శిక్షప్రకారం ఆ వ్యక్తికి ఎర్రరంగుపూసి వెనక్కి తిప్పి గాడిదమీద కూచోబెట్టి మెడలో బోర్డు వేలాడదీశారు. పూరేగించారు. అతను వీళ్ళు చిత్రమైన మనుషుల్లా





ఉన్నారు. వీళ్ళవి వింత ఆచారాల్లా ఉన్నాయి. వీళ్ళ మర్యాదలు వేరుగా ఉన్నాయి. ఐనా ఎంత గొప్పగా నన్ను గౌరవిస్తున్నారు అని పొంగిపోయాడు. అతన్ని చూడటానికి జనం విరగబడి వచ్చారు. వృద్ధులు, మహిళలు, పిల్లలు, ఒక్కరేమిటి? పూరుపూరంతా కదలి వచ్చింది. రోడ్డుకు యిటువేపు, అటువేపు బారులు తీరి జనం నిల్చున్నారు. పిల్లలు అరుస్తున్నారు. కేరింతలు కొడుతున్నారు. అవును నాకు యింత గొప్ప గౌరవం జరుగుతుందని, మా ఊళ్ళో వాళ్ళకి తెలియదు కదా! మా దేశం వ్యక్తి ఎవరయినా చూసి చెబితే బావుండు. నా అంతకు నేను చెబితే మా దేశం జనం నమ్మరే" అనుకున్నాడు.

అంతలో ఆ జనంలో అతని దేశానికి చెందిన అతని పూరికి చెందిన అతనికి పరిచితుడయిన వ్యక్తి అతన్ని చూస్తూ ఉండడం కనిపించింది. వెంటనే అతన్ని పేరుపెట్టి గట్టిగా పిలిచాడు. తాను పిలుస్తూ ఉండగానే తెలిసిన ఆ మనిషి గుంపులో కలిసి మాయమైపోయాడు. అతను కనిపించకుండా మాయమయిపోయేసరికి ఈ వ్యక్తి 'వెధవ! కోపంతో కుళ్ళు! నాకు జరుగుతున్న గౌరవానికి అసూయతో మండిపోతూ మాయమయిపోయాడు! వాడి ఖర్మ!' అనుకున్నాడు.

**ఏదయినా మనం తీసుకోవడాన్ని బట్టి ఉంటుంది.**

## 67. కర్మబంధం

కోపం వచ్చినప్పుడు దాన్ని పరిశీలించండి. అది ఎక్కణ్ణించి వస్తోంది? అది మీలోంచి వస్తుందా? మీ జ్ఞాపకాల నుంచి వస్తోందా? పరిశీలించండి. వెనకటికి ఎప్పుడో మీరు అవమానానికి గురయ్యారు. ఎవరో మిమ్మల్ని అవమానించారు. అది జ్ఞాపకంగా మీలో నిలిచిపోయింది. అది గాయంలా మిగిలిపోతుంది. ఎప్పుడో దానికి సమాంతరంగా, దాన్ని పోలిన అనుభవమేదో జరుగుతుంది. పాతగాయం పచ్చిపచ్చిగా ముందుకొస్తుంది. మిమ్మల్ని మీరు నిశితంగా ఒకరోజంతా గమనిస్తే గడచిపోయిన గాయాలుగా మిగిలిపోయిన జ్ఞాపకాలు యాంత్రికంగా చర్యా ప్రతిచర్యల్ని నిర్వహిస్తున్నట్లు తెలిసి మీరు ఆశ్చర్యపోతారు.

బుద్ధుడికి జ్ఞానోదయమైంది. బుద్ధుడి కీర్తి దశదిశలా వ్యాపించింది. అందరూ ఆయనకు అభివాదం చెయ్యడం, గౌరవించడం మొదలుపెట్టారు. బుద్ధుడికి దేవదత్తుడనే దాయాది ఉండేవాడు. బుద్ధుడి కీర్తి ప్రతిష్టలు చూసి అతనికి ఈర్ష్య కలిగింది. బుద్ధుణ్ణి ఎలాగయినా చంపాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. విషప్రయోగాలు చేశాడు. అవన్నీ విఫలమయ్యాయి. అవి విఫలమయ్యేకొద్దీ అతనిలో ద్వేషం మరింత పెరిగిపోయింది. ఆ విషయం అందరికీ తెలిసి జనం బుద్ధుడితో "మీ మీద అంత ప్రతీకారంతో ఉన్న

వ్యక్తిని మీరు ఎందుకు పట్టించుకోరు? అతనిపై ఎందుకు చర్య తీసుకోరు?' అనేవాళ్ళు. బుద్ధుడు చిరునవ్వు నవ్వి ఊరుకునేవాడు. దేవదత్తుడు ఒకసారి బుద్ధుడిపైకి మదపు టేనుగును వదిలాడు. అది బాగా పొగరుపట్టిన మదపుటేనుగు. ఘీంకరించుకుంటూ దూసుకొచ్చింది. దేవదత్తుడు బుద్ధుని పని అయి పోయిందనుకున్నాడు. చుట్టుపట్ల జనం భయభ్రాంతులయి పరుగులు తీశారు. కొంతమంది వింతను చూస్తున్నట్లు నిలబడ్డారు.

బుద్ధుడు నిశ్చలంగా నడిచిపోతున్నాడు. ఏనుగు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ బుద్ధుడి దగ్గరకు వచ్చింది. ఒక్క క్షణంలో అది బుద్ధుణ్ణి తొక్కేసేదే. కానీ బుద్ధుడి కళ్ళలోకి చూస్తూనే ఆగిపోయింది. పైకి ఎత్తిన కాలును కిందకు దించింది. ఎంతో సౌమ్యంగా మారిపోయింది. తలదించి తొండంతో నమస్కరించి వెనుదిరిగిపోయింది.

అప్పుడు జనం బుద్ధుడి దగ్గరకు వచ్చారు. బుద్ధుడు చిరునవ్వుతోనే ఉన్నాడు. జనం ఆయనతో "ఇంత జరిగినా మీరు నవ్వుతూనే ఉన్నారు. ఇదంతా దేవదత్తుడు చేస్తున్నాడని మీకు తెలిసి కూడా మీరు ఎందుకు అతనిపై ప్రతీకారానికి పూనుకోరు? ఎందుకు మీరంటే అతనికి అంత ద్వేషం" అన్నారు?

బుద్ధుడు "యిదంతా నేను చేసిన కర్మఫలం. నేనెప్పుడో దేవదత్తుణ్ణి బాధపెట్టి ఉంటాను. దానికి యిది ప్రతీకారం. పూర్వజన్మలో అతన్ని హింసించి ఉంటాను. అందుకని అతను నా మీద పగపట్టాడు. యిప్పుడు క్షణంలో నన్ను చంపబోయిన ఏనుగు నన్ను వదిలిపెట్టి దాని దారంటే అది వెళ్ళింది. బహుశః ఎప్పుడో ఏ జన్మలోనో నేను దానికి సాయపడి ఉంటాను. ఆదుకుని ఉంటాను. అందుకనే అది నన్ను చంపకుండా వదిలి వెళ్ళిపోయింది. ఇప్పుడు నేను ప్రతీకారచర్యలకు పూనుకుంటే జన్మజన్మల్లో ఈ చర్యాప్రతిచర్యలు గొలుసుకట్టుగా నిరంతరాయంగా సాగుతాయి. మళ్ళీ కర్మబంధంలో తగులుకుపోతాను. దేవదత్తుడు "ఈ జన్మలో ఆ కర్మబంధం నుంచి విముక్తుడు కానీ" అన్నాడు.

జనం స్థాణువులయి బుద్ధుడు చెప్పినవి విన్నారు.

**ఎప్పుడయినా ఎవరయినా మనల్ని అవమానిస్తే సాక్షీభూతంగా ఉండాలి. వైరాగ్య భావంతో ఉండాలి.** ఆ మనిషి నన్ను అవమానిస్తున్నాడంటే బాధపెడుతున్నాడంటే ఎప్పుడో, ఏ జన్మలోనో అతన్ని నేను అవమానించి ఉంటాను. ఏదీ నిష్కారణంగా జరగదు. అట్లా ఒకప్పుడు జరిగిన దాని ఫలితంగా యిది జరుగుతుంది. కాబట్టి దాన్ని భరించాలి. విధి నాకు నిర్దేశించినది యిదేనేమో! అనుకోవాలి. ఏ పనిచేసినా దానిగుండా భవిష్యత్తుకు సంబంధించి ఒక నిర్ణయం జరిగిపోతుంది. దాన్ని బట్టే భవిష్యత్తు





రూపొందుతుంది. ఈ విషయాన్ని వ్యక్తి గుర్తుంచుకోవాలి. ఎట్లాంటి ప్రతీకారం లేకుండా ప్రతిదాన్నీ ఎప్పుడయితే యథాతథంగా స్వీకరిస్తామో అప్పుడు ఆ సమస్య అక్కడితో అంతమవుతుంది.

## 68. ఒంటిచేతి చప్పుడు

పన్నెండేళ్ళ కుర్రాడు జెన్ ఆశ్రమంలో ఉండేవాడు. అక్కడి జెన్ గురువు ఎంతో సుప్రసిద్ధుడు. ఎందరో ఆయన దర్శనానికి వచ్చేవాళ్ళు. ఎంతోమంది ఆయన్ని ఎన్నో సలహాలు అడిగేవాళ్ళు. తమ బాధలు ఆయన్తో చెప్పుకునేవాళ్ళు. పరిష్కారాన్ని కోరేవాళ్ళు. కష్టాల నుండి బయటపడే మార్గాల్ని చెప్పమని అడిగేవాళ్ళు. ఆయన తనకు తోచినవి చెప్పి వాళ్ళను సంతృప్తి పరచి పంపేవాళ్ళు.

అట్లా ఎంతోమంది గురువుగారి దగ్గరకు వచ్చి వెళ్ళడాన్ని ఆ కుర్రాడు గమనిస్తూ ఉండేవాడు. అట్లా చూడడం వల్ల ఆ కుర్రాడికి ఒక ఆలోచన వచ్చింది. ఒకరోజు ఉదయాన్నే గురువుగార్ని చూడడానికి వచ్చే యితర జనాల్లాగా ఎంతో వినయంగా అడుగులేసుకుంటూ వచ్చి గురువుగారికి నమస్కరించి ఏడుసార్లు తలవంచి నమ్రత ప్రకటించాడు. ఆ కుర్రాడి చేష్టలు చూసి గురువుగారికి నవ్వు వచ్చింది. వాడి అనుకరణ చూసి ఆనందించాడు. గురువుగారు ఆ కుర్రాణ్ణి చూసి నవ్వుతూ ఎందుకు వీడిలా చేస్తున్నాడు? అనుకున్నాడు.

గురువుగారు "ఎందుకొచ్చావు?" అని ప్రశ్నించేదాకా నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

ఆ కుర్రాడి పేరు టోయో. గురువు కుర్రాణ్ణి చూసి "ఏం కావాలి?" అన్నాడు.

కుర్రాడు మళ్ళీ తలవంచి "నేను సత్యాన్ని అన్వేషిస్తున్నాను. నేను సత్యాన్ని అందుకోవాలంటే ఏం చెయ్యాలి?" అన్నాడు.

యితరులని అనుకరిస్తున్నాడని తెలిసినా గురువుగారు "టోయో! వెళ్ళి ధ్యానం చేయి. ఒంటిచేతి చప్పుడు ఎలా ఉంటుందో తెలుసుకుని రా!" అన్నాడు.

ఆ కుర్రాడు గురువుగారికి ప్రణామం చేసి వెళ్ళిపోయాడు. ధ్యానంలో కూర్చున్నాడు. అంతలో కిటికీ నుంచి ఎవరో ఒకమ్మాయి పాట పాడడం వినిపించింది. లేచి గురువుగారి దగ్గరికి వెళ్ళి "గురువుగారూ! ఒంటిచేతి చప్పుడంటే ఏమిటో తెలిసింది. కిటికీ బయట అమ్మాయి పాడుతున్న పాట" అన్నాడు.

గురువు నవ్వి "కాదు. వెళ్ళు. ధ్యానంలో కూచో" అన్నాడు.

కుర్రాడు వెళ్ళి మూడు రోజులపాటు ధ్యానం చేశాడు. అంతా నిశ్శబ్దంగా ఉండే చూరు నుంచి నీళ్ళు బొట్లు బొట్లుగా కారడం కనిపించింది. అవి చేసే శబ్దాలు

ఎంతో లయాత్మకంగా ఉన్నాయి. పరిగెట్టుకుంటూ గురువు దగ్గరికెళ్ళి "చూరు నుంచి రాలే నీటి బిందువుల శబ్దాలు" అన్నాడు. గురువు ధ్యానం చెయ్యమన్నాడు.

కుర్రాడు మూడు నెలలపాటు ధ్యానం చేశాడు. మధ్యలో వచ్చి ఎన్నో అనుభవాలు చెప్పాడు. గురువు కాదన్నాడు. కుర్రాడెళ్ళిపోయాడు. సంవత్సరం గడిచినా కుర్రాడు తిరిగి రాకపోయేసరికి కుర్రాణ్ణి వెతుక్కుంటూ గురువు వెళ్ళాడు.

వెతుక్కుంటూ పోతే ఒకచెట్టు కింద కుర్రాడు నిశ్శబ్దంగా ధ్యానం చేస్తూ కనిపించాడు. గురువు ఆ కుర్రాడు కళ్ళు తెరుస్తాడని చూశాడు. గంటలు గడిచినా కుర్రాడు కళ్ళు తెరవలేదు. ఆ కుర్రాడి శరీరం మృదువుగా కదుల్తోంది. అతని ముఖం కాంతివంతంగా ఉంది. కుర్రాడు ఎంతో లేతగా, ఎంతో మనోహరంగా కనిపించాడు.

చీకటి పడబోతోంది. గురువు మెల్లగా "టోయో!" అన్నాడు.

కుర్రాడు మెల్లగా కళ్ళు తెరిచి గురువుని చూశాడు. "ఇదే!" అన్నాడు.

గురువు "ఔను! నువ్వు సాధించావు" అన్నాడు.

మాటల్ని దాటిన జ్ఞానోదయాన్ని ఒంటిచేతి శబ్దం సూచిస్తుంది. **మనకు వివేకం కలిగిన సంగతి మనకు తెలుస్తుంది. దాన్ని మాటల్లో వర్ణించలేం.** అట్లాగే ఒంటిచేతి శబ్దం వినిపించదు. దాని అంతరార్థం అంతరాత్మకే తెలుస్తుంది.

ఆ రకంగా కుర్రాడికి జ్ఞానోదయమైంది.

## 69. ఆవిష్కారం

ఉపనిషత్తుల్ని ఆవిష్కరించిన ఋషులు అసాధారణ ప్రతిభామూర్తులు. వాళ్ళ అభివ్యక్తి అపూర్వమైంది. యితరులకన్నా విభిన్నమయింది. తాము దర్శించిన సత్యాల్ని సిద్ధాంతాల స్థాయికి వాళ్ళు దిగజార్చలేదు. అట్లాంటి ప్రయత్నాలకు పనిగట్టుకుని పూనుకోలేదు. ఉపనిషత్తులు సిద్ధాంతాలు కావు. సత్యావిష్కారాలు. అవి చిన్ని చిన్ని మెరుపులు. అంతరాంతరాళాల ప్రకంపనలు. వాటికి ఒక క్రమబద్ధత, హేతుబద్ధత ఉండదు. అవి అభిప్రాయాలు కావు. ఆలోచనలు కావు. వాళ్ళ దర్శనాల్లో వాళ్ళకేం కనిపించిందో, దాన్ని యథాతథంగా వాళ్ళు వ్యక్తీకరించారు. అవి సహజంగా పూలు విచ్చుకుంటున్నట్లు ఉంటాయి.

కానీ సత్యాన్ని సిద్ధాంతీకరించడానికి ప్రయత్నించినవాళ్ళు ఉన్నారు. దానివల్ల సత్యం దాని జీవాన్ని కోల్పోతుంది. హెగెల్, కాంట్, ప్లేటో, అరిస్టాటిల్ మొదలయిన తాత్వికుల దగ్గర కొంత జ్ఞానానికి సంబంధించిన అంశ ఉంది. కానీ దానిని వాళ్ళు





సర్వనాశనం చేశారు. దానిని సిద్ధాంతాల చట్రాల్లో బంధించడానికి ప్రయత్నించారు. సత్యమెప్పుడూ సిద్ధాంతాలకు లొంగదు. లొంగదీయాలని ప్రయత్నిస్తే అది నిర్జీవంగా మారుతుంది.

కోలరిడ్జ్ గొప్ప ఇంగ్లీషు కవి. వర్డ్స్‌వర్త్‌తో కలిసి కాల్పనిక కవిత్వ ఉద్యమ నిర్మాతల్లో ఒకడు. కోలరిడ్జ్ ఎన్నో సుప్రసిద్ధ కవితలు రాశాడు. కానీ ఆయన మరణించే సమయానికి ఎన్నో కవితల్ని అసంపూర్తిగా వదిలేశాడు. ఆయన మరణ సమయం ఆసన్నమయింది. ఆయన సన్నిహితుల్లో ఒకరు "మీరు ఎందుకని ఎన్నో కవితల్ని అసంపూర్తిగా వదిలిపెట్టారు? నిజానికి కొన్ని కవితలయితే కొన్ని లైన్లు రాస్తే చాలు పూర్తయిపోతాయి. దాంతో వాటికి సమగ్రత, సంపూర్ణత వస్తుంది. మీరు వాటిని పూర్తి చెయ్యవచ్చు కదా! ఎందుకు అలా వదిలేశారు. ఎంతమందో వాటి గురించి అడిగారు. మీరు కొన్ని కవితల్ని పూర్తి చేస్తే అవి ఆంగ్లసాహిత్యంలో ఆణిముత్యాలవుతాయి. వాటివల్ల మీ పేరు మరింత చిరస్థాయిగా మిగిలిపోతుంది కదా! మీరెందుకు ఆ ప్రయత్నం చెయ్యలేదు. ఎందుకు వాటిని అసంపూర్తిగా వదిలిపెట్టారు?" అన్నారు.

దానికి కోలరిడ్జ్ "అట్లా చెయ్యడం నా చేత కాదు. పైగా వాటిని పూర్తి చెయ్యకూడదని నేను నిర్ణయించుకున్నాను. ఎందుకంటే అప్పటిదాకా వచ్చిన ఆ కవిత్వచరణాలు వాటంతట అవే వచ్చాయి. అవి ఎట్లా వచ్చాయో వాటిని అట్లాగే యథాతథంగా రాసిపెట్టాను. అందరూ అనుకోవచ్చు. వాటిని నేనే రాశానని, కానీ నిజానికి వాటిని నేను రాయలేదు. ఒక పరవశక్షణంలో అవి వచ్చాయి. ఆవిష్కార మయ్యాయి. నేను నిమిత్తమాత్రుణ్ణి. అవి ఎంతవరకు ఏ మేరకు వస్తే వాటిని అంతమేరకు రాసిపెట్టాను. వాటిని పూర్తిచెయ్యగలిగే సాహసం చెయ్యను. అక్కడ నా సొంత తెలివితేటలు ప్రదర్శించే సాహసం చెయ్యను. అవి నా గుండా ప్రయాణించాయి. నేనొక మాధ్యమాన్ని మాత్రమే. వాటిలో నాకు ప్రమేయం లేదు. వాటి చివరి చరణాలు రాలేదు. వాటికోసం ఎదురుచూస్తాను. వస్తే రానీ, రాకపోతే నేనేమీ చేయలేను. ఆ విషయంలో నేను నిస్సహాయుణ్ణి" అన్నాడు.

ఉపనిషత్ వాక్యాలు అలాంటివే. అవి ఋషుల గుండా వచ్చాయి. వాళ్ళు నిమిత్తమాత్రులు. వాటికి ఒక సిద్ధాంతాన్ని అంటగట్టడానికి వాళ్ళెప్పుడూ ప్రయత్నించలేదు. లేని సమగ్రతని తీసుకురావడానికి పూనుకోలేదు. వాటిని యథాతథంగా వ్యక్తీకరించారు. అందుకే వాటిల్లో అంత సహజత్వం, సౌందర్యం ఉన్నాయి.

## 70. తీర్పు

మనుషులు దేన్ని గురించయినా తీర్పు చేస్తూ ఉంటారు. నిర్ణయాలు చేస్తూ ఉంటారు. ఫలానా వ్యక్తి మంచివాడు. ఫలానా వ్యక్తి చెడ్డవాడు. అన్న అభిప్రాయాలకు వస్తూ ఉంటారు. **ఏది మంచో? ఏది చెడ్డో నిర్ణయాలకు రావడానికి మనమెవరము?**

మనిషి తన పరిస్థితుల్ని బట్టి, పరిసరాల్ని బట్టి ప్రవర్తిస్తాడు. మనం మనుషుల్ని అంచనాలతో సమీపిస్తాం. ఫలానా వ్యక్తి ఇలాంటివాడు అని ఖచ్చితంగా తీర్మానిస్తాం. అతను అలాంటి వాడయితే అతనెందుకలా అయ్యాడన్నది చూడం. రేపు అతను మంచిగా ప్రవర్తించినా దాన్ని గురించి పట్టించుకోం.

ఒక సూఫీ వేదాంతి ఉండేవాడు. చాలా సౌమ్యుడు. నెమ్మదస్తుడు. ఎప్పుడూ ఎవరికి ఎట్లాంటి అపకారమూ తలపెట్టనివాడు. వీలయినంత మేర యితరులకు సాయపడేవాడు. ఫలానా వ్యక్తి మంచివాడు, ఫలానా వ్యక్తి చెడ్డవాడు అని ఎట్లాంటి నిందారోపణలు చెయ్యనివాడు.

బతుకుదెరువు కోసం చిన్ని చిన్ని వస్తువుల్ని ఊళ్ళో తిరుగుతూ అమ్ముకునేవాడు. వాటిల్లో తినుబండారాలు, బొమ్మలు ఎన్నెన్నో ఉండేవి. ఒక్కోసారి రుతువుని బట్టి అతను అమ్మే వస్తువులు మారేవి. పొద్దున్నే బయల్దేరి ఊరంతా తిరిగి అమ్ముకునేవాడు. సాయంత్రానికి యిల్లు చేరేవాడు. ఒక్కోసారి సంచిలో వస్తువులు తీసుకెళ్ళేవాడు. యింకోసారి పళ్ళు లాంటివి వున్నప్పుడు తోపుడు బండి తోసుకెళ్లేవాడు.

ఎన్నో ఏళ్ళుగా అతని వృత్తి అదే. తను అమ్మే వస్తువులకు తగిన ధరలు పెట్టేవాడు. వాటిలో వచ్చే ఆదాయం తన తిండికి సరిపోయేంతగా మాత్రమే ఉండేలా చూసుకునేవాడు. లాభాల చింత ఉండేది కాదు. దాంతో బయటకన్నా అతని దగ్గర వస్తువుల ఖరీదు చాలా తక్కువ.

కానీ అతను ఎప్పుడయినా ఎవరయినా కొద్ది తక్కువ డబ్బులు ఇచ్చినా ఏమీ అనుకునేవాడు కాదు. కొందరు తరువాత యిస్తామని ఎగ్గొట్టేవాళ్ళు. పట్టించుకునేవాడు కాడు. అతని నెమ్మదితనం చూసి, అమాయకత్వం చూసి కొందరు సరుకులు తీసుకుని చెల్లని నాణేల్ని యిచ్చేవాళ్ళు. ఏమీ అనకుండా వాటిని తీసుకునేవాడు. అందరికీ అతని గురించి తెలిసి పోయింది. కొందరు మోసం చేసేవాళ్ళు. అతని మంచితనాన్ని చూసి కొందరు ఆదుకునేవాళ్ళు.

ఆయన చెల్లని నాణేల్ని యిచ్చినా 'ఇవి చెల్లవు కదా!' అనేవాడు కాదు. అఋవుగా సరుకులు తీసుకుని కూడా 'నీ డబ్బు యిచ్చేశాం కదా!' అంటే 'మీరు యివ్వలేదు' అనేవాడు కాదు.





ఇట్లా తిరుగుతూ వ్యాపారం చేస్తే నష్టపోతాడని కొంతమంది సాయం చేసి ఇంటిదగ్గరే ఒక అంగడి పెట్టుకోవడానికి తోడ్పడ్డారు. అంగట్లో కూచునేవాడు. కానీ వ్యవహారంలో మార్పు లేదు. చెల్లని నాణేల్ని యిచ్చేవాళ్ళు. చేతివాటం మనుషులు ఎప్పట్లా తమ పనులు కొనసాగిస్తూనే ఉన్నారు.

అదనంగా పక్కవూరి జనానికి కూడా ఈ అమాయకుడి వ్యవహారం తెలిసింది. అందులో రకరకాల జనం. నిజాయితీ పరులు, మోసగాళ్ళు. అట్లా అని అతను పూర్తిగా దివాలా తియ్యలేదు. బండి నడుస్తూనే ఉంది.

కాలం ఎప్పుడూ ఎక్కడా ఆగదు కదా! అతను వృద్ధుడయ్యాడు. మరణ సమయం ఆసన్నమైంది. మంచంపై ఉన్నాడు. చివరి ఘడియలు, అప్పటిదాకా తన జీవన విధానమంతా అతని మనసులో మెదిలింది. ఆకాశంలోకి చూసి

'దేవుడా! యిన్నాళ్ళూ యిన్నేళ్ళు నిన్నే నమ్ముకుని జీవనం సాగించాను. చెల్లని నాణేల్ని యిచ్చినా తీసుకున్నాను. చెల్లే నాణేల్ని స్వీకరించాను. దయగా ఉన్నవాళ్ళ ప్రేమని పొందాను. అరువు తీసుకుని ఎగ్గొట్టిన వాళ్ళని ఏమీ అనలేదు. నాకు సాయపడిన వాళ్ళని మంచివాళ్ళని, నన్ను మోసగించిన వాళ్ళని చెడ్డవాళ్ళని ఎప్పుడూ అనలేదు. నిర్ణయాలు, తీర్పులు చెయ్యలేదు. నువ్వు సృష్టించిన మనుషుల్ని ఫలానా అని నిర్ణయించడానికి పూనుకోలేదు. నేను కూడా నీ సృష్టిలో భాగాన్నే. దయచేసి నా గురించి కూడా ఎట్లాంటి నిర్ణయమూ చేయకు" అన్నాడు.

## 71. సాక్షిగా ఉండడం

**మనిషి సాక్షిగా ఉండడం అభ్యసించాలి. తన విషయంలోనైనా, యితరుల విషయాలలోనైనా అది సాధన చేస్తే జీవితం అపూర్వంగా ఉంటుంది. ఇది నేను చెయ్యడం లేదు. నేను సాక్షిని మాత్రమే. అక్కడ నా నిమిత్తంలేదు. ఆ చర్యతో నాకు సంబంధం లేదు. నేను దానికి బాహ్యంలో ఉన్నాను. కేవలం ప్రేక్షకుడిగా జరిగేది చూస్తున్నాను"** అన్న విషయాన్ని మనిషి గుర్తుపెట్టుకోవాలి. తామరాకుపై నీటిబొట్టులా ఉండటమంటే అదే.

మనిషి దాన్ని చిన్న చిన్న విషయాల నుంచే ప్రారంభించాలి. ఉదాహరణకి మనం భోంచేస్తూ ఉంటాం. భోజనం చేస్తున్నప్పుడు మననించే మనం వేరయి భోజనం చేస్తున్న వ్యక్తిని పరిశీలించాలి. అదొక అపూర్వ అనుభవం. అట్లాగే నడుస్తున్నప్పుడు నడుస్తున్న మన నుండి వేరయి మనల్ని పరిశీలించడం. ఈ క్రమంలో మెల్లమెల్లగా ఇతర విషయాల్లోనూ ప్రయోగాలు చేయవచ్చు. సాధారణంగా మనకు సంతోషం కలిగితే

సంతోషంలో లీనమవుతాం. మనకు దుఃఖం కలిగితే దుఃఖంలో మునిగిపోతాం. అంటే నువ్వు సంతోషమయిపోతావు. నువ్వు దుఃఖమయిపోతావు. ఇవి రెండూ శాశ్వతం కావు. ప్రతి మనిషీ సంతోషంనించీ బయటపడతాడు. దుఃఖంనుంచీ బయటపడతాడు. అంటే అవి మనకు సంబంధించినవి కావు. ఇవి అంటని ఒక చైతన్యస్థితి ప్రతి మనిషిలో ఉంది. ఆ చైతన్యస్థితే మనమని గుర్తించినప్పుడు మనం వాటిని అంటే సంతోషాన్ని, దుఃఖాన్ని దాటి వాటిని పరిశీలిస్తాం. అప్పుడు సుఖాన్ని, దుఃఖాన్ని దాటి ఒక ఆనంద స్థితి అనుభవంలోకి వస్తుంది. నిజమైన మనిషితత్త్వం అదే. స్వామి రామతీర్థ పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలో భారతీయ ఆధ్యాత్మికతను ప్రపంచానికి చాటిన వాళ్ళల్లో ఒకరు. ఆయన వందేళ్ళ క్రితం అమెరికాకి వెళ్లాడు. భారతీయ తత్త్వచింతనను పాశ్చాత్యులకు పరిచయం చేశాడు. రామతీర్థ చిత్రమయిన వ్యక్తి. మార్మికుడు. ఆయన ఎప్పుడూ 'నేను' అన్న మాటను వాడేవాడు కాదు. "నేను చెబుతున్నాను" అనేవాడు కాదు. నేను అన్న మాటలో ఎంతో అహం దాగి ఉంటుంది. అధికారం ఉంటుంది. ఆధిపత్యం ఉంటుంది. అందుకని ఆయన 'నేను' అన్నమాటని పరిహసించేవాడు. కానీ 'నేను' స్థానంలో ఏదో ఉండాలి కదా! అందుకని 'నేను' అన్న స్థానంలో 'రాముడు' అన్న మాటను ఉపయోగించేవాడు. ఆ చెప్పడంలోనే రాముడు నేను కాదన్న అర్థముంది.

ఉదాహరణకి ఆయనకు ఆకలి వేస్తుందనుకోండి. ఆయన 'నాకు ఆకలేస్తోంది. అనేవాడు కాదు. రాముడికి ఆకలేస్తోంది" అనేవాడు. ఆయనకు తలనొప్పి వేసిందనుకోండి. రాముడికి తలనొప్పి వేస్తుంది అనేవాడు. రాముడు వేరు, తను వేరు అని ఆయన గుర్తించాడు. మనం ఇట్లాంటి సాధువుల్ని చూసే ఉంటాం. ఇట్లాంటి సన్యాసులు మనకు కేవలం భారతదేశంలోనే కనిపిస్తారు.

ఒకరోజు కొంతమంది ఆయన నటిస్తున్నాడని, పిచ్చిగా ప్రవర్తిస్తున్నాడని, జనాల్ని వంచిస్తున్నాడని ఆయనను నిలదీసి అవమానించారు. దూషించారు.వాళ్లు తిడుతున్న కొద్దీ ఆయన నవ్వుతున్నాడు. వాళ్ళందరూ ఆయన్ని అనరాని మాటలన్నా ఆయన చిఱునవ్వు నవ్వుతూనే ఉన్నాడు. చివరకి యిక లాభం లేదనకుని ఆ జనం వెళ్ళిపోయారు. ఆయన నవ్వడం మటుకు ఆపలేదు. నవ్వుకుంటూనే తన శిష్యులున్న చోటికి వచ్చాడు. శిష్యుల్ని చూసి కూడా నవ్వాడు. గురువుగారి వింత ప్రవర్తన చూసి శిష్యులు విస్తుపోయారు. గురువుగారూ! "ఎందుకు నవ్వుతున్నారు! ఏమైంది" అన్నారు. రామతీర్థ శిష్యుల్ని చూసి ఈ రోజొక విషయం జరిగిందయ్యా! రాముడు దారంటే వెళుతూ ఉంటే ఎవరో నిలదీశారు. తిట్టారు. అవమానం పాలు చేశారు. ఆ చేసిన పనికి ఎంతో ఆనందించారు. కానీ పాపం రాముడు ఎంతో బాధపడ్డాడు. రాముడికి





ఎంతో యిబ్బంది కలిగింది. కానీ ఏం చెయ్యను. నేను రాముడికి బయట నిల్చున్నాను. అంతా చూస్తూనే ఉన్నాను" అన్నాడు.

**మనిషి చైతన్యం మనిషి అహంనించీ బయటకువచ్చి జరుగుతున్నదానికి సాక్షిగా ఉండాలి. మనిషి సాధన చెయ్యాల్సింది అదే. సాధించాల్సింది అదే. సహజమైంది అదే**

## 72. మూడు వరాలు

మనం దేవుణ్ణి ప్రార్థిస్తాం. ఆ ప్రార్థన మన తీరని కోరికలతో నిండి ఉంటుంది. ఎట్లాగయినా ఆ కోరికల్ని తీరుస్తాడని మనం దేవుణ్ణి ప్రార్థిస్తాం. అంటే ప్రార్థన అన్నది బేరసారాలతో కూడి ఉంటుంది. దాన్ని మనం ప్రార్థన అంటాం.

ఒక వ్యక్తి నిరంతరం శివుణ్ణి పూజించేవాడు. ప్రార్థించేవాడు. ఉపవాసాలు చేసేవాడు. భజనలు చేసేవాడు. సంవత్సరాల తరబడి శివుణ్ణి ఆరాధిస్తూ ఎప్పటికయినా శివుడు ప్రత్యక్షమై తన కోరికలు తీరుస్తాడని తపించాడు. ఆ సమయం ఆసన్నమైంది.

ఒకరోజు హఠాత్తుగా శివుడు ఆ భక్తుడి ముందుకు ప్రత్యక్షమయ్యాడు. కలలో కూడా ఊహించని ఆ పరిణామానికి అతను బిత్తరపోయాడు. సాక్షాత్తు శివుడే తనముందు నిల్చుంటే అవే ఆలోచనలు స్తంభించిపోయాయి. శివుడు ప్రసన్నవదనంతో భక్తుణ్ణి చూసి "నీకు మూడు వరాలు ప్రసాదిస్తున్నా. కోరుకో" అన్నాడు. ఒక్కసారిగా మూడువరాలు అనేసరికి భక్తుడికి తోచలేదు "స్వామీ! నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి" అన్నాడు. శివుడు చిరునవ్వు నవ్వి "అలాగే" అన్నాడు.

ఆ వ్యక్తి తీవ్రంగా ఆలోచించాడు. పాతికేళ్ళ క్రితం అతనికి పెళ్ళయింది. అప్పటినించీ అతను భార్య అజమాయిషీ కింద, అధికారం కింద నలిగిపోయాడు. ప్రతిదానికీ ఆమె అడ్డుచెప్పేది. తనమాటే నెగ్గేలా చూసుకునేది. అతని మనసులో భార్యపైన అంతులేని ఆగ్రహం ఉంది. కానీ దాన్ని ఎప్పుడూ బయటపెట్టలేదు. నిగ్రహించుకున్నాడు. ఇప్పుడు తనకు అవకాశం వచ్చింది. ఆమెపై ప్రతీకారం తీర్చుకోవాలి. ఇంతకుమించిన మంచి సమయం మళ్లీరాదు అనుకుని స్వామీ! "నా భార్యను చంపేయి" అన్నాడు.

శివుడు 'తథాస్తు' అన్నాడు. దాంతో అతని భార్య చనిపోయింది.

భార్యభర్తల మధ్య అభిప్రాయభేదాలన్నవి అనివార్యం. కానీ ఎవరిపట్లా మరొకరికి పూర్తి ద్వేషం ఉండదు. ప్రేమ, ద్వేషం విడివిడిగా ఉండవు. మనం ప్రేమించే వాళ్ళనే ద్వేషిస్తాం. ద్వేషించేవాళ్ళనే ప్రేమిస్తాం. అతను తన కళ్ళముందే భార్య చనిపోతే దానికి తనే కారణమని తెలిసి విలవిల్లాడిపోయాడు. వాళ్ళ మధ్య అనురాగక్షణాలు, కుటుంబం పట్ల ఆమె అంకితభావం గుర్తుకొచ్చి అతని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. వెంటనే

శివుడి పాదాలపై పడి "స్వామీ! తప్పయిపోయింది. నా భార్యను దయచేసి బతికించండి" అన్నాడు.

శివుడు నవ్వుతూ "అలాగే" అన్నాడు. అతని భార్య తిరిగి ప్రాణాలతో లేచింది. ఆ రకంగా రెండు వరాలు పూర్తయ్యాయి. ఇంక ఒక్క వరం మిగిలింది. తొందరపాటువల్ల వరాలు అట్లా వ్యర్థమయ్యాయని ఆ వ్యక్తి దిగులుపడి కనీసం మూడోవరం అర్థవంతంగా ఉండాలని అనుకుంటూ శివుడితో "స్వామీ! నాకు కొద్దిగా సమయమివ్వండి" అన్నాడు.

శివుడు "సరే! నీ యిష్టం. నువ్వు ఎప్పుడు కావాలంటే అప్పుడు తలచుకో. ప్రత్యక్షమవుతాను." అని అదృశ్యమైపోయాడు.

రోజూ ఆ వ్యక్తి ఏం కోరుకోవాలా? అని ఆలోచించేవాడు. అతని దగ్గర ఒక వరం ఉంది. దాన్ని జాగ్రత్తగా ఆలోచించి కోరుకోవటం మంచిది. లేకుంటే ఆ కోరిక నిష్ఫలమవుతుంది. అనుకుని ఎప్పుడూ దాన్ని గురించే ఆలోచించి ఎటూ నిర్ణయించ లేకపోయేవాడు. సంవత్సరం గడిచిపోయింది. భక్తుడు ఒకరోజు శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. భక్తుడు శివుడి పాదాలపై పడి "స్వామీ! నేను ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. ఏం కోరాలో నాకు అంతుబట్టడం లేదు. దయచేసి నేను ఏం కోరాలో మీరే చెప్పండి" అని భారాన్ని శివుడిపై వేశాడు.

దానికి శివుడు "నాయనా! నువ్వు కోరదగిన వరం ఒకటుంది. అది సాటిలేనిది. దానితో పోల్చదగింది మరొకటి లేదు. అది కోరుకుంటే నీకు అన్నీ నెరవేరినట్లే. అది వాంఛా రాహిత్యం. కోరికలు లేనితనం. ఆ కోరికలు లేనితనాన్ని నువ్వు కోరుకుంటే నీకు అన్నీ నెరవేరుతాయి. తక్కినవేమీ కోరినా దాని ముందు అన్నీ నిష్ప్రయోజనమే" అన్నాడు. భక్తుడు "స్వామీ! దయతలచి నాకు వాంఛా రాహిత్యాన్ని ప్రసాదించు" అన్నాడు.

## 73. ఉపేక్ష

జీవితంలో ఎన్నో సంభవిస్తూ ఉంటాయి. సకారణంగా జరుగుతాయి. నిష్కారణంగానూ జరుగుతాయి. ప్రతిక్రియలకు పాల్పడుతూ పోతే వాటికి అంతముండదు. సంఘర్షిస్తూ పోతే సంవేదన మిగుల్తుంది. **మనిషి జరుగుతున్న వాటిపట్ల నిర్లిప్తంగా ఉండాలి. నిర్మలంగా ఉండాలి. ఉపేక్షా భావంతో ఉండాలి జరుగుతున్న వాటిపట్ల ఆమోదం తెలపాలి.** మన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఎన్నో జరుగుతూ ఉంటాయి.వాటితో సంఘర్షించడం కన్నా వాటిని స్వీకరించడం మంచిది.

బొకుజు అన్న జెన్ గురువు ఉండేవాడు. ఆయన ఎంతో ప్రశాంతంగా, ఆనందంగా ఉండేవాడు. ఎప్పుడూ ఎవరితోనూ వాదోపవాదాలు చేసి ఎరగడు. తాను





చెప్పిందే సరయిందని ఎప్పుడూ అనేవాడు కాదు. తన పని ఏదో అది చేసుకుంటూ పోయేవాడు. ఇతరుల మెప్పుకోసం ఏ పనీ చేసేవాడు కాదు. నిజమైన సన్యాసి జీవితం గడిపేవాడు.

ఒకరోజు బొకుజు ఏదో పనిమీద వీథిలో వెళుతున్నాడు. హఠాత్తుగా ఒకవ్యక్తి కర్రతో ఆయనకు ఎదురుపడ్డాడు. బొకుజు ఆశ్చర్యపోయి నిలబడ్డాడు. "నువ్వు ఎవరు?" అని ఆ వ్యక్తి అడగబోయేంతలో ఆ వ్యక్తి బొకుజును ఆ కర్రతో కొట్టి కర్రను అక్కడే వదిలిపెట్టి పారిపోయాడు.

అనుకోని సంఘటనకు కొద్దిగా చలించినా బొకుజు వెంటనే తేరుకున్నాడు. ఆవ్యక్తి ఎవరో ఎందుకు కొట్టాడో బొకుజుకు అర్థం కాలేదు. చుట్టుపక్కల జనం వింతగా చూస్తున్నారు. వీళ్ళిద్దరి మధ్య ఏదో జరిగిందని, ప్రతీకారంగా ఆ వ్యక్తి ఈ సన్యాసిని కర్రతో కొట్టాడని అందరూ అనుకున్నారు. నిజానికి ఆ వ్యక్తి ఎవరో బొకుజుకి తెలీదు.

బొకుజు ఆ కర్రను తీసుకుని ఆ వ్యక్తి వెంటపడ్డాడు. జనమంతా కథ మంచి రంజులో ఉందని బొకుజు వెంట పరిగెత్తారు. బొకుజు ఎంత వేగంగా పరిగెడితే ఆ వ్యక్తి మరింత వేగంగా పరిగెత్తాడు. బొకుజు వెంట జనమూ పరిగెత్తారు. మొత్తానికి బొకుజు ఆ వ్యక్తిని పట్టుకున్నాడు. జనమంతా ఆతృతగా జరగబోయే సన్నివేశాన్ని ఊహించుకుంటున్నారు. బొకుజు ఆ వ్యక్తిని పట్టుకున్నాడు. ఆ వ్యక్తి ప్రాణభయంతో వణికిపోతున్నాడు. బొకుజు ప్రశాంతంగా ఆ వ్యక్తిని చూసి "నన్ను కొట్టావు. బాగానే ఉంది. కానీ నీ కర్రను వదిలిపెట్టావు. నువ్వు నీ కర్రను తీసుకెళ్ళు. నాకెందుకు?" అని ఆ కర్రను ఆ వ్యక్తికి ఇచ్చాడు. ఆ వ్యక్తి వింతగా చూస్తూ కర్ర తీసుకుని వెళ్ళిపోయాడు.

ఉత్సాహంగా వెంటపడిన జనం విస్తుపోయారు. ఏమీ జరగనందుకు నీరసించారు. వాళ్ళల్లో ఒక వ్యక్తి "నువ్వు వింత మనిషిలా ఉన్నావు. అతను నిన్ను కర్రతో కొడితే నువ్వు తిరిగి కొట్టకుండా కర్రను అతనికిచ్చి ఎందుకు పంపావు?" అన్నాడు. బొకుజు "అతను ఎందుకో కొట్టాడు. ఆ సంగతి నాకూ తెలియదు. మళ్లీ నేను అతన్ని తిరిగి ఎందుకు కొట్టాలి? ఒక చెట్టుకింద ఉంటే కొమ్మ విరిగి నా నెత్తిన పడిందనుకోండి. నేను చెట్టును ఏమైనా అన్నా లాభముంటుందా?" అన్నాడు. జనం "చెట్టువేరు, మనిషి వేరు. ఇప్పుడు నిన్ను కొట్టింది మనిషి. కానీ నువ్వు చెట్టును శిక్షించలేకపోవచ్చు. కానీ మనిషి నీ కళ్ళ ఎదుటే ఉన్నాడు. అతన్ని శిక్షించవచ్చు కదా!" అన్నారు.

దానికి బొకుజు "మీరు చెట్టుకు, మనిషికి తేడా చూస్తున్నారు. నా దృష్టిలో ఇతను కూడా చెట్టు కొమ్మలాంటివాడే. నేను చెట్టు కొమ్మకు ఏమీ చెప్పలేనివాణ్ణి.

అలాగే ఈ మనిషికి ఏమీ చెప్పలేను. జరిగిందేదో జరిగిపోయింది. జరిగిపోయినదాన్ని పట్టుకుని వ్రేలాడడం వల్ల ప్రయోజనం ఉండదు. అక్కడ తప్పు జరిగిందా? లేదా? అన్నదాన్ని గురించి నేను ఆలోచించను. దానివల్ల లాభం లేదు. దాని గురించి బాధపడి ప్రయోజనముండదు" అన్నాడు.

జనం చిత్రమయిన మనిషి అనుకుంటూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. నిజమైన సన్యాసి నిర్మలంగా ఉంటాడు. **ఇట్లా జరగాలి. ఇది తప్పు. ఇది ఒప్పు. అని అనుకోడు. జరిగేవాటి కన్నింటికీ సాక్షీభూతుడుగా ఉంటాడు.** అవి తనకు జరిగినా, ఇతరులకు జరిగినా ఉపేక్షాభావంతో ఉంటాడు. దానివల్ల అతనికి అన్నీ అవగత మవుతాయి. పక్షపాత దృష్టి ఉండదు. దేనివేపో మొగ్గు చూపడమంటూ ఉండదు.

## 74. పాపం చేయనివారు

ఒక ఊరి జనం ఒక స్త్రీని బంధించి జీసస్ దగ్గరకు తీసుకువచ్చారు. అందరూ ఆవేశంలో ఉన్నారు. ఆగ్రహంతో ఉన్నారు. వాళ్ళ దృష్టిలో ఆ స్త్రీ పాపం చేసింది. పాపం చేసిన స్త్రీకి కఠినదండన విధించాలి. పైగా తాను పాపం చేసినట్లు ఆ స్త్రీ అంగీకరించింది కూడా!

ఆ జనం జీసస్‌తో "ఈమె తాను తప్పు చేశానని ఒప్పుకుంది. యిప్పుడు మమ్మల్ని ఏం చెయ్యమంటారు? పాపం చేశానని ఈ స్త్రీ అంగీకరించింది. మన గ్రంథాల్లో పాపం చేసిన స్త్రీని రాళ్ళతో కొట్టి చంపాలని రాసి ఉంది కదా! కాబట్టి ఈ స్త్రీని రాళ్ళతో కొట్టి చంపమంటారా?" అనడిగారు.

జీసస్ ముందు ఈ సమస్య పెట్టి ఆయన్ని యిబ్బంది పాలు చెయ్యడానికి ప్రయత్నించారు. ఎందుకంటే ఆయన అహింసావాది. వ్యక్తిని రాళ్ళతో కొట్టి చంపడాన్ని ఆయన ఒప్పుకోడు. ఆయన తత్త్వం జనాలకు బాగా తెలుసు. జీసస్ మనుషులు పరస్పరం ప్రేమతో ఉండండి. ఒకర్నొకరు క్షమించుకోండి. ఎవరయినా ఒక చెంపమీద కొడితే యింకో చెంప చూపించండి. తమ బరువును మోస్తూ మైలు దూరం నడవమని ఎవరైనా కోరితే ఆ బరువును మోస్తూ రెండు మైళ్ళు నడవండి. ఎవరయినా మీ పైన ఉన్న కోటును లాక్కోవాలని చూస్తే లోపల ఉన్న చొక్కాను కూడా యిచ్చేయండి అంటాడు. అట్లాంటి వ్యక్తి శాంతిని ప్రేమించే వ్యక్తి, త్యాగాన్ని బోధించే వ్యక్తి, ఆ స్త్రీ గురించి ఎట్లాంటి నిర్ణయం చేస్తాడా? అని అందరికీ ఆసక్తి కలిగింది.

ఆ స్త్రీని రాళ్ళతో కొట్టి చంపండి అనలేదు జీసస్. పోనీ ఆ స్త్రీని చంపకండి అని కూడా అనలేదు. అట్లా అంటే అప్పుడు జీసస్‌ని నిలదీయవచ్చు. మన పవిత్ర





గ్రంథాల్లో ఉన్న దానికి భిన్నంగా మీరు మాట్లాడుతున్నారని ఆయన తప్పు ఎత్తి చూపవచ్చు. జీసస్ వివేకంతో ఆ సమస్యను చూశాడు. సమస్యలన్నవి మనసు సృష్టి. అంచనాలు చేసేది నిర్ణయాలకు వచ్చేది. మంచి చెడ్డల్ని విభజించేది మనసే. మనసు లేకపోతే సమస్యలుండవు. మాయమవుతాయి. సమస్య అంటే విషయాల్ని విడగొట్టడం పరస్పర విరుద్ధ ప్రకటనలు చెయ్యడం. దేన్నో ఒకదాన్ని ఎన్నుకోవడం. దానిపట్ల మొగ్గుచూపడం. జీసస్ వాటిని దాటి సమస్యని చూశాడు.

ఆయన "మీరు చెప్పినది కరక్టే. పవిత్ర గ్రంథాల్లో పాపం చేసినవాళ్ళని రాళ్ళతో కొట్టి చంపాలని రాసి ఉంది. నిజమే. మీరువెళ్ళి రాళ్ళు తీసుకుని రండి. ఈ స్త్రీని తప్పు చేసిన ఈమెను రాళ్ళతో కొట్టి చంపండి. కానీ పవిత్రగ్రంథాల్లో ఒక నిబంధన కూడా ఉంది. అది ఏమిటంటే తమ చర్యల్లో ఏ పాపమూ చెయ్యనివాడు. తన ఆలోచనల్లో కూడా ఎట్లాంటి పాపమూ చెయ్యనివాడు మాత్రమే రాళ్ళతో కొట్టి చంపడానికి అర్హుడు. ఈ మాటల్ని శ్రద్ధగా విని నిర్ణయానికి రండి" అన్నాడు.

అప్పటిదాకా ఆవేశంతో ఊగిపోతున్న జనం చల్లబడ్డారు. ఆలోచనల్లో పడ్డారు. మెల్లమెల్లగా ఒక్కొక్కరే అక్కడి నుంచి జారుకోవడం మొదలుపెట్టారు. ఎందుకంటే తమ పనుల ద్వారానో, లేదా తమ ఆలోచనల ద్వారానో తప్పు చేయనివారు, పాపం చెయ్యనివారు ప్రపంచంలో ఎవరూ ఉండరు. అట్లాంటప్పుడు యితరులని శిక్షించే అర్హత వారికి ఎక్కడ ఉంటుంది? భౌతికంగా లేదా మానసికంగా ఎట్లాంటి కల్మష పూరితమయిన చర్య ఐనా పాపమే?

ఎవరూ ఆ స్త్రీ పైన రాయి వేయడానికి సాహసించలేరు. అట్లాంటి పనిచేస్తే తన స్వచ్ఛతని నిరూపించుకోవాల్సి ఉంటుంది. మెల్లమెల్లగా ఒక్కొక్కరే మాయమైపోయారు.

జీసస్, ఆ స్త్రీ ఇద్దరే మిగిలారు. ఆ స్త్రీ "అయ్యా! నేను పాపం చేశానని ఒప్పుకుంటున్నాను. దయచేసి నన్ను శిక్షించండి" అంది.

జీసస్ "నువ్వు పాపంచేశానని ఒప్పుకున్నా శిక్షించడానికి నేనేవర్ని? నిర్ణయించ డానికి నేనేవర్ని? ఆ పాపం అన్నది. ఆ చర్య అన్నది నీకు దేవుడికి మధ్య జరిగింది. నిన్ను శిక్షించినా, వదిలిపెట్టినా ఆ పని చెయ్యాల్సిన వాడు దేవుడు" అన్నాడు.

## 75. పైకి ఎగిరిన రాయి

మనిషి తన జీవితాన్ని పరిశీలించాలి. జీవితాన్ని పరిశీలిస్తే మనం ఏమీ చెయ్యలేమని తెలిసి వస్తుంది. ప్రతి విషయం మీద మన ప్రయత్నంవల్ల కాక దానంతట అదే జరుగుతుందన్న విషయం తెలుసుకుని ఆశ్చర్యపోతాం. ఎవరికి వారు

ఆలోచించుకోండి. మీరు ఈ భూమిలో పుట్టాలనుకున్నారా? మీ ఉద్దేశంతో, యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే భూమిలోకి వచ్చారు.

ఓ చోట రాళ్ళని గుంపుగా పోశారు. దగ్గరలో ఏదో ఇల్లు కడుతున్నారు. యింటి పనికోసం వాటిని కుప్పగా పోశారు. ఒక కుర్రాడు ఆ దారంటే వెళుతూ అక్కడ కుప్పగా పోసిన రాళ్ళను చూశాడు. పసివాళ్ళు పసివాళ్ళేకదా! వాళ్ళకి దేన్ని చూసినా ఆడుకోవాలని అనిపిస్తుంది. ఆ కుర్రాడికి ఆ రాళ్ళను చూస్తూనే ఉత్సాహం కలిగింది. పసివాళ్ళు రాళ్ళు చేతికందుతూనే ఆకాశంలోకి విసురుతారు. తమ శక్తి రాయిని ఎంత పైకి విసరగలదో పరీక్షించుకోవడమది. ఆ కుర్రాడు అదే పని చేశాడు. ఒక రాయిని తీసుకుని బలంగా ఆకాశంలోకి విసిరి తన దారంటే తాను వెళ్ళిపోయాడు. ఆ రాయి ఎంత పైకి ఎగిరింది? ఎప్పుడు కిందికి వస్తుంది? అవేవీ పట్టించుకోలేదు.

ఆ కుర్రాడు బలంగా విసరడంవల్ల రాయి ఆకాశంపైకి వెళుతూనే ఉంది. రాళ్ళు ఆకాశంలోకెళ్ళడాన్ని ఊహించలేవు. భూమ్యాకర్షణవల్ల కిందకు రావడమే కానీ పైకి వెళ్ళడమన్నది వాటి అనుభవంలో లేదు. అట్లాంటిది రాయి ఆకాశంలోకి కెళుతూ ఉంది. దానికి అదంతా కలలాగా ఉంది. ఎక్కడో చలనం లేకుండా పడి ఉండే తను ఇంత ఎత్తు ఎగరడమేమిటి? ఆకాశంలోకి దూసుకుపోవడమేమిటి? దాని ఊహకే అందని విషయమిది.

ఆ రోజు ఆకాశంలోకి దూసుకుపోతూ కిందకు చూసింది. చలనం లేకుండా పడి ఉన్న రాళ్ళను చూసింది. “ఎందుకలా పడి ఉన్నారు? పైకి ఎగరండి. యిక్కడ మేఘాలు ఎంత మనోహరంగా ఉన్నాయో, చంద్రుడు, నక్షత్రాలు నాకు దగ్గరగా ఉన్నాయి. ఆకాశం ఎంత నీలంగా ఉందో! రండి” అని అరచింది.

కింద ఉన్న రాళ్ళు కదలడానికి ప్రయత్నించాయి. కదలిక ఏ మాత్రం కలగలేదు. నిస్సహాయంగా, రోదించాయి. ఆకాశంలో ఎగిరిన ఆ రాయి అదృష్టాన్ని తలచుకుని ఆశ్చర్యపోయి పూర్వజన్మలో అది అదృష్టం చేసుకుని ఉంటుంది. అందుకనే ఆకాశంలో పక్షిలా అది ఎగరగలిగింది అనుకున్నాయి. మొదట ఈర్ష్య పడ్డాయి. తరువాత నువ్వు మాలో ఒకడివే. మేము ఎగరలేకపోతే ఏం? మాలో ఒకడు మాకు సంబంధించిన ఒకడు అనంతవిశ్వంలోకి దూసుకుపోతున్నాడు. అంతకన్నా మాకింకేం కావాలి? నిన్ను తలచుకుని మేము గర్విస్తున్నాం” అన్నాయి.

భూమ్యాకర్షణ అన్నది ఉన్నది కదా! అంతపైకి ఎగిరిన రాయి వేగం తగ్గిపోయింది. అక్కడనుంచి రావడం ప్రారంభించింది. “ఇంతవరకూ పైకి దూసుకుపోతున్నాను. ఏమైంది నాకు? ఎందుకు ఎవరో లాగుతున్నట్లు కిందకు పడిపోతున్నాను”





అనుకుంది. కాని అది కిందకు వస్తుంది. కిందకు రాక తప్పదు కదా! కిందకు వస్తున్నప్పుడు దానికి అనుగుణంగా దాని ఆలోచనలు కూడా మారిపోయాయి. ఈ రోజుకు ఈ మాత్రం ఎగరడం వల్లే మళ్ళీ ఎప్పుడయినా ఇంకా పైకెళ్తాను. ప్రస్తుతానికి ఈ అనుభవం చాలు. ఆలోచనల్ని మరింత అనుకూలంగా మలుచుకుంది. ‘నేను ఆకాశంలోకి వచ్చి చాలాకాలమయింది. నాకు ఇంటిమీద మనసు మళ్ళింది. పైగా, బాగా అలసిపోయాను. ఇప్పుడు నాకు విశ్రాంతి అవసరం. నా వాళ్ళు, నా భూమి గుర్తుకొస్తున్నాయి. ఎంతో బెంగగా ఉంది. వాటిని చూడందే నాకు ఏమీ తోచడం లేదు. పైగా నేను వాళ్ళ దగ్గరికి వెళ్ళి నేను చూసిన ఆకాశం, చంద్రుడు, నక్షత్రాల గురించి చెప్పాలి. అసలు యిట్లాంటి అనుభవం పంచుకోవడంలో ఆనందం ఉంది అని “రాతికుప్పకు దగ్గరగా వచ్చి వాటితో” నేను వచ్చేస్తాను. యిక నా గురించి బెంగవద్దు. యింకెప్పుడూ మిమ్మల్ని వదిలివెళ్ళను. మీతోనే ఉంటాను. ఆకాశం ఎంత అద్భుతమైనదయినా భూమితో పోల్చలేం. నాకు ఇక్కడ మీతో ఉండడంలోనే ఆనందముంది!” అంది.

## 76. కృతజ్ఞత

**ఏదయినా ఎవరితోనైనా పంచుకోవడంలోనే ఆనందం ఉంది.** ఆ పంచుకోవడం వెనక స్వార్థం పొంచి ఉంటే అది పంచుకోవడం కిందకు రాదు. అది వంచన కిందకు వస్తుంది. అది పరవంచన, ఆత్మవంచన అవుతుంది. స్వార్థమున్న మనిషికి పంచుకోవడమన్న దానికి ఎప్పుడూ అర్థం తెలీదు. అతను దానధర్మాలు చేయవచ్చు. కాని దాని వెనక ఏదో ప్రయోజనం దాగి ఉంటే అది దాని అసలు గుణాన్ని కోల్పోతుంది. అది దానధర్మాలకు సంబంధించి మాత్రమే కాదు. అది భార్యకు ఇచ్చే వస్తువు కావచ్చు. బిడ్డలకు యిచ్చేది కావచ్చు. దాని వెనక ప్రతిఫలాన్ని ఆశిస్తే అది యివ్వడం కిందకు రాదు. అది దానం కిందకు రాదు. పంచుకోవడం కిందకు రాదు.

డోజో జెన్ గురువు. ఆయన ఆశ్రమ అధిపతి. అక్కడ ఎందరో విద్యార్థులు ఉండేవాళ్ళు. సాధారణంగా ఎందరో ఆశ్రమానికి చేతనయినంత సాయం చేసేవాళ్ళు. తను కూడా ఆశ్రమానికి సాయపడి గొప్పవాణ్ణి అనిపించుకోవాలని ఒక ధనికుడికి కోరిక పుట్టింది. ఆశ్రమానికి పదిలక్షల రూపాయలు విరాళం ప్రకటించాడు. ఆ విషయాన్ని అందరికీ తెలిసేలా చాటింపు వేయించాడు. ఫలానారోజు ఆ ధనం అందజేయబడుతుందని, ఆ సందర్భంలో గొప్ప ఉత్సవం నిర్వహింపబడుతుందని జనాలకు తెలిపాడు. ఆ విషయం తెలిసి డోజో ఎంతో ఇబ్బందికి లోనయ్యాడు. అతన్ని ఆశ్రమానికి సాయం చెయ్యమని కోరలేదు. అతనే యిస్తానన్నాడు. ఆ యిచ్చేది ప్రశాంతంగా యిచ్చి వెళితే

సరిపోయేది. దానికోసం యింత ప్రచారం ఎందుకు చేస్తున్నాడితను అనుకున్నాడు. జనమంతా "యితను ఎంతో గొప్ప వ్యక్తి. పదిలక్షలు విరాళమంటే సామాన్య విషయం కాదు. ఎంతో గొప్ప దాతృత్వగుణం ఉన్నవాళ్ళు కానీ అంత మొత్తంలో దానం చెయ్యలేరు" అని ఆశ్చర్యపోయారు. ఆ ధనవంతుడు నిర్ణయించిన తేదీ వచ్చింది. ఆ రోజు ధనవంతుని సేవకులు వచ్చి ఆశ్రమం ముందు పందిరి వేశారు. దానికోసం డోజో అనుమతి కూడా తీసుకోలేదు.

ధనవంతుడు మేళతాళాల్తో బయల్దేరాడు. జనం ప్రవాహంలా అనుసరించారు. ధనవంతుడు పందిరి కిందకు చేరుకున్నాడు. ఈ ఆర్భాటం చూసి డోజోకు అసహ్యం వేసింది. ధనవంతుడు డోజోని పిలిచాడు. డోజో పందిరి కిందకు వచ్చాడు. అందరి సమక్షంలో ధనవంతుడు పదిలక్షల్ని డోజోకి అందజేశాడు. డోజో ఏమీ పట్టనట్లు, అది పెద్ద విషయం కాదన్నట్లు ఆ డబ్బును తీసుకున్నాడు.

ధనవంతుడు "ఇవి పదిలక్షలండీ!" అన్నాడు.

డోజో "నాకు చెవుడు లేదు. వినిపిస్తుంది" అన్నాడు.

ఆ ధనవంతుడు "డోజో కనీసం తనకు కృతజ్ఞతలు చెబితే చాలనుకున్నాడు. మీరు మా ఆశ్రమానికి యింత సాయం చేస్తున్నందుకు ధన్యవాదాలు" అన్న మాటల్ని మాత్రమే ఆశించాడు. కానీ ఒక్కమాట కూడా మాట్లాడకుండా డోజో నిర్లక్ష్యంగా తీసుకున్నాడు. ధనవంతుడు "అయ్యా! యివి పదిలక్షలు. అవి ధనవంతుడయిన నా దృష్టిలో కూడా ఎక్కువ మొత్తమే" అన్నాడు.

డోజో అతన్ని చూసి కావచ్చు. "ఇంతకూ మీరు ఏమి ఆశిస్తున్నారు? మీరు చేసిన సహాయానికి కృతజ్ఞత ప్రకటించాలని కోరుకుంటున్నారా" అన్నాడు. ధనవంతుడు "ఆ మాత్రం కృతజ్ఞతని ఆశించే అర్హత నాకు లేదంటారా?" అన్నాడు.

ఆ మాటలకి వెంటనే డోజో ఆ డబ్బును ఆ ధనవంతునికి తిరిగి యిచ్చి దయచేసి మీ డబ్బుల్ని మీరు తీసుకెళ్ళండి. మీరు ఆశ్రమానికి సాయపడాలను కుంటున్నారా? లేక మీ ఔదార్యాన్ని లోకమంతా చాటింపు వేయాలనుకుంటున్నారా? నిజానికి మీరు యిచ్చింది తీసుకుంటున్నందుకు మీరు కృతజ్ఞత ప్రకటించాలి" అన్నాడు.

ఆ మాటలతో ధనవంతుడు నోరు వెళ్ళబెట్టాడు. అంతమంది జనం ముందు అతని అహంకారం దెబ్బతిన్నది. ఏమీ మాట్లాడకుండా తలవంచుకుని నిష్క్రమించాడు. అప్పటినుంచి ఆ ఆశ్రమద్వారంలో యిలా రాశారు. "ఎవరు దానం చేస్తారో అతనే కృతజ్ఞత ప్రకటించాలి".





**కాబట్టి దానం చేసే వ్యక్తి అహంకారంతో కాదు వినయంతో దానం చెయ్యాలి.**

## 77. అర్హత

స్వీకరించే గుణం ఉన్న వాళ్ళు కొద్దిమందే ఉంటారు. వాళ్ళు ప్రతిఘటించరు. సానుకూల, వ్యతిరేక వ్యాఖ్యలు చెయ్యరు. ఆమోదం వాళ్ళ అణువణువులో ఉంటుంది. జీవనరహస్యం ఆమోదం. దేన్నయినా స్వీకరించే, ఆమోదించే లక్షణముంటే అది ప్రశాంత జీవనానికి మార్గమవుతుంది. అక్కడ అహంకార లక్షణముండదు. అక్కడ కాంక్ష అన్నది ముందుకు రాదు.

అది ఒక మనోహరమయిన సాయంకాలం. సూర్యుడు చల్లబడి పర్వతాలు వెనక్కి వెళ్తున్నాడు. పసుపు పచ్చని కాంతులు ప్రపంచమంతా వ్యాపించాయి. కిరణాల కాంతిలో గలగలా ఆకులు కదిలించే చెట్లన్నీ వింత శోభని సంతరించుకున్నాయి. ఆ అందమయిన సాయంత్రం ఆ గ్రామానికి బుద్ధుడు వచ్చాడు. బుద్ధుడు ఆ గ్రామానికి వచ్చాడన్న వార్త వ్యాపించింది. ఒక రచ్చబండపై బుద్ధుడు కూచున్నాడు. ఊరి జనమంతా అక్కడికి చేరారు. ఆ ప్రసన్నమూర్తి వాక్కుల కోసం ఎదురు చూశారు.

కానీ బుద్ధుడు ఏమీ మాట్లాడలేదు. మౌనంగా కూచున్నాడు. అరగంట గడిచింది. గంట గడిచింది. జనమంతా విచిత్రంగా చూశారు. యింతమంది గుమిగూడాం. యింతమందిని ఉద్దేశించి ఏమయినా చెప్పవచ్చు కదా! ఎందుకీయన ఏమీ మాట్లడకుండా కూచున్నాడు? అనుకున్నారు.

అంతలో గుంపునుంచి ఒక వ్యక్తి "స్వామీ! వూళ్ళో వాళ్ళందరం వచ్చేశాం. మీ పవిత్ర వాక్కుల కోసం ఎదురుచూస్తున్నాం. అయినా మీరు ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉన్నారు. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లు ఇటూ అటూ చూస్తున్నారు. ఎవరూ రావాల్సిన వాళ్ళు లేరు. అందరూ వచ్చేశారు. మీరు ప్రారంభించవచ్చు" అన్నారు.

బుద్ధుడు ఎవరి కోసమో వెతుకుతున్నాడు. ఆ వ్యక్తి మాటలకు 'నేను ఈ ఊరికి ఒక వ్యక్తి కోసం వచ్చాను. ఆ వ్యక్తి ఇంకా రాలేదు. ఆ వ్యక్తి వచ్చాక చెబుతాను. పైగా నేను చెప్పేది మీరు గ్రహించలేరు. ఆ వ్యక్తి మాత్రమే గ్రహించే వీలు ఉన్నది" అన్నాడు.

అందరూ ఆశ్చర్యపోయారు. ఎందుకంటే ఊరు ఊరంతా అక్కడికి తరలి వచ్చింది. ఊళ్ళోని అధికారులు, సంపన్నులు, విద్యావంతులు అందరూ అక్కడికి వచ్చారు. యింతమందిని కాదని బుద్ధుడు ఎవరికోసమో ఎదురుచూడడం అందరికీ విచిత్రమని పించింది.

అంతలో ఒక స్త్రీ అక్కడకు వచ్చింది. ఆమె చాలా పేదది. ఆమెను ఎవరూ లక్ష్య పెట్టరు. అంత నిరుపేద స్త్రీకి బుద్ధుడు ఎంతో ప్రత్యేకత నిచ్చాడు. ఆమెను చూస్తూనే బుద్ధుడు "నేను అనుకున్న వ్యక్తి వచ్చింది. ఇప్పుడు ఉపదేశం ఆరంభిస్తాను" అన్నాడు.

ఊరిజనమంతా ఆశ్చర్యపోయారు. "మీరు యింతసేపూ ఎదురుచూసింది ఈమె కోసమా? ఈమె ఊళ్ళో ఉందన్న సంగతి కూడా ఎవరూ పట్టించుకోలేదు" అన్నారు.

బుద్ధుడు 'ఈ గ్రామంలో ఉన్నవాళ్ళల్లో నేను చెప్పేది విని అర్థం చేసుకునే అర్హత ఈ స్త్రీ ఒక్కదానికే ఉంది. నేను ఈమె కోసమే ఎంతో దూరం నించి వచ్చాను. ఈమె ఏమీ చదువుకోలేదు. శాస్త్రజ్ఞానం లేదు. ధనవంతురాలు కాదు. నిరుపేద. పైగా తక్కువ కులానికి చెందింది.

అందువల్ల ఆమెను ఎవరూ లెక్కపెట్టరు. ఆ కారణంగా ఆమె గురించి ఎవరికీ తెలియదు. కానీ ఎవరికీ తెలియని సంగతి ఒకటి ఉంది. అదేమిటంటే "దేన్నయినా తెలుసుకోవాలన్న ఆసక్తి, శ్రద్ధ ఈమెకుంది. ఆమె నాకోసం ఎప్పటినించో ఎదురు చూస్తోంది. ప్రార్థిస్తోంది. నా బోధనలు వినాలని తపిస్తోంది. సత్యాన్ని తెలుసుకోవాలన్న ఆకాంక్ష ఆమెలో ఉంది. ఎక్కడో దూరంగా వెళుతున్న నాకు ఆమె అభ్యర్థన అందింది. ఆమె కోసమే వచ్చాను. అర్హత అన్నది ఆత్మసమర్పణలో ఉంది. ఆ లక్షణం ఆమెలో ఉంది" అని తన బోధనలు ప్రారంభించాడు.

అందరూ ఆ నిరుపేద స్త్రీవేపు ఆసక్తిగా చూశారు. ఆమె యివేవీ పట్టనట్లు ముకుళితహస్తాలతో బుద్ధభగవానుని ముందు మోకరిల్లింది.

## 78. జ్ఞాపకశక్తి

ప్రపంచాన్ని జయించాలనుకున్న అలెగ్జాండర్ దండయాత్రకు బయల్దేరే ముందు కొంతమంది గ్రీకు వేదాంతులు భారతదేశం గురించి కొన్ని విషయాలు చెప్పారు. భారతదేశంలో అతి పవిత్రమయిన వేదాలని, వాటిల్లో విశ్వాసానికి సంబంధించి ఎన్నో రహస్యాలుంటాయని, భారతదేశం నుంచి వచ్చేటప్పుడు తప్పకుండా వాటిని తీసుకు రావాలని కోరారు. అలెగ్జాండర్ తప్పకుండా వాళ్ళ కోరిక తీరుస్తానన్నాడు.

అలెగ్జాండర్ భారతదేశం మీదకు దండెత్తి వచ్చినప్పుడు భారతదేశంలో వేదాధ్యయనం గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయాడు. ఎన్నో విషయాల్ని మననం చేస్తూ, మరెన్నో విషయాలు గుర్తుపెట్టుకునే భారతదేశంలోని బ్రాహ్మణుల్ని చూసి దిగ్భ్రమ చెందాడు. సాటిలేని వాళ్ళ జ్ఞాపకశక్తికి నిశ్చేష్టుడయ్యాడు. భారతదేశ దండయాత్ర





పూర్తయింది. వెనుదిరిగాడు. భారతదేశ సరిహద్దులు దాటి వెళుతున్నాడు. అప్పుడు గ్రీకు వేదాంతులు చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది. వెంటనే పంజాబులో ఒక గ్రామానికి వెళ్ళి ఊళ్ళో వేదాలు ఎవరి దగ్గరయినా వున్నాయా?" అని అడిగాడు.

దానికి గ్రామస్థులు "ఈ ఊళ్ళో ఒక బ్రాహ్మణ కుటుంబం ఉంది. వాళ్ళ దగ్గర పవిత్రమైన వేదాలున్నాయి. కానీ ఆ వేదాల్ని వాళ్ళు యితరులెవ్వరికీ ఇవ్వరు. అది జరిగే పని కాదు" అన్నారు.

అలెగ్జాండర్‌కి ఆ మాటల్తో ఆగ్రహం వచ్చింది. "నేను విశ్వవిజేతను. నాకెందుకు యివ్వరు" అన్నాడు. గ్రామస్థులు "మీరు విశ్వవిజేత అయితే కావచ్చు. కానీ, ఆ వేదాలు మీ చేతికందవు" అన్నారు.

వాళ్ళు అంత నమ్మకంతో చెబుతున్నందుకు ఒకవేపు ఆశ్చర్యం కలిగినా అభిమతంతో "వాళ్ళు ఎలా యివ్వరో చూస్తాను. ఎలా తీసుకుపోవాలో నాకు తెలుసు. మంచి మాటలతో యివ్వకపోతే దౌర్జన్యంతోనైనా తీసుకుపోవడం నాకు తెలుసు. అప్పటికీ అంగీకరించకుంటే వాళ్ళను చంపి అయినా తీసుకుపోతాను" అన్నాడు.

అలెగ్జాండర్ సైన్యం ఆ బ్రాహ్మణుడి ఇంటిని చుట్టుముట్టింది. అలెగ్జాండర్ ఆ ఇంట్లోకి వెళ్ళి "ఆ ఇంటి యజమాని ఎవరు?" అని అడిగాడు. ఒక వృద్ధుడు "నేనే" అన్నాడు.

అలెగ్జాండర్ "నేను విశ్వవిజేతను. నాకు నాలుగు వేదాలు మీ దగ్గర ఉన్నట్లు తెలిసింది. అవి నాకు కావాలి. మీకు దానికి తగిన బహుమతి యిస్తాను. ఇవ్వనంటే నేను దౌర్జన్యంగా తీసుకుపోక తప్పదు" అన్నాడు.

దానికి ఆ వృద్ధుడు "మీరు అంత ఆగ్రహించాల్సిన పన్లేదు. తప్పక యిస్తాను. కానీ "ఈ రోజు ఇవ్వను. రేపు యిస్తాను. ఈ రోజు ఒక యజ్ఞం చెయ్యాల్సి ఉంది. అది పూర్తయ్యాక యిస్తాను. పైగా మీ సైన్యం మా ఇంటిని చుట్టుముట్టి ఉంది కదా! మీరు సందేహించాల్సిన పని లేదు" అన్నాడు.

అలెగ్జాండర్ "సరే"నన్నాడు. రాత్రంతా సైన్యం బ్రాహ్మణుడి ఇంటిని చుట్టిముట్టే ఉంది. తెల్లారింది. అలెగ్జాండర్ వచ్చాడు. బ్రాహ్మణుడి యింటిలో వేదఘోష వినిపిస్తోంది. హోమం జరుగుతోంది. బ్రాహ్మణుడు వేదాల తాళపత్ర గ్రంథాల నుంచి చివరి తాళపత్రాన్ని మంత్రాలు చదువుతూ హోమగుండంలో వెయ్యడం చూసి అలెగ్జాండర్ హతాశుడయ్యాడు.

"ఏం చేస్తున్నావు? వేదాలను అగ్నికి ఆహుతి చేస్తున్నావా?" అన్నాడు. దానికి ఆ బ్రాహ్మణుడు "యివి పవిత్రమయిన వేదాలు. యివి ఉంచాల్సింది మనసులో. ఈ

వేదాలు అగ్నికి ఆహుతి అయ్యాయని, మీరు ఆందోళన చెందాల్సిన అవసరం లేదు. ఇక్కడ ఉన్న నా నలుగురు కొడుకుల్ని చూడండి.  వీళ్ళు రాత్రంతా నేను చదివిన వేదాల్ని విన్నారు. అక్షరం పొల్లుపోకుండా అన్నీ మీకు అప్పజెబుతారు. కావాలంటే మీరు పరీక్షించుకోవచ్చు" అన్నాడు ధీమాగా.

అలెగ్జాండర్ వాళ్ళని పరీక్షించి దిగ్భ్రమ చెందాడు. వాళ్ళ జ్ఞాపకశక్తికి జోహార్లన్నాడు. గ్రీసు దేశానికి చెందిన వేదాంతులు భారతీయ బ్రాహ్మణులంత అపార జ్ఞానసంపన్నులు, జ్ఞాపక సంపన్నులు కారని తీర్మానించుకున్నాడు.

దీన్నించీ తెలుసుకోవలసింది **"విలువైన దాన్ని ఎలా గుర్తు పెట్టుకోవాలి. అనవసరమయిన దానిని ఎలా వదిలిపెట్టాలి"** అన్న సంగతి.

## 79. ఖాళీ కప్పు

మనిషి మొదట వినడం నేర్చుకోవాలి. వినడానికి సిద్ధపడి ఉండాలి. వినడానికి సిద్ధపడి ఉండాలంటే మనసు స్వచ్ఛంగా ఉండాలి. అంతులేని ఆలోచనల్తో నిండి ఉంటే అవన్నీ మనల్ని విననియ్యవు. అవే ముందుకు వస్తాయి. దాంతో  వినడమన్నది ఉండదు. నిజానికి గురువులందరూ విద్యార్థులకు చెప్పాల్సిన విషయం వినడం గురించి మొదట మనిషి వినడం గురించి తెలుసుకుంటే తక్కినవన్నీ తెలిసివస్తాయి. **వినడమన్నది గొప్ప కళ**. అది తెలిసినవాళ్ళు అతి తక్కువమంది ఉంటారు.

నాన్సేన్ అని గొప్ప గురువు ఉండేవాడు. ఆయన నగరానికి దూరంగా ఒక పర్వతప్రదేశం మీద ఆశ్రమం నిర్మించుకుని ప్రశాంతజీవితం గడిపేవాడు. ఆయన తన వివేకంతో ఎందరినో ఆకర్షించాడు. ఆయన కీర్తి దూర ప్రాంతాలకు వ్యాపించింది. ఆయన్ని సందర్శించడానికి, సందేహాల్ని నివృత్తి చేసుకోవడానికి దూరదేశాల నుండి ఎందరో వచ్చేవారు. ఆయన దగ్గర విద్యను అభ్యసించడానికి ఎందరో శిష్యులుగా చేరేవాళ్ళు. ఆయన మాటలు మణుల్లా మెరిసేవి. అజ్ఞాన తిమిరాన్ని పారదోలేవి.

నాన్సేన్ నివసించే ప్రాంతంలో నిశ్శబ్దం రాజ్యమేలేది. మానవ సంచారం లేని ఆ మనోహర ప్రశాంతతలోకి అడుగుపెట్టిన వాళ్ళు ఎంతో ఉల్లాసాన్ని అనుభూతి పొందేవాళ్ళు. జీవిత సమస్యలతో సతమతమయ్యే జనం అక్కడికి వస్తూనే భారం దిగినట్లు తేలిక పడేవాళ్ళు.  టోక్యో నగర విశ్వవిద్యాలయంలో ఒక ఆచార్యుడు పనిచేసేవాడు. నిత్యం విద్యార్థులతో, అధికారులతో, ఇతర విషయాలతో అవిశ్రాంతంగా ఉండేవాడు. ఆయన గొప్పగా చదువుకున్నాడు. ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాల్ని ఆపోసన పట్టాడు.  కానీ అతనికి ఇంకా ఇంకా తెలుసుకోవాలన్న ఆరాటముండేది. అతను నాన్సేన్ గురించి





విన్నాడు. నాన్సేన్‌ను కలిసి ఆయన దగ్గర నుంచి ఏమైనా తెలుసుకోవాలని బయల్దేరాడు. దూరప్రయాణం చేసి ఆచార్యుడు నాన్సేన్ ఆశ్రమానికి చేరాడు. నాన్సేన్ అతన్ని ఆహ్వానించి కూచోమన్నాడు. అంతే అలసటలోనూ ఆచార్యుడు "నాకు సత్యం గురించి మీ దగ్గర తెలుసుకోవాలన్న జ్ఞానకాంక్షతో వచ్చాను" అన్నాడు. ఆచార్యుడు ఆగకుండా ఏవో చెబుతూనే ఉన్నాడు. నాన్సేన్ అతన్ని పరిశీలించాడు. "మీరు దూరప్రయాణం చేసి వచ్చారు. మొదట విశ్రాంతి తీసుకోండి. తరువాత మనం తాపీగా సత్యం గురించి చర్చించుకుందాం" అన్నాడు.

ఆచార్యుడు మాట్లాడుతూనే లేచి తప్పనిసరయినట్లు స్నానాదికాలు ముగించాడు. ఫలహారం చేశాడు. చేస్తూ కూడా మాట్లాడుతూ వచ్చాడు. గంట గడిచింది. ఆచార్యుడు అనర్గళంగా తన అనుభవాల్ని, తన జ్ఞానాన్ని ప్రదర్శిస్తూనే ఉన్నాడు. ఎదుటి మనిషి వింటున్నాడా? లేదా? అన్నదానితో పట్టింపే లేకుండా కొనసాగిస్తూనే ఉన్నాడు.

నాన్సేన్ "నేనువెళ్ళి ఇప్పుడే టీ తీసుకువస్తాను. టీ తాగుతూ మనం మాట్లాడుకుందాం" అన్నాడు. తప్పనిసరై ఆచార్యుడు తన మాటల్ని ఆపాడు.

నాన్సేన్ టీ పాత్రని పట్టుకొచ్చాడు. రెండు కప్పుల్ని కూడా పట్టుకొచ్చాడు. ఒకటి ఆచార్యుడికిచ్చాడు. ఒకటి తను తీసుకున్నాడు. అవి రెండూ ఖాళీ కప్పులు. మొదట తన కప్పులో టీ నింపాడు. టీ పాత్రని నాన్సేన్ తీసుకురావడం చూసినప్పటినుంచి ఆచార్యుడు మళ్ళీ మాట్లాడటం మొదలుపెట్టాడు.

"నేను నా తోటి ఆచార్యులతో, విద్యార్థులతో ఎప్పుడూ చెబుతూ ఉంటాను... అంతా నాకే తెలుసునని ఎప్పుడూ అనుకోకూడదు. అందుకే మీ దగ్గరికి వచ్చాను. అసలు సత్యమంటే..." మాటలు ప్రవాహంలా కొనసాగుతున్నాయి. ఇంతలో ఆచార్యుడు పట్టుకున్న ఖాళీ కప్పులో నాన్సేన్  టీ పోయడం ప్రారంభించాడు. కప్పు నిండిపోయినా పోస్తూనే ఉన్నాడు. కప్పు నిండి టీ వేళ్ళకు తగిలి చురుక్కుమని ఆచార్యుడు ఉలిక్కిపడి "కప్పు నిండిపోయినా మీరు పోస్తూనే ఉన్నారు" అన్నాడు. నాన్సేన్ "ఐతే కప్పు నిండిందని తెలుసుకున్నారు. కప్పు నిండితే తర్వాత పోసింది బయటకి ఒలికిపోతుంది. మొదట మనసును ఖాళీ చేసుకుని రండి. ఖాళీ కప్పులా మార్చుకురండి. అప్పుడు నేను చెప్పేది మీ మనస్సుకెక్కుతుంది" అన్నాడు. ఆచార్యుడి నోట మాటరాలేదు.

## 80. మాయ

మన ప్రాచీనులు 'యద్భావం తద్భవతి' అన్నారు. మనం మనసులో దేన్ని ఊహిస్తామో బయట కూడా అదే ఉందనుకుంటాం. మనుషుల్ని మాటల్లో మభ్యపెట్టవచ్చు.

నమ్మకాలతో మనల్ని మనం మోసగించుకోవచ్చు. ఒక రాయిని మనిషి చేతికి యిచ్చి అది నిప్పుకణిక అనండి. వెంటనే ఆ వ్యక్తి రాయిని విసిరేస్తాడు. నిజంగా తన చేయి కాలినట్లు అనుభూతి పొందుతాడు. అతని చేయి కాలినట్లు అతనికి అనిపిస్తుంది. అతని నమ్మకం, భయం మరీ బలీయమయినవయితే చేతిలో బొబ్బకూడా లేచి ఉంటుంది.

ఎందరో ఎన్నో సందర్భాల్లో, ఉత్సవాల్లో నిప్పుల్లో నడవడం చూసే ఉంటాం. వాళ్ళకేమీ కాదు. అక్కడ ఏమీ కాదని మనసు చెబుతుంది. మనసును శరీరం అనుసరిస్తుంది. గంగానది ఒడ్డున యిద్దరు మిత్రులు కూచుని ఉన్నారు. ఏవో కుటుంబ విషయాలు, ప్రాపంచిక విషయాలు, ఆధ్యాత్మిక విషయాలు చర్చించుకుంటున్నారు. కాలం సాగిపోతోంది. "సూర్యుడు ఎంతో అద్భుతంగా ఉన్నాడు. సాయంసంధ్య ఎంతో మనోహరంగా ఉంది" అన్నాడు.

రెండో మిత్రుడు ఎక్కడో చూస్తున్నాడు. మొదటి మిత్రుడి మాటల్ని వినడం లేదు. మొదటి మిత్రుడు "ఏమిటి? ఏమైంది, ఎక్కడ చూస్తున్నావు?" అన్నాడు.

రెండో మిత్రుడు "అక్కడ స్నానం చేస్తున్న స్త్రీని చూడు" అని దూరంగా కనిపించిన దృశ్యాన్ని చూపించాడు. కొద్దిగా దూరంలో గంగానదిలో ఒక అమ్మాయి స్నానం చేస్తుంది. ఆమె వీపు మాత్రం కనిపిస్తోంది. ఆమె శరీరం కూడా పసిమి రంగులో ఉంది. సాయం సంధ్యలో ఆ సౌందర్యవతి శరీరం అపురూపంగా ధగధగలాడుతోంది. ఆమె కురులు చిక్కని నల్లదనంలో భుజాలుమీదుగా పడుతూ మెరుస్తున్నాయి. ఆమె శరీరం, కురులు నీటి చుక్కల్ని రాలుస్తూ నిగనిగలాడుతున్నాయి. మొదటి మిత్రుడు "గంగానదిలో ఎందరో స్త్రీలు స్నానం చేస్తూ ఉంటారు. యిక్కడ ప్రత్యేకంగా పట్టించుకోవాల్సిన విషయమేముంది చెప్పు?" అన్నాడు కొంత విముఖత ప్రదర్శిస్తూ.

రెండో మిత్రుడు "ఏమీ అనుకోకు. నీ మాటల పైన మనసు పెట్టలేకపోతున్నాను. ఆ అపూర్వ సౌందర్యరాశి నన్ను కట్టిపడేసింది. ఆమెను సన్నిహితంగా సందర్శించనిదే నాకు మనశ్శాంతి ఉండదు. పదినిమిషాల్లో వస్తాను" అని లేచివెళ్ళాడు.

పదినిమిషాల తరువాత వస్తానన్న మిత్రుడు ఒక నిమిషానికే తిరిగి వచ్చేశాడు. మొదటి మిత్రుడు ఆశ్చర్యపోయాడు. రెండో మిత్రుని ముఖం నీరసంగా ఉంది. దేన్నో కోల్పోయినట్లు దిగాలుగా ఉన్నాడు. మొదటి మిత్రుడు "ఏమయింది? ఎందుకంత దిగులుగా ఉన్నావు?" అన్నాడు.

రెండో మిత్రుడు "అక్కడ స్నానం చేస్తున్నది సౌందర్యరాశి అని వెళ్ళి చూసాను. కానీ అక్కడ స్నానం చేస్తున్నది ఒక సన్యాసి. యవ్వనంలో ఉన్నాడు. వెనకనించి అతని శరీరం, కురులు అందాలరాశిలా నన్ను భ్రమింపజేశాయి. ఒక్కసారిగా ఆ అపురూప



స్వప్నసుందరిని సమీపించాలనుకున్నాను. అంతలో అంతా మాయగా అనిపించింది. ఆమె మాయమయి పోయింది. సన్యాసి దర్శనమైంది" అన్నాడు. మన భారతీయ తత్త్వవేత్తలు మాయ అన్నారు. జీవితాన్ని స్వప్నమన్నారు. పాశ్చాత్యులు దాన్ని పొరపాటుగా అర్థం చేసుకున్నారు. ప్రపంచం భ్రాంతి అన్న మాటని పాశ్చాత్యులు తప్పుగా భావించారు. మన తత్త్వవేత్తలు లోకాన్ని మిథ్య అనలేదు. మన మనసులో ఏ ప్రపంచాన్ని సృష్టించుకుంటున్నామో దాన్ని మిథ్య అన్నారు. అది మాయ అన్నారు. భ్రాంతి అన్నారు. ఎందుకంటే మనుషులు కనిపించిన దాన్ని కాక, మనసు చెప్పిందాన్ని, మనసు కల్పించిన మాయని అనుసరిస్తారు. తమ చుట్టూ ఒక ప్రపంచాన్ని అల్లుకుంటారు. సృష్టించుకుంటారు. అదే యథార్థమనుకుంటారు. దాంతో మనసులో ఏదనుకుంటామో కళ్ళకు అదే అడ్డం వస్తుంది. కళ్ళకు అది అడ్డం వస్తే వాస్తవాలు కనిపించవు. వూహలే మిగుల్తాయి. మనిషి వాస్తవాన్ని చూడాలంటే మనసు మాయ నించి బయటపడాలి. అప్పుడు మాటలుండవు. కల్పనలుండవు. యథార్థదర్శన మేర్పడుతుంది. యథార్థ దర్శనంవల్ల సత్యం తెలిసి వస్తుంది.

## 81. 'నువ్వు' లేనప్పుడు

ఒకప్పుడు చైనాలో ఒక ప్రాంతంలో ఒక ఆలయాన్ని నిర్మించాలనుకున్నారు. ఆ ప్రాంతపాలకుడు ఎంతో దైవభక్తి కలవాడు. తమ ప్రాంతంలో కట్టబోయే ఆలయం అపూర్వంగా ఉండాలని, దానికి సాటివచ్చేది ఎక్కడా ఉండకూడదని సంకల్పించాడు. తను నిర్మించే ఆలయం గొప్ప శిల్పసంపదతో నిండి ఉండాలని, అందర్నీ ఆశ్చర్యపరచాలని అనుకున్నాడు. అందుకని తన ప్రాంతంలోని శిల్పుల్ని, వాస్తుశాస్త్ర నిపుణుల్ని ఎందర్నో ఆహ్వానించాడు. అంతేకాక దేశవిదేశాలకు చెందిన ఎందర్నో పిలిపించాడు.

ప్రత్యేకించి ఆ ఆలయద్వారం దిగ్భ్రమ కలిగించేలా ఉండాలని ఆయన ఉద్దేశ్యం. అందుకని చిత్రకారులతో మొదట ఆ ఆలయనమూనాను చిత్రించమని పురమాయించాడు. అక్కడికి ప్రత్యేక ఆహ్వానితుడిగా ఆ దేశానికి చెందిన ప్రముఖ చిత్రకారుణ్ణి కూడా పిలిపించాడు. అందరూ ఏకాగ్రతగా ఆ పనిలో మునిగారు. ఆ చిత్రకారుడు కూడా తన నైపుణ్యప్రదర్శనలో లీనమయ్యాడు.

ఆ చిత్రకారుడికి ఒక అలవాటు ఉండేది. తను ఏ చిత్రం గీయదలచుకున్నా ఊహించదలచుకున్నా శిష్యుణ్ణి ప్రక్కనే కూచోబెట్టుకునేవాడు. తను చిత్రం పూర్తిచేశాకా శిష్యుడి వేపు తిరిగి "ఎలా ఉంది?" అని అడిగేవాడు. శిష్యుడు 'బాగుంది' అంటే ఆ

చిత్రాన్ని ఎంపిక చేసేవాడు. శిష్యుడది "బాగా లేదు" అంటే యింకో చిత్రం గీసేవాడు.ఆ విధంగా శిష్యుడి ఆమోదం పొందేదాకా ఆ పని కొనసాగుతూ ఉండేది.

పైగా యిప్పుడు నిర్వహిస్తున్నది గొప్ప బృహత్తర కార్యం. సాటిలేని ఆలయానికి అద్వితీయమైన ద్వారచిత్రణ తన భుజాలకెత్తుకున్నాడు. యిట్లాంటప్పుడు తన ప్రియ శిష్యుడి సహకారం తనకు మరింతగా అవసరమనిపించింది గురువుకు. శిష్యుడు పక్కనే కూచున్నాడు. గురువు నమూనా గీశాడు. శిష్యుడు పెదవి విరిచాడు. ఆయన ఇంకో నమూనా గీశాడు. శిష్యుడు బాగా లేదన్నాడు. గురువు అలసిపోకుండా గీస్తూనే ఉన్నాడు. శిష్యుడు తన గురువు చిత్రించిన వాటన్నింటినీ కాదంటూనే ఉన్నాడు.

యిట్లా ఒకటి రెండు రోజులు కాదు. నెలలు గడిచిపోయాయి. అప్పటిదాకా ఆ చిత్రకారుడు అంత శ్రమ ఎప్పుడూ పడలేదు. తన "సమస్త శక్తుల్ని కేంద్రీకరించి పనిచేస్తున్నాడు. శిష్యుడివేపు చూస్తున్నాడు. శిష్యుడు బాగా లేదంటున్నాడు. ఇది నిత్యనిరంతర క్రియగా సాగుతోంది.

ఆ దేశపాలకుడు కూడా ఆందోళన పడుతున్నాడు. నెలలు గడుస్తున్నాయి. ఈయన నమూనా ఎప్పుడు పూర్తవుతుంది? అది పూర్తికాందే నిర్మాణం ఆరంభం కాదు!

వాళ్ళు తయారుచేసుక్ను సిరా అయిపోవస్తుంది. కొత్తది తయారుచేయాలి. కేవలం కొద్దిగానే ఉంది. అందుకని గురువు శిష్యుణ్ణి చూసి 'నువ్వు వెళ్ళి కొత్త సిరా తయారుచేసుకురా' అని పురమాయించాడు. శిష్యుడు వెళ్ళాడు. గంటసేపు తరువాత కొత్త సిరాతో గురువు గదిలోకి వచ్చాడు.

అప్పటిదాకా మిగిలిన సిరాతో గురువు నమూనా రూపొందించాడు. అది చూసి శిష్యుడి కళ్ళు చెదిరిపోయాయి. ఆ నమూనా సంపూర్ణంగా, సమగ్రంగా ఆకట్టుకుంది.

'గురువుగారూ! నమూనా అంటే యిది.

యిప్పటిదాకా యిట్లా గీయకుండా ఎందుకు ఆలస్యం చేశారు" అన్నాడు. దానికి గురువు శిష్యుణ్ణి చూసి 'ఇప్పటిదాకా ఎందుకు దాన్ని గీయలేదో యిప్పుడే అర్థమయింది. అది గీస్తున్నంత సేపూ నా దృష్టి నీ మీదే ఉండేది. నీకు నచ్చుతుందో లేదో? నీ ఆమోదం పొందుతుందో లేదో అన్న ఆందోళనలో మునిగి ఉండేవాణ్ణి. చిత్రకారుడు ఉండేవాడు కాదు. నేను ఉండేవాణ్ణి. నీతోబాటూ నేనూ వచ్చాను. నువ్వు బయటకి కెళ్ళావు. నీతోబాటు నేను వచ్చాను. ఇప్పుడు చిత్రకారుడొక్కడే మిగిలిన చిత్రాన్ని పూర్తి చేశాడు" అన్నాడు.





**ఏదయినా సహజంగా సంభవించాలంటే అక్కడ 'నేను, నువ్వు' ఉండకూడదు.**

## 82. గతజన్మ

భౌతికమన్నది స్థలకాల పరిమిత. ఆధ్యాత్మికమన్నది స్థలకాల పరిమితు లుండవు. ఆ పరిమితులకు లోబడి దాని నిర్వచనముండదు. మనం జన్మిస్తాం. మరణిస్తాం. మళ్లీ జన్మిస్తాం. ఈ జన్మపరంపర శరీరానికి ఉంటుంది. అట్లా బుద్ధుని గతజన్మలు తెలిపే జాతక కథలు. అట్లాంటి ఒక గత జన్మలో బుద్ధుడు ఏనుగుగా పుట్టాడు. ఆ జన్మలో చేసిన మంచిపని వల్ల తాను బుద్ధుడుగా జన్మించినట్లు చెప్పుకున్నాడు. ఆయన గతజన్మల గాథలు ఆసక్తికరమయినవి. వాటిల్లో ఏనుగుకు సంబంధించింది ఒకటి.

ఒక అడవిలో ఒక ఏనుగు నివసించేంది. ఒకరోజు ఉన్నట్లుండి అడవి అంటుకున్నది. దావానలంలా వ్యాపించింది. మహావృక్షాలు కూడా మాడిపోతున్నాయి. కూలిపోతున్నాయి. అరణ్యమంతా తగలబడిపోతోంది. ఎన్నో జంతువులు మండి మసయిపోయాయి. కొన్ని ప్రాణభయంతో ఇటూ అటూ పరుగులు తీశాయి. సగం ప్రాణంతో కొన్ని గిలగిలలాడుతున్నాయి.

ఏనుగు కూడా ప్రాణభయంతో పరుగులు తీసింది. ఎటువేపు వెళ్ళినా మంటలే. పరుగులు తీస్తూ ఉంటే మంటలతో కాలుతున్న కొమ్మలు చెట్ల నుండీ విరిగిపడేవి. వాటితో ఏనుగు శరీరమంతా గాయాలయ్యాయి. ఏం చెయ్యాలో దానికి దిక్కుతోచలేదు. పరిగెత్తి పరిగెత్తి అలసిపోయింది. దగ్గర్లో ఉన్న ఒకమహావృక్షం కనిపించింది. ఇంకా అది మంటలకు ఆహుతి కాలేదు. దాని దగ్గరకు మంటలు రావడానికి కొంతసేపు పట్టేట్లు ఉంది. ఏనుగు దాని మొదట్లో నిల్చుని కాసేపు విశ్రాంతి తీసుకుందామనుకుంది.

కాసేపు విశ్రాంతి తీసుకున్నాకా యిక అక్కడినించీ వెళ్ళిపోవాల్సిన సమయం వచ్చింది. మంటలు ఆ చెట్టు దగ్గరకు వచ్చాయి. చెట్టు కూడా దగ్ధమయ్యేట్లు ఉంది. అక్కడ నుంచి వెళ్ళిపోవాలి. ఆ ప్రయత్నంలో ఏనుగు కాలుపైకి ఎత్తి ముందుకు కదలబోయింది. అంతలో అక్కడెక్కడో చెట్టుబోదెలో ఉన్న కుందేలు ఒకటి పరిగెత్తుకుంటూ వచ్చి దాని కాలి కింద ఆగింది. అది తను విశ్రాంతి తీసుకోవడానికి అనువయిన స్థలమని ఆ కుందేలు అనుకున్నట్లుంది. జరుగుతున్నదంతా ఏనుగు గమనించింది. ఎత్తినకాలు దించకుండా అలాగే ఆగిపోయింది. ఆలోచనలో పడింది. కుందేలు ఏనుగుకాలు నీడలో హాయిగా ముడుచుకుని కూచింది. దూరం నుంచి వస్తున్న మంటసెగలు ఏనుగును సమీపిస్తున్నాయే కాని కుందేలును తాకడం లేదు. పైగా

కుందేలుకు అక్కణ్నించీ కదలాలనిపించలేదు. ఈ ఏనుగు కొండలా ఉంది. దాని క్రింద ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటాను. 'ఈ ఏనుగు ఎప్పటిదాకా యిక్కడుంటుందో అప్పటిదాకా నాకు దిగుల్లేదు. ప్రమాదం లేదు' అనుకుంది.

కుందేలు ఎప్పుడు కదుల్తుందా? అని ఏనుగు, ఏనుగు ఎప్పుడు కదుల్తుందా? అని కుందేలు ఎదురు చూసాయి. దాంతో రెండూ అలాగే ఉండిపోయాయి. మంటలు దగ్గరికి వచ్చేస్తున్నాయి. ఏనుగు ఒక కాలు ఎత్తి నిల్చుంది. అలిసిపోయింది. కుందేలు అక్కణ్ణించి కదలేట్లు లేదు. 'ఈ కుందేలు కోసం నేను జాలి చూపించడమెందుకు? అది బతికితే నాకెంత? చస్తే నాకెంత?' నా ప్రాణం నాకు ముఖ్యం కదా!' అని అనుకుంది ఏనుగు. కానీ వెంటనే ఆలోచనలో పడింది. 'నాకు నా ప్రాణాలంటే ఎంత ఇష్టమో, కుందేలుకు కూడా దాని ప్రాణాలంటే అంతే ఇష్టముంటుంది కదా! నా ప్రాణాల్ని కాపాడుకోవడానికి నేను వెళ్ళిపోతే ఈ కుందేలు దిక్కులేనిదవుతుంది. నిస్సహాయంగా మిగుల్తుంది. మంటల్లో మండిపోతుంది' అనుకుంది.

ఆ కుందేలు పట్ల దయతో ఏనుగు అటూ ఇటూ కదలకుండా నిలబడిపోయింది. నాలుగు వేపుల నుంచి మంటలు వ్యాపించాయి. మహావృక్షం కూడా మంటలకు ఆహుతి అయింది. చెట్టు కాలుతున్నప్పుడు కూడా కాలుకింద కుందేలు కదల్లేదు. ఏనుగు మాత్రం కదలకుండా ఆ మంటలకు నిలబడే చనిపోయింది. బుద్ధుడు తాను ఈ జన్మ ఎత్తడానికి గతజన్మలో ఒకటయిన ఏనుగు జన్మ గురించి చెబుతూ యితర ప్రాణులపట్ల అంత దయ, నిశ్చలత్వం ఉండడంవల్లే నేను ఈ జన్మ ఎత్తానని చెప్పాడు.

**ఇతరుల కష్టాలపట్ల సానుభూతి, త్యాగం అన్నవి ఎప్పుడూ వృథాగా పోవు.**

## 83. హఠత్ జ్ఞానోదయం

మనం సత్యసందర్శన కోసం, జ్ఞానోదయం కోసం పనిగట్టుకుని ప్రయత్నించాల్సిన పనిలేదు. ఎప్పుడో అది హఠాత్తుగా వస్తుంది. కానీ మానసికంగా మనం దానికి సంసిద్ధులమయి ఉండాలి. పూర్వరంగాన్ని ఏర్పాట్లు చేసుకోవాలి. దానికవి సంబంధించినవే ధ్యానం, సన్యాసం మొదలయినవన్నీ. దీనికి సంబంధించి రెండు ఘటనలు. ఒకటి జెన్ ఆశ్రమానికి చెందిన గాథ.

ఒక జెన్ ఆశ్రమంలో ఒక సన్యాసిని ఉండేది. ఆమె దశాబ్దాలుగా నియమ నిష్ఠలతో జీవితాన్ని గడిపింది. నిరంతర ధ్యానంలో నిమగ్నమయ్యేది. ఆశ్రమంలో అన్ని పనులు చేసేది. దూరం నించే ఆశ్రమానికి కావడిలో నీళ్ళు మోసుకుని వచ్చేది.





ఒకరోజు రాత్రి ఆమె కావడి కుండల్లో నీళ్ళు మోసుకుని ఆశ్రమానికి వస్తోంది. కుండల్లో నీళ్ళు కదుల్తున్నాయి. ఆకాశంలో నిండు చంద్రుడు కుండల్లోని నీళ్ళల్లో చంద్రుడు కదుల్తున్నాడు. వెదురు కర్రకు యిటువేపు, అటువేపు కుండలు ఉంటాయి. వాటిని సమతూకంగా మోస్తూ వెదురుకర్ర ఆమె భుజం మీద ఉంటుంది. ఉన్నట్లుండి వెదురుకర్ర విరిగిపోయింది. కుండలు పగిలి నీళ్ళు నేలపాలయ్యాయి.ఆ సన్నివేశంలో ఆమెకు హఠాత్తుగా జ్ఞానోదయమైంది. ఉదయాన్నే సన్యాసులు వచ్చి చూస్తే ఆమె నాట్యం చేస్తోంది. అందరూ ఏమైందని అడిగారు.

ఆమె "వెదురు విరిగి కావడి కుండలు కిందపడి నీళ్ళు నేలపాలయ్యాయి. నీళ్ళల్లో చంద్రుడు కూడా అదృశ్యమయ్యాడు. ఆకాశంలో ఉన్న చంద్రుడు నీళ్ళల్లో ప్రతిబింబిస్తూ ఉన్నాడు. నీళ్ళు నేలపాలయితే చంద్రుడు మాయమయ్యాడు. తలెత్తి పైకి చూశాను. చంద్రుడు నిశ్చలంగా ఉన్నాడు. నా మనసులో మెరుపు మెరిసింది. సత్యానికి చెందిన స్పృహ ఏదో కలిగింది" అంది.

జ్ఞానోదయానికి చెందిన అనుభవాల్ని విశ్లేషించడం కుదరదు. ఉపరితలం గురించి వివరించగలం. అనుభవపు ఆంతర్యాన్ని అందించలేం.

రెండో గాథ గురునానక్‌కు సంబంధించింది.

గురునానక్ అంగట్లో కూచుని సరుకులు అమ్మేవాడు. త్రాసులో తూకాలు వేస్తూ ఉండేవాడు. మనసు లోతుల్లో ఆయన నిరంతరం ఎదుగుతూ ఉండేవాడు. ఎంతగా ఎదుగుతున్నాడో ఆ స్పృహ కూడా ఆయనకు ఉండేది కాదు. ఒకరోజు ఆయన ఏదో తూకాలువేస్తూ లెక్కపెడుతున్నాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు ఇట్లా లెక్కపెట్టాడు. హిందీలో పదమూడుని 'తేరా' అంటారు. ఆ పదానికి రెండు అర్థాలున్నాయి. ఒకటి పదమూడు, రెండోది 'నీది'.

'తేరా' అన్నమాట దగ్గర నానక్ ఆగిపోయాడు. నిజానికి ఏదో ధ్యానానికి ఆయన్ని తూకం వేసి వ్యక్తి సంచీలో వేస్తున్నాడు. కానీ తేరా అంటే పదమూడు అన్న సంఖ్యకు సంబంధించిన స్పృహ ఉంటే ఆయన దాన్ని దాటి పధ్నాలుగు, పదిహేను అంటూ ముందుకు సాగేవాడు. కానీ ఆయన 'తేరా' అంటే 'నీది, నీకు సంబంధించింది' అన్న భావనకు లోనయి దాన్ని దాటి వెళ్ళలేదు. నీకు అంటే దైవానికి అని అర్థం. ఇదంతా నీదే అన్న భావానికి ఆయన ఎప్పుడు లోనయ్యాడో తనను తాను మరచి పోయాడు. తన్మయుడయి పోయాడు. తూకాలేస్తూనే ఉన్నాడు. సంచిలో పోస్తూనే ఉన్నాడు. కానీ లెక్క తేరా దగ్గర ఆగిపోయింది. పదమూడును దాటిపోవడం లేదు. జనం వచ్చారు. ఆ అంగడి యజమాని కూడా వచ్చాడు. ఆ యజమాని సత్యానికి సంబంధించిన

స్పృహ ఉన్నవాడు. దైవచింతన ఉన్నవాడు కావడం వల్ల నానక్ వర్చస్సును, పారవశ్యాన్ని చూసి తలవంచి నానక్‌ని నమస్కరించాడు. నానక్ అతని అపూర్వపరివర్తనను చూశాడు.

అప్పటినించే నానక్ మారిపోయాడు. తనదంటూ నానక్‌లో ఏదీ లేకుండా పోయింది. అంతా దైవానికి సంబంధించిందిగా మారిపోయింది. నానక్ ఆ అంగడిని వదిలిపెట్టి సన్యాసి ఐపోయాడు. సంచారకుడయ్యాడు. తనతోబాటు 'మర్దన' అన్న శిష్యుణ్ణి వెంటబెట్టుకుని తిరిగాడు. శిష్యుడు తంబూరా వాయిస్తుంటే గురువు కీర్తనలు పాడేవాడు. నానక్ ఎన్నో ప్రాంతాలు తిరిగాడు. భారతదేశమంతా పర్యటించాడు. దేశాన్ని దాటి వెళ్ళాడు. **జ్ఞానోదయానికి స్థలకాల పరిమితుల్లేవు.**

## 84. నేనెవర్నీ కాను

అహంకారమన్నది పొగరుమోతులకే ఉంటుదని అనుకోకూడదు. వినయంగా ఉన్నవాళ్ళకు కూడా ఉంటుంది. కొందర్లో కనిపిస్తుంది. కొందర్లో కనిపించదు. అహంకారం విభిన్న రూపాల్లో ఉంటుంది. అహం అందర్లో ఉంటుంది. అహమన్నది మేఘంలాంటిది. ఆ మేఘాన్ని గుర్తిస్తే అది అదృశ్యమవుతుంది. అంటే మనల్ని మనం తెలుసుకుంటే అహం మాయమవుతుంది. అన్ని ఆధ్యాత్మిక చింతనల సారాంశం **'నిన్ను నువ్వు తెలుసుకో'**.

లావోత్స అన్న చైనాతత్త్వవేత్త చాలా వినయం కలవాడండి అన్నామనుకోండి. **"మనలో అహమన్నది ఉన్నప్పుడు మాత్రమే ఎదుటి మనిషి వినయం ఉన్నవాడో లేడో అన్న సంగతి చెబుతాం"** అంటాడు.

ఎవరయినా వినయం ఉన్న వ్యక్తి దగ్గరకు వెళ్ళండి. పరిశీలించండి. అతను చాలా నెమ్మదిగా ఉంటాడు. అతన్తో మాట్లాడండి. 'నేను అందర్తో చాలా వినయంగా ఉంటానండి. అహంకారమంటే నాకు పడదు. పొగరు మోతుల్ని నేను ఇష్టపడను" వంటి మాటలు చెబుతాడు. వినయం గురించి నొక్కి చెబుతాడు. ఆ చెప్పడంలోనే అతన్లోని 'అహం' మనకు కనిపిస్తుంది. అతని వినయమే మనకు అతని గర్వంగా తెలిసి వస్తుంది. మనం అతన్తో మీకన్నా ఎంతో వినయసంపన్నుణ్ణి ఈ ఊళ్ళో చూశాను" అని అనండి. అతని అహం దెబ్బతింటుంది. "అయ్యా! మీరు పొరబడ్డారు. నా అంతటి వినయశీలి ఈ ఊళ్ళోనే కాదు పక్కఊళ్ళో కూడా లేడు. మీరెక్కడో పొరబడి ఉంటారు" అంటాడు. **నేను అన్నది ఎక్కడుంటే, ఎన్ని వేషాలు వేసినా, అక్కడ అహం ఉంటుంది.** ఒక నవాబుగారు ప్రతిరోజు నమాజు చెయ్యడానికి మసీదుకు వస్తారంటే అక్కడ ఎవరూ ఉండడానికి వీళ్ళేదు. భద్రాత ఏర్పాట్లు భారీ ఎత్తున ఉంటాయి. ఒక పండుగరోజు





తెల్లవారకముందే నవాబుగారికి నమాజు చెయ్యాలనిపించింది. ఏర్పాట్లన్నీ సిద్ధమయ్యాయి. నవాబు మసీదుకు తరలివచ్చారు. సేవకులు మసీదు బయటే ఉన్నారు. ఇంకా చీకటిగానే ఉంది. నవాబు ఒక్కడే మసీదులోకి వచ్చాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. ప్రశాంతంగా ఉంది. నవాబు పరవశంతో దైవాన్ని ఉద్దేశించి 'అల్లా! సర్వాంతర్యామి, అన్నింటికీ నువ్వే కారణం. నీముందు నేనెంత? నీ కాలి ధూళిని నేను. అసలు నేను లెక్కలోనికి రాను. నేను ఎవర్నీకాను" అన్నాడు. ఆ మాటలు మసీదులో ప్రతిధ్వనించాయి. తన వినయం, నమ్రత తప్పక దైవానికి అంది ఉంటాయన్న విశ్వాసం నవాబుకు కలిగింది. మనసంతా ఏదో మాధుర్యం నిండుకుంది. అంతలో దగ్గర్లో ఏదో శబ్దం వినిపించింది. తను ఒక్కడే కాక మసీదులో యింకా ఏవరో ఉన్నారన్న సందేహం నవాబుకు కలిగింది. ఎవరా అని యిటూ అటూ చూశాడు. ఒక మూల ఒక బిచ్చగాడు ఉన్నాడు. నవాబు నమాజుతో అతనికి మెలకువ వచ్చింది. సేవకులు మసీదులో ఈ సమయంలో ఎవరు ఉంటారులే అనుకుని తనిఖీ చెయ్యలేదు. మూలనున్న బిచ్చగాణ్ణి వాళ్ళు చూడలేదు.

బిచ్చగాడు నవాబు ప్రార్థన విన్నాడు. తాను కూడా 'అల్లా! సర్వాంతర్యామీ!' అన్నింటికీ నువ్వే కారణం. నీ ముందు నేనేంత? నీ కాలిధూళిని నేను, అసలు నేను లెక్కలోకిరాను, నేను ఎవర్నీ కాను" అని ప్రార్థించాడు. ఆ మాటలకు నవాబుకి అంతులేని ఆగ్రహం వచ్చింది. నేను లెక్కలేనివాణ్ణి నేను ఎవర్నీకాను. అని నేను అంటూ ఉంటే మధ్యలో వీడెవడో నాకు పోటీ వచ్చాడేమిటి? అనుకుని "ఎవడ్రా వాడు?నేను అంటున్నదే మరలా అనే వాడెవడ్రా?" అన్నాడు.

అంటే ఎవరూ కాకపోవడంలో కూడా పోటీ ఉందన్నమాట! అంతలో తెల్లారింది. నమాజు చేస్తున్న బిచ్చగాణ్ణి నవాబు చూశాడు. ఆ బిచ్చగాణ్ణి నవాబు నిర్లక్ష్యంగా చూపి "నేను నవాబుని, నువ్వు బికారివి. 'నేను ఎవర్నీ కాను' అని నేను అంటూ ఉంటే అప్పుడూ ఎవరూ ఆ మాటల్ని అనకూడదు. పైగా నీలాంటి బిచ్చగాడు అసలు అనకూడదు" అని ఆజ్ఞ జారీ చేశాడు.

ఏమీ కానితనంలో కూడా అంతులేని అహంకారం అడుగుపెట్టే అవకాశముంది! వినయం ప్రదర్శిస్తున్నప్పుడు, నిరహంకారాన్ని నిరూపించుకోవాలన్నప్పుడు నేను వెనక ఉండి వాటిని ముందుకు తోస్తుంది. వాటికి పోటీగా ఎదురుగా అవి వస్తే వాటిని పక్కకు తోసి 'నేను' ముందుకు వస్తుంది.

## 85. నవయవ్వనం

నవయవ్వనం కావాలంటే జీవితంమీద దృష్టి నిలపాలి. వయసుమీద కాదు. శారీరకసౌష్ఠవంమీద కాదు. జీవితం నిరంతరం కాంతులీనుతుంది. ఆ కాంతుల్తో

మనసును నింపుకోవాలి. జీవన మధువును సేవించిన వారే నిత్యచైతన్యంతో నిగనిగ లాడతారు. కాలంతో సంబంధం లేని అనుభవం కావాలి. జీవితంలో పూలూ, ముళ్ళూ ఉన్నాయి. ముసలివాళ్ళు కావాలనుకుంటే ముళ్ళను లెక్కించండి. యవ్వనం కావాలనుకుంటే పూలను లెక్కపెట్టండి.

కోటిముళ్ళు కూడా ఒక పువ్వు రేకుకు సాటిరావు. గులాబీ రేకు చూడండి! ఎంత మృదువుగా, ఎంత అపూర్వంగా ఉంటుందో? ఎంత స్వచ్ఛంగా, ఎంత సుందరంగా ఉంటుంది. అట్లాంటి ఒక పువ్వు రేకు చాలు. కోటి ముళ్ళు ఉన్నా ప్రయోజనమేముంది?

కానీ చిత్రమేమిటంటే ముళ్ళు ఉన్న దగ్గరే పూలుంటాయి. పూలు ఉన్న దగ్గరే ముళ్ళు ఉంటాయి. అది సృష్టి విచిత్రం! కానీ ఎంపిక అన్నది మన చేతిలో ఉంది. మన దృష్టిని బట్టే ఉంటుంది. **జీవితంపైన దృష్టి నిలిపితే నవయవ్వనం ఎప్పటికీ నవనవ లాడుతుంది. మరణచింతన ఉంటే నిత్యవృద్ధాప్యం మీద పడుతుంది.**

రవీంద్రనాథ్ టాగూర్ మరణశయ్యపై ఉన్నాడు. ఎందరో ఆ మహాకవిని సందర్శించడానికి వచ్చారు. ముసలివాడయిన ఒక రవీంద్ర మిత్రుడు వచ్చాడు. రవీంద్రుని దగ్గర కూచున్నాడు. అతను రవీంద్రునికేసి చూసి 'ఇవి చివరి క్షణాలు. ఈ చివరి క్షణాల్లో నువ్వు భగవంతుణ్ణి ఒకే విషయం గురించి ప్రార్థించు. దేవా! ఇకచాలు. నాకు విముక్తి ప్రసాదించు. మళ్ళీ నాకు జన్మలేకుండా చేయి. పాపపంకిలమయిన ఈ ప్రపంచంలో మళ్ళీ నన్ను పుట్టించకు" అని ప్రార్థించు అన్నాడు.

రవీంద్రుడు ఆ మిత్రుని మాటలు విని "నువ్వేం చెబుతున్నావు? నన్ను ప్రార్థించమంటున్నావు. అదీ మళ్ళీ నన్ను ఈ భూమిలో పుట్టించకు" అని ప్రార్థించమంటున్నావు. చిత్రంగా చెబుతున్నావు. నువ్వు చెప్పినట్లు నేను చేయను. పైగా స్వామీ! నిజంగా నన్ను అర్హత కలిగినవాడుగా నువ్వు భావిస్తే దయచేసి మళ్ళీ నన్ను భూలోకానికి పంపించు. మళ్ళీ ఈ మట్టిలో పుట్టేలా చేయి. ఎంత మనోహరమయిన ప్రపంచమిది. ఎంత గొప్ప రంగుల లోకం! ఇక్కడి అద్భుతమైన పూలని, ఆకాశాన్ని, ధగధగలాడే నక్షత్రాల్ని, అందమైన వదనాల్ని, ఆహ్లాద వాతావరణాన్ని, అపూర్వ చైతన్యాన్ని నేను ఇంకెక్కడా చూడలేను. ఇవన్నీ చూసి నేను పరవశించాను. స్థాణువునయిపోయాను. సంభ్రమాశ్చర్యాలకి లోనయ్యాను. నిజంగా మళ్ళీ ఇక్కడికి వచ్చే అర్హత నాకుంటే దయచేసి నన్ను ఈ లోకంలోకి పంపించు. నేను అసమర్థుడని ఎక్కడ అనుకుంటావో, అర్హత లేనివాడని ఎక్కడ భావిస్తావో, బహుశః మళ్ళీ నన్ను ఇక్కడికి పంపవేమో అని నేను సందేహిస్తున్నాను! అని భగవంతునితో అంటాను" అన్నాడు.





రవీంద్రుని మాటలకు మిత్రుడు విస్తుపోయాడు. రవీంద్ర కవీంద్రుడు నాయకుడు. నిత్యయవ్వనంతో జ్వలించినవాడు. రవీంద్రుణ్ణి ముసలివాణ్ణి చెయ్యడం ఎవరివల్లా కాదు. శరీరం ఎవరికయినా ముసలిదవుతుంది. కానీ రవీంద్రుని ఆత్మ నిత్యయవ్వనంతో ఉంటుంది. దానికి వయసు రాదు. అదెప్పుడూ జీవితాన్ని ప్రేమిస్తుంది.

'నువ్వు ఆరువేల పాటలు రాశావు. ప్రపంచ ప్రసిద్ధి పొందావు. నీ గీతాలన్నీ గానయోగ్యమయినవి. అసలు భారతదేశంలో ప్రపంచంలో నీలాంటి కవిపుట్టలేదు." అన్నాడో మిత్రుడు. రవీంద్రుని కళ్ళు నీళ్ళతో నిండాయి. 'నువ్వంటున్నది సరి కాదు. యిప్పటిదాకా నేను 'పాట'ను పాడనే లేదు. పాటను పాడ్డానికి సిద్ధపడ్డాను. అంతలో పిలుపు వచ్చింది. వెళ్ళిపోవాల్సిన క్షణం వచ్చింది. నేను వీణను శ్రుతి చేస్తున్నాను. నేను వీణను శ్రుతిచేయడం చూసి జనం పాటపాడుతున్నాననుకున్నారు. గొంతు సరిచేసుకోవడం చూసి మహాకవి అని భ్రమించారు. నిజానికి యిప్పుడు పాటపాడటానికి సర్వం సంసిద్ధమయింది. కానీ భగవంతుని పిలుపు వచ్చింది. అందుకనే ఈ కన్నీళ్ళు" అన్నాడు. తన చివరి క్షణాల్లో రవీంద్రుడు రెండు చరణాల కవిత చెప్పాడు. అవి అపూర్వ అర్థవంత వాక్యాలు.

## 86. జీవన మధువు

యవ్వనానికి శరీరానికి ఎట్లాంటి సంబంధం లేదు. మనసును బట్టి కూడా యవ్వనమంటూ ఉండదు. వయసులో ఉన్న యువకుడు యవ్వనంలో ఉన్నాడని చెప్పడానికి లేదు. వయసుమీద పడిన వ్యక్తిని వృద్ధుడనటానికి లేదు. యువకులు కూడా ముసలివాళ్ళు కావచ్చు. ముసలివాళ్ళు కూడా యువకులు కావచ్చు. కానీ ముసలివాళ్ళు యువకులు కావడం ఎప్పుడోగాని జరగదు. ఐతే యువకులు వృద్ధులు కావడం సర్వసాధారణంగా చూస్తూ ఉంటాం.

సజీవంగా ఉండడమే యవ్వనం. దానికి వయసుతో నిమిత్తం లేదు. **ఉత్సాహం, ఆనందం, జీవించాలనే ఆకాంక్ష ఎక్కడ తొణికిసలాడుతూ ఉంటుందో అక్కడ యవ్వనముంటుంది.** మన చలనంలో, మన చర్యల్లో, మన చూపుల్లో ఆ జీవన మధువుని స్వీకరించాలన్న తపన ఉంటే మరణ పర్యంతం మనం ప్రశాంతంగా ఉంటాం.

సకల సౌకర్యాలున్న ఒక హోటల్ ఉంది. ఆ హోటల్లో ఒక ఖరీదయిన టేబుల్ ముందు ముగ్గురు మహాపురుషులున్నారు. ప్రపంచంలో గొప్ప పరివర్తన తెచ్చిన గొప్ప సంస్కర్తలు వాళ్ళు. గొప్ప ఆధ్యాత్మికసంపన్నులు. మహాపురుషులు స్వర్గానికి చేరినట్లే వాళ్ళు కూడా స్వర్గానికి వచ్చారు. విశ్రాంతికి ఆ టేబుల్ దగ్గర కూచున్నారు.

వాళ్ళల్లో మొదటివ్యక్తి బుద్ధుడు. రెండో వ్యక్తి కన్‌ఫ్యూషియస్. మూడో వ్యక్తి లావోత్స. ముగ్గురూ కబుర్లలో పడ్డారు. అంతలో ఒక దేవకన్య వాళ్ళ టేబుల్ దగ్గరికి వచ్చింది. స్వర్గంలో దేవకన్యలుంటారు కదా! అక్కడికి వచ్చిన అందరి అవసరాల్ని వాళ్ళు తీరుస్తూ ఉంటారు. అట్లా ఆ అప్సరస అక్కడికి వచ్చింది. ఆమె చేతిలో మధుపాత్ర ఉంది. ఆమె వాళ్ళని చూసి ఇది "జీవనమధువు. దీన్ని తీసుకుంటారా?" అని అడిగింది. ఆ మాట వింటూనే బుద్ధుడు కళ్లు మూసుకుని "జీవనమన్నదే సారహీనమైంది దాంట్లో రసం లేదు. అది అర్థం లేదు. నాకు అక్కర్లేదు. నేను స్వీకరించను" అన్నాడు.

కన్‌ఫ్యూషియస్ మధ్యే మార్గాన్ని అనుసరించేవాడు. బుద్ధుడిలాగా ఒకేసారి దాన్ని గురించి తీర్మానం చేసే వ్యక్తి కాదు. కళ్ళు మూసుకోలేదు. కానీ కళ్ళు సగం తెరిచి ఆ మధువును చూశాడు. అప్సరస కేసి చూసి "దాన్ని ఏమన్నావు?" అన్నాడు. దేవకన్య "జీవనమధువు" అంది. కన్‌ఫ్యూషియస్ "దేన్నీ అనుభవానికి తెచ్చుకోకుండా నేను నిర్ణయాలు చెయ్యను. కొద్దిగా తాగి చూస్తాను. అది తాగదగిందయితే, రుచిగా ఉంటే ఆ తరువాత దాన్ని పూర్తిగా తాగాలా? వద్దా? అన్న సంగతి నిర్ణయిస్తాను" అని ఆ జీవనమధువును కొద్దిగా రుచి చూశాడు. బుద్ధుడు, లావోత్స యిద్దరూ కన్‌ఫ్యూషియస్‌ను చూశారు. కన్‌ఫ్యూషియస్ ముఖంలో యితమిత్థంగా నిర్ణయించడానికి వీలుపడని హావభావాలు కనిపించాయి. అతని అభిప్రాయమేమిటో దేవకన్యకు కూడా అంతుబట్టలేదు. అప్పుడు కన్‌ఫ్యూషియస్ 'ఇది రుచిగా ఉందని చెప్పడానికి వీలుపడదు. రుచిగా లేదని కూడా చెప్పలేం. తాగొచ్చనీ చెప్పలేను. తాగకూడదని చెప్పలేను" అంటూ గోడమీద పిల్లిలా ప్రవర్తించాడు.

లావోత్స బుద్ధుడి చర్యను చూశాడు. కన్‌ఫ్యూషియస్ చర్యనూ గమనించాడు. ఏమీ మాట్లాడకుండా ఆ జీవనమధువు నంతా తృప్తిగా తాగేశాడు. పైకి లేచి నాట్యం చేశాడు. అతనిలోని మార్పుకి అందరూ ఆశ్చర్యపోయారు. లావోత్స ముఖం కళాకాంతులతో వెలిగిపోయింది. లావోత్స బుద్ధుణ్ణి చూసి "బుద్ధా! నీ చర్య నాకు ఆశ్చర్యం కలిగించింది. వింతగా తోచింది. నిష్కర్షగా నువ్వు జీవనమధువును వద్దన్నావు. అది తాగందే మంచిదో, చెడ్డదో ఎలా తెలుస్తుంది? ఆరంభించకుండానే పర్యవసానాల గురించి నిర్ణయాలకు వచ్చావు" అన్నాడు. తరువాత కన్‌ఫ్యూషియస్‌వైపు తిరిగి "మిత్రమా! నీ ప్రవర్తన మరీ చిత్రంగా ఉంది. బుద్ధుడితో పేచీలేదు. అతని నమ్మకమతనికి ఉంది. నువ్వట్లా కాదు. సందేహవాదివి. కొద్దిగా రుచి చూశావు. కానీ సరయిన నిర్ణయానికి రాలేకపోయావు. సరయిన నిర్ణయానికి రావడానికి సంపూర్ణమయిన అనుభవం అవసరం" అన్నాడు.



లావోత్స చెప్పింది సరైంది. ఎందుకంటే దేన్నయినా పాక్షికంగా ఎట్లా అనుభవంలోకి తెచ్చుకుంటాం? **సమగ్రంగా తెలుసుకుంటే తప్ప సారాంశం తెలిసిరాదు.**

## 87. దారి లేదు

మనిషి మరో మనిషంటేనే భయపడతాడు. తను ఒక్కడే ఉంటే అక్కడ భయం ఉండదనుకుంటాడు. కారణం ఇతరులనుండే తనకు సమస్యలు వస్తాయనుకుంటాడు. మనం మన కుటుంబసభ్యులతో, భార్యాబిడ్డలతో మాట్లాడేటప్పుడు ప్రవర్తించేటప్పుడు కూడా అక్కడ భయం ఉంది. అందుకనే జీన్ పాల సార్త్రే. 'అదర్ పర్సన్ ఈజ్ హెల్' అన్నాడు. అంటే తనుకాక తక్కిన ఎవరైనా నరకమే అన్నాడు. సార్త్రే 'నో ఎగ్జిట్' అన్న నాటకం రాశాడు. ఆ కథ చిత్రంగా ఉంటుంది.

ఆ నాటకంలో ఒక వ్యక్తి పడుకుని ఉంటాడు. హఠాత్తుగా నిద్ర లేస్తాడు. ఇటూ అటూ చూస్తాడు. తను ఎక్కడ ఉన్నానా? అని పరిశీలిస్తాడు. తను నరకంలో ఉన్నట్లు నిర్ధారించుకుంటాడు. కానీ అక్కడ నరకానికి సంబంధించిన వాతావరణం కనబడదు. అంతా నిశ్శబ్దం. నిర్మలం. నరకంలోని చిత్రహింసలేవీ కనిపించలేదు. అది నరకంలా లేదు. అతను ఎయిర్ కండిషన్ గదిలో ఉన్నాడు. ఆ గదిలో ఆ వ్యక్తితోబాటు ఇంకా ముగ్గురున్నారు. అంటే మొత్తం నలుగురున్నారన్నమాట. అంతా అద్భుతంగా ఉంది. కానీ ఆ గదికి తలుపులేదు. నాలుగు వేపులా గోడలే. లోపల అన్నీ అనుకూలాలు ఉన్నాయి.

అక్కడ అనుకున్నదంతా సమకూరేది. మనమనకునే నరకంలో మన కోరికలు తీరడమంటూ ఉండదు కదా! మనకు దాహమేసిందనుకోండి నీళ్ళు వస్తాయి. మనకు తెలిసిన నరకంలో కూడా దాహమేస్తే నీళ్ళు ప్రత్యక్షమవుతాయి. కానీ తాగడానికుండదు. తీరని కోరికలతో మనిషి చిత్రహింసలపాలు కావడమే నరకం. కానీ ఈ నరకంలో పరిస్థితి వేరు. ఆకలి వేసిందనుకోండి. వెంటనే మనిషి ప్రత్యక్షమవుతాడు. అన్ని రకాలయిన వంటలతో వస్తాడు. నాలుగు వైపులా గోడలున్నా ఆ గోడలు అతనికి ఆటంకం కావు. గోడల గుండా పొగలోంచి వచ్చినట్లు వస్తాడు. ఎట్లా వస్తాడో తెలీదు. అదంతా అద్భుతంలా జరుగుతుంది. కానీ కావలసినవన్నీ సమకూరుతాయి. ఆ గదిలో ఈ నిద్రలేచిన మనిషితోబాటు ఒక అమ్మాయి, ఒక ముసలావిడ, ఒక కుర్రాడు ఉంటారు.

మొత్తానికి అందరూ ఒకర్నొకరు పరిచయం చేసుకున్నారు. కబుర్లు చెప్పుకున్నారు. వాళ్ళ జీవితాల గురించి తెలుసుకున్నారు. అట్లా రెండు రోజులు గడిచిపోయాయి. అన్ని విషయాలు మాట్లాడుకున్నారు. ఇక ఏమి మాట్లాడుకోవాలో

తోచలేదు. చదువుకుందామంటే పుస్తకాలు లేవు. కనీసం పేపరు కూడా లేదు. బయటికి వెళ్ళే అవకాశం లేదు. విసుగునుంచి బయటపడడానికి అవీ, యివీ చెప్పుకున్నారు. ఎంతసేపని చెప్పుకుంటారు? విసుగు అంతులేకుండా పోయింది. చేయడానికి పనిలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ ఎన్నాళ్ళని ఉంటారు? క్రమంగా ఒకర్నొకరు భరించలేని స్థితికి వచ్చారు? అప్పుడు ఆ వ్యక్తికి తను నిజమైన నరకంలో ఉన్నానన్న విషయం తెలిసివచ్చింది. అతన్తోబాటు తక్కిన ముగ్గురు కూడా నిజమైన నరకమిదే అన్న విషయం గ్రహించారు. అట్లా ఎక్కడికీ బయటకు వెళ్ళలేని జీవితం వాళ్ళకు దుర్భరమనిపించింది. ఆత్మహత్య చేసుకుందామని అనుకున్నారు. కానీ నరకంలో ఆత్మహత్య చేసుకోలేరు కదా! తమకు ఆకలేస్తే అన్నీ సిద్ధం చేసే వ్యక్తిని వాళ్ళు 'మీరు మాకు చనిపోయే మార్గం చెప్పండి" అన్నారు. అతను "బాబూ! మీరున్నది నరకం. ఇక్కడ ఆత్మహత్య చేసుకోవడం కుదరదు. ఆత్మహత్యే కాదు, మీరు స్వతంత్రంగా చేయడానికి ఇక్కడ వీలుపడదు" అన్నాడు. ఆ మాటల్తో అంతా విస్తుపోయారు. ఏమీ పాలుపోలేదు. దీన్నించి విముక్తి ఉంటుందా?అనుకున్నారు. అదే విషయం గురించి అతన్తో "మేమిక్కడ ఎంతకాలం ఉండాలి?" అని అడిగారు. అతను "ఇంతకాలమంటూ పరిమితి ఏమీలేదు. ఎందుకంటే ఇది నరకం. దీనికి సమయం అంటూ ఉండదు. ఇది శాశ్వతంగా ఉంటుంది" అన్నాడు. సార్త్రే **తనుకాని వ్యక్తి నరకం** అన్నాడు. అన్నింటికన్నా దుర్భరమయిన నరకం మనకు దారిలేకపోవడం. బయటకి వెళ్ళేదారి లేకపోవడం అసలు నరకం. **నియమాలు, నిబంధనలూ మనల్ని అల్లుకుంటే మెల్లిగా నిజమైన నరకం మన చుట్టూ రూపొందుతుంది.** దాన్నించి బయటపడాలని తపిస్తాం. దారితేనితనం దహిస్తుంది.

## 88. ప్రశ్నల్లో సమాధానముంది

మనలోనే సమాధానాలున్నాయి. ప్రశ్నను సరిగా వెయ్యగలిగితే దాన్ని బట్టే సమాధానం వస్తుంది. ప్రశ్నలోని తీవ్రతలోనే సమాధానం దాగి ఉంటుంది. ప్రశ్నించే వ్యక్తి ఎంత హృదయపూర్వకంగా ఆ ప్రశ్న వేశాడన్నదాన్ని బట్టి ఉంటుంది.

సత్యాన్వేషి సందేహం అపూర్వమయింది. అతని అన్వేషణలోనే సత్యం దాగి ఉంది. దేవుణ్ణి అన్వేషిస్తూ వివేకానందుడు ఎందరో మహాపురుషుల్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. రామకృష్ణ పరమహంస దగ్గరకు వెళ్ళకముందు ఒకసారి ఆయన మహర్షి దేవేంద్రనాథుని దగ్గరకు వెళ్ళాడు.

అది ఒక రాత్రి. దేవేంద్రనాథుడు గంగానదిలో పడవలో కూచుని ధ్యాననిమగ్నుడయి ఉన్నాడు. దేవేంద్రనాథుడి కుటుంబం సంపన్నమయింది. అతని





పడవ సకల సదుపాయాల్తో ఒక ఇల్లులా ఉండేది. ఏకాంతం కోసం, ప్రశాంతత కోసం ఆయన ఆ పడవ ఎక్కి గంగానదిలో విహరించేవాడు. అక్కడ ఎట్లాంటి ఆటంకమూ ఉండేదికాదు. నిర్మలమయిన అలల్లో, నిశ్శబ్ద రాత్రిలో పడవసాగేది. దేవేంద్రనాథుడు అట్లాంటి అపూర్వ ఘడియల్లో ధ్యాననిమగ్నుడయ్యేవాడు. ఎవరూ ఆయనకు ఆటంకం కలిగించేవాళ్ళు కారు. ఇబ్బంది పెట్టేవాళ్ళు కారు.

అట్లాంటి ఒకరోజు నిశ్శబ్ద రాత్రిలో దేవేంద్రనాథుడు పడవలో ధ్యాననిమగ్ను డయి ఉన్నాడు. దేవేంద్రనాథుడు తన ఆధ్యాత్మిక చింతన ద్వారా, సత్యాన్వేషణ ద్వారా సుప్రసిద్ధుడు. దైవాన్ని అన్వేషిస్తున్న వివేకానందుడు దేవేంద్రనాథుణ్ణి కలుసుకోవా లనుకున్నాడు. ఈతకొట్టుకుంటూ వచ్చి పడవను అందుకున్నాడు. పడవలో ఎక్కాడు. పడవ అటూ ఇటూ కదిలింది. కుదుపుకు లోనయింది. పడవలోని గదిలోకి వెళ్ళి వివేకానందుడు ధ్యాననిమగ్నుడయిన దేవేంద్రనాథుణ్ణి కదిలించాడు.

ధ్యానంలో ఉన్న దేవేంద్రుడు కళ్ళు తెరిచి చూశాడు. తడిసి ముద్దయి నీళ్ళు కారుతున్న వివేకానందుణ్ణి చూసి ఆయన భయపడ్డాడు. ఆయన మనసులో ఆ యువకుడి పట్ల ఎన్నో ఆలోచనలు మెదిలాయి. పడవ ఊగుతుంది. వివేకానందుడు ఆయన్ని చూసి "దేవుడున్నాడా?" అని అడిగాడు.

దేవేంద్రుడు ఊహించని ఘటన అది. ఆ ప్రశ్నని ఊహించలేదు. రాత్రిపూట ఒక యువకుడు హఠాత్తుగా ప్రత్యక్షమైతే అతని గురించి ఆలోచనలు ఎలా ఉంటాయి? ఏమి అడుగుతున్నాడని ఆశ్చర్యపోయాడు దేవేంద్రనాథుడు. పైగా మనిషిని నిలదీసి 'దేవుడున్నాడా?' అంటే క్షణంలో ఎవరయినా ఏం చెబుతారు. దేవేంద్రనాథుడు మొదట 'మొదట నువ్వు విశ్రాంతి తీసుకో' అన్నాడు. కానీ వివేకానందుడు ఉద్వేగంలో ఉన్నాడు. తపనలో ఉన్నాడు. దేవేంద్రుడు "ప్రశాంతంగా కూర్చో. నువ్వెవరవు? ఎక్కడనుంచి వచ్చావు? ఏ తపన నిన్నింతగా అన్వేషణకు ప్రేరేపించింది?" అన్నాడు. వెంటనే వివేకానందుడు పడవ నించీ నదిలోకి దూకేశాడు. దేవేంద్రుడు ఆ హఠాత్ సంఘటనకు ఆశ్చర్యపోయాడు. "అబ్బాయ్! నేను చెప్పేది వినకుండానే వెళ్ళిపోతున్నావ్" అన్నాడు. వివేకానందుడు "మీ సందేహమే నాకు సమాధానం చెప్పింది" అని వెళ్ళిపోయాడు.

ఎందుకంటే వివేకానందుడు వేసిన ప్రశ్నకు దేవేంద్రనాథుడు దారి మళ్ళించాడు. ఎందుకంటే అట్లాంటి స్థితి దేవేంద్రనాథుడికి ఎప్పుడూ తటస్థించలేదు. ఆయన ఎంతో గొప్పగా చదువుకున్నవాడు. ఎందరి ఆధ్యాత్మిక సందేహాలకో అలవోకగా సమాధానా లిచ్చేవాడు. కానీ ఇక్కడ పరిస్థితి వేరు. ఈ హఠాత్ పరిణామం ఆయన్ని సందిగ్ధంలో పడేసింది. వివేకానందుడు వెళ్లిపోయాకా ఆయన ఆలోచనలో పడ్డాడు. నిజంగా నాకు

దేవుడి గురించి తెలుసా? దేవుడు ఉన్నాడా? లేడా? అన్న విషయం గురించి నేను చెప్పగలనా? మరి ఆ యువకుడు అడిగితే వెంటనే ఎందుకు చెప్పలేకపోయాను? నా సందేహం వల్ల నా దగ్గర సరయిన సమాధానం లేదని నాకు తెలిసింది" అనుకున్నాడు. వివేకానందుడు ఉద్వేగంగా, అన్వేషణాత్మకంగా ప్రశ్నని వేశాడు. **ప్రశ్నని సూటిగా అందుకోలేని వ్యక్తి సమాధానాల్ని సూటిగా ఇవ్వలేడు**. ఎందుకంటే ప్రశ్నలోనే సమాధానముంది. సమాధానమిచ్చే వ్యక్తి ప్రశ్నలోనే సమాధానాన్ని చూస్తాడు.

## 89. మార్పు

సహజంగా ఉండడం గురించి ఎన్నో సిద్ధాంతులున్నాయి. సహజయోగమని కూడా అంటూ ఉంటారు. సహజంగా ఉండడం మంచిదేకాని సహజంగా ఉండడమన్నది అంత సులభంగా కాదు. సిద్ధాంతాల్ని పనిగట్టుకుని జీవితంపై ఆరోపించుకుంటే ఫలితాలు విపరీతంగా ఉంటాయి. సహజత్వం కోసం ప్రయత్నించే మనుషులు అసహజంగా తయారవుతారు. ఒకడు కోపంగా ఉంటాడు. ఆ కోపాన్ని పోగొట్టుకుని శాంతంగా ఉండాలనుకుంటాడు. దొంగ సాధువుగా ఉండడానికి పూనుకుంటాడు. శాంతం, ఔదార్యం, సాధులక్షణమన్నది ఎక్కడో బయట ఉన్నాయని వాటిని తెచ్చి తమకు ఆరోపించుకోవడానికి మనుషులు తంటాలు పడతారు. ఉన్నవేవో వాటిని అర్థం చేసుకుంటే వాటినుంచి మనకు విడుదల కలుగుతుంది. వాటిని బలవంతంగా మననించి పంపించెయ్యాలని ప్రయత్నిస్తే అవి మరింత బలంగా తయారవుతాయి.

ఏకనాథుడు తన శిష్య బృందంతో ఒకసారి తీర్థయాత్రకు బయల్దేరాడు. ఆయన బోధనల్తో ఎందరో ప్రభావితులయ్యారు. ఆయన అనుచరులయ్యారు. ఒక దొంగ ఆయన బోధనల్తో ప్రభావితుడై ఆయన దగ్గరకు వచ్చి ఆయన్తోబాటు తీర్థయాత్ర చెయ్యాలని ఉందని తన కోరికను వెళ్ళబుచ్చాడు. ఏమీ దాచుకోకుండా తన గురించి చెప్పుకున్నాడు. "స్వామీ! నేను దొంగను. మీతోబాటు గంగానదిలో పుణ్యస్నానమాచరించి నా పాపాలు పోగొట్టుకోవాలనుకుంటున్నాను" అన్నాడు. ఏకనాథుడు "బాబూ! నీ ఉద్దేశ్యం మంచిదే. నాతోబాటు నువ్వు రావటానికి నాకు ఎట్లాంటి అభ్యంతరమూ లేదు. ఎందుకంటే నువ్వు నాతో ఏదీ దాచకుండా నేను దొంగను అని చెప్పావు. అయితే నాతో కూడా ఎందరో దొంగలు ఉన్నారు. వాళ్ళు కూడా తీర్థయాత్రలకు వస్తున్నారు. కాబట్టి వాళ్ళకు నీ సంగతి తెలిస్తే నిన్ను నాతోబాటు తీసుకురావడానికి అభ్యంతరం చెప్పవచ్చు. కాబట్టి ఇక్కడ ఇబ్బంది ఉంది. ఒక షరతుమీద నువ్వు నాతో రావచ్చు. తీర్థయాత్ర ముగిసేదాకా నువ్వు ఎవరి వస్తువుల్నీ దొంగిలించకూడదు. సరేనా?" అన్నాడు. దొంగ సరేనన్నాడు. తీర్థయాత్ర కొనసాగింది.





రోజులు గడిచేకొద్దీ దొంగకు చాలా ఇబ్బంది అయింది ఎందుకంటే అలవాటయిన చెయ్యి. దొంగతనమన్నది అతని అలవాటు. ఆ అలవాటునుంచి తప్పించుకోవడం కష్టమయింది. పగలంతా ఎట్లాగో గడిచినా రాత్రిళ్ళు అతనికి నిద్రపట్టేది కాదు. ఆలోచనలో పడ్డాడు. ఈ తీర్థయాత్ర మూడు నెలలు పట్టవచ్చు. నేను చోరకళలో ఆరితేరిన వాణ్ణి. ఈ మూడు నెలలు యిలా దొంగతనాన్న చెయ్యకుండా ఉంటే ఆ కళలో నేను ప్రావీణ్యం పోగొట్టుకుంటానేమో, తరువాత ఎందుకూ పనికిరాని వాణ్ణవుతానేమో" అని దిగులు పడిపోయాడు.

తానేమో ఏకనాథునికి దొంగతనం చెయ్యనని చెప్పాడు. కానీ ప్రాణం గింజుకుంటుంది. ఏదో చెయ్యాలి. అదే సమయంలో ఇచ్చిన మాట నిలుపుకోవాలి. అప్పుడతనికి ఒక ఆలోచన వచ్చింది. వచ్చింది మొదలు దాన్ని ఆచరణలో పెట్టాడు.

అందరికీ తమ వస్తువులు తారుమారవుతున్నట్లు తెలిసింది. ఎందుకిట్లా జరుగుతుందో అంతుబట్టలేదు. వస్తువులు మాయం కావడం లేదు. కానీ స్థలం మారుతున్నాయి. అంతా అయోమయంగా ఉంది. ఏదో జరుగుతుందని ఏకనాథుడికి తెలిసింది. దొంగ మీద సందేహం కలిగింది.

ఒకరోజు అర్ధరాత్రి ఏకనాథుడు మేలుకుని చూశాడు. దొంగ ఒకరి సంచిలోని వస్తువులు తీసి ఇంకొకరి సంచిలో పెట్టడం చూశాడు. "నువ్వు దొంగతనం చెయ్యనని చెప్పావు. నువ్వు చేస్తున్నదేమిటి" అన్నాడు. దొంగ ఉలికిపడి "స్వామీ! నేను మీకు ఇచ్చినమాటని జవదాటడం లేదు. నేను ఇతరుల సొత్తు దొంగిలించనని మీకు ప్రమాణం చేశాను. ఆ మాటకే కట్టుబడి ఉన్నాను. ఒకరి వస్తువులు తీసి ఇంకొక దగ్గర పెడుతున్నాను. ఇది దొంగతనమెట్లా అవుతుంది. మీకు చేసిన ప్రమాణంలో ఈ విషయం లేదు కదా!" అన్నాడు. ఏకనాథుడు దొంగలో మార్పు రాలేదని, దొంగిలించడంలో మాత్రమే మార్పు వచ్చిందని తెలిసి అవాక్కయ్యాడు.

## 90. మహారాజు

ఒక స్థాయిలో మనిషి అహంకారం అదృశ్యమయిపోతుంది. దాంతోబాటు వినయమూ అదృశ్యమయిపోతుంది. ఎందుకంటే అహంకారం మాయమయి పోయినప్పుడు వినయం కూడా ఉండాల్సిన పనిలేదు. అక్కడ అహంకార ప్రదర్శనకు అవకాశమే లేనప్పుడు వినయానికి కూడా వీలుండదు. ఆ రెండూ కానితనాన్ని నిలుపుకున్న వాళ్లుంటారు. బుద్ధుడు, జీసస్, మహావీరుడు అట్లాంటివాళ్ళు. వాళ్ళల్లో అహంకారం కనిపించదు. అదే సమయంలో వినయం కనిపించదు.

జీసస్ "నేనే దేవుణ్ణి అనేవాడు లేదా నేనే దేవుని కుమారుణ్ణి" అనేవాడు. నేను స్వర్గంలో ఉన్న దేవుడూ ఒక్కరమే" అనేవాడు. "అహంకారం నిండిన మనసుతో సమీపిస్తే అవన్నీ అహంకారపూరితమయిన మాటల్లాగా అనిపిస్తాయి. ఎందుకంటే అక్కడ ఆయన మాటల్లో మీ అందరికన్నా నేను ఉన్నతుణ్ణి" అన్న భావం స్ఫురిస్తున్నట్లనిపిస్తుంది.

కానీ అక్కడ పరిశీలిస్తే అటువంటి భావాలకు అవకాశమే లేదు. ఎందుకంటే అక్కడ ఆయన ఇతరుల నెవ్వరినీ తక్కువ చెయ్యడం లేదు. మీ కంటే నేను గొప్పవాణ్ణి అనడం లేదు. నేనొక్కణ్ణే దేవుని కుమారుణ్ణి. మీరెవరూ కాదు అనడం లేదు. మరింత లోతుల్లోకి వెళ్ళి చూస్తే "మీరు కూడా దైవాలే. మీరు కూడా దేవుని పుత్రులే" అన్న భావన ఆయనదని తెలిసి వస్తుంది.

రామతీర్థ భారతదేశానికి చెందిన ఆధ్యాత్మికగురువుల్లో ఒకడు. గొప్ప ధర్మబద్ధుడు. యోగి. ఆయన ఎప్పుడూ తనను గురించి 'రామతీర్థ మహారాజ్' అని చెప్పుకునేవాడు. భారతదేశంలో ఆయన ఒక సన్యాసి. విరాగిలాంటివాడు. కానీ తనని తను 'రామతీర్థ మహారాజ్' అని చెప్పుకుంటే భారతీయులెవరూ ఆగ్రహించలేదు. ఆయన్ని పిచ్చివాడనుకోలేదు. ఎందుకంటే ఆయన కాదు ఎందరో సన్యాసులు అలా చెప్పుకునే వాళ్ళు. ఈ దేశప్రజలు సర్వసంగ పరిత్యాగుల్ని గౌరవించేవాళ్ళు. మహారాజుల కన్నా గొప్పవాళ్ళుగా వాళ్ళని చూసేవాళ్ళు. ఈ దేశ ప్రజలకు అదెంతో సహజలక్షణం. ఆ సన్యాసులకు సైన్యముండదు. రాజ్యముండదు. ఆయుధాలుండవు. కానీ వాళ్ళు 'మహారాజులు'.

రామతీర్థ అమెరికా వెళ్ళాడు. భారతీయ ఆధ్యాత్మికశక్తిని ప్రపంచానికి పంచడానికి పాశ్చాత్యానికి వెళ్ళిన వాళ్ళల్లో ఆయన ఒకడు. ఆయన్ని అమెరికా అధ్యక్షుడు ఆహ్వానించాడు. ఆదరించాడు. ఆ సందర్భంలోని సంభాషణల్లో తన గురించి చెబుతున్నప్పుడల్లా రామతీర్థ 'రామతీర్థ మహారాజ్' అనేవాడు. ఆ మాట విన్నప్పుడల్లా అమెరికా అధ్యక్షుడికి ఆశ్చర్యం వేసింది. ఇబ్బంది కలిగింది. ఎందుకంటే రామతీర్థ ఒక సన్యాసి అని అతనికి తెలుసు. తను గొప్ప దేశానికి అధిపతిననీ తెలుసు.

రామతీర్థ మాటిమాటికీ తనను మహారాజ్ అని పిలుచుకుంటూ ఉంటే భరించలేక అమెరికా అధ్యక్షుడు "మీరు అన్యథా భావించకండి. మీరు మాటిమాటికీ మిమ్మల్ని 'మహారాజు, మహారాజు' అని పిలుచుకుంటున్నారు. మిమ్మల్ని చూస్తే మీరు సర్వసంగపరిత్యాగి. మీకేమీ లేనట్లు తెలుస్తుంది. కానీ ఎందుకని మీరు మిమ్మల్ని మహారాజు అని పిలుచుకుంటారు?" అని అడిగాడు.





రామతీర్థ ఆ మాటలకు "మీరన్నట్లు నాకు సామ్రాజ్యమూ లేదు. అందుకనే నన్ను నేను 'మహారాజు' అని పిలుచుకుంటున్నాను. ఎందుకంటే నా దగ్గర ఉన్నదాన్ని ఎవడూ లాక్కోలేడు. లాక్కోవడానికి నాదగ్గర ఏమీలేదు. నన్ను ఎవడూ ఓడించే వీల్లేదు. నేను చెబుతున్న మహారాజత్వం ఇహలోకానికి సంబంధించింది కాదు. అది పరలోకానికి సంబంధించింది. నా సార్వభౌమత్వాన్ని ఎవరూ నానుంచి తీసుకునే వీల్లేదు. మీ దగ్గరున్న రాజ్యాన్ని భోగభాగ్యాల్ని ఎవరయినా మీ నుంచి లాక్కునే వీలుంది. మీరు ఈ దేశానికి యిప్పుడు అధ్యక్షులు. మీ పదవిని యిప్పుడయినా కొంతకాలానికి అయినా మీరు కోల్పోయే అవకాశం ఉంది. కానీ నా స్థాయిని నా నుంచి ఎవరూ లాక్కునే వీలులేదు. కారణం కోల్పోవడానికి నా దగ్గర ఏమీలేదు. నాకు ఎట్లాంటి కోరికలూ లేవు. అనంత సంతృప్తి నాది. ఇప్పుడు చెప్పండి. నేను మహారాజును కాదా!" అన్నాడు.

అమెరికా అధ్యక్షుడికి నోటమాట రాలేదు.

## 91. సంతృప్తి

మనం ఏ పనిచేసినా ఆనందంగా చేయాలి. చేస్తున్నపని మనకు తృప్తినివ్వాలి. ఇతరులు మన గురించి ఏమనుకుంటున్నారో అసలు పట్టించుకోకూడదు. ఎందుకంటే అక్కడ మనం చేస్తున్న పని మన సంతోషం కోసం చేస్తున్నాం. అది ఇతరులకు ఆనందం కలిగిస్తే, గొప్పవాళ్ళు అయిపోవాలని, కీర్తి ప్రతిష్టలు పొందాలని అనుకోకూడదు. **ఇతరులతో పోల్చుకోకూడదు.**

దానివల్ల మనకు దుఃఖమే మిగులుతోనిది. ఆలోచిస్తే గొప్పవైన పనులు తక్కువ పనులు అంటూ ఉండవు. మనం చేసే పనిలో మనం సంతృప్తి పడడంలో సంతోషం దాగి ఉంది. ఇష్టపడడంలో ఆనందం ఉంది.

తను చేసేవి సాధారణమయిన పనులే కావచ్చు. వాటికి సౌందర్యాన్ని, సంపన్నతను తీసుకురావడంలో సంతోషముంటుంది. నిజమైన గొప్పతనం అందులో ఉంది. మన నడకలో, మన అనుదినకార్యక్రమాల్లో, తినడంలో, మాట్లాడడంలో, నిద్రలో మనస్ఫూర్తిగా ఇవన్నీ చెయ్యడంలోనే ఔన్నత్యముంది.

ఎపిక్యూరస్ గ్రీకు తాత్వికుడు. ఆయన దేవుణ్ణి విశ్వసించలేదు. దేవుణ్ణే కాదు. ఆయన దేన్నీ నమ్మలేదు. ఎందుకంటే అన్నింటికన్నా దారుణమైంది నమ్మకం. అది అర్థం లేనిది. సాధారణ జనాలు మాత్రమే విశ్వాసంలో పడతారు. శ్రద్ధ ఉన్నవాళ్ళు జీవితాన్ని పరిశీలిస్తారు. పరిశోధిస్తారు. పరవశిస్తారు. ఎపిక్యూరస్ ఆలోచనలు గ్రీసు దేశమంతా వ్యాపించాయి. కానీ అతను నిరాడంబరంగా, నిర్మలంగా జీవించేవాడు.

అతనికి చిన్నతోట ఉండేది. అక్కడ తన శిష్యులతో ఉండేవాడు. సాధారణ జనం అతన్ని నాస్తికుడని భావించేవాళ్ళు. నీతినియమాలు లేనివాడని నిందించేవాళ్ళు. ఎందుకంటే ఆయన దేవుణ్ణి నమ్మలేదు. ఏ గుడికీ వెళ్ళలేదు. తన శిష్యులతో హాయిగా, ఉల్లాసంగా జీవించేవాడు. ఆయన ఎట్లాంటి మతగ్రంథాలపట్ల నమ్మకం ప్రదర్శించలేదు. కానీ తన శిష్యులతో అద్భుతంగా, ఆనందంగా జీవించేవాడు. నిజానికి వాళ్ళు ఎవరూ సంపద ఉన్నవాళ్ళు కారు. సాధారణ జీవితం గడిపేవాళ్ళు. ఉన్నది తింటూ ఉత్సాహంగా ఉండేవాళ్ళు.

ఆ దేశాన్ని పాలించే రాజు వాళ్ళ గురించి విన్నాడు. దేవుడంటే నమ్మకం లేకుండా వాళ్ళు ప్రశాంతంగా ఎట్లా జీవిస్తున్నారో చూడాలనిపించింది. జనం నానాకష్టాలు పడుతుంటారు. నమ్మకమే లేని వీళ్ళు బతుకులెలా ఉన్నాయో రాజుకు చూడాలనిపించింది.

ఒకరోజు సాయంత్రం రాజు ఎపిక్యూరస్ ఉండేచోటకి వచ్చి అక్కడ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఎపిక్యూరస్ శిష్యుల్తో ఆడుతూ పాడుతూ ఆనందంగా ఉన్నాడు. వాళ్ళందరూ నవ్వుతూ దుఃఖమన్నది లోకంలో ఉందా? అన్నంతగా హాయిగా కనిపించారు. సాధారణమయిన ఆహారం తింటూ, మామూలు బట్టలు కట్టుకుంటూ ఇంత ఆనందంగా ఉండడం రాజుకు ఆశ్చర్యం కలిగించింది.

వాళ్ళ చర్యల్లో పారవశ్యం కనిపించింది. వాళ్ళు స్నానానికి వెళితే అది ఒక నాట్యంలాగా అనిపించింది. నదిలోని అలలతో తన్మయంగా వాళ్ళు కలిసిపోవడం రాజు చూశాడు. వాళ్ళ దగ్గర మామూలు రొట్టెలున్నాయి. ఆ రొట్టె తినడానికి ఉప్పుమాత్రమే ఉంది. వెన్న కూడా లేదు. అయినా అమృతాన్ని సేవించినట్లు ఎంతో తృప్తిగా వాళ్ళు తింటూ కనిపించారు. అంతకు మించి జీవితానికి ఇంకేమయినా అవసరముంటుందని వాళ్ళు అనుకోలేదు. రాజు వాళ్ళను చూసి దిగ్భ్రమకి లోనయ్యాడు.

రాజు ఎపిక్యూరస్‌తో "మిమ్మల్ని చూసి నాకు చాలా సంతోషం కలిగింది. ఈసారి వచ్చినప్పుడు మీకోసం ఏమైనా తీసుకు వద్దామనుకుంటున్నాను. ఏం కావాలో కోరుకో" అన్నాడు. దానికి ఎపిక్యూరస్ కొంత ఆలోచనలో పడి "మీరు మాకోసం ఏమైనా ఇవ్వాలని అనుకున్నందుకు కృతజ్ఞతలు. అయితే మాకు అన్నీ ఉన్నాయి. మాకు ఎట్లాంటి లోటూ లేదు. మీరు అంతగా అడుగుతున్నారు కాబట్టి ఏమైనా కోరకుంటే బాగుండదు. కాబట్టి ఈసారి వచ్చినప్పుడు దయచేసి వెన్న తీసుకురండి. అంతకు మించి ఏమీవద్దు" అన్నాడు. **సంతృప్తిలో సంతోషం దాగుంది.**



## 92. కోపం లేని యుద్ధం

కోపం వస్తే మనిషి అదుపు తప్పుతాడు. నిజమైన వీరుడు యుద్ధంలో పాల్గొంటాడు. అది అతని ధర్మంలో భాగం మాత్రమే. అక్కడ ఆగ్రహానికి అవకాశం లేదు. ఒక సూఫీ కథ. ఒమర్ అనే కలీఫీ జీవితంలో సంభవించిన ఘటన యిది. ఒమర్‌కు ఒక శత్రువు ఉండేవాడు. అతను కూడా శక్తివంతుడు. అతన్ని ఓడించడానికి ఒమర్ ఎన్నోసార్లు అతన్తో యుద్ధానికి తలపడేవాడు. ఆ యుద్ధాలు సంవత్సరాలు తరబడి జరిగేవి. మధ్యమధ్యలో కొన్నాళ్ళు ఎవరికి వారుగా ఉండిపోయేవారు. మళ్ళీ ఎప్పుడో యుద్ధం ప్రారంభమయ్యేది.

కానీ ఒమర్, అతని శత్రువు ఎప్పుడూ ఒకరికొకరు ఎదురు పడడం జరగలేదు. యుద్ధం ముప్పయ్యేళ్ళుగా విరామాలతో కొనసాగుతూనే ఉంది. ఒకర్నొకరు చంపాలని పట్టుదల మాత్రం అలాగే ఉంది. శత్రురాజులిద్దరు ముఖాముఖి ఎదురుపడడమంటూ జరగలేదు. ముప్పయ్యేళ్ళ అనంతరం యిద్దరూ ఎదురు చూస్తున్న సందర్భం వచ్చింది. ఒమర్, అతని శత్రువు యుద్ధరంగంలో గుర్రాలమీద ఒకరికొకరు ఎదురుపడ్డారు. ఒకర్నొకరు చంపుకోవాలన్న చిరకాలవాంఛ వాళ్ళల్లో కలిగింది. ఇంతకు మించిన అవకాశం జీవితంలో ఎప్పుడూ రాదని వాళ్ళు అనుకున్నారు. ఇద్దరిమధ్య భీషణయుద్ధం జరిగింది. అటువేపు సైనికులు, ఇటువేపు సైనికులు యుద్ధమాపి మహావీరులయిన తమరాజుల మధ్య జరుగుతున్న మహాసంగ్రామాన్ని చూడడం మొదలుపెట్టారు. ఒమర్, శత్రువు ఇద్దరూ గుర్రాలు దిగి ముఖాముఖి తలపడ్డారు. కత్తులు ఝుళిపిస్తూ కలయబడ్డారు. చాలాసేపు తమ ప్రావీణ్యంతో ఒకరిపై ఒకరు దాడిచేశారు. చివరికి ఒమర్ తన శత్రువు చేతిలోని ఖడ్గాన్ని ఎగరగొట్టాడు. శత్రువును కిందపడేశాడు. శత్రువు రొమ్ముమీద కూచుని కత్తితీసి అతని గుండెల్లోకి గుచ్చబోయాడు. అంతలో శత్రువు ఒమర్ ముఖంమీద తుపుక్కున ఉమ్మేశాడు.

కత్తిని శత్రువు గుండెల్లో దించబోయిన ఒమర్ ఆగాడు. శత్రువుపైనుంచీ లేచి ముఖం తుడుచుకుని 'మనం మళ్ళీ రేపు యుద్ధరంగంలో కలుద్దాం' అన్నాడు. శత్రువు విస్తుపోయాడు. చూస్తున్న సైనికులందరూ ఎంతో ఆశ్చర్యానికి గురయ్యారు. శత్రువు ఒమర్‌తో 'ఇది చిత్రంగా ఉంది. మనం ఒకర్నొకరు చంపుకుందామని ముప్పయి సంవత్సరాల నుంచి ఎదురుచూస్తున్నాం. ఇన్నేళ్ళకు నన్ను చంపే అవకాశం నీకు దొరికింది. ఒక క్షణంలో నువ్వు నన్ను అంతం చేయొచ్చు. ఎందుకు నన్ను చంపకుండా వదిలేశావు" అన్నాడు. ఒమర్ ఇది ధర్మయుద్ధం. నేను నా బాధ్యతని నెరవేర్చాలి. అదీ ఆగ్రహం లేకుండా యుద్ధం చేస్తానని నేను ప్రతిజ్ఞ చేశాను. ఇప్పుడే కాదు. గత ముప్పయి

సంవత్సరాలనుంచి నేను కోపం లేకుండానే యుద్ధం చేస్తున్నాను. ఎక్కడా ఎప్పుడూ నా ప్రతిజ్ఞకు భంగం కలగలేదు. కానీ నువ్వు నా మొహంమీద ఉమ్మినపుడు క్షణకాలం నాలో కోపం మెదిలింది. వెంటనే దాన్ని నేను గుర్తించాను. అది వేరే సంగతి. అయితే నాలో కోపం కలిగిందా? లేదా? కలిగింది కదా! కలిగితే ప్రతిజ్ఞ భంగమయినట్లే కదా! అంటే నాలో అహంకారం తలెత్తింది. 'నేను' అన్న గర్వం తలెత్తింది. ఈ ముప్పయ్యేళ్ళుగా నీతో యుద్ధం చేస్తున్నది నా కోసం కాదు. అది వ్యక్తిగతమైన విషయం కాదు. అది రాజ్యసంబంధమైనది. ఆ నిర్ణయమున్నప్పుడు అక్కడ కోపానికి వ్యక్తిగత ఆగ్రహానికి ఆస్కారం లేదు. కానీ నువ్వు నాపై ఉమ్మినపుడు నాలో అహంకారం తలసూపింది. అందుకని నేను తప్పు చేశానని గ్రహించాను. ఆ కారణంగా నిన్ను చంపలేదు. ఈరోజుతో ఇక్కడికి చాలు. మళ్ళీ మనం రేపు యుద్ధం చేద్దాం అన్నాడు. నిజానికి ఆ రేపటి యుద్ధమన్నది రానేలేదు. శత్రువు ఒమర్ మాటలు విని చలించిపోయాడు. "నువ్వు ఎంత ఉత్తముడివి! కోపం లేకుండా యుద్ధం చెయ్యడమన్నది అపూర్వ విషయం. నేను కూడా దాన్ని అభ్యసించాలనుకుంటున్నాను. దయచేసి నన్ను నీ శిష్యుడిగా చేసుకో. నువ్వు నా గురువువి" అని అతని పాదాలపై పడ్డాడు. దీన్నించి తెలిసేదేమంటే యుద్ధమే కాదు. **ఏ పనిచేసినా అహం లేకుండా చేయాలి. అహం లేకుండా చేస్తే ఏ పనయినా సానుకూలంగా ఉంటుంది. అద్భుతంగా ఉంటుంది.**

## 93. అనామకం

మనకో ప్రత్యేకత ఉంటుంది. మనమూ ప్రత్యేకత ప్రదర్శించడం మొదలుపెడితే పరిస్థితి మారుతుంది. మనం ప్రదర్శించుకోవడం వల్ల క్రమంగా మనకో నైపుణ్యం అలవడుతుంది. సాధారణంగా మనం ప్రదర్శిస్తూ ఉంటే జనం ఈర్ష్యాసూయలకు లోనవుతారు. కారణం వాళ్ళల్లో లేనిది మనం ప్రదర్శిస్తున్నాం. అది సాధారణ ప్రాపంచిక విషయాల్లో ఉంటుంది. ఆధ్యాత్మిక విషయాల్లో మరింతగా ఉంటుంది. సత్యాన్ని గ్రహించిన వాళ్ళ ప్రదర్శనకు పూనుకుంటే జనం ఆగ్రహిస్తారు. తమ జీవనవిశ్వాసాల్ని గాయపరిచే సత్యసంధుల్ని మన్నించలేరు.

తావోరుషుల విధానం వేరు. వాళ్ళు జనాలకు 'బోధలు చేయవద్దని, జనం ముందు తెలివితేటలు ప్రదర్శించవద్దని' చెబుతారు. అసలు జనాన్ని తప్పించుకుని తిరగడంలో గొప్ప ఆనందముందంటారు. వాళ్ళెప్పుడూ తమ తెలివితేటలమీద ఆధారపడలేదు. తమ ప్రత్యేకతని నిరూపించుకోవాలని ప్రయత్నించలేదు. సాధారణ ప్రజలకన్నా తాము అధికులమని వారు భావించలేదు. అలా అని ఎవరితో చెప్పుకునేవారు కాదు.





తావో సిద్ధాంత కర్త అయిన లావోత్సు శిష్యుడయిన చువాంగ్‌త్సు కూడా అట్లాంటి నిర్మల, నిరాడంబరజీవితం గడిపినవాడు. నిజానికి అతను ప్రతిభావంతుడు. నైపుణ్యమున్నవాడు. అసాధారణ వ్యక్తి. కానీ వాటిని ఎక్కడా ప్రదర్శించి తమ గొప్పతనాన్ని చాటుకోలేదు. అసలు ఇట్లాంటి గొప్ప వ్యక్తి మనమధ్య ఉన్నాడన్న విషయం తన చుట్టుపట్ల వాళ్ళకు కూడా తెలియకుండా జీవించాడు.

చువాంగ్‌త్సు నిరంతర సంచారి. ఎప్పుడూ ఒక దగ్గర ఉండేవాడు కాదు. ఈ రోజు ఒక గ్రామంలో ఉంటే ఇంకోరోజు ఇంకో గ్రామానికి వెళ్ళేవాడు. అసలు ఒక గ్రామంలో ఆ రోజులో బసచేసినట్లు ఆ గ్రామస్థులకే తెలియకుండా ఉండేవాడు.

కానీ ప్రతిభ అన్నది ఏదోరూపంగా పరిమళాల్ని చిమ్ముతుంది. చువాంగ్‌త్సు గురించి చక్రవర్తికి తెలిసింది. అతను గొప్ప తాత్వికుడని, సత్యాన్వేషి అని, నిరాడంబర జీవితం గడుపుతాడని ఆయన విన్నాడు. అట్లాంటి వ్యక్తి తన ఆస్థానంలో ఉంటే అది తనకు గర్వకారణమవుతుందని చక్రవర్తి భావించాడు. వెంటనే తన మంత్రిని పిలిపించి "సకల మర్యాదలతో చువాంగ్‌త్సును మన ఆస్థానానికి తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు.

ఆజ్ఞ జారీ చేశాడు. కానీ చువాంగ్‌త్సుని పట్టుకోవడమెట్లా? మంత్రిగారికి అది పెద్ద సంకటంగా మారింది. ఎందుకంటే చువాంగ్‌త్సు ఎప్పుడూ ఒక దగ్గర ఉండేరకం కాదు. పైగా చువాంగ్‌త్సు "ఎప్పుడూ ఒకే దగ్గర ఉండకు. ఎందుకంటే ఒకేదగ్గర ఉండే నువ్వు జనం నుంచి తప్పించుకోలేవు. జనం నిన్ను సందేహిస్తారు. నీ దగ్గర ఏమయినా ఉంటే అనుమానం ఎక్కువవుతుంది. కాబట్టి వాళ్ళు నీ గురించి పూర్తిగా తెలుసుకోకముందే అక్కణ్ణించి నిష్క్రమించు" అంటూ ఉండేవాడు.

కానీ మంత్రికి అతని ఆచూకి కనిపెట్టడం తప్పదుకదా! మనుషుల్ని పంపాడు. మొత్తానికి కొంతమంది అతన్ని ఎట్లా కనిపెట్టవచ్చో చెప్పారు. "అసాధారణంగా కాదు, అతి సాధారణంగా ఉన్న వ్యక్తి ఎవరైనా గ్రామంలోకి ప్రవేశించి ఉంటే అతనే అని మీరు చువాంగ్‌త్సుని పసికట్టవచ్చు" అన్నారు. చివరకి ఒక గ్రామంలో చువాంగ్‌త్సు దొరికాడు. ఆ రోజే ఆయన ఆ గ్రామంలోకి ప్రవేశించాడు. మంత్రిగారి మనుషులు చువాంగ్‌త్సుని చూశారు. అతను ఎంతో సామాన్యంగా నిరాడంబరంగా ఉన్నాడు. ఆశ్చర్యపోయారు. అయినా చక్రవర్తి ఆదేశం. వాళ్ళు చువాంగ్‌త్సుతో "చక్రవర్తి నిన్ను వెతికి పట్టుకోమన్నారు. సకల మర్యాదలతో నిన్ను ఆహ్వానించమని చెప్పారు. నీలాంటి వ్యక్తి రాజుగారి ఆస్థానంలో ఉండాలని రాజుగారి కోరిక. నీకు యిష్టమేనా?" అన్నారు.

చువాంగ్‌త్సు "ఉన్నఫళంగా మీరు అడిగితే వెంటనే ఎట్లా చెప్పేది. రేపటిదాకా నాకు సమయమివ్వండి. ఆలోచించుకుని చెబుతాను" అన్నాడు. వాళ్ళు సరేనని వెళ్ళారు.

మరుసటిరోజు ఉదయానికి వాళ్ళువచ్చి చూస్తే ఛువాంగ్‌త్సు లేడు! ఆ గ్రామం వదిలి వెళ్ళిపోయాడు! తన సామర్థ్యాన్ని ప్రదర్శించుకోవడానికి ఇష్టపడని వ్యక్తి ఛువాంగ్‌త్సు.

## 94. దృష్టిభేదం

ఏదయినా మనం చూడడాన్ని బట్టే ఉంటుంది. ఒకరు ప్రతిమను దైవంగా భావించి ఆరాధిస్తూ ఉంటారు. ఇంకొకరు రాతివిగ్రహం పూజించడమేమిటి? అనుకుంటారు.

ఒకరోజు మైకెలాంజిలో దారంటే వెళుతున్నాడు. దారిపక్కన పాలరాతి బండల్ని అమ్మే దుకాణం కనిపించింది. ఆ షాపులో రకరకాల పాలరాతి బండలు పేర్చి ఉన్నాయి. వివిధ వర్ణాలతో ఉన్నాయి. అయితే షాపు బయట ఒక రాతి దిమ్మె కనిపించింది. అది తనకు ఎంతో ఉపయోగపడుతుందని భావించి మైకెలాంజిలో "ఈ దిమ్మ ఖరీదు ఎంత" అని అడిగాడు? షాపు యజమాని మైకెలాంజిలో కేసి చిత్రంగా చూశాడు.

"ఈ పాలరాతి దిమ్మె పదేళ్ళనించే ఇక్కడ పడి ఉంది. పనికిరాదన్న ఉద్దేశంతో బయటపడేశాం. దీన్ని ఊరికే ఇచ్చేస్తాను. ఇక్కడ నుంచి తీసుకెళ్ళు. కనీసం అడ్డం లేకుండా ఉంటుంది. ఆ స్థలంలో ఇతర రాళ్ళను పేర్చిపెట్టుకునే వీలుంటుంది. దీన్ని తీసికెళితే నువ్వు నాకు సాయపడిన వాడవవుతావు. మైకెలాంజిలో ఆ పాలరాతి బండను తీసుకెళ్ళాడు. సంవత్సరం గడిచాకా మైకెలాంజిలో షాపు దగ్గరకి వచ్చి దయచేసి నాతోబాటు రండి అని అతన్ని తీసుకెళ్ళి ఒక అద్భుతమైన శిల్పాన్ని చూపించాడు. అది క్రీస్తు శిల్పం. షాపు యజమాని ముకుళిత హస్తాలతో ఆ శిల్పానికి అభివాదం చేసి "ఎంత గొప్ప శిల్పాన్ని సృష్టించారు" అని అభినందించాడు. తను తీసుకెళ్ళమన్న రాతి దిమ్మెనుంచి ఈ అపూర్వ కళాఖండాన్ని ఆవిష్కరించిన మైకెలాంజిలో "మీ షాపుముందు నుంచీ ఆ రోజు వెళుతూ ఉంటే నాకు జీసస్ కనిపించాడు. తనకు అడ్డంకిగా ఉన్న రాతిముక్కలు తొలగిస్తే ఆయన బయటపడతానని నాతో చెప్పినట్లనిపించింది. ఆయనకు అడ్డంగా ఉన్న రాతిముక్కల్ని తొలగించాను. నేను చేసింది అదే అన్నాడు. దానికి సుత్తి, ఉలి సహకరించాయి. ఆ శిల్పంలో మేరీ ఒళ్ళో ఉన్న క్రీస్తు. శిలువ అపూర్వంగా చెక్కబడి ఆ శిల్పం ప్రపంచ ప్రఖ్యాతి పొంది మైకెలాంజిలోకు ఎనలేని కీర్తి తెచ్చిపెట్టాయి. శిల్పం వాటికన్ సిటీలో ఉండేది. ముప్పయ్యేళ్ళ క్రితం దాకా ప్రపంచవ్యాప్తంగా కోట్లమంది జనం ఆ శిల్పాన్ని దర్శించి పరవశించారు. ఆ మహాకళాకారుణ్ణి వేనోళ్ళా పొగిడారు. ముప్పయ్యేళ్ళ క్రితం ఒక పిచ్చివాడు సుత్తి తీసుకుని మ్యూజియంలోకి వెళ్ళి ఆ శిల్పంలోని మేరీ, జీసస్ తలల్ని పగలగొట్టాడు. మళ్ళీ అంత గొప్పగా ఆ శిల్పాన్ని ఆవిష్కరించాలంటే అసాధ్యం. ప్రపంచమంతా ఆ జరిగిన సంఘటన తెలిసి విస్తుపోయింది. బాధపడింది.





మొత్తానికి ఆ దొంగను పట్టుకున్నారు. జైల్లో వేశారు. కోర్టులో కేసు నడిచింది. అతనాపని చేశాడంటే పిచ్చివాడయి ఉండాలి. మొదట పిచ్చివాడనుకున్నారు. కానీ, చూస్తే మామూలు మనిషిలాగే అనిపించాడు. జడ్జి "ఎందుకు ఇంత దుర్మార్గానికి ఒడిగట్టావు? అపూర్వమయిన ఆ మహాకళాకారుడి శిల్పాన్ని ఎందుకు ధ్వంసం చేశావు?" అని అడిగాడు. దానికి ఆ వ్యక్తి చెప్పిన సమాధానం వింటే మనకు ఆశ్చర్యం వేస్తుంది. ఆ వ్యక్తి "నేను మైకెలాంజిలోలా గొప్ప శిల్పిని కాను. నేను మామూలు మనిషిని. మైకెలాంజిలో చనిపోయి వందల సంవత్సరాలు గడిచినా అందరూ ఆయన గొప్పతనాన్ని చెప్పుకుంటున్నారు. నేను మైకెలాంజిలోలా గొప్పశిల్పాన్ని సృష్టించలేను. కానీ పదిమందీ నన్ను పదికాలాలు గుర్తుపెట్టుకోవాలంటే ఏం చెయ్యాలి? చరిత్రలో నా పేరు నిలిచిపోవాలంటే ఏం చెయ్యాలి? నాకు ఇంతకుమించిన మార్గం దొరకలేదు. అందుకని ఆ శిల్పాన్ని పగలగొట్టాను. నేను అనుకున్నపని జరిగింది. నా కోరిక నెరవేరింది. పత్రికల్లో, మీడియాల్లో నా పేరు మారుమోగిపోయింది. ఇక నాకు ఉరిశిక్ష విధించినా అభ్యంతరం లేదు. మీ ఇష్టం" అన్నాడు.

మైకెలాంజిలో ఒక రాతి దిమ్మెలో మహా శిల్పాన్ని చూశాడు. ఆవిష్కరించాడు. కోరికతో వ్యక్తి అదే శిల్పాన్ని పేరు కోసం విధ్వంసం చేశాడు. మైకెలాంజిలో పేరుప్రతిష్ఠల కోసం ఆ శిల్పాన్ని సృష్టించలేదు. మహాకళాకారుడికి మహా ఆవిష్కరణ అన్నదే ముఖ్యం. సాధారణ వ్యక్తికి పేరు రావడం ముఖ్యం. దానికోసం అనుచితమైన పనులు కూడా చేస్తాడు.

## 95. తిరస్కారమే పురస్కారం

జెన్ గురువులు చిత్రమయిన వాళ్ళు. వాళ్ళల్లో పోటీ తత్త్వముండదు. తమ దగ్గర ఎక్కువమంది శిష్యులు ఉండాలని, తాము ఇతరులకన్నా గొప్పవాళ్ళమని, వాళ్ళెప్పుడూ అనుకోరు. శిష్యుల్ని తమకన్నా తక్కువ వాళ్ళనీ భావించరు. తమ దగ్గర వివేకం పొందలేని శిష్యుల్ని ఫలానా ఆయన గొప్ప గురువు. ఆయన దగ్గరికి వెళ్ళి అభ్యసించు అని కూడా చెబుతారు.

ఒక జెన్ గురువు దగ్గర ఒక శిష్యుడు ఉండేవాడు. ఎన్నో సంవత్సరాలు గురుశుశ్రూష చేశాడు. గురువు బోధనలు వినేవాడు. అభ్యాసం చేసేవాడు. గురువు వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి ప్రయత్నించేవాడు కానీ చెప్పలేకపోయేవాడు. అతనికి ఏకాగ్రత కుదిరేది కాదు. ఎన్నో రకాలుగా గురువు ప్రయత్నించారు. కానీ లాభం లేకపోయింది. అప్పటికీ ఆ శిష్యుడు ఆశ్రమంలోకి వచ్చి సంవత్సరాలు

గడిచిపోయాయి. ఏళ్ళు గడిచినా శిష్యుడిలో వివేకం వికసించలేదు. గురువుకు చిరాకు వేసేది. కసురుకునేవాడు. శిష్యుడు మొద్దురాచ్చిప్పలా పడి ఉండేవాడు.

ఒకరోజు గురువు శిష్యుణ్ణి పిలిచి 'నీకు బోధించడం నావల్ల కాదు. నీలో ఎట్లాంటి పరివర్తన రాలేదు. జ్ఞానానికి సంబంధించిన ఏ వెలుగూ లేదు. నువ్వు నా ఆశ్రమం నుంచి వెళ్ళిపో" అన్నాడు. శిష్యుడు మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు. సాయంత్రం దాకా అక్కడా యిక్కడా తిరిగి మళ్లీ ఆశ్రమానికి వచ్చాడు. శిష్యుడు అట్లాంటి వాడని గురువుకు తెలుసు. అతను తిరిగి వస్తాడనీ గురువుకు తెలుసు. గురువు శిష్యుణ్ణి చూసి 'లోపలకు రాకు. బయటకు వెళ్ళు.' అని తలుపులు మూసేశాడు. శిష్యుడు "గురువు వద్దన్నాడు. గురువు చెప్పినవన్నీ విన్నాను. కానీ తిరస్కరించాడు. ఇక ఈ ఆశ్రమాన్ని వదిలిపెట్టడం మంచిది. ఎదురుగా వేరే ఆశ్రమం ఉంది కదా! అక్కడికి వెళతాను. అక్కడున్న కొత్త గురువు కొత్తకొత్త విషయాల్ని బోధించే అవకాశముంటుంది" అనుకుని ఎదురుగా ఉన్న ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమంలోని గురువుగారికి నమస్కరించి "నేను ఎదురుగా ఉన్న ఆశ్రమంలో ఎనిమిదేళ్ళుగా ఉంటున్నాను. శ్రద్ధగా గురువు సేవ చేశాను. నాకు జ్ఞానం కలిగే వీలులేదని మా గురువుగారు తిరస్కారంగా, నిర్దయగా నన్ను బయటికి తరిమేశాడు. నా పరిస్థితి ఇలా ఉంది. దయచేసి మీరు అనుమతిస్తే నేను మీ శిష్యుడిగా చేరతాను" అన్నాడు.

శిష్యుడు మాటలు విని ఆ ఆశ్రమ గురువు "నాయనా! నిన్ను శిష్యుడిగా స్వీకరించడానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. కానీ నువ్వు అక్కడ ఆ ఆశ్రమంలోనే ఉండడానికి అర్హుడివి. ఇన్నేళ్ళనుంచి నేను నిన్ను, మీ గురువుగారిని చూస్తూనే ఉన్నాను. నువ్వు తెలుసుకోవలసిన విషయం ఒకటుంది. నువ్వంటే మీ గురువుకి ఎంతో ప్రేమ. ఆయన నీ పట్ల ఎంతో కరుణ, జాలి ప్రదర్శిస్తాడు. ఆయన నీ పట్ల ప్రదర్శించిన దయను నేను నీ పట్ల చూపలేను. ఆయన నిన్ను బయటికి తోసి తలుపులు వేసుకున్నా అది ఆయన ప్రేమలో భాగమే అన్న సంగతి నువ్వు గుర్తించాలి. ఆయన కాదన్నా ఆయన్ని వదిలిపెట్టకు. తలుపులు వేసుకున్నా బయటే కూచో. అప్పుడు నీకు అన్నీ తెలిసివస్తాయి" అని పంపేశాడు.

శిష్యుడు శ్రద్ధగా అన్నీ విని ఆ మాటల్ని హృదయానికి పట్టించుకున్నాడు. తన గురువుపట్ల అతనికి అపార విశ్వాసమేర్పడింది. తమ ఆశ్రమం ముందు పద్మాసనం వేసుకుని ధ్యానంలో లీనమయ్యాడు. ఎప్పుడు తెల్లవారిందో తెలీదు. శిష్యుడు తన్మయత్వంలో ఉన్నాడు. గురువు తలుపులు తెరిచి శిష్యుణ్ణి చూశాడు. శిష్యుడి ముఖంలో తేజస్సు విరచిమ్ముతోంది. అతనిలో వచ్చిన పరివర్తనను గురువు వెంటనే పసికట్టేశాడు.



అప్పటిదాకా బుద్ధుని విగ్రహానికి పూజలు చెయ్యడానికి గురువు పూలు సేకరించి ఉంచాడు. ఆ పూలని శిష్యుని తలపై చల్లాడు. ఆ పూల తాకిడితో కళ్ళు తెరిచిన శిష్యుడు "గురువుగారూ! ఏం చేస్తున్నారు? బుద్ధుని కోసం పెట్టిన పూలని నాపై చల్లుతున్నారా?" అన్నాడు. దానికి గురువు "ఈ రోజుకు పూలు లేకున్నా బుద్ధుడు ఏమీ అనుకోడు. సర్దుకుంటాడు. ఇప్పుడు నా కళ్ళముందు విగ్రహాన్ని కాదు, ప్రాణంతో కదిలే బుద్ధుణ్ణి చూస్తున్నాను. ఆ బుద్ధుణ్ణి పూజించడం నా ధర్మం". "గురువుగారూ! ఎన్నో ఏళ్ళ నుంచి మీ దగ్గరే ఉన్నాను. మొద్దులా పడి ఉన్నాను. ఇంకా ఎన్నో ఏళ్ళు పడి ఉండేవాణ్ణి మీ తిరస్కారమే నాకు పురస్కారమయింది" అని నమస్కరించాడు.

## 96. నిశ్శబ్ద ద్వేషం

ద్వేషంతో ఉన్న వ్యక్తుల్తో సంబంధముంటే ఫరవాలేదు. ద్వేషంగా ఉన్నవాళ్ళని మార్చే అవకాశం ఉంది. కారణం ద్వేషాన్ని తలకిందులు చేస్తే ప్రేమ ఉంటుంది. ప్రేమకు వ్యతిరేక దిశలో ద్వేషముంటుంది. మనల్ని వ్యతిరేకించేవాళ్ళతో మనకు సమస్య ఉండదు. అక్కడ విషయం స్పష్టం. రహస్యం లేదు. అట్లాగే ప్రేమగా ఉన్న వ్యక్తుల్తో పేచీ ఉండదు. సమస్యేలేదు. ఇక మూడోరకం మనుషులుంటారు. సమస్య వాళ్ళతోనే. చలనం లేనివారు, స్పందన లేనివాళ్ళు ఉంటారు. ప్రమాదమంతా వాళ్లతోనే. వాళ్లని మార్చలేం. మారాలన్న దృష్టే వాళ్ళకు ఉండదు.

ఒక తత్త్వవేత్త మతంపై ఒక గ్రంథం రాశాడు. అది తీవ్ర దుమారాన్ని లేపింది. మతమంటే ఏమిటి? అని అతను అన్ని కోణాల్లో పరిశీలించాడు. విశ్లేషణాత్మకంగా వివరించాడు. కానీ దాన్ని అన్ని మతసంస్థలు వ్యతిరేకించాయి. మతపెద్దలు ఆ గ్రంథాన్ని నిషేధించారు. కారణం అది విశ్వాసాన్ని దెబ్బతీసేదిగా ఉందని, జనాల్ని తప్పుదారి పట్టించేదిగా ఉందని వాళ్ళు అభిప్రాయపడ్డారు.

కానీ ఆ తత్త్వవేత్త ఊరికే ఉండే రకం కాదు. ఒక మతపెద్దమీద అతని దృష్టి పడింది. అతన్ని రెచ్చగొట్టాలని సంకల్పించాడు. తన శిష్యుణ్ణి పిలిచి "ఈ పుస్తకం తీసుకెళ్ళి మతపెద్ద దగ్గరకి వెళ్ళి నేనిచ్చానని అతనికివ్వు. అతని ప్రతిక్రియ ఎలా ఉంటుందో గమనించు. అతను ఏం చెబుతాడో గమనించు. అంతా నాకు పూసగుచ్చినట్లు వివరించు" అన్నాడు. శిష్యుడు ఆ గ్రంథం తీసుకుని మతపెద్ద దగ్గరికి భయం భయంగా బయల్దేరాడు. ఆ గ్రంథం గురించి మతపెద్దకు తెలిసింది. అయినా ధైర్యం కూడగట్టుకుని శిష్యుడు మతపెద్దయింటికి వెళ్ళాడు. మతపెద్ద భార్యతో ఏదో ముచ్చటిస్తున్నాడు. శిష్యుడు మత పెద్దని చూసి నమస్కరించి, ఆ గ్రంథాన్ని అతని చేతికి అందించాడు. మతపెద్ద 'ఏమిటి ఈ గ్రంథం?' అన్నాడు. శిష్యుడు ఫలానా తాత్త్వికుడు రాసిన గ్రంథమన్నాడు.

ఆ మాటతో ఒక్కసారిగా ఆగ్రహోగ్రుడై ఆ గ్రంథాన్ని కిటికీలోంచి బయటకు విసిరేసి చేతులు దులుపుకుంటూ "గ్రంథం నాకు ఇవ్వకముందే ఆ గ్రంథం ఏవరిదో నాకు చెప్పాలి కదా! ఈ గ్రంథాన్ని ముట్టుకోవడంతో నా చేతులు మలినమయ్యాయి. ఇప్పుడు వెళ్ళి నేను చేతులు శుభ్రంగా కడుక్కోవాలి" అని చిరాకు పడ్డాడు. శిష్యుడంతా గమనిస్తున్నాడు. మతపెద్ద భార్య అక్కడే అంతా గమనిస్తోంది. ఆమె భర్త ప్రవర్తనకు నొచ్చుకుంది. శిష్యుడు ఆమెను కూడా గమనించాడు. ఆమె "మీరు ఈ కుర్రాడిపట్ల ఎందుకంత నిర్దయగా ప్రవర్తించారు. పైగా మీరు పుస్తకాన్ని అట్లా విసిరేయాల్సిన అవసరం లేదు. మీ దగ్గర లైబ్రరీలో వేల గ్రంథాల్లో అదొకటిగా పడి ఉండేది. లేదా ఆ కుర్రాడు వెళ్ళాక నువ్వు దాన్ని విసిరేసి తరువాత శుభ్రంగా స్నానం చేసి ఉండవచ్చు" అంది.

శిష్యుడు అక్కడనుంచి నిష్క్రమించి గురువుగారి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పాడు. గురువుగారు అంతా విని "ఇంతకూ నీ అభిప్రాయమేమిటి?" అన్నాడు. శిష్యుడు "నా మటుకు ఆ మతపెద్ద మూర్ఖుడు. సంస్కారహీనుడు. మర్యాద తెలియనివాడు అనిపించాడు. ఏ మాత్రం మర్యాద లేకుండా మొహంమీద మీ గురించి అవమానంగా మాట్లాడాడు. కానీ ఆయన భార్య మాత్రం చాలా సంస్కారవంతురాలనిపించింది. మర్యాద తెలిసిన మనిషి అనిపించింది. నా మటుకు ఆమె అంటే నాకు గౌరవమేర్పడింది" అన్నాడు. శిష్యుడు మాటలు విని గురువు "నువ్వు పొరపాటుగా అర్థం చేసుకున్నావు. పైకి కనిపించిన దాన్ని బట్టే మనిషి తత్త్వాన్ని అంచనా వేశావు. నాకు మతపెద్ద అంటేనే గౌరవం కలిగింది. అతను నిలువెల్లా ద్వేషంతో నిప్పులు చెరిగాడు. అట్లాంటి వ్యక్తే ప్రేమపూరితుడుగా అయ్యే వీలుంది. ద్వేషాన్ని ప్రేమగా వర్తింపచేసే వీలుంది. కాబట్టి అక్కడ ఎట్లాంటి సమస్యా లేదు. ఈరోజు ద్వేషించినవాడు రేపు ప్రేమిస్తాడు. కానీ అతని భార్యను తలుచుకుంటేనే నాకు భయం వేస్తోంది. ఆమెలో చలనం లేదు. ప్రతిస్పందన లేదు. ఆమెకు మార్పుకు లొంగని, మొండి అభిప్రాయాలున్నాయి. అక్కడ కదలికకు అవకాశమే లేదు. ఆమెను ఎప్పుడూ ఎవరూ మార్చలేరు. **బహిరంగద్వేషం మారే వీలుంది. నిశ్శబ్దద్వేషం నిశ్చలమైంది. దాన్ని మార్చలేము"** అన్నాడు.

శిష్యుడు ఆశ్చర్యపోయాడు.

## 97. ధ్యానం

**ధ్యానమంటే మన ఆలోచనలపై దృష్టి నిలపడం, మన ఆలోచనలను పక్కన పెట్టడం. మన ఆలోచనలను పరిశీలించడం.** కాని మనం ఆగమంటే ఆలోచనలు ఆగుతున్నాయా? వాటి యిష్టం వచ్చినట్లు లాగుతున్నాయా?మనం వాటిపై అధికారం





చెలాయిస్తున్నామా? మనపై అవి అధికారం చెలాయిస్తున్నాయా?ఈ విషయాన్ని మనం జాగ్రత్తగా గమనించాలి.

ఒక శిష్యుడు గురువుగార్ని ఎన్నో ఏళ్ళు భక్తి, శ్రద్ధలతో సేవించాడు. ఆ గురువు దగ్గర ఎన్నో మంత్రాలున్నాయని, మహత్తులున్నాయని, ఆ శిష్యుడు విన్నాడు. అతనికి తను ఏమనుకుంటే అది జరిగేలా గురువు నుంచి వరం పొందాలని కోరిక. అద్భుతాల్ని ఆవిష్కరించాలని అతని కాంక్ష. ఇట్లాంటి గొప్పవాడయిన గురువును మంచి చేసుకుంటే తన కోరిక తీరుతుందని పట్టుదలతో ఎన్నో ఏళ్ళు నుండి గురువుకు సేవలు చేశాడు. కానీ తన కోరికను అడగాలనుకుని గురువు ఏమంటాడో అని, ఎప్పుడూ సంశయిస్తుండేవాడు. గురువు ఎప్పుడూ అతన్ని గమనిస్తూ ఉండేవాడు. ఏదో ప్రయోజనాన్ని ఆశించే అతను తన దగ్గరికి వచ్చినట్లు గురువు తెలుసుకున్నాడు. ఒకరోజు గురువుగారు శిష్యుణ్ణి చూసి "నిన్ను గమనిస్తున్నాను. నువ్వు నా దగ్గరికి వచ్చిన రోజునుంచీ చూస్తున్నా. నీ మనసులో ఏదో ఉంది. నన్ను ఏదో అడగాలన్న ఆరాటం నీకుంది. కానీ అడగడానికి సంశయిస్తున్నావు. నేనేమీ అనుకోను. నాకు వీలయితే నీ కోరిక తీరుస్తాను. నిస్సంశయంగా నువ్వు అడగవచ్చు" అని భరోసా ఇచ్చాడు. శిష్యుడు ఏళ్ళకొద్దీ ఆ మాటకోసమే ఎదురుచూస్తున్నాడు. "గురువు గారూ! నేను ఏది అనుకుంటే అది జరగాలని నాకు వరమివ్వండి. మీ దగ్గర ఎన్నో మంత్ర తంత్రాలున్నాయని విన్నాను" అన్నాడు. గురువు ఇన్నాళ్ళూ ఇతను తనకు చేసిన శిష్యరికం వెనుక ఉన్న ఉద్దేశ్యం ఇదా? అనుకున్నాడు. ఇనాళ్ళు చేసిన సేవలో ప్రయోజనం తప్ప ఏమీ లేదా అని విస్తుపోయాడు. "నువ్వు అనవసరంగా ఇన్ని సంవత్సరాలు వ్యర్థం చేశావు. కష్టపడ్డావు. కాలయాపన చేశావు. ఇంత చిన్న విషయాన్ని అడగడానికి సంశయించావు. నువ్వు వచ్చిన మొదటిరోజే అడిగి ఉంటే కూడా నీ కోరిక తీర్చేవాణ్ణి. ఇదెంత పని?నీకో మంత్రం చెప్తాను. శుభ్రంగా స్నానం చేసి పవిత్రభావంతో కూచుని **"బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి"** అన్న ఈ మూడు వాక్యాల్ని ఐదుసార్లు చెప్పిన తరువాత నువ్వు ఏమి కావాలనుకుంటే అది జరుగుతుంది. నువ్వు గాల్లోకి ఎగరవచ్చు. ఏది కావాలంటే అది సృష్టించవచ్చు. నువ్వేది అనుకుంటే అది జరుగుతుంది. అయితే చిన్న షరతు. ఈ మంత్రాలు చెప్పేటప్పుడు కోతిని మాత్రం గుర్తు తెచ్చుకోవద్దు" అన్నాడు. గురువు రహస్యం తనకు బోధించినందుకు పరమ సంతోషపడి, "అయినా మంత్రం పునశ్చరణ చేసేటప్పుడు కోతిని ఎందుకు గుర్తు తెచ్చుకుంటాను" అని నవ్వుకుని విజయం సాధించినవాడుగా, వెళ్లిపోయాడు. ఇంటికి వెళ్ళి స్నానపానాలు ముగించుకుని శ్రద్ధగా ఆసనం మీద కూచుని "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అన్నాడు. 'హమ్మయ్య ఒక్కసారి పూర్తయింది. ఇక నాలుగుసార్లు

పూర్తిచేస్తే ఈ ప్రపంచంలో ఇక నన్ను మించిన వాడుండడు. నేను అనుకున్నదల్లా సాధిస్తాను. ఈ ప్రపంచాన్ని ఆడిస్తాను. అనుకుని 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నాడు. అంతలో మనసులో కోతి మెదిలింది. కిచకిచలాడింది. మంత్రాన్ని ఆపి మనసులోకి చూశాడు. రకరకాల కోతులు, రంగు రంగుల కోతులు, ఎగురుతున్నాయి. గంతులేస్తున్నాయి. మనసు అదుపు చెయ్యడానికి ప్రయత్నించాడు. మళ్ళీ మొదటినుంచి "బుద్ధం శరణం..." అంటూ మొదలుపెట్టాడు. కోతులు ఆకాశం నుంచి మనసులోకి దూకినట్లు అనిపించింది. ఎన్నిసార్లు ప్రయత్నించినా కోతుల్ని అదుపు చెయ్యలేకపోయాడు. చెమటలు పట్టాయి. శరీరం వణికిపోయింది. జ్వరం వచ్చింది. పరిగెత్తుకుంటూ వెళ్ళి గురువు పాదాలపై పడి "గురువు గారూ! బుద్ధి గడ్డి తిని దురాశతో, దుష్టచింతనతో మిమ్మల్ని ఆ కోరిక కోరాను. నన్ను మన్నించండి. నాకు ఆ వరమూ వద్దు. ఈ అశాంతి వద్దు. కోతుల బెడద నుంచి నన్ను రక్షించండి" అని వేడుకున్నాడు.

## 98. కమాల్

**మనుషుల మాటల్ని బట్టి ఎప్పుడూ వాళ్ళని అంచనా వేయకూడదు. వాళ్ళ చర్యల్ని బట్టే వాళ్లని గుర్తించాలి.** కబీర్ మహామార్మికుడు. ఆయన బోధనలు వినడానికి ఎప్పుడూ ఎందరో వస్తూ ఉండేవాళ్ళు. కబీర్‌కు కమాల్ అన్న కొడుకు ఉండేవాడు. అతను భక్తుల్ని, తండ్రి మాటల్ని గమనిస్తూ ఉండేవాడు. భక్తులు కబీర్ బోధనల్ని విని తరించేవాళ్ళు. తాము తెచ్చిన బహుమతుల్ని కబీర్‌కు ఇవ్వబోయేవాళ్ళు. కబీర్ నిరాడంబర జీవి. స్వయంగా మగ్గం నేసి జీవించేవాడు. ఎవరు ఏమి ఇచ్చినా స్వీకరించేవాడు కాదు. వద్దు అనేవాడు. కమాల్ "ఆయన అట్లాగే అంటాడు. అవన్నీ నాకు ఇవ్వండి. నేను భద్రపరుస్తాను" అనేవాడు. కబీరుకు ఎంతో ఆగ్రహం వచ్చేది. "నేను ఏవీ వద్దంటే నువ్వెందుకు తీసుకుంటున్నావు" అన్నాడు. కమాల్ "ఏది మంచో ఏది చెడ్డో నాకు తెలుసు. నేను మీ కొడుకును. ఇన్నేళ్ళనుంచీ మీ దగ్గర ఉంటున్నాను. మీరు చెప్పేవి వింటున్నాను. మీరు నాకు అదనంగా బోధించాల్సినదేమీ లేదు" అన్నాడు. కబీర్ కోపం కట్టలు తెంచుకుంది. "అందర్లో నువ్వు నా పరువు తీస్తున్నావు. ఆశపోతువయ్యావు. నీకూ నాకూ ఎట్లాంటి సంబంధమూ లేదు. నా వంశం నాతోనే అంతమయిందను కుంటాను" అన్నాడు. కమాల్ "మీరు అట్లా అనుకుంటే నాకు ఎట్లాంటి అభ్యంతరమూ లేదు. నేను మీకు ఇబ్బంది కలిగించదలచుకోలేదు. నేను వెళ్లిపోతున్నాను" అని కబీర్ ఇంటిముందే ఒక గుడిసె వేసుకున్నాడు.

భక్తులు వచ్చి కబీర్ బోధనల్ని వినేవాళ్ళు. వెళుతూ వెళుతూ కమాల్ గుడిసెకు వెళ్ళి అతన్ని కూడా కలిసి వెళ్ళేవాళ్ళు. కాశీరాజు కూడా కబీర్ బోధనలు విని తరించేవాడు.





కనీసం వారానికి ఒకసారయినా వచ్చి కబీర్‌ని సందర్శించి ఆయన బోధనలు విని తరించేవాడు. ఒకరోజ వచ్చి కబీర్ సూక్తులు విని వెళ్ళబోతూ "మీ అబ్బాయి కమాల్ కనిపించడం లేదే? ఎక్కడికి వెళ్ళాడు?" అని అడిగాడు.

కబీర్ "రాజా! ఆ విషయం గురించి ఏం చెప్పమంటారు? వాడు నా పరువు తీస్తుంటే ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాను. భక్తులు ఇచ్చే బహుమానాల్ని వద్దంటే అవన్నీ వాడు తీసుకుంటున్నాడు. అందుకని నీకు నాకు సంబంధం లేదని పంపేశాను. అదుగో ఆ ఎదురుగా గుడిసె వేసుకుని అందులో ఉన్నాడు" అన్నాడు.

రాజుకు చిత్రంగా అనిపించి కమాల్ గుడిసెలోకి వెళ్ళాడు. కాసేపు గడిపి "రేపు వారం నీకు విలువైన బహుమతి ఇవ్వాలనుకుంటున్నాను" అన్నాడు. కమాల్ మంచిదన్నాడు. మరుసటివారం రాజు ఒక గొప్ప విలువైన వజ్రాన్ని తీసుకుని కమాల్ దగ్గరికి వచ్చాడు. స్వీకరించమన్నాడు. కమాల్ తన గుడిసె చూపించి పై కప్పును నిలిపి ఉంచిన స్తంభం బోసిపోతూ ఉంది. ఆ స్తంభం పైన ఈ వజ్రాన్ని పెట్టండి. ఎవరూ దొంగిలించకుంటే అక్కడే ఉంటుంది. ఎవరయినా తీసుకుపోతే పోనీ" అన్నాడు.

రాజు సేవకులతో అక్కడ పెట్టించి కమాల్ మాటల్ని సందేహిస్తూ వెళ్ళాడు. కబీర్ చెప్పిన మాటల్ని బట్టి కమాల్‌కు ధనవ్యామోహం ఉందనుకున్నాడు. వారం తరువాత వచ్చి కమాల్ దగ్గరికి వెళ్ళి "ఆ వజ్రం ఎలా ఉంది?" అన్నాడు. కమాల్ "ఏమో దాన్ని నేను చూడలేదు. నేను లోపలికి చూసే పనిలో ఉన్నాను. బయటకు చూసే సమయం నాకు లేదు" అన్నాడు. నటిస్తున్నాడనుకుని రాజు పై కప్పుకేసి చూస్తే వజ్రం అక్కడే ఉంది. కమాల్ ఔన్నత్యాన్ని గుర్తించి ప్రాపంచిక విషయాలపట్ల, వస్తువులపట్ల అతని అనాసక్తిని గమనించి, రాజుకు అతనిపట్ల గౌరవం పెరిగింది. అదే విషయాన్ని కబీర్‌తో చెప్పాడు. కబీర్ కొడుకు దగ్గరికి వెళ్ళి, "నన్ను క్షమించు. నన్ను పరీక్షించడానికే ఇదంతా చేస్తున్నావని నేను అనుకోలేదు. నిజంగానే సామాన్యమానవుడిలాగానే నేను కోపం తెచ్చుకున్నాను" అన్నాడు. కమాల్ "నాన్నగారూ! నేను మీ కొడుకుని. వస్తువులపట్ల నాకు వ్యామోహం ఉంటుందని మీరు ఎలా అనుకుంటారు? మీ బోధనల్ని ఉగ్గుపాలతో కలిపి విన్నవాణ్ణి. నేను కానుకల్ని స్వీకరిస్తోంటే మీకెందుకంత ఆసక్తి. మీలో కాంక్ష ఉందన్నమాట. మీ కోపంలాగే ఎప్పుడో అదీ బయటపడుతుంది" అన్నాడు. కబీర్‌లో పశ్చాత్తాపం రేగింది. "నువ్వు స్వీకరిస్తున్నవాటిపట్ల నేను ఆసక్తి ప్రదర్శిస్తున్నానంటే నిజంగానే నాలో కాంక్ష ఉంది. దురాశ ఉంది. అవన్నీ నాలో ఉన్నాయి. నీలో ఉన్నాయని భ్రమించాను. నన్ను మన్నించు" అన్నాడు. కమాల్ ఇంటికి వెళ్ళాడు.

## 99. విగ్రహం

తాన్కా తెన్నక అన్న ఒక సన్యాసి ఎక్కడికో వెళుతూ చీకటిపడుతూ ఉంటే ఒక బౌద్ధ ఆశ్రమం దగ్గరకి వచ్చాడు. బాగా చల్లగా ఉంది. రాత్రి అక్కడ గడిపి పొద్దున్నే వెళదామనుకున్నాడు. ఆశ్రమ నిర్వాహకుల్ని రాత్రికి అక్కడ పడుకుంటానని అడిగాడు. మొదట వాళ్ళు సందేహించినా, సన్యాసి గనక కాదనలేకపోయారు. ఆశ్రమంలో ఒక హాలు ఉంది. అక్కడ పడుకోమన్నారు. ఆశ్రమపెద్దగా తెల్లవారుఝామునించీ బుద్ధుని సంకీర్తనలు మొదలవుతాయి. గనక తెల్లవారుఝాముకల్లా అతను లేచి వెళ్ళిపోవాలన్నాడు. తాన్కా సరేనన్నాడు.

హాల్లో పడుకున్నాడు. కానీ బయటనుంచి చల్లగాలి వస్తోంది. అట్లాగే ముడుసుకుని పడుకున్నాడు. అతని దగ్గర చలికి తట్టుకునే బట్టలు లేవు. పల్చటి దుప్పటి ఉంటే అందులోనే ముడుచుకు పడుకున్నాడు. రెండు, మూడు గంటలు నిద్రపోయాడు. రాత్రి ఒంటిగంట ప్రాంతంలో మెలకువ వచ్చింది. చలి విపరీతంగా ఉంది. భరించలేనంత స్థాయిలో ఉంది . వణుకు మొదలయింది. ఆశ్రమంలోని వాళ్ళంతా తలుపులు బిడాయించుకుని గదుల్లో పడుకున్నారు.

తాన్కా హాలంతా కలయజూశాడు. ఎదురుగా బుద్ధుని విగ్రహం అతన్నే చూస్తున్నట్లుంది. నేనున్నానని ఓదార్పు నిస్తున్నట్లు కనిపించింది. తాన్కా మనసులో తళుక్కున ఆలోచన మెదిలింది. ఆ బుద్ధుని విగ్రహం కొయ్యతో చేసింది. వెంటనే తాన్కా చిదుగులు పోగుచేసి మంటపెట్టి ఆ బుద్ధుని విగ్రహాన్ని తీసుకుని ఆ మంటలో వేశాడు. ఆ విగ్రహం చేసిన కొయ్య చాలా బలమైంది. ఆ విగ్రహం మెల్లగా కాలుతూ తాన్కాకి వెచ్చదనాన్ని యిచ్చింది. తాన్కా చలి ఎగిరిపోయింది. మంట దగ్గరగా వెచ్చగా దుప్పటి కప్పుకుని కునుకు తీశాడు. తెల్లవారుజాముదాకా విగ్రహం కాలుతూనే ఉంది. ఆశ్రమంలోని వాళ్ళు నిద్రలేచేసరికి విగ్రహం పూర్తిగా కాలిపోయి కణకణలాడే నిప్పు కణికలు మిగిలాయి. ఆశ్రమ నిర్వాహకుడు వచ్చి చూస్తే అక్కడ ఉన్న బుద్ధుని విగ్రహం లేదు. సన్యాసి దాన్ని తగలబెట్టినట్లు నిప్పుకణికల్ని చూస్తూనే అర్థమయిపోయింది. ఆశ్రమపెద్ద ఆందోళనతో, ఆగ్రహంతో "ఎంత పని చేశావు? బుద్ధుణ్ణి కాల్చేశావా? ఎంత దారుణం" అని అరిచాడు. సన్యాసి ఏమాత్రం ఉద్రేకపడకుండా ఒక కర్ర తీసుకుని నిప్పుకణికల్ని కెలుకుతూ "ఏవీ! బుద్ధుని ఎముకలు కనిపించడం లేదే?" అన్నాడు. "ఆశ్రమ పెద్ద అది బుద్ధుని విగ్రహం. విగ్రహానికి ఎముకలుంటాయా?" అన్నాడు. సన్యాసి 'అయితే ప్రాణంలేని విగ్రహమన్నమాట. ఇంకా ఏవైనా విగ్రహాలుంటే తీసుకొచ్చి మంటల్లో వేయండి" అన్నాడు.





ఆశ్రమ పెద్ద "నువ్వు పెద్ద దుర్మార్గుడిలా ఉన్నావు. నీలాంటివాడు ఇక్కడ ఉండడానికి వీల్లేదు. వెంటనే మా ఆశ్రమం నుంచి వెళ్ళిపో" అని సన్యాసిని బయటికి పంపి తలుపు వేసేశాడు. సన్యాసి నవ్వుకుంటూ మసక చీకటిలో ఇటూ అటూ చూసుకుంటూ ఒక చెట్టును ఆనుకుని కాసేపు నిద్రపోయాడు. ఆశ్రమ పెద్ద తెల్లవారాకా ఆ సన్యాసిపట్ల అనుచితంగా ప్రవర్తించానేమో అని పశ్చాత్తాపపడి అతన్ని వెతుక్కుంటూ బయటికి వచ్చాడు. చూస్తే రోడ్డుమీద ఆ సన్యాసి కూచుని ఉండడం కనిపించింది.

సన్యాసి ఒక మైలురాయి దగ్గర కూచిని ఆ రాయిమీద పూలు చల్లుతూ "బుద్ధం శరణం గచ్ఛామి... గచ్ఛామి" అంటూ ఉన్నాడు. మొదట అయ్యో పాపం అనుకున్న ఆశ్రమపెద్ద సన్యాసిని చూసి ఇతడు నిజంగా పిచ్చివాడే అనుకున్నాడు. అతని దగ్గరికి వచ్చి మఠపెద్ద "నువ్వు నిజంగా పిచ్చివాడవే అనిపిస్తుంది. ఎందుకంటే రాత్రేమో విగ్రహాన్ని తగలబెట్టి చలికాచుకున్నావు. ఇప్పుడేమో మైలురాయిని ప్రార్థన చేస్తున్నావు. చిత్రంగా ఉంది" అన్నాడు.

తాన్కా "దానికీ, దీనికి తేడా ఏమిటో చెప్పండి. అది కొయ్య విగ్రహం. ఇది మైలురాయి. అంతే కదా!" అన్నాడు. "మఠ పెద్ద అది విగ్రహం. ఇది రాయి" అన్నాడు. తాన్కా తేడా లేదు. అది కొయ్యనుంచి చెక్కిన విగ్రహం. ఈ రాతిలో కూడా బుద్ధుడున్నాడు. ఏ శిల్పి అయినా అనుకుంటే ఈ రాతిలోంచి కూడా బుద్ధుణ్ణి సృష్టిస్తాడు. నా మనసుకు ఈ రాతిలో బుద్ధుడు కనిపిస్తున్నాడు. ఆలయపెద్ద తాన్కా వివేకానికి తలవంచి అతనికి నమస్కరించాడు.

## 100. గురువు కాని గురువు

మనిషికి రెండు దృష్టులుంటాయి. ఒకటి అహంకార దృష్టి. రెండోది ఆత్మదృష్టి. అహంకారదృష్టి ప్రాపంచకమైంది. ఆత్మదృష్టి దైవికమయింది. ప్రపంచానికి అహంకార దృష్టే అర్థమవుతుంది. అందుతుంది. మనకు తెలిసిన ఏకలవ్యుని కథ అలాంటిదే. ఆ అంశ ఉన్న కథ ఒకటి చైనీయుల్లో ఉంది. అది జెన్ సంబంధమయిన కథ.

ఒక సన్యాసి ఆ చుట్టుపట్ల ప్రాంతంలో చాలా పేరు పొందినవాడు. ఎందరో సలహా సంప్రదింపుల కోసం ఆయన్ని సందర్శించేవాళ్ళు. వచ్చిన వాళ్ళందరి సమస్యలూ విని తగిన పరిష్కారాలు చెప్పేవాడు. ఆయనకు ఎందరో శిష్యులయ్యారు. ఒకరోజు ఆయన చాలా గొప్పగా తన గురువుగారి పుట్టినరోజు జరపడానికి సంకల్పించారు. గురువుగారి పటం పెట్టి, ఆశ్రమాన్ని అందంగా అలంకరించి హడావుడి చేశాడు. సమీప ఆశ్రమాల్లోని ఇతర సన్యాసులకు, గురువులకు అందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి.

కానీ ఆ సన్యాసి ఎప్పుడూ అందర్తో ఒక విషయం చెబుతూనే ఉంటాడు. "తనకు గురువు అంటూ ఎవరూ లేరని, తనకు గురువు అన్నవాడి అవసరమే లేదని" చెప్పేవాడు. ఆ సంగతి అందరికీ తెలిసిన విషయమే. అట్లాంటి వ్యక్తి హఠాత్తుగా తన గురువు జన్మదినాన్ని సంబరంగా జరపడం అందరికీ ఆశ్చర్యం వేసింది. లేని గురువు పుట్టినరోజు జరపడం అందరికీ వింతగా అనిపించింది. శిష్యులు తమ సందేహాన్ని గురువు దగ్గర వెలిబుచ్చారు. మొదట ఆయన "ఆ విషయం గురించి ఎవరూ ఏమీ అడగకండి" అన్నాడు. కానీ శిష్యులు పదే పదే అడగడంతో "మీరు మరీ యింతగా అడుగుతున్నారు కాబట్టి చెబుతున్నాను. నిజానికి నాకు గురువంటూ ఎవరూ లేరు. కానీ నేను మీలాగే ఒకప్పుడు గురువుకోసం అన్వేషణలో పడ్డాను. వెతగ్గా వెతగ్గా నాకు ఒక గురువు దొరికాడు. ఆయనకు నమస్కరించి నన్ను ఒక శిష్యుడిగా చేర్చుకోమన్నాను. కానీ ఆయన నన్ను శిష్యుడిగా స్వీకరించడానికి అంగీకరించలేదు. ఒకవేళ ఆయన నన్ను శిష్యుడిగా అంగీకరించి ఉంటే నేను ఇంకోలా ఉండేవాడినేమో! నిజానికి ఆయన కాదన్నప్పుడు నాకు ఆయనపై ఎంతో కోపం కలిగింది. కానీ ఈరోజు ఆయనకు తలవంచి నమస్కరిస్తున్నాను. ఆయన్ని తలచుకుంటాను. ఆయన అనుకొని ఉంటే నన్ను శిష్యుడిగా స్వీకరించేవాడు. నాకు గురువయ్యేవాడు. అప్పట్లో నేను నన్ను శిష్యుడిగా స్వీకరించమని అభ్యర్థించాను. ప్రార్థించాను. కానీ ఆయన నిర్ద్వంద్వంగా తిరస్కరించాడు" అన్నాడు.

శిష్యులు "మరి అంతగా మిమ్మల్ని కాదన్న అతనిపట్ల మీరు ఇంత గౌరవం ఎందుకు ప్రదర్శిస్తున్నారు. అతని జన్మదినాన్ని ఎందుకు జరుపుకుంటున్నారు?" అన్నారు. దానికి ఆ సన్యాసి "ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన నా గురువుగా ఉండడానికి తిరస్కరించడం వల్ల నాకు గొప్ప ఉపకారం చేశాడు. ఒకవేళ ఆయన నా గురువుగా ఉండడానికి అంగీకరించాడనుకోండి. అప్పుడు నేను ఆయనపట్ల కృతజ్ఞతగా ఉండేవాణ్ణి. ఆయన శిష్యుడిగా మారేవాణ్ణి. వినయంగా ఆయన పాదాలు స్పర్శించి తలవంచేవాణ్ణి. ఆయనపట్ల గౌరవం ప్రదర్శించేవాణ్ణి. పవిత్రభావంతో ఉండేవాణ్ణి. అంతా సజావుగా జరిగేది. అంతేకాదు, అక్కడితో ఆ విషయం ముగిసిపోయేది. కానీ పరిస్థితి అలా కాలే. ఆయన నన్ను శిష్యుడిగా చేర్చుకోవడానికి అంగీకరించలేదు. అలా అంగీకరించక పోవడంలో నా పట్ల తృణీకారభావాన్ని ప్రదర్శించలేదు. తానేదో గొప్ప గురువని నా పట్ల విపరీతమైన వినయాన్ని ప్రదర్శిస్తే తప్ప శిష్యుడిగా స్వీకరించనని ఆయన గర్వం ప్రదర్శించలేదు. ఇదంతా నాణేనికి ఒకవైపు సంగతే. ఆయన మౌనంగా కాదన్నారు. దానికి సంబంధించి ఎట్లాంటి రాగద్వేషాల్ని ప్రదర్శించలేదు. అంతటి మహానుభావునికి అప్పుడు నేను కనీసం కృతజ్ఞత కూడా చూపలేదు. చెప్పలేదు. ఆగ్రహంతో నిష్క్రమించాను.





నిజానికి ఆయన నానుంచి ఎట్లాంటి కృతజ్ఞతా ఆశించలేదు. యిన్నాళ్ళకి, యిన్నేళ్ళకి ఆయనపట్ల నా రుణం తీర్చుకుంటున్నాను" అన్నాడు.

శిష్యులు ఆశ్చర్యపోయారు.

## 101. ఉన్నది ఒక్కరే!

**నువ్వు వేరు, నేను వేరు. అతను వేరు అనుకుంటూ ఉంటాం. కానీ మనమందరం ఒకటే. అందరూ భగవదంశలో భాగాలమే. ఒకే అంతరాత్మ అందర్లో ఉండి ఒక వ్యక్తి ఇంకో వ్యక్తిని చూస్తూ ఉన్నాదంటే తనని తాను చూస్తూ ఉన్నాదన్నమాట.** ఇక్కడ కృతజ్ఞత ప్రకటించడం వంటివన్నీ మనకు మనం చెప్పుకునేవిగా ఉంటాయి.

జెన్ ఆశ్రమానకి ఒక ఆచారం ఉంది. సన్యాసులు ధ్యానానికి కూచుంటారు. ఎవరికి వాళ్ళు సన్యాసులు. తమ చాపల్ని తెచ్చుకుని ధ్యానానికి వాటిపై కూచుంటారు. ధ్యానం చేస్తారు లేచి వెళతారు. చాపని అక్కడే వదిలి వెళతారు. ధ్యాన పరిసమాప్తి ఎప్పుడో జరుగుతుంది. ఆ రోజు ధ్యానం చేసిన వ్యక్తి ఆ చాపని చుట్టి వెళ్లిపోతాడు. గురువు ఇదంతా చూస్తూ ఉంటాడు. శిష్యుడి జ్ఞానం పూర్తయిందని గ్రహిస్తాడు. చాపని చుట్టిన శిష్యుడు గురువుకి కృతజ్ఞత వంటివేమీ ప్రదర్శించడు. నిశ్శబ్దంగా నిష్క్రమిస్తాడు. గురువు కూడా అతన్నించి ఎట్లాంటి కృతజ్ఞతనూ ఆశించడు. ఎందుకంటే అక్కడ కృతజ్ఞతను ఆశించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే అక్కడ కృతజ్ఞతను ప్రకటించే వ్యక్తీ లేడు. స్వీకరించే మనిషీ లేడు. దానికి సంబంధించి శిష్యుడు ఏమీ చెప్పడు. గురువు ఏమీ వినడు. అక్కడ అంతా నిశ్శబ్దంగా జరిగిపోతుంది. మౌనానికి అవగాహన అవుతుంది. లేదా ఆ సందర్భంలో శిష్యుడు పొరపాటుపడి గురువుకి కృతజ్ఞత ప్రకటిస్తాడను కోండి. గురువు అతన్ని కర్రతో కొట్టి మళ్ళీ చుట్టిన చాపను విప్పమంటాడు. గురువు ప్రసక్తి అంతవరకే. పరిపూర్ణ ధ్యానానికి సంబంధించి కృతజ్ఞత ప్రకటించడానికి అక్కడ వ్యక్తి అంటూ ఉండడు.

మనకు భిన్నంగా ఎవరో ఉన్నారన్నది భ్రాంతి మాత్రమే. భ్రమ మాత్రమే. ఎక్కడ చూసినా, ఎవర్ని చూసినా మనం మాత్రమే కనిపిస్తాం. ప్రాచీనులు **'ఆత్మవత్ సర్వభూతాని'** అనడంలో అర్థమిదే.

ఒక విచిత్రమయిన సూఫీ కథ ఉంది. అది గొప్ప సత్యాన్ని ఆవిష్కరించే కథ. ఒక అద్దాల మేడ ఉండేది. ఒక హాల్లో చుట్టూ అద్దాలు ఉండేవి. పైకప్పు కూడా అద్దాలు ఉండేవి. ఎవరయినా ఆ హాల్లోకి వస్తే ఎటు చూసినా వందల మందిగా ఒక్కడే కనిపించేవాడు. అన్ని ప్రతిబింబాలతో అయోమయం ఏర్పడుతుంది. ఆ హాల్లోకి దారితప్పి

ఒక కుక్క వచ్చింది. ముందు, వెనుక, పైన లెక్కలేనన్ని కుక్కలు కనిపించేసరికి దానికి దిక్కుతోచలేదు. అవి తన ప్రతిబింబాలన్న స్పృహ దానికి ఉండదు కదా! దాంతో అది బెంబేలెత్తిపోయింది. ఇటూ అటూ పరిగెత్తింది. అద్దంలో ప్రతిబింబాలు కూడా పరిగెట్టాయి. ఉన్నది ఒక్కటే కుక్క. కనిపిస్తున్నది మాత్రం వందల కుక్కలు. దానికి దిక్కు తోచలేదు. ఎటు చూసినా కుక్కలే. తప్పించుకునే మార్గం లేదు. అద్దాలతో చేసిన తలుపులు దానికి దారి కనిపించలేదు. ప్రాణభయంతో మొరగడం ప్రారంభించింది.

ఇక్కడ అరుస్తున్నది ఒక కుక్క. అద్దాల్లో వందల కుక్కలు అరవడం మొదలుపెట్టాయి. దాంతో దానికి మరింత భయం పెరిగింది. భయం పెరిగేకొద్దీ అరవడమూ ఎక్కువైంది. ప్రతిధ్వనులు పదింతలుగా చుట్టుముట్టాయి. దాని భయం కూడా పదింతలు పెరిగింది. తను గొప్ప ప్రమాదంలో చిక్కుకున్నానని అనుకుంది. ఆత్మరక్షణకు అరవడమొక్కటే పరిష్కారమనుకుంది. ఒక అద్దం దగ్గరికి వెళ్ళింది. అద్దంలోని దాని ప్రతిబింబానికి సన్నిహితంగా వచ్చింది. దానిమీదకు దాడిచేసి గోళ్ళతో గోకింది. పక్క అద్దం దగ్గరకు వెళ్లింది. అక్కడ అలాగే చేసింది. అద్దంలోని కుక్కలన్నీ తనమీద దాడి చేస్తున్నాయని భావించుకుని హడలిపోయింది.

అరుస్తూ, అద్దాలపై దాడిచేస్తూ రాత్రంతా అవిశ్రాంతంగా గడిపింది. ప్రతిబింబాల్ని పరమశత్రువులుగా భావించడం వల్ల వాటిని అది ప్రశాంతంగా చూడలేకపోయింది. ఫలితంగా అరుస్తూ పోట్లాడుతూ గడిపింది. ఉద్రేకపడకుండా సాదాసీదాగా ప్రతిబింబాల్ని చూసి ఉంటే పరిస్థితి మరోలా ఉండేది. కానీ ప్రతిబింబాల్తో ఘర్షిస్తూ, అరుస్తూ అలిసిపోయింది. వాటితో గొడవ పడుతున్నామనుకుని పోట్లాడుతున్నామనుకుని ఉదయం దాకా పరుగులు తీస్తూ అరచి అరచి సొలసి చనిపోయింది. ఈ విషయం తెలుసుకుంటే **మనం ఇతరులతో ఘర్షించడం ఒకరికొకరు అద్దాలని గ్రహించాలి.**

## 102. ఉన్నాడు, లేడు, తెలీదు

దేవుడి గురించిన చర్చ ఎంత ప్రాచీనమో, అంత అర్వాచీనం. వివేకవంతులు ప్రశ్నించే వ్యక్తిని అనుసరించి సమాధానమిస్తారు. రామకృష్ణపరమహంస దగ్గరికి వచ్చి వివేకానందుడు "మీరు దేవుణ్ణి చూశారా" అని అడిగాడు. దానికి రామకృష్ణ పరమహంస "చూశాను ఇప్పుడు నిన్ను ఎట్లా చూస్తున్నానో అట్లాగే దేవుణ్ణి చూశాను" అన్నాడు.

ఆ సమాధానం మనల్ని ఆలోచింపచేస్తుంది. అట్లాంటిదే బుద్ధునికి సంబంధించిన ఒక కథ ఉంది. ఒకరోజు ఉదయాన్నే బుద్ధుడు బయల్దేరి ఒక గ్రామానికి వెళ్లాడు. ఆ గ్రామంలో వాళ్ళకు బుద్ధుడు వచ్చాడని తెలిసింది. అందరూ ఆ మహాపురుషుడి





సందర్శనానికి వచ్చారు. ఆయన బోధనలు వినడానికి, ఆయన మధుర వాక్కుల్ని వినడానికి ఎంతో మక్కువ ప్రదర్శించేవాళ్ళు. వచ్చినవాళ్ళల్లో ఒక వ్యక్తి బుద్ధుణ్ణి చూసి "దేవుడున్నాడా?" అన్నాడు. వెంటనే బుద్ధుడు "దేవుడు లేడు" అని సమాధానమిచ్చాడు. ఆ వ్యక్తి ఏమీ బదులివ్వకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నసమయంలో మరోవ్యక్తి వచ్చి "నేను దేవుడు లేడు అంటాను. మీరేమంటారు?" అన్నాడు. బుద్ధుడు అతణ్ణి చూసి "దేవుడున్నాడు" అన్నాడు. ఆ వ్యక్తి మారు మాట్లాడకుండా అక్కణ్ణించి నిష్క్రమించాడు. సాయంత్రానికి ఇంకో మనిషి వచ్చాడు. అతను బుద్ధుడికి నమస్కరించి "దేవుడు ఉన్నాడో లేదో నాకు తెలీదు. మీరేమంటారు?" అన్నాడు. బుద్ధుడు "ఉన్నాడో లేదో తెలీనప్పుడు వూరికే ఉండడం మంచిది" అన్నాడు. ఆ వ్యక్తి కూడా మౌనంగా నిష్క్రమించాడు. బుద్ధుడితోబాటు ఉన్న శిష్యుల్లో ఒకతను "మొదటనుంచీ బుద్ధుడు చెప్పినవన్నీ విని ఆశ్చర్యపోయాడు. అయోమయంలో పడ్డాడు. అతను బుద్ధుడితో మీరు ఒకసారి 'దేవుడున్నాడు' అంటారు. ఇంకోసారి 'దేవుడు లేడు' అంటారు. మరోసారి మౌనంగా ఉంటే మంచిదంటారు. ఇంతకూ వీటిల్లో సరయిన సమాధానమేది?" అన్నాడు.

దానికి బుద్ధుడు "నేను చెప్పిన సమాధానాలు నీకు చెప్పినవి కావు. అవి ప్రశ్న అడిగిన వాళ్ళకు సంబంధించినవి. నువ్వు వాళ్ళ ప్రశ్నల్ని వాళ్ళకిచ్చిన సమాధానాల్ని విన్నావు. నువ్వు నన్ను ప్రశ్నిస్తే దానికి సమాధానమిస్తాను" అన్నాడు. "శిష్యుడు ఏమైతేనేం నాకు సమాధానమిచ్చారు కదా!" అన్నాడు. బుద్ధుడు "అవును. నీ ప్రశ్నకు తగిన సమాధానం నువ్వందుకున్నావు. వాళ్ళ ప్రశ్నలకు వాళ్ళు అందుకున్నారు.

మొదటి వ్యక్తి ఆస్తికుడు. దేవుణ్ణి నమ్మేవాడు. అతని నమ్మకాన్ని బలపరచాలనే ఉద్దేశంతో నా దగ్గరికి వచ్చి అడిగాడు. అతని అహానికి బలం కావాలి. అందుకే నేను "దేవుడు లేడు" అన్నాను. నిజానికి దైవం గురించి అతనికి తెలీదు. ఒకవేళ తెలిసి ఉంటే నా దగ్గరకు వచ్చేవాడు కాదు. నిజమైన నమ్మకమున్న వాడు ప్రపంచమంతా దేవుడు లేడన్నా ఉన్నాడని దృఢంగా నిలబడతాడు. అతను నా సమాధానంతో ఆలోచనలో పడతాడు. నిజమైన అన్వేషణలో పడతాడు. అందుకని అతనికి అట్లాంటి సమాధానమిచ్చాను.

ఇక రెండో వ్యక్తి వేసిన ప్రశ్న. "దేవుడు లేడు. మీరేమంటారు?" అన్నది. అతను నాస్తికుడు. దేవుణ్ణి నమ్మడు. అది కూడా అతని అహంలో భాగమే. దానికి నిశ్చయం కోసం నా దగ్గరికి వచ్చాడు. అతన్తో నేను "దేవుడున్నాడు" అన్నాను. దాంతో అతను ఆలోచనలో పడ్డాడు. దానివల్ల అతని అన్వేషణ కొనసాగే వీలుంది. తరువాత

మూడోవ్యక్తి "దేవుడున్నాడో లేదో నాకు తెలీదు మీరేమంటారు?" అని అడిగితే అతనికి "ఉన్నాడో లేదో తెలీనప్పుడు ఊరికే ఉండడం మంచిది" అన్నాను.

ఎందుకంటే అతను సందేహంలో ఉన్నాడు. అన్వేషణలో ఉన్నాడు. అతని నమ్మకానికో, అపనమ్మకానికో కట్టి పడేయడం మంచిది కాదు. అందుకని తను ఏ పరిస్థితిలో ఉన్నాడో అట్లాగే ఉండమన్నాను" అన్నాడు.

మతమన్నది ప్రేమ లాంటిది. మనసుకు సంబంధించింది. దాని సందేహాల్ని అదే తీరుస్తుంది. అది బహిరంగం కావాల్సిన పనిలేదు. వివేకానందుడు రామకృష్ణ పరమహంసను వేసిన ప్రశ్న. "మీరు దేవుణ్ణి చూశారా?" అన్నది చాలా సాధారణంగా కనిపించవచ్చు. పసివాడు వేసిన ప్రశ్నలా ఉండవచ్చు. ఆ ప్రశ్నకు పరమహంస ఇచ్చిన సమాధానం వివేకానందుని అంతరాత్మకం అందించిన సమాచారం.

## 103. వదులుకోవడం

పరివర్తన అన్నది ప్రశాంతంగా జరిగేది కాదు. మార్పన్నది మెల్లగా జరిగేది కాదు. అది క్షణంలో వచ్చేది. మెరుపు వేగంతో వచ్చేది. కూచుని మంచి చెడ్డలు బేరీజు వేసుకుని జరిగేదాన్ని పరివర్తన అనరు. అది ప్రాపంచిక విషయాలుకు సంబంధించింది. హఠాత్తుగా ఒక్కసారిగా, అనూహ్యంగా జరిగేది జ్ఞానోదయం. అది జరిగినప్పుడు గతం అదృశ్యమవుతుంది. అందుకు మనం సిద్ధపడి ఉండాలి. మనసు సిద్ధపడి ఉండాలి.

రామకృష్ణ పరమహంసకు సంబంధిచిన ఒక కథ ఉంది. రామకృష్ణ పరమహంస అంటే ఒక వ్యాపారస్థుడికి  అపారమయిన భక్తి శ్రద్ధలుండేవి. ఏదో ఒకరకంగా పరమహంసని సంతృప్తి పరచాలని అతను ఉవ్విళ్ళూరుతూ ఉండేవాడు. అతనికి ఒక ఆలోచన వచ్చింది. ఎవరూ చేయలేని రీతిలో తానొక గొప్ప పని చేసి రామకృష్ణ పరమహంసను సంతోషపెట్టాలనుకున్నాడు. అదేమిటంటే పదివేలు బంగారు నాణేల్ని కూడబెట్టి పరమహంసకు సమర్పించుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఎంతో శ్రమించి కొన్ని ఏళ్ళపాటు బంగారు నాణేల్ని కూడబెట్టాడు. అవి స్వామివారికి సమర్పిస్తే తప్పక తనపట్ల దయ ప్రదర్శిస్తాడని అతని నమ్మకం.ఎందుకంటే చిన్నచిన్న మొత్తాల్ని సమర్పించిన భక్తులకు ఎన్నో కోరికలు నెరవేరుతున్నాయి. భారీ మొత్తంలో ఇస్తే తన కోరిక తప్పక సులభంగా తీరుతుందని విశ్వసించాడు.

ప్రపంచం చిత్రమైంది. దైవాన్ని కూడా ధనంతోనే అంచనా వేస్తుంది. అట్లాగే ఈ భక్తుడు పదివేల బంగారు నాణేల్ని తీసుకుని రామకృష్ణ పరమహంస దగ్గరికి వెళ్ళాడు. ఆ బంగారు నాణేల సంచిని రామకృష్ణ పరమహంస ముందు ఉంచి నమస్కరించి





"స్వామి! ఈ భక్తుడిచ్చిన ఈ పదివేల బంగారు నాణేల్ని స్వీకరించి ముక్తి ప్రసాదించండి" అని వేడుకున్నాడు. సాధారణమయిన సన్యాసులు ఏమిచ్చినా స్వీకరిస్తారు. పరమహంస గనక ఆయన తీసుకోడు అని మనమనుకుంటాం. పైగా ఆయన సర్వసంగపరిత్యాగి. బంగారంతో ఆయనకేం పని? అనుకుంటాం.  పరమహంస ఆ బంగారు సంచి చూసి, భక్తుని మాటలు విని, "తప్పకుండా ఈ బంగారు నాణేల్ని స్వీకరిస్తాను. అయితే నువ్వొకపని చేయాలి" అన్నాడు. భక్తుడు "మీ ఆజ్ఞ. మీరు ఏమి చెబితే అది చేస్తాను" అన్నాడు.

రామకృష్ణ పరమహంస ఆ నాణేల సంచిని తీసుకుని మళ్ళీ ఆ సంచిని భక్తుడికే యిచ్చి "ఈ సంచిని తీసుకెళ్ళి గంగానదిలో వేసేసి రా. నీకు మోక్షమిస్తాను" అన్నాడు. ఆ మాటల్తో భక్తుడు షాక్ తిన్నాడు. కానీ బదులు చెప్పలేకపోయాడు. ఎందుకంటే అవన్నీ పరమహంసకు ఇచ్చేశాడు. ఇప్పుడు అవి పరమహంస సొత్తు. ఆయన దాచుకున్నా, పారేసినా ఆయన ఇష్టం. అందుకని ఆ సంచిని మోసుకుని గంగానది దగ్గరకు వెళ్ళాడు. ఆ నదీతీరంలో కూచున్నాడు.

రెండు గంటలు గడిచాయి. మూడు గంటలు గడిచాయి. ఆ వ్యక్తి తిరిగి రానేలేదు. ఏమయ్యాడో తెలియలేదు. అతని ఆచూకీ కోసం పరమహంస మనిషిని పంపాడు. ఆ మనిషి గంగానది తీరానికి వెళ్ళి భక్తుణ్ణి చూసి తిరిగి వచ్చి అక్కడ పరిస్థితి చెప్పాడు. "స్వామీ! అక్కడ జనం గుంపుగా ఉన్నారు. ఈ వ్యక్తి ఒక్కో బంగారు నాణేన్ని తీసి రాతిమీద గీచి అది బంగారు నాణెమో కాదో తేల్చుకుని గంగానదిలో విసురుతున్నాడు. జనం నదిలోకి దూకి ఆ నాణం వెతుకుతున్నారు" అన్నాడు. ఆ మనిషితో రామకృష్ణ పరమహంస "నువ్వు వెళ్ళి ఆ వ్యక్తితో నేను చెప్పానని చెప్పు. అతన్ని సంచిని తీసుకు వెళ్ళి గంగానదిలో వేసి రమ్మన్నాను. అంతేకానీ,  అక్కడ కూచుని ఒక్కో నాణేన్ని అది బంగారుదా కాదా? అని చూస్తూ లెక్కపెట్టుకుంటూ ఉండమని కాదు. పైగా ఎవరయినా సంపాదించుకుంటున్నప్పుడు లెక్కపెట్టుకోవాలి. అంతేకాని వదులుకుంటున్నప్పుడు కాదు. దానివల్ల కాలం వ్యర్థమవుతుంది తప్ప ఎట్లాంటి ప్రయోజనం ఉండదు" అన్నాడు. ఆ వ్యాపారస్థుడు సంపాదించడంలో ఎట్లా లెక్కలు వేసేవాడో వదులుకుంటున్నప్పుడు కూడా అదేవిధంగా లెక్కలేస్తున్నాడు. అతనికి సంపాదించడానికి, వదలుకోవడానికి తేడా తెలీదు.

## 104. మూడుసూక్తులు

రబ్బీ అంటే యూదుమత గురువు. ఆయన ప్రార్థనా మందిరంలో జనాలకు ఎన్నో నీతులు బోధించేవాడు. అందరూ ఆయన్ని జ్ఞానిగా భావించేవాళ్ళు. గౌరవించేవాళ్ళు. ఒకరోజు ఆయన దారంటే వెళుతూ ఉండే ఒక వేటగాడు అడవినుంచి పిట్టలు పట్టుకుని

ఎదురుపడ్డాడు. రాత్రి భోజనంలోకి బాగుంటుందని రబ్బీ ఆ పిట్టను కొన్నాడు. అంతలో ఆ పిట్ట "అట్లాంటి ఆలోచనలు చెయ్యకు" అంది. ఆ మాటతో రబ్బీ అదిరిపోయాడు. పిట్ట ఏమిటి? మాట్లాడమేమిటి? పైగా తన మనసులోని ఆలోచనలు అది పసిగట్టి పైకి అనడమేమిటి? రబ్బీకి అంతా చిత్రమనిపించింది.

రబ్బీ పక్షిని చూసి "నిజంగా నువ్వు మాట్లాడుతున్నావా?" అని అన్నాడు. పిట్ట "అవును. నేనే మాట్లాడుతున్నాను. నీ మనసులోని ఆలోచనల్ని పసిగట్టాను. నువ్వు నీ వాళ్ళకు ఎలా మతపెద్దవో... నేనూ నా వాళ్ళకు మతపెద్దను. నేనుకూడా మా పక్షిజాతికి మతబోధలు చేస్తాను. నువ్వు నన్ను ప్రాణాలతో వదుల్తానంటే, స్వేచ్ఛనిస్తానంటే నీకు అమూల్యమైన మూడు సూక్తులు చెబుతాను. అవి జీవితానికి ఎంతో ఉపయోగ పడతాయి" అంది.

రబ్బీ "ఈ పక్షి ఎంతో జ్ఞానం ఉన్నదిలా కనిపిస్తోంది. సరే చూద్దాం. అనుకుని దాందేముంది. తప్పక నిన్ను వదిలేస్తాను. ఆ మూడు సూక్తులేవో చెప్పు" అన్నాడు.

పక్షి "మొదటిది. ఎప్పుడూ ఎవరు అబద్ధం చెప్పినా నమ్మకు. ఎంత గొప్ప వ్యక్తి చెప్పినా నమ్మకు. వ్యక్తి చెప్పడాన్ని బట్టి అది జరిగే విషయమా కాదా? అది నీకు అర్థమయిపోతుంది. నిజానిజాలు తెలిసిపోతాయి. కాబట్టి వీలుపడని వాటినీ అసంబద్ధమైన అంటే పొంతనలేని మాటల్ని నమ్మకు" అంది. పిట్ట మాటల్లో సత్యమున్నదని రబ్బీ భావించాడు. పిట్ట "ఇక రెండోది ఎప్పుడూ నీ హద్దులు దాటవద్దు. తన పరిమితుల్ని తెలుసుకున్నవాడే వివేకవంతుడు. అతను ఎప్పుడూ చేతకాని పనులు చేయడు. తన పరిమితుల్ని అధిగమించిన వాడు అవివేకి" అన్నాడు.

ఆ మాటలకి రబ్బీ ఉబ్బిపోయాడు. పక్షి "ఇక మూడో విషయం. ఎప్పుడయినా ఏదయినా మంచి పని చేసినందుకు పశ్చాత్తాపపడకు. చెడ్డపని చేస్తే పశ్చాత్తాప పడాలి. కానీ మంచి పని చేసినందుకు సంతోషించాలి. ఈ మూడు విషయాలు గుర్తుంచుకో. నీ జీవితంలో ఎంతో ఉపయోగపడతాయి" అంది.

రబ్బీ ఆ పక్షి తెలివితేటలకు మెచ్చుకుని దాన్ని వదిలిపెట్టాడు. ఎదురుగా చెట్టుకొమ్మపై వాలి పిట్ట నవ్వింది. రబ్బీ పిట్టను చూసి ఎందుకు నవ్వుతున్నావన్నాడు. పిట్ట "నువ్వు పిచ్చివాడివి నా కడుపులో విలువైన వజ్రం ఉంది. నన్ను చంపి ఉంటే ఆ వజ్రం నీకు దొరికేది. అమాయకంగా నన్ను వదలిపెట్టావు" అంది. ఆ మాటతో రబ్బీ పరిగెట్టుకుంటూ చెట్టు దగ్గరికి వచ్చి పిట్టను పట్టుకోబోయాడు. పిట్ట పైకొమ్మపైకి ఎగిరింది. ఎప్పుడూ చెట్టు ఎక్కని రబ్బీ వృద్ధుడయి ఉండి కూడా ఆశతో చెట్టెక్కాడు. పిట్ట ఉన్న కొమ్మకు చేరాడు. పిట్ట పై కొమ్మకు ఎగిరింది. రబ్బీ అక్కడకూ వెళ్లాడు.





పల్చటి కొమ్మ విరిగికింద పడ్డాడు. కాలు విరిగింది. గాయాలయ్యాయి. గాయాలనుంచీ రక్తం కారింది. పిట్ట అతని దురవస్థ చూసి "నువ్వు నీ దురాశతో ఈ దురవస్థ తెచ్చుకున్నావు. నేను చెప్పిన మొదటి హితోక్తిని నువ్వు అర్థం చేసుకుని ఉంటే నా కడుపులో వజ్రం ఉందని నేను చెప్పిన మాటని నమ్మేవాడివి కావు. నా కడుపులో వజ్రం ఉంటుందన్న అసంబద్ధమయిన అబద్ధాన్ని నమ్మడం నీ మొదటి తప్పు. ఇక ఆ మాటలు నమ్మి నువ్వు చెట్టెక్కావు. ఈ వయసులో నువ్వు చెట్టెక్కలేవు. కానీ ఆశతో చెట్టెక్కావు. ఇది వీలవుతుందా కాదా? అని నువ్వు ఆలోచించలేదు. పైగా రెక్కలున్న పక్షిని నేను చెట్టెక్కి పట్టుకోగలనా? అన్న కనీస జ్ఞానం లేకుండా ప్రవర్తించావు. అంటే నీ పరిమితుల్ని, హద్దుల్ని తెలుసుకోలేని అవివేకి వయ్యావు. ఫలితంగా కిందపడ్డావు".

మూడోది "నన్ను వదిలిపెట్టినందుకు నువ్వు సంతోషించాల్సింది పోయి పశ్చాత్తాప పడ్డావు. నువ్వు మంచి పని చేశావు. మంచి పనికి సంతోషించాల్సింది పోయి బాధపడ్డావు. ఫలితం ఇది. మాటల్ని మాటలుగా స్వీకరించడం కాదు. మనసుకు పట్టించుకో" అని ఎగిరిపోయింది.

## 105. ఆధారపడడం

మనుషులు స్వతంత్రంగా ఉండడం కన్నా ఆధారపడడాన్ని ఇష్టపడతారు. కారణం ఆధారపడడంలో శ్రమ ఉండదు. కానీ అక్కడ స్వతంత్రతని కోల్పోతున్నామన్న విషయాన్ని వాళ్ళు గుర్తించరు. దేవుడికి సంబంధించి కూడా ప్రపంచవ్యాప్తంగా ఇట్లాంటి భావనే ఉంది. దేవుణ్ణి అందరూ కలిసి ఒక వ్యక్తిని చేసేశారు. వ్యక్తిని చేయడం వల్ల అతనిపై ఆధారపడడానికి అవకాశాన్ని సృష్టించుకున్నారు. ప్రతి చిన్న విషయానికి దేవుణ్ణి బాధ్యుణ్ణి చెయ్యడం మొదలుపెట్టారు.

మనకు ఏదయినా లాభం కలిగితే దేవుని దయ అంటాం. ఒకడికి నష్టం కలిగితే దేవుడి ఆగ్రహంగా భావిస్తాం. దేవుణ్ణి మన స్వార్థానికి, స్వలాభానికి సంబంధించిన వాణ్ణిగా చేసేశాం. ఇదంతా మన అహంకారం చేసిన దృష్టి. మన రాగద్వేషాల మిశ్రమమూర్తిగా దైవాన్ని మార్చేశాం. దేవుణ్ణి మన ఆకాంక్షల్ని తీర్చేవాడుగా, మన ఆస్తిపాస్తుల్ని రక్షించేవాడుగా మార్చేశాం.

దైవత్వమన్నది ఒక అపూర్వభావన. సత్యంతో దానికి సంబంధం ఉంది. అది ప్రాపంచికమైన విషయాలతో సంబంధం లేనిది. ఆ భావనను మనం అవగాహన చేసుకుంటే ప్రాపంచికమయిన విషయాల పరిమితులు తెలుస్తాయి. అప్పుడు దైవత్త్వమన్నది అతీతశక్తి కాక మనలో భాగంగా మారుతుంది. ముడుపులు చెల్లించం.

అన్నీ దేవుడిమీద తోసెయ్యం. అన్నీ దేవుడిమీద తోసెయ్యడం వల్లనే ఎవరి కాంక్షల్ని బట్టి వాళ్ళు సాగుతారు. అక్రమార్జనల్లో కూడా దేవుడికి వాటాలు ఇచ్చి ఆయన్ని తృప్తి పరుస్తారు. **నిజమైన సత్యాన్వేషి తనకు తానే బాధ్యుడు. తన దుఃఖానికి తానే కర్త. తన సంతోషానికి తనే బాధ్యుడు. అది స్వయం సృష్టి అని సత్యాన్వేషికి తెలుసు.** ఆ తెలుసుకోవడమే దైవత్వం. అప్పుడు వైరుధ్యముండదు. ఘర్షణ ఉండదు. అప్పుడు ఆధారపడడమంటూ ఉండదు. అస్తవ్యస్తమంటూ ఉండదు. ఆ స్థాయికి వచ్చిన వ్యక్తికి గురువు, శిష్యుడు,గొప్పవాడు, తక్కువవాడు అన్న భావన ఉండదు. బుద్ధుడి గత జన్మకు సంబంధించి ఒక కథ ఉంది. ఆ కథ గురించి బుద్ధుడు చెప్పాడు. "నేను గత జన్మల్లో ఒకదానిలో అవివేకిని. అజ్ఞానిని. నేనున్న ప్రాంతంలో ఒక వ్యక్తి ఎంతో వివేకి అని, జ్ఞానోదయం పొందినవాడని విన్నాను. అట్లాంటి మహాపురుషుణ్ణి చూడాలని, ఆయన ఆశీస్సులు పొందాలని, నా జన్మ తరింపజేసుకోవాలని అనుకున్నాను. ఆయన దగ్గరికి వెళ్ళి ఆ మహానుభావుణ్ణి చూసి ఆయన పాదాలు తాకి నమస్కరించాను. కానీ ఆశ్చర్యమెక్కడంటే నేను ఆయన పాదాల్ని తాకి నమస్కరించాకా హఠాత్తుగా ఆయన కూడా వంగి నా పాదాల్ని తాకి నమస్కరించాడు. ఆ సంఘటనతో నేను దిగ్భ్రాంతి చెంది "స్వామీ! ఎందుకు మీరిలా చేశారు? నేను అవివేకిని. మీరు జ్ఞానసంపన్నులు. మీరిలా చేయకూడదు" అన్నాను.

దానికి ఆయన "అలా అనకు. నువ్వు నా పాదాల్ని తాకావు. అప్పుడు నేను తిరిగి నీ పాదాల్ని తాకకుండా ఉంటే గొప్పపొరపాటు చేసిన వాణ్ణవుతాను. ఎందుకంటే నీకూ నాకూ తేడా లేదు. తారతమ్యం లేదు. మనిద్దరం ఒక్కలాంటి వాళ్ళమే అని నీకు చెప్పడమే నా ఉద్దేశం. నువ్వు అవివేకివి. నేను జ్ఞానిని అనుకోకు. ఒక కాలు ముందు పడితే అప్పుడు ఇంకో కాలు వెనకనే ఉంటుంది. అది ముందుకు వచ్చినప్పుడు ఇది వెనక్కి పోతుంది. కాబట్టి ఇప్పుడు నువ్వు అజ్ఞానివనుకుంటున్నావు. రేపు జ్ఞానివవుతావు" అన్నాడు.

నిజానికి గురువు, శిష్యుడు అన్న అనుబంధంలో ఎట్లాంటి ఆధ్యాత్మికతా లేదు. ఎట్లాంటి బంధాలయినా అధికారం ఆధారంగా కలిగినవే. అధికారమన్న దానిలో ఆధిపత్యముంటుంది. రాజకీయముంటుంది. ఒకరు తండ్రి, ఇంకొకరు కొడుకు. తక్కిన అనుబంధాలన్నీ అధికార బంధాలే. ఆ సంబంధాల మధ్య ప్రేమ ఉన్నదనుకోండి. అప్పటి పరిస్థితి వేరుగా ఉంటుంది. అక్కడ తండ్రి అన్న మాట ఉండదు. పెద్దతనానికి వీలుండదు. కొడుకు అన్న బాంధవ్యముండదు. ప్రేమ ఒక్కటే ఉంటుంది. ఇతర బాంధవ్యాలన్నింటికీ అదే వర్తిస్తుంది. స్నేహం, అనురాగం అన్నీ అధికారంతో సంబంధం





లేనివి. **ఆధారపడడమన్నది ఎప్పుడు ఉంటుందో అధికారమన్నది అప్పుడు అనివార్యంగా ఉంటుంది.**

## 106. నమ్మకం - విశ్వాసం

మనకు కొన్ని నమ్మకాలుంటాయి. కొన్ని విశ్వాసాలుంటాయి. మనసులో అవి ఉండిపోతాయి. మనం వాటిని బట్టి ప్రవర్తిస్తాం. వాటికి అనుకూలంగా ఎవరయినా మాట్లాడితే సంతోషిస్తాం. వ్యతిరేకంగా ఎవరయినా మాట్లాడితే బాధపడతాం. వాటినిబట్టే మన అహంకారం రూపొందుతుంది. అవన్నీ మనకు సంబంధించినవి. కానీ వాటిని మనం మతంతో ముడిపెడతాం. మన మతాన్ని ఎవరయినా కించపరిస్తే మనం బాధపడతాం. మన మతం గొప్పదంటే సంతోషిస్తాం. ఆ సంతోషం, ఆ బాధ మనవి మాత్రమే అని మతానికి వాటితో సంబంధం లేదని అనుకోం. అక్కడిదాకా మన ఆలోచనలు వెళ్ళవు. ఉద్వేగాలు, రాగద్వేషాలతో కూడుకుని ఉంటాయి. రాగద్వేషాలు వ్యక్తిగతమయినవి మాత్రమే. వాటికి మతభావనకు సంబంధం లేదు.

ముగ్గురు మిత్రులు దారంటే వెళుతున్నారు. అది సాయంకాలం. ప్రకృతి మనోహరంగా ఉంది. సూర్యుడు అస్తమించబోతున్నాడు. సాయం సంధ్య మనోహరంగా ఉంది. చల్లగాలి వీస్తోంది. మిత్రులు వాకింగ్ చేస్తున్నారు. ఏవో కబుర్లు చెప్పుకుంటూ పోతున్నారు. అంతలో ఒక కారు వాళ్ళ పక్కనుంచీ వెళ్లింది. ముగ్గురు మిత్రులు మాటలు ఆపి ఆ కారుకేసి చూశారు. ఆ కారులో వ్యక్తి ముగ్గురు మిత్రులకూ పరిచితుడే.

అతన్ని చూసి ముగ్గురు మిత్రులూ చిరునవ్వు నవ్వారు. అతను కార్లోంచి 'హలో!' అన్నాడు. కారు వెళ్లిపోయింది. ముగ్గురు మిత్రులూ నడుస్తూ దూరంగా వెళుతున్న కారుని చూశారు. ముగ్గురూ కార్లో వ్యక్తి తమనే పలకరించాడని అనుకున్నారు. మొదటి మిత్రుడు 'కార్లో వ్యక్తి ఎవర్ని చూసి హలో అన్నాడనకుంటున్నారు?" అన్నాడు. తక్కిన ఇద్దరు మిత్రులూ "నన్నంటే నన్ను చూసి" అన్నారు.

మొదటి మిత్రుడు "మీరు అక్కడే పొరబడ్డారు. అతను నన్ను చూసి హల్లో" అన్నాడు. నన్ను చూసే హలో అన్నాడని చెప్పడానికి బలమైన కారణముంది. అతను మీకూ పరిచితుడే కావచ్చు. ప్రత్యేకించి నాకే ఎందుకు హల్లో చెప్పాడంటే... నేను రెండు సంవత్సరాల క్రితం అతని దగ్గర పదివేల రూపాయలు అప్పు తీసుకున్నాను. సమయానికి డబ్బు సమకూరక యిన్నాళ్ళ నుంచీ అతనికి డబ్బు తిరిగి ఇవ్వలేకపోయాను. అతనికి డబ్బు ఎగ్గొట్టాలన్నది నా ఉద్దేశం కాదు. ప్రస్తుతానికి అతనికి తిరిగి ఇవ్వలేని స్థితిలో ఉన్నాను. తెలిసినవాణ్ణి గనక అతను నన్ను పదిమంది ముందు నిలదియ్యలేదు.

కాబట్టి బాబూ! నువ్వు నాకు పదివేలు అప్పుపడ్డావు. కొంచెం గుర్తు తెచ్చుకో. ఎప్పుడిస్తావో ఏమో?! అన్నట్లు తను నన్ను చూసి "హల్లో!" అన్నాడు అని చెప్పాడు.

రెండో మిత్రుడు "నువ్వు చెప్పినదాంట్లో వాస్తవం ఉండొచ్చు. కానీ ఆ కారణంగా అతను నిన్ను చూసి హల్లో అనలేదు. అసలు నన్ను చూసే హల్లో! అన్నాడనడానికి బలమైన కారణముంది. నీకన్నా బలమైన కారణముంది. నేను అతనికి పదివేల రూపాయలు అప్పిచ్చాను. అది కూడా రెండు సంవత్సరాలయింది. నువ్వెలా అతనికి ఇవ్వలేకపోతున్నావో అతను కూడా అలాంటి పరిస్థితుల్లోనే నాకు ఇవ్వలేకపోతున్నాడు. బాబూ! నేను నీకు పదివేల రూపాయలు బాకీ ఉన్నాను. నేను ఎగగొట్టే రకాన్ని కాను. ఏమీ అనుకోకు. తప్పక తిరిగి ఇస్తాను" అంటూ ఆ విషయం గుర్తుచేస్తూ అతను నాకు హల్లో చెప్పాడు. ఈ విషయంలో ఉన్న అర్థాన్ని నువ్వు గుర్తించాలి" అన్నాడు.

మూడోమిత్రుడు వాళ్ళిద్దరూ చెప్పింది విన్నాడు. చిరునవ్వు నవ్వాడు. అసలు అతను మీ ఇద్దరికీ హలో చెప్పలేదంటాను. నాకే చెప్పాడంటాను. ఎందుకంటే అతను దగ్గర అప్పు చెయ్యలేదు. అతనికి నేను అప్పు ఇవ్వలేదు. అటువంటి లావాదేవీలేవీ మా మధ్య లేవు. అందుకనే నాకు ఉల్లాసంగా 'హల్లో' చెప్పాడు" అన్నాడు.

ముగ్గురు మిత్రులు వాళ్ళ దృష్టి కోణాల్లో వాస్తవాన్ని చూశారు. అతను హల్లో చెప్పడమన్నది ఒక వాస్తవం. అతను ఎవరికి చెప్పాడన్న ఎవరి దృష్టిని బట్టి వాళ్ళు చూశారు. వాటికి కారణాల్ని కూడా ప్రదర్శించారు. నిజమేదో ఎవరికీ తెలీదు.

**మనం కొన్ని సిద్ధాంతాలకి, అభిప్రాయాలకి కట్టుబడిపోతే ప్రతిదాన్నీ ఆ దృష్టితోనే చూస్తాం.**

## 107. మాయమైన ఆకలి

ప్రతి మనిషిలో భగవంతుని గురించిన తపన ఉంటుంది. దైవత్వానికి సంబంధించిన అన్వేషణ ఉంటుంది. దేవుడంటే ఎవరు? ఆ దేవుణ్ణి తను ఎలా అందుకోవాలి? దైవత్వాన్ని ఎట్లా ఆవిష్కరించాలి అని ప్రతి మనిషి హృదయం తపిస్తూ ఉంటుంది. కానీ సమాజం వ్యక్తిని వ్యక్తిగా వదిలిపెట్టదు. అతనికి ఎన్నో ప్రత్యామ్నాయాల్ని ప్రదర్శిస్తుంది. ఫలానా గుడికి వెళ్ళు. ఫలానా పవిత్ర గ్రంథం చదువు. నీకు పరిష్కారం దొరుకుతుంది. అంటుంది. వాటివల్ల మనిషికి దైవసాక్షాత్కారం దొరకదు. కానీ అతని తపనని ఇవన్నీ అణిచివేస్తాయి. అతని దాహం అణగారి పోతుంది. తను చూస్తున్న విగ్రహాలు, తను చదివే గ్రంథాలే నిజానికి దైవ సంబంధమయినవని అతను భ్రమిస్తాడు.

సుప్రసిద్ధ కథకుడు కఫ్కాది ఒక కథ ఉంది.





ఒక పెద్ద సర్కస్ కంపెనీ ఉండేది. అది ఊరూరా తిరిగి ప్రదర్శనలిచ్చేది. ఆ సర్కస్‌లో ఎన్నోరకాలయిన ఆకర్షణలుండేవి. రకరకాల ఫీట్లు చేసేవాళ్ళు, హాస్యగాళ్ళు, వింత వింత జంతువులు జనాల్ని విపరీతంగా ఆకర్షించేవి. సాధారణంగా సర్కస్‌లలో ఇవన్నీ ఉంటాయి. ఈ సర్కస్‌లో అదనంగా ఇంకో ఆకర్షణ జతచేశారు. ఒక ఊరికి వెళ్ళినప్పుడు సర్కస్ కంపెనీ ఆ ఊళ్ళో రెండు, మూడు నెలలు ఉండేది. చుట్టుపట్ల గ్రామాలవాళ్ళు వచ్చేవాళ్ళు. మూడునెలల తరువాత ఆ ఊరువదిలి మరొక ఊళ్ళో మకాం వేసేవాళ్ళు. అయితే ఎక్కడా మూడు నెలలకు మించి ఉండేవాళ్ళు కాదు.

ఆ సర్కస్‌లో ఏర్పాటుచేసిన అదనపు ఆకర్షణ ఏమిటంటే ఒకవ్యక్తి నిరాహారంగా ఉంటాడు. పదిరోజులు, ఇరవైరోజులు సర్కస్ ఎన్నాళ్ళు ఉంటే అన్నాళ్ళు నిరాహారంగా ఉంటాడు. అతనికో ప్రత్యేకమయిన గదిని కేటాయించి, అతన్ని అక్కడ ఉంచారు. సర్కస్ చూసిన జనానికి అతను అదనపు ఆకర్షణగా ఉండేవాడు. తనని చూడడానికి వచ్చిన జనంతో మాట్లాడేవాడు. ఏమీ తినకుండా ఉన్నప్పుడు తన శరీరస్థితి ఎలా ఉందో జనానికి వివరించేవాడు.

ఇట్లా ప్రతి ఊరు వెళ్ళినపుడు అతను ప్రత్యేక ఆకర్షణగా ఉండేవాడు. అతని గురించి ప్రచారంకూడా జరిగేది. సర్కస్ ఒక ఊరు వెళ్ళింది. జనం ప్రదర్శనలు చూసి నిరాహారంతో ఉన్న వ్యక్తిని కూడా చూసి వెళ్ళేవాళ్ళు. ఆ ఊరిచుట్టూ ఎక్కువ గ్రామాలు ఉండడంతో ఆదాయం రావడంతో సర్కస్ కంపెనీ మూడు నెలలయినా మకాం మార్చలేదు. మూడు నెలలు క్రమంగా ఆరు నెలలయ్యాయి.

నిరాహారంగా ఉన్న వ్యక్తిని రెండు, మూడు నెలలపాటు జనం ఉత్సాహంగా చూడడానికి వచ్చేవాళ్ళు. క్రమంగా రావడం మానేశారు. సర్కస్ కంపెనీవాళ్లు వాళ్ళ హడావుడిలోపడి అతని విషయమే మరిచిపోయారు. నిరాహారంగా ఉన వ్యక్తి పరిస్థితి తెలుసుకోవడానికి అటువేపు ఎవరూ రానేలేదు. తిండిలేక అస్థిపంజరంలా మారి పోయాడు.

ఐదునెలలు గడిచాక సర్కస్ కంపెనీలో ఎవరికో హఠాత్తుగా నిరాహారంగా ఉన్న వ్యక్తి గుర్తుకొచ్చాడు. అతను మేనేజర్ దగ్గరికి పరిగెత్తుకుంటూ వెళ్ళి చెప్పాడు. మేనేజర్ "ఎంత పొరపాటయింది. అతను బతికి ఉన్నాడో లేదో పదండి" అని వచ్చి చూస్తే నిరాహారంగా ఉన్న వ్యక్తి ఎముకలు బయటపడి అస్థిపంజరంలా కనిపించాడు. కానీ చనిపోలేదు.

మేనేజర్ "మన్నించు! మేము నీ సంగతి మరచిపోయాం. మూడు నెలలు గడిచాకా, జనం రావడం ఆగిపోయాకా నువ్వు ఏదయినా తినడానికి ప్రయత్నించి

ఉండవచ్చు కదా! ఇట్లా ప్రాణాలమీదికి ఎందుకు తెచ్చుకున్నావు?" అన్నాడు.

దానికి నిరాహారంగా ఉన్న వ్యక్తి "నేను నిరాహారంగా ఉండడం అలవాటై తినడమన్న విషయాన్ని మరచిపోయాను. దానికి తోడు నాకు ఆకలి అంటే ఏమిటో తెలియకుండా పోయింది. నిరాహారంగా ఉండడాన్ని ప్రదర్శించే వ్యక్తిగా లేను. నిజంగానే నిరాహారిగా మారిపోయాను. అందరూ అనుకునే ఆకలి అంటే ఏమిటో నాకు తెలీదు. ఆకలి నానుంచి మాయమైంది" అన్నాడు.

అట్లా ఆచార వ్యవహారాల్లో కర్మకాండల్లో మతాల్లో పడి మనిషిలోని అన్వేషణ, దైవత్వానికి సంబంధించిన తపన అదృశ్యమైపోయాయి.

## 108. గంగా స్నానం

మనుషుల ప్రవర్తన చిత్రంగా ఉంటుంది. తాము ఎన్నో తప్పులు చేస్తారు. ఆ తప్పులు సులభంగా పోగొట్టుకోవడానికి వాళ్ళు సులభమయిన మార్గాలు వెతుకుతారు. ఎన్నో పాపాలు చేస్తారు. ఆ పాపాల్ని కడుక్కోవడానికి కావలసిన అనుకూలాల్ని సృష్టించుకుంటారు. మనదేశంలో కావలసినన్ని గుళ్ళు, గోపురాలు కదా!వాటిని సందర్శిస్తే ముడుపులు చెల్లిస్తే చేసిన పాపం పటాపంచలవుతుందని అనుకుంటారు. కొత్త పాపాలు చెయ్యడానికి సిద్ధపడతారు.

పాపప్రక్షాళనకి మనకు పవిత్ర స్థలాలు, పవిత్రమయిన నదులు ఉన్నాయి కదా! ఆ గుడుల్ని సందర్శిస్తే, ఆ నదుల్లో స్నానం చేస్తే పాపాలు పటాపంచలవుతాయి. మళ్లీ మనం తాజాగా కొత్తపాపాలు చేయడానికి సిద్ధం కావచ్చు అనుకుంటారు. ఎక్కడ చూసినా ఇదే తంతు. మనిషి లోపలికి చూసుకోవడం మానేసి పరిష్కారాలు కోసం బయట వెతుకుతాడు. బయట కర్మకాండల్తో ఆచార, వ్యవహారాల్తో తాము స్వచ్ఛంగా మారిపోతామనుకుంటారు. దేవుడికి ముడుపులు చెల్లిస్తే పవిత్ర స్నానాలు చేస్తే పాపం పటాపంచలయిపోతుందని అనుకోవడం సర్వసాధారణమయిపోయింది. మనసులో, ప్రవర్తనలో మార్పు కాక బాహ్య ఆచారాలతో మార్పు వస్తుందని భ్రమపడతారు. ఒక భక్తుడు రామకృష్ణ పరమహంస దగ్గరకు వచ్చి 'స్వామీ! నేను గంగానదిలో స్నానం చెయ్యడానికి వెళుతున్నాను. నన్ను ఆశీర్వదించి అనుమతించండి" అన్నాడు. పరమహంస "ఎందుకంత శ్రమ తీసుకుంటున్నావు? గంగలో స్నానం చెయ్యాలనుకుంటున్నావు? నువ్వు కష్టపడడమే కాదు. గంగానదిని కూడా కష్టపెడుతున్నావు? నువ్వే కాదు. నీలాంటి వాళ్ళు లక్షలమంది గంగానదిలో స్నానం చేస్తున్నారు. ఇంతమంది స్నానానికి రావడంతో గంగానది బెంబేలెత్తిపోతుంది. పైగా వాళ్ళు ఊరికే గంగానదిలో స్నానం చెయ్యడానికి





వెళ్లడం లేదు. పవిత్ర స్నానం చెయ్యడానికి వెళుతున్నారు. పాప ప్రక్షాళనకి వెళుతున్నారు. అంటే తాము చేసిన పాపాల్ని కడుక్కోవడానికి వెళుతున్నారు. అంటే స్వచ్ఛంగా ఉన్న గంగానదిని తమ పాపాలతో నింపడానికి వెళుతున్నారు. అందువల్ల గంగానది జనాలను చూస్తూనే హడలిపోతోంది. ఇంతకూ నువ్వు కూడా అందుకే వెళుతున్నావా'" అని అడిగాడు.

ఆ భక్తుడు "స్వామీ! గంగానది పవిత్రమయింది. ఆ తల్లి నా పాపాలను పోగొడుతుందని ఆ నదిలో స్నానం చెయ్యడానికి వెళుతున్నాను. అనుమతించండి" అన్నాడు. రామకృష్ణ పరమహంస ఆ భక్తుణ్ణి చూసి "గంగానది ఒడ్డున పెద్ద పెద్ద చెట్లు ఉన్నాయి. ఆ చెట్లు ఎందుకున్నాయో నీకు తెలుసా?" అన్నాడు. భక్తుడు "తెలియదు స్వామీ!" అన్నాడు.

రామకృష్ణ పరమహంస "గంగానది పవిత్రమైంది. స్వచ్ఛమైంది కదా! అట్లాంటి నదిలో స్నానం చేస్తే పాపాలు పటాపంచలవుతాయని నమ్ముతారు కదా! నిజమే. పవిత్ర నదిని అంటవు. నువ్వు నదిలో దిగుతావు. నీలో ఉన్న పాపాలు పవిత్ర నదీ జలాలంటే భయపడతాయి. ఆ భయం వల్ల అవి నిన్ను వదిలిపెడతాయి. అవి ఎక్కడికో వెళ్లిపోవు. నది గట్టులో ఉన్న చెట్లమీద కూచుని ఉంటాయి. నీకోసం ఎదురుచూస్తూ ఉంటాయి. నువ్వు ఎప్పుడొస్తావా? అని కాచుకుని ఉంటాయి. ఎందుకంటే నువ్వు నదిలోనే ఉండవు కదా! గంట ఉంటావు. రెండు గంటలుంటావు. రోజులు తరబడి ఉండలేవు కదా! నువ్వు బయటకు వస్తూనే మళ్ళీ అవి నిన్ను పట్టుకుంటాయి. కాబట్టి అనవసరంగా శ్రమించకు. నువ్వు బాధపడి, గంగానదిని కూడా బాధపెట్టకు. చెట్లను బాధపెట్టకు. ఈ అల్పమయిన పనులవల్ల ఆత్మ ప్రక్షాళన కాదు. శరీరాన్ని కడుక్కుంటే పాపాలు పటాపంచలైతే ప్రపంచం ఈ పాటికి స్వర్గంగా మారిపోయేది. మనం చేసేవన్నీ ఇట్లాగే ఉంటాయి. బయటి ప్రయత్నాల్తో అన్నీ పరిష్కారమవుతాయని భ్రమపడతాం. మనలోపల కుట్ర, కల్మషం అట్లాగే ఉంటాయి. వాటికి చలనం ఉండదు. బయటకి వేసే కంటితుడుపు చర్యలవల్ల మనలోపలి కాలుష్యాన్ని దాచుకుంటాం. నిజానికి నువ్వు చేసే తప్పుడు పనులు నిన్ను ఎప్పుడూ ఎత్తి చూపుతూ ఉంటాయి. వాటినుంచి తప్పించుకోవడానికి మనుషులు ఇట్లాంటి నాటకాలు ఆడుతూ ఉంటారు" అన్నాడు.

భక్తుడు నోరు వెళ్ళబెట్టాడు.

## 109. జీవితలక్ష్యం జీవించడమే

జీవితమన్నది జీవించడానికి మాత్రమే ఉంది. మన ఆశలు, కోరికలు, ఆకాంక్షలు మనల్ని జీవించకుండా అడ్డుపడతాయి. మన సహజత్వాన్ని మనకు కాకుండా

చేస్తాయి. మనుషులు ఏవో ప్రయోజనాల్ని, లక్ష్యాల్ని నిర్దేశించుకుంటారు. అట్లాంటివి ఉన్నప్పుడే జీవితం అర్థవంతంగా ఉంటుందనుకుంటారు. అదొక సహజక్రియ అని అవగాహనకి వస్తుంది.

ఆలోచన అన్నది మన మనసులో ఎప్పుడూ కదుల్తూ ఉంటుంది. కుటుంబం, సంబంధ బాంధవ్యాలు అన్నీ మెదుల్తూ ఉంటాయి. వాటిని అనుసరించి బాధ్యతలు, కోరికలు తీగలు సాగుతాయి. దాంతో జీవితం తన స్వరూపాన్ని మార్చుకుంటుంది. పరిస్థితి తారుమారవుతుంది.

మనిషి సహజసిద్ధంగా ఉండాలి. కానీ మనిషి అసహజంగా మారిపోయాడు. తిరిగి సహజత్వంలోకి వెళ్ళడానికి అతనికి ఒక ప్రయత్నముండాలి. ఒక ఉద్దేశముండాలి. ఎందుకంటే మనిషి సహజంగా ఉండే తను సహజంగా ఉన్నానన్న స్పృహ మనిషికుండదు. అసలు సహజంగా ఉండాలన్న ఆలోచనే చిత్రమైంది. మనిషి సహజంగా ఉండాలి అన్న అభిప్రాయం వదులుకోవాలి. ఎందుకంటే అట్లా ఉండడమన్నది ఒక లక్ష్యాన్ని, గమ్యాన్ని ఏర్పరచుకోవడం. కానీ **జీవితానికి ఎట్లాంటి గమ్యం, లక్ష్యం ఉండవు.** జీవితమన్నది జీవించడానికి మాత్రమే ఉంది.

అంటే జీవితానికి ఒక ప్రత్యేక లక్ష్యమంటూ లేదు. ఒక ప్రయోజనమంటూ లేదు. ఉదాహరణకి ఒక పువ్వు తీసుకోండి. సున్నితమయిన తీగకు సుందరమయిన పువ్వు పూస్తుంది. అది వికసిస్తుంది. అందాల్ని వెదజల్లుతుంది. అది ఏదో ఉద్దేశంతో, ప్రయోజనంతో ఉనికిలోకి రాలేదు. అది ఎవరికోసమో ఆకారాన్ని సంతరించుకోలేదు. అది దారిపక్కన పూచి ఉంటుంది. పరిమళాల్ని ప్రసరిస్తూ ఉంటుంది. దారంటే ఎందరో వెళుతూ ఉంటారు. "దయచేసి దగ్గరికి రండి. నన్ను చూడండి. ఆనందించండి. ఆఘ్రాణించండి. నేను మీ కోసమే భూమ్మీదకి వచ్చాను" అని అది అనదు. లేదా "నేనంటే ఏమనుకుంటున్నారు. అమ్మాయిలకి, ఆడవాళ్ళకి నేనంటే ఎంతో ఆసక్తి". "నన్ను తీసుకెళ్ళండి. అమ్మండి. వాళ్ళు నన్ను ఖరీదు చేస్తారు. వాళ్ళని ఆకర్షించడానికే నేను జన్మించాను" అని గొప్పలు చెప్పుకోదు. ఇంకా ... "నేను ఆయన పాదాలని తాకందే ఆయనకు పరిపూర్ణత సిద్ధించదు. నన్ను తీసుకెళ్ళండి. ఆలయానికి వెళ్ళండి. దేవుని పాదాలపై నన్ను పెట్టండి. నాలో పవిత్రత ఉంది" అని పరితపించదు. ఇట్లా ఎన్నెన్నో చెబుతుంటుందని మనసు అంటుంది. కానీ అది వాస్తవం కాదు. ప్రయోజనాలన్నవి మనసు చేసే కల్పనలు. మనుషులకు ప్రయోజనాలుంటాయి. ఏ ప్రయోజనాలు లేకుండా ఏదయినా ఉండడమన్నది మనుషులు ఊహించలేరు. పువ్వులంటే స్త్రీల జడల్లో ఉండాలి. దేవుని పాదాలపై ఉండాలి. నాయకుల మెడల్లో ఉండాలి. ఇట్లా పూలకు ఒక





ప్రయోజనాన్ని మనం అంటగడతాం. కాని నిజానికి వీటన్నింటిని ఉద్దేశించి పువ్వు ఉనికిలోకి రాదు. అది ఉంది అంతే!

పువ్వు ప్రయోజనం వికసించడమే! వికసించడం అన్నదానికి ఒక ప్రయోజనం. ఉద్దేశించడం ఉండవు. దానివల్ల ఎట్లాంటి ప్రయోజనమూ ఉండదనవచ్చు. ఎట్లాంటి ప్రయోజనమూ లేకపోవడమే పువ్వుకయినా, మనిషికయినా ఉన్న సహజ లక్షణం.

**మనిషి కూడా పువ్వులాగే ఉండాలి. పువ్వులాగే జీవించాలి.** "మనిషి పుట్టినప్పుడు స్వేచ్ఛగా ఉన్నాడు. తరువాత జీవితమంతా నిగాళాల్లో ఉన్నాడు" అని రూసో అన్నది అందుకే. నిజమే మనం జన్మతో స్వేచ్ఛగా భూమిలోకి వస్తాము. సహజంగా వస్తాం. క్రమక్రమంగా కుటుంబం, సమాజం మనల్ని వాటికి అనుగుణంగా, అనుకూలంగా మారుస్తాయి. మలచుకుంటాయి. మనిషి అస్తిత్వం మరుగున పడుతుంది. సమాజం ఆపాదించిన 'వ్యక్తిత్వం' రూపొందుతుంది. సహజత్వమన్నది అదృశ్యమవుతుంది. మనం అసహనంగా రూపొందుతాం. కానీ మనిషి అట్లా లేడు. అసహజత్వాన్ని సహజంగా భావిస్తున్నాడు. అనుబంధాల్ని అనివార్యంగా భావిస్తున్నాడు. దాంతో పరిస్థితి తారుమారయింది. ప్రయోజనాల పరస్పర సంబంధంలో జీవితం ఉన్నది జీవించడానికి అన్న విషయం మరుగునపడింది. **హెచ్చుతగ్గులు, అధికారం అన్నీ రంగంలోకి వచ్చి జీవితమన్నది జీవించడానికి అన్న విషయం మరుగునపడింది.**

## 110. అంతటా ఉన్నాడు

దైవం ఇక్కడ ఉన్నాడు. అక్కడ లేడు అనడానికి లేదు. ఆయన అంతటా ఉన్నాడు. దైవాన్ని ఒక వ్యక్తిగా కాక అనంతశక్తిగా మనం చూసినప్పుడు దైవం అంతటా ఉన్నాడు. నీలో ఉన్నాడు. నాలో ఉన్నాడు. చరాచర సృష్టి అంతటా నిండి ఉన్నాడు. మన కల్పనలను బట్టి మనం దైవానికి పరిధులేర్పరుస్తాం. పరిమితులేర్పరుస్తాం.

దీనికి సంబంధించి షిర్డీ సాయిబాబాకు సంబంధించిన ఒక అద్భుతమయిన ఘటన ఉంది. సాయిబాబా మసీదులో నివసించేవాడు. ఆయన హిందువా, మహమ్మదీయుడా అన్న విషయం ఎవరికీ ఖచ్చితంగా తెలియదు. అయితే మసీదును తన నివాసంగా చేసుకుని నిరాడంబరంగా జీవించేవాడు. ఆ సాధుపుంగవుడి ఉదాత్త జీవితం ఎందర్నో ఆకర్షించింది. వాళ్ళల్లో ఒక హిందువు ఉండేవాడు. అతనికి సాయిబాబా అంటే ఎనలేని గౌరవం. అతనికి సాయిబాబా అంటే ఎంతో ప్రేమ. ఆరాధన, అతను సాయిబాబాతో ఎంతో సన్నిహితంగా మెలిగేవాడు.

సాయిబాబాను ఎవరయినా మీరు హిందువా? ముస్లిమా? అని అడిగితే ఆయన

ఏమీ చెప్పేవాడుకాదు. నవ్వి ఊరుకునేవాడు. ఉత్తమ జీవితం గడిపిన వ్యక్తికి తనకంటూ మతముండదు. అతని జీవితమే అతని మతం. సాయిబాబా అంటే ఎంతో ఆరాధించే హిందువు సాయిబాబాను వదిలి ఉండలేకపోయేవాడు. కానీ అతను హిందువు. మసీదులో ఉండలేడు. ఊరి పొలిమేరల్లో ఒక ఆలయముండేది. అతను అక్కడ నివసించేవాడు. ప్రతిరోజు సాయంత్రం వంటచేసి తీసుకెళ్ళి సాయిబాబాకు ఇచ్చేవాడు. సాయిబాబా భుజించాక బాబాతో మాట్లాడి, కొంత సమయం గడిపి మళ్ళీ తన మందిరానికి వెళ్ళేవాడు.

ప్రతిరోజూ వ్యవహారం ఇలాగే సాగేది. ఆ వ్యక్తి ఎంతో శ్రమపడి అంతదూరం నించి సాయిబాబాకు భోజనం తీసుకువచ్చేవాడు. బాబా అతని శ్రమను చూసి "ఎందుకు రోజూ అంత శ్రమపడి ఇంతదూరం నాకోసం భోజనం తీసుకొస్తావు? నేను చాలాసార్లు రోజూ మీ గుడి ముందుగానే వెళుతుంటాను. నాకు అప్పుడే నువ్వు భోజనం పెట్టవచ్చు కదా!" అన్నాడు. దానికావ్యక్తి "నిజంగానా? నేనెప్పుడూ చూడలేదే?" అన్నాడు. సాయిబాబా "జాగ్రత్తగా గమనిస్తూ ఉండు. నేను అటువేపు వచ్చినప్పుడు గుర్తుపట్టి భోజనం పెట్టు" అన్నాడు.

మరుసటి రోజు ఆ వ్యక్తి మందిరం బయటే కూచుని సాయిబాబా కోసం ఎదురుచూశాడు. కానీ సాయంత్రమయినా బాబా రాలేదు. బాబా ఆకలితో ఉంటాడని ఆహారం తీసుకుని పరిగెత్తుకుంటూ మసీదు దగ్గరకు వచ్చాడు. బాబాను చూసి "బాబా! మీకోసం ప్రొద్దున నుండి ఎదురుచూస్తూనే ఉన్నాను. కాని మీరు అటువేపు రానే లేదు" అన్నాడు. సాయిబాబా "లేదయ్యా! నేను వచ్చాను. కానీ నువ్వు నిర్దాక్షిణ్యంగా కొట్టి తరిమేశావు. గుర్తు తెచ్చుకో" అన్నాడు.

ఆ వ్యక్తి ఆలోచనలో పడి "బాబా! నేను మిమ్మల్ని కొట్టడమేమిటి? తరమడమేమిటి? ఒక కుక్క అన్నంలోకి రాబోతూ ఉంటే దాన్ని కొట్టి తరిమాను" అన్నాడు. బాబా నవ్వుతూ "ఆ కుక్కను నేనే" అన్నాడు. ఆ వ్యక్తి పశ్చాత్తాపంతో మన్నించండి. మిమ్మల్ని గుర్తుపట్టలేకపోయాను" అని క్షమాపణలు కోరాడు. ఇంకా "రేపు తప్పక మిమ్మల్ని గుర్తిస్తాను" అని వెళ్ళిపోయాడు. కానీ మరుసటి రోజు కూడా ఆ వ్యక్తి నిరాశగానే వచ్చాడు బాబా దగ్గరికి. అప్పుడు బాబా "ఏమయ్యా! ఈ రోజు కూడా వచ్చాను కదా! నన్ను గుర్తించలేదేం?" అన్నాడు.

అతను "బాబా! మీకోసం సాయంత్రం దాకా ఎదురుచూశాను. ఎవరూ ఏ రూపంలోనూ రాలేదు. నేను మీకోసం ఆహారం తీసుకొస్తూ ఉంటే ఒక కుష్ఠురోగి దారికి అడ్డుగా వచ్చాడు. నేను బాబా గారికి ఆహారం తీసుకెళుతున్నాను. అడ్డం తొలుగు అని వచ్చాను" అన్నాడు. బాబా! "నేను అతని రూపంలో వచ్చాను. నువ్వు ఫలానా





రూపంలో ఉండాలని అనుకోవడం పొరపాటు. దానికి ముందు నువ్వు సత్యాన్ని గ్రహించాలి. మనసును నిర్మలం చేసుకోవాలి. నేను అనేక రూపాల్లో వస్తాను. ఫలానా రూపంలోనే ఉండాలని నువ్వు అనుకోకు. **ఒకసారి నువ్వు దైవాన్ని అర్థం చేసుకుంటే నీకున్న భ్రమలన్నీ తొలగిపోతాయి, అందర్నీ ఒక్కలా చూడగలవు. అందర్లో దైవాన్ని చూడగలవు"** అన్నాడు.

## 111. తెలియని వరం

**వ్యక్తి మనసులో ఏ కాంక్షలూ లేకుండా ఉండాలి. మనసు శూన్యంగా మారాలి. నిర్మలత్వంతో నిండిపోవాలి. అప్పుడు అతను అపూర్వ శక్తితో నిండిపోతాడు.** అద్భుతమయిన చైతన్యం అతన్ని ఆవహిస్తుంది. అతనికి స్పృహ ఉండదు. అప్పుడు అతన్లో ప్రతిదీ సహజంగా పరివర్తన చెందుతుంది. సూర్యోదయం జరిగినట్లు, చంద్రుడు ఉదయించినట్లు, పూలు వికసించినట్లు, నది ప్రవహించినట్లు ప్రతిదీ అప్రయత్నంగా నిర్నిమిత్తంగా జరిగిపోతుంది. అక్కడ అన్నీ చలనంలో ఉంటాయి. అన్నీ జరుగుతాయి. కానీ తాను వాటన్నింటినీ నిర్వహిస్తున్నానన్న అహంకారం అతనికుండదు.

ఒక ప్రాచీన రోమన్ కథ ఉంది. అది గొప్ప కథ. గొప్ప సత్యాన్ని నిక్షిప్తం చేసుకున్న కథ. ఒక సన్యాసి ఉదాత్తమయిన జీవితం గడిపాడు. అతనికి ఎట్లాంటి స్వార్థ చింతన లేదు. ఏ కోరికలూ లేవు. ఏదో సాధిద్దామని అతను ఎప్పుడూ అనుకోలేదు. నిర్మలంగా, నిశ్చింతగా జీవించాడు. అతని సహజజీవితం స్వర్గం దాకా వ్యాపించింది. అతను సాధారణంగా జీవించాడు. కానీ లోకం దృష్టిలో అది అసాధారణం. కాంక్షలు లేని మనిషిని లోకం చిత్రంగా చూస్తుంది. ఆ వ్యక్తి ఔన్నత్యానికి దేవతలు ఆశ్చర్యపడ్డారు. అటువంటి వ్యక్తికోసం ఏమైనా చేయాలని సంకల్పించారు.

ఒకరోజు దేవతలు అతని ముందు ప్రత్యక్షమయ్యారు. దేవతల్ని చూస్తూనే అతను భక్తితో, నమ్రతతో వాళ్ళకు ప్రణమిల్లాడు. "నాలాంటి సామాన్యుడి పట్ల దయతో మీరు రావడం నా అదృష్టం. మీరు నన్ను ఏం చెయ్యమంటారో ఆజ్ఞాపించండి" అన్నాడు. దేవతలు "మేము నీకు ఆజ్ఞలివ్వడానికి, ఆదేశాలు జారీ చెయ్యడానికి రాలేదు. నువ్వు నీదంటూ ఏమీ లేనివాడివి. నీగురించి ఎప్పుడూ ఆలోచించనివాడివి. నిస్వార్థపరుడివి. నిరాడంబరుడివి. అట్లాంటి నీకోసం ఏమైనా చెయ్యాలనిపించి వచ్చాం. నీకు యిష్టమయిన కోరికను కోరుకో. నువ్వేది అడిగినా యిస్తాం" అన్నారు.

దానికి ఆ సన్యాసి "మీరు నాపట్ల యింత దయగా ప్రవర్తించినందుకు నా ధన్యవాదాలు. నాకు సంబంధించిన కోరికలంటూ ఏమీలేవు. దైవం ఏది సంకల్పించిందో

అదంతా యథాతథంగా జరుగుతోంది. మీరు ఇంతగా అడుగుతున్నారు, కాదంటే కూడా బాగుండదు. కానీ నాకు ఏమడగాలో తెలీడంలేదు. నేను ఊహించినవే కాదు. నేను ఊహించనివి కూడా దైవం నాకు ఇచ్చింది" అన్నాడు.

అతని వినమ్రతకు దేవతలు మరింతగా అతన్ని ఇష్టపడ్డారు. కారణం అతను కాంక్షా తీరానికి ఆవలవున్నాడన్న విషయం వాళ్ళకు తెలిసివచ్చింది. కానీ అతనికి ఏదో చెయ్యాలన్న తపన వాళ్ళల్లో పెరిగింది. "నువ్వు వద్దంటున్నావు. కానీ మాకు ఏదైనా నీకోసం చెయ్యాలని ఉంది. కాబట్టి దయచేసి ఏదైనా కోరు. మేమూ నీకు వరమియ్యందే కదలం" అన్నారు.

సన్యాసి సంకటంలో పడ్డాడు. తప్పించుకునే వీలు లేదు. "సరే! ఏం కోరాలో నాకయితే తెలియదు. మీకు ఏది మంచిదనిపిస్తే ఆ వరమివ్వండి" అన్నాడు. దేవతలు అతను ఒప్పుకున్నందుకు సంతోషించి "నీకు గొప్ప వరమిస్తున్నాం. మరణించినవాళ్ళను నువ్వు తాకితే వాళ్ళు బతికి లేచి కూచుంటారు" అన్నారు. ఆ వరంతో సన్యాసి ఆలోచనలో పడ్డాడు. "మీరు అన్యథా భావించకండి. ఇట్లా చనిపోయిన వాళ్ళను బతికిస్తున్నాను అన్న స్పృహ ఉంటే నాలో అహంకారం పెరుగుతుంది. దయచేసి మీరు ఏ వరమిచ్చినా ఆ స్పృహ నాకు లేకుండా చేయండి" అని ప్రార్థించాడు.

ఆ మాటలకు దేవతలు మరింత ఆనందించి "నీ నీడ ఎక్కడ పడినా అక్కడ చనిపోయినవన్నీ తిరిగి బతుకుతాయి" అని వరమిచ్చి మాయమైపోయారు.

వాళ్ళు వరమిచ్చారు. ఆ స్పృహ ఆ సన్యాసికి లేదు. ఆయన తన పనుల్లో తానుండేవాడు. ఆయన నీడపడిన చోట ఎండిపోయిన పచ్చిక చిగురించేది. చనిపోయిన ప్రాణులు తిరిగి బతికేవి. కానీ ఇదంతా ఆయనకు తెలిసేది కాదు. ఆయన తనదారంటే తాను వెళుతూ ఉండేవాడు. నీడపడినచోట నిత్య వసంతముండేది. ఆ సన్యాసి మరణించి స్వర్గానికి వెళ్లినప్పుడు మాత్రమే దేవతల్తో మీరిచ్చిన వరం ఎంతవరకూ పనిచేసింది? అని అడిగాడు. **అహంకారమున్న చోట కాంక్షలు ఉంటాయి. అవేవీ లేనప్పుడు మనిషి శూన్యంగా ఉంటాడు.**

## 112. ప్రయత్నం

**ప్రయత్నమన్నది ఎప్పుడూ అవసరం. అది అనుదినజీవితంలో కావచ్చు. ఆధ్యాత్మికవిషయాల్లో కావచ్చు. నిరంతర ప్రయత్నమన్నది ఎప్పుడూ నిష్ఫలం కాదు. దానికోసం మన సమస్త శక్తుల్ని కేంద్రీకరించాలి.**





అమెరికాలో కొలరాడో రాష్ట్రంలో బంగారు గనులున్నాయని తెలిసింది. అమెరికాలో ఉన్న అన్ని రాష్ట్రాలవాళ్ళు అక్కడికి పరిగెట్టారు. మనుషుల్ని ఆకర్షించే భౌతిక వస్తువుల్లో బంగారంను మించింది లేదు కదా! బంగారం ఎంత ఎక్కువ ఉంటే అంత సంపన్నులవుతామని ప్రతివాళ్ళు అనుకుంటారు. అట్లా కొలరాడో రాష్ట్రంలో బంగారం దొరుకుతుందని తెలిశాక అక్కడ భూములకు ఖరీదు పెరిగింది. మన దగ్గర రియల్ ఎస్టేట్ బూమ్‌లో ధరలు ఆకాశానికంటినట్లు అక్కడ బంగారం దొరుకుతుందన్న కారణం వల్ల స్థానికులు ధరలు పెంచేశారు. తామే తవ్వకాలు జరిపి బంగారం సొంతం చేసుకుందామనుకున్నవాళ్ళు కొందరు అమ్మలేదు. మొత్తానికి స్థానికులు సంపన్ను లయ్యారు. కొన్నవాళ్ళల్లో కొందరికి బంగారం దొరికింది. కొందరికి దొరకలేదు.

ఒక కోటీశ్వరుడు తన ఆస్తిపాస్తులమ్ముకుని వచ్చిన డబ్బును తీసుకుని కొలరాడో వచ్చాడు. అందరూ కొంత కొంత స్థలం కొని తవ్వకం పనులు మొదలుపెట్టడం చూశాడు. చిన్న చిన్న భూకమతాలు కొనడం అతనికి చిన్నతనమనిపించింది. ఏదయినా తన స్థాయికి తగినట్లు భారీగా ఉండాలని అతని ఉద్దేశ్యం. అక్కడ పెద్దగుట్ట కనిపించింది. అది రాళ్ళూ, రప్పలతో నిండి ఉంది. దాన్ని సొంతం చేసుకుంటే తప్పకుండా దాంట్లో బంగారు నిక్షేపాలు బయటపడతాయని అతనికి నమ్మకం కలిగింది.

ఆ గుట్ట యజమాని గురించి వాకబు చేశాడు. అతన్ని కలిసి బేరసారాలు ముగించి ఆ గుట్టను ఖరీదు చేశాడు. పని వాళ్ళను పెట్టుకుని యంత్రాల్ని తెప్పించి ఆ గుట్టను తవ్వడం ప్రారంభించాడు. నెలరోజులు గడిచాయి. రెండు నెలలయ్యాయి. దాదాపు సంవత్సరం పాటు తవ్వకాలు కొనసాగించాడు. ఎంత తవ్వినా రాళ్ళూ, మట్టి తప్ప బంగారు ఛాయలే కనిపించలేదు. ఆ కోటీశ్వరుడు దాదాపు దిగాలు పడిపోయాడు. జీవితమంతా శ్రమించి సంపాదించిన సంపాదనంతా అతను ఆ గుట్టను కొనడానికి ధారపోశాడు. దాదాపు బిచ్చగాడి స్థితికి చేరుకున్నాడు. అతని ఆశలన్నీ అడుగంటాయి. తన ప్రయత్నాన్ని విరమించుకున్నాడు. ఆ గుట్టను అమ్మకానికి పెట్టాలని నిర్ణయించుకుని పత్రికా ప్రకటన ఇచ్చాడు.

పత్రికా ప్రకటను చూసి ఒక వ్యక్తి ఆ గుట్టను కొనడానికి వచ్చాడు. ఆ వ్యక్తికి వ్యవహారం తెలీదేమో అనుకున్నాడు కోటీశ్వరుడు. కానీ ఆ వ్యక్తికి విషయమంతా తెలుసు. "మరి ఇదంతా తెలిసే, ఇక్కడేమీ బంగారం లేదని తెలిసే నువ్వు కొనడానికి ముందుకొచ్చావా?" అన్నాడు కోటీశ్వరుడు. దానికి ఆ వ్యక్తి "మీరు ఎక్కడ తవ్వకాలు జరిపారో అక్కడ బంగారం లేకపోవచ్చు. లేదా మీరు తవ్విన చోటే మరికొంత తవ్వితే దొరకవచ్చు. ఎవరికి తెలుసు? మరింత తవ్వాలనిపించలేదా?" అన్నాడు.

"ఇప్పటికే నా పరిస్థితి దిగజారింది. ఇంక తవ్వకం జరపడం జరగదు. ఎందుకంటే ఇంతకుమించి ఈ పరిసరాల్లో తవ్వకం జరిపినవాళ్ళు లేరు" అన్నాడు కోటీశ్వరుడు.

మొత్తానికి ఆ వ్యక్తి ఆ గుట్టను కొన్నాడు. కోటీశ్వరుడికి కూడా అనుకున్నంత డబ్బు చేతికి వచ్చింది. కానీ ఆ కొన్నవ్యక్తి పట్ల జాలిపడ్డాడు. కొన్నిసార్లు అద్భుతాలు జరుగుతాయి. ఆ కొన్న వ్యక్తి చాలా పట్టుదలగలవాడు. కోటీశ్వరుడు ఎక్కడిదాకా తవ్వకాలు జరిపి ఆపేశాడో అక్కడినుండి తవ్వకాలు మొదలుపెట్టాడు. హఠాత్తుగా అతనికి బంగారు నిక్షేపాలు బయటపడ్డాయి. ఆ బంగారు గనుల్లో అపారమైన నిల్వలు కనిపించాయి. లోకానికంతా ఆ విషయం తెలిసింది. సంగతి తెలిసి కోటీశ్వరుడు నివ్వెరపోయాడు. ఇంక కొంతకాలం తవ్వకం జరిపి ఉంటే ఆ బంగారమంతా తనకే దక్కేది కదా! అని దిగులు పడ్డాడు. సత్యాన్ని మనం అందుకోవడంలోనైనా సమస్త శక్తుల్ని కేంద్రీకరించాలి. నిరంతర ప్రయత్నం చెయ్యాలి. **మనల్ని మనం సమర్పించుకున్నప్పుడే సమగ్రంగా, సంపూర్ణంగా సమర్పించుకున్నప్పుడే సత్యమన్నది ఆవిష్కారమవుతుంది.**

## 113. మనసు రహస్యం

మనసును అర్థం చేసుకుంటే మనిషిని అర్థం చేసుకున్నట్లే. కుటుంబంలో, వ్యక్తుల మధ్య దూరానికి అదే ప్రధానం. అంటే మనసును అర్థం చేసుకోక పోవడంవల్లే ప్రధాన సమస్యలు రంగంలోకి వస్తాయి. సంఘర్షణ మొదలవుతుంది. మనసును అర్థం చేసుకోవడమంటే ఏమిటి? ఇష్టాయిష్టాల్ని తెలుసుకోవడం. వ్యక్తి స్వేచ్ఛను గౌరవించడం. అర్థం చేసుకోకుంటే అలజడి మొదలవుతుంది. మన అభిప్రాయాల్ని అధికారాన్ని ఎదుటివాళ్ళపై రుద్దితే మనుషులు దూరమవుతారు. పెద్దవాళ్ళు సాధారణంగా ఆ పనే చేస్తుంటారు. తాము అనుభవాలతో అన్నీ తెలిసిన వాళ్ళమయ్యామని, మంచి చెడ్డలు తమకు తెలిసినట్లుగా చిన్నవాళ్ళకు తెలియవని అనుకుంటారు. ఆ అనుకోవడం నుంచీ పిల్లలమీద అధికారం ఆరంభిస్తారు. ఒక దశదాకా పిల్లలకు ఊహ తెలిసేదాక పిల్లలపట్ల జాగ్రత్త చూపించాలి. వాళ్ళు ఎదిగేకొద్దీ పరిణామం కలిగే కొద్దీ వాళ్ళల్లో వచ్చిన మార్పుని గుర్తించి వాళ్లపై అధికారం చెలాయించడం, సలహాలు ఇవ్వడం మానుకోవాలి. ఎందుకంటే వాళ్ళు ఎదుగుతున్నారు. ప్రపంచాన్ని చూస్తున్నారు. మంచీ చెడ్డా గమనిస్తున్నారు. ఇక వాళ్ళకు చెప్పడం మానేసి వాళ్ళనుంచి తెలుసుకునే దశ వచ్చిందని తల్లిదండ్రులు గుర్తించాలి, ఆమోదించాలి. ఫ్రాయిడ్ సుప్రసిద్ధ మనస్తత్వవేత్త. ఆయన తన జీవితంలో జరిగిన ఒక సంఘటనని వివరించాడు. మనస్తత్వవేత్తలు బయటి





ప్రపంచాన్నే కాక లోపలి ప్రపంచాన్ని కూడా చూస్తారు. ఎదుటివ్యక్తులు గురించి మాత్రమే కాక తనతో ఉన్నవాళ్ళని, తనని కూడా పరీక్షిస్తారు. పరిశీలిస్తారు. ఫ్రాయిడ్ మహామేధావి. ఆధునిక యుగంలో మనసు లోతుల్ని విప్పి చెప్పిన ప్రతిభావంతుడు.

ఓసారి ఫ్రాయిడ్ భార్యతో, కొడుకుతో ఒక ఉద్యానవనానికి వెళ్ళాడు. ఆ తోట చాలా పెద్దది మధ్యాహ్నం నించి సాయంత్రం దాకా తిరిగారు. ఒక దగ్గర భార్యాభర్తలు ఒక బెంచీపై కూర్చుని విశ్రాంతి తీసుకుంటూ కబుర్లతో పడ్డారు. చీకటిపడవస్తోంది. ఇక బయల్దేరుదాం అనుకుని చూస్తే అక్కడ వాళ్ళ కొడుకు కనిపించలేదు. తల్లి ఆందోళన పడింది. ఇద్దరూ కలసి కుర్ర వాడికోసం వెతికారు. కనిపించలేదు. కారణం అది చాలా పెద్ద గార్డెన్. ఎకరాల ఎకరాల విస్తీర్ణంలో వ్యాపించి ఉంది. అందులో చాలా పెద్ద చెట్లు కూడా ఉన్నాయి. పైగా చీకటి పడుతుంది. ఎక్కడ వెతకాలో పాలుపోవడం లేదు. తల్లి కన్నీళ్ళపర్యంతమైంది. ఫ్రాయిడ్ భార్యను చూసి "ఆందోళన పడకు. వాడు ఎక్కడికి వెళ్ళడు. తప్పిపోడు. నేను ఒకటి అడుగుతాను చెప్పు. సాధారణంగా వాణ్ణి నువ్వు అదుపు చేస్తుంటావు. ఇక్కడికి వెళ్ళవచ్చు. అక్కడికి వెళ్ళకూడదు అని చెబుతూ ఉంటావు. నువ్వు ఫలానా చోటుకి వెళ్ళకు నాయనా అని అంటావు. అట్లాంటి సందర్భమయినా ఉంటే గుర్తు తెచ్చుకో" అన్నాడు.

ఫ్రాయిడ్ భార్య ఆలోచించి "నిజమే నాయనా! ఆ సరస్సు దగ్గర నీళ్ళు చాలా లోతుగా ఉంటాయి. అక్కడికి వెళితే ప్రమాదం. అక్కడికి తప్ప ఎక్కడికయినా వెళ్ళు! అన్నాను" అంది.

ఫ్రాయిడ్ "ఐతే నూటికి తొంభయి తొమ్మిది పాళ్లు వాడు తప్పక అక్కడే ఉంటాడు. ఏమీ జరగదు. నువ్వు దిగులుపడకు. నేను వెళ్ళి చూస్తాను" అని ఆ సరస్సు దగ్గరకు వెళ్ళాడు. అక్కడ సరస్సు మెట్లమీద కూర్చుని కుర్రాడు నీళ్ళల్లో కాళ్ళు కదిలిస్తూ ఆడుకుంటున్నాడు. ఫ్రాయిడ్ "చీకటయింది. ఇంటికి వెళదాం పదా!" అని ఆ కుర్రాణ్ణి తీసుకుని భార్య వద్దకు వచ్చాడు. భార్య ఆనందంతో బిడ్డను దగ్గరకు తీసుకుంది. ఆమె ఎంతో ఆశ్చర్యపోయింది. "మీరు మనవాడు అక్కడ ఉండవచ్చని ఎలా అనుకున్నారు? నాకంతా అద్భుతంగా ఉంది" అంది.

ఫ్రాయిడ్ "ఇందులో అద్భుతం లేదు. ఆశ్చర్యం లేదు. నేను ఆలోచించాను. మనసు ఎట్లాంటిదంటే ఎవరయినా ఫలానా పని చేయవద్దంటే అది ఎందుకు చెయ్యకూడదు? అనుకుంటుంది. ఫలానాచోటుకి వెళ్ళకు అంటే మనిషి అక్కడకు వెళ్లి తీరాలని తీర్మానించుకుంటాడు. ఏది నిషేధిస్తే మనిషి అది చెయ్యాలనుకుంటాడు. మనిషి తత్వమది. మానవజాతి ఈ విషయాన్ని తెలుసుకుంటే ప్రపంచంలోని సవాలక్ష

సమస్యలు పరిష్కరింపబడతాయి. దౌర్జన్యంతో దేన్నీ అణచిపెట్టలేం. **అర్థం చేసుకుంటేనే సమస్య పరిష్కరించబడుతుంది.**

## 114. శ్మశానం

జీవితంలో మనిషి సత్యాన్ని తెలుసుకోవాలి. జీవితానికి అర్థాన్ని గ్రహించాలి. జీవనసౌందర్యాన్ని అనుభవానికి తెచ్చుకోవాలి. జీవితం మనోహరమైంది. ఆ మనోహరత్వం మనలోపల ఉంటుంది. బయట ఉండదు. మనుషుల్లో అధిక సంఖ్యాకులు ఆ సత్యం కోసం బయట వెతుకుతారు. భౌతిక సుఖాన్ని ఆనందమనుకుంటారు. అన్ని ఆనందాలూ మనిషి అంతరంగంలో ఉన్నాయి. బీజప్రాయంగా ఉన్నాయి. మనం చెయ్యాల్సిందల్లా ఆ బీజం మొలకెత్తడానికి అనుకూలాలు ఏర్పరచడం. అది మన అహంకారాన్ని వదులుకున్నప్పుడే వీలవుతుంది. సత్యం అప్పుడే అవగాహనకు వస్తుంది. వయసు పెరిగినంత మాత్రాన మనిషి సత్యాన్ని గ్రహిస్తాడని చెప్పడానికి వీలులేదు. కోట్లమంది పుడుతున్నారు. చనిపోతున్నారు. మరణానికి భయపడకుండా, మరణాన్ని లెక్కపెట్టకుండా ఎంతమంది సంతృప్తిగా ఈ ప్రపంచాన్ని విడిచి వెళతారు? జీవితాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకుని జీవన మూలాల్ని గ్రహించి ఇక చాలు. నేను జీవితం గురించి తెలుసుకోవలసింది లేదు అని ఎంతమంది చెప్పగలుగుతారు? మరణమన్నది మనోహరమయిందని, అది జీవితానికి కొనసాగింపని ఎంతమంది తెలుసుకుంటారు?

ఎవరో కొంతమంది మాత్రమే సత్యసందర్శన చేసిన వాళ్ళుంటారు. వాళ్ళను వేళ్ళమీద మాత్రమే లెక్కపెట్టవచ్చు. కోటానుకోట్ల మంది పుడుతున్నారు. గిడుతున్నారు. ఎట్లాంటి జీవన సౌందర్యాన్ని అనుభవానికి తెచ్చుకోకుండా ప్రపంచం నుంచి నిష్క్రమిస్తున్నారు. తమలోనే ఉన్న సత్యాన్ని తమలోనే బీజప్రాయంగా ఉన్నవాటిని మొలకెత్తనీయకుండా జీవితం ముగిస్తున్నారు.

ఒక దేశానికి ఒక రాజు ఉండేవాడు. అతను సున్నితమయిన వాడు. మనుషుల్ని పరిశీలించాడు. ప్రపంచాన్ని అవలోకించాడు. జీవితం ఎంత అల్పమైందో ఎంత అశాశ్వతమయిందో గ్రహించాడు. వైరాగ్య భావనతోనే పాలన చేశాడు. తిండికి లేక పేదవాడయినా, అంతులేని సంపద ఉన్న రాజయినా చనిపోక తప్పదుకదా! అట్లాగే ఆ రాజు కూడా చనిపోయాడు. తరువాతి జన్మలో ఒక సామాన్యుడిగా పుట్టాడు. సన్యాసి అయ్యాడు. ఆ సన్యాసి ఒక దేశ రాజధాని నగరం దగ్గరున్న ఒక నాలుగు రోడ్ల కూడలి దగ్గర గుడిసె వేసుకుని నివసించేవాడు. ఎప్పుడూ ధ్యానంలో ఉండేవాడు. అతని బోధనల





పట్ల ఆసక్తి కలిగినవాళ్ళు కొంతమంది వచ్చేవాళ్ళు. వాళ్ళు అతి కొద్దిమంది. అతనికి ప్రచారం లేదు. చుట్టుపట్ల కూడా అతని గురించి పెద్దగా ఎవరికీ తెలియదు.

అయితే అతనివల్ల ఆ గుడిసె ముందు నుంచి వెళ్ళే జనాలకు కొన్ని సమస్యలు వచ్చేవి. వాళ్ళు ఆయన్తో వాదనకు దిగేవాళ్ళు. ఎందుకంటే ఆ దారంటే వెళుతూ జనం "అయ్యా! రాజధానికి వెళ్ళాలంటే ఎటువేపు వెళ్ళాలి?" అని అడిగేవాళ్ళు. ఆ సన్యాసి "ఎడమవైపు దారంటే వెళ్ళండి. రాజధాని వస్తుంది" అని చెప్పేవాడు. ఆయన చెప్పిన మాటలు విని జనం ఎడమవైపు మైలు దూరం వెళితే అక్కడ పెద్ద శ్మశానం ఉండేది. తాము దారి తప్పామని, దారి తప్పేలా సన్యాసే చేశాడని ఆగ్రహంతో జనం తిరిగి వచ్చి సన్యాసితో గొడవ పడేవాళ్ళు. "ఎవరో చెప్పారు. కుడివేపు వెళితే రాజధాని వస్తుంది. మరి నువ్వేమో రాజధానికి వెళ్ళే మార్గమని చెప్పి మమ్మల్ని శ్మశానం వేపు మళ్ళించావు. నీకు పిచ్చెక్కినట్లుంది. నీకు శ్మశానానికి, రాజధానికి తేడా తెలీదా?" అన్నారు.

వాళ్ళు చెప్పింది విని నవ్వి సన్యాసి "నేను చెప్పిన మాటల్ని మీరు అర్థం చేసుకోలేదు. వాటి అంతరార్థం గ్రహించలేదు. మీరు రాజధానికి వెళ్ళాలని అడిగారు. అంటే మనుషులు స్థిరంగా ఉండేచోటు. మనుషులు శాశ్వతంగా ఉండేచోటు. రాజధానిలో జనం నివసిస్తారు. ఉంటారు. కానీ ఎవరూ అక్కడ శాశ్వతంగా ఉండరు. రోజూ కొంతమంది పుడుతూ, మరికొంతమంది చనిపోతూ ఉంటారు. అది శాశ్వత జనావాసం కాదు. ఈ రోజు కనిపించిన జనం రేపు కనిపించరు. అక్కడ నివసించే జనమంతా మృత్యువు కోసం ఎదురుచూసేవాళ్ళే. అందుకని నేను రాజధానిని శ్మశానమంటాను. శ్మశానాన్ని రాజధాని అంటాను. ఎందుకంటే ఎవరయితే శ్మశానానికి వస్తారో వాళ్ళు స్థిరపడిపోయినట్లే. వాళ్ళు ఇక అక్కణ్ణించి కదిలే అవకాశమే లేదు.

## 115. శాంతినాథుడు

ఒక ఊళ్ళో ఒక వ్యక్తి ఉండేవాడు. అతనికి విపరీతమయిన కోపం. చిన్న విషయానికి కూడా కోపం కట్టలు తెంచుకునేది. తనని తను అదుపులో పెట్టుకోలేక పోయేవాడు. ఏదో సందర్భంలో అతను భార్యతో గొడవపడి ఆమెను కొట్టి బావిలో పడేశాడు. ఆమె శవాన్ని బావిలోంచి తీసి బయటపెట్టారు. ఆ శవాన్ని చూసిన వెంటనే అతను చలించాడు. కోపం తప్ప ఏమీ తెలియని అతను నిద్రనుండి మేల్కొన్నట్లు భావించాడు. తనలో ఏదో పరివర్తన కలిగినట్లు భావించాడు. పశ్చాత్తాపానికి గురయ్యాడు.

అప్పుడే ఆ వూళ్ళోకి గొప్ప సన్యాసి వచ్చినట్లు విని అతని దగ్గరకు వెళ్ళి అతని పాదాలపై పడి తన పరిస్థితి వివరించి "స్వామీ! నేను ఎప్పుడూ నా కోపంలో

పడి కొట్టుకుపోతుంటాను. నిగ్రహించుకోలేను. విముక్తి కలిగించండి" అని వేడుకున్నాడు. దానికి ఆ సన్యాసి "దీనికి ఒకటే మార్గం. నువ్వు సన్యాసం స్వీకరిస్తే శాంతిమూర్తిగా మారిపోతావు. క్రోధం నిన్ను వదిలిపెడుతుంది" అన్నాడు. ఆ వ్యక్తి తన వస్త్రాల్ని కూడా విసర్జించి "స్వామీ! మీరు చెప్పినట్లే అన్నీ వదిలేశాను. సన్యాసం స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. నాకు దీక్ష ఇవ్వండి" అన్నాడు. ఆ సన్యాసి ఆశ్చర్యపోయాడు. "నీ అంత బలమైన సంకల్పం ఉన్నవాళ్ళని నేను చూడలేదు. క్షణంలో అన్నీ వదిలి సిద్ధపడ్డావు" అని అతన్ని అభినందించి, అతనికి సన్యాసి దీక్ష ఇచ్చాడు. 'శాంతినాథుడు' అని పేరు పెట్టాడు. పూజా పురస్కారాల్లో, ఉపవాస దీక్షల్లో శాంతినాథుడు ముందుండేవాడు. క్రమంగా అతనికి పేరు ప్రఖ్యాతలు వచ్చాయి. అతనికి శిష్యులు కూడా ఏర్పడ్డారు.

తన నియమాలతో శాంతినాథుడు ఎప్పుడూ అందరికన్నా ముందుండేవాడు. ఎవరయినా ఒక పూట ఉపవాసముంటే తను రెండు రోజులుండేవాడు. ఇతరులు మామూలు దారిలో నడిస్తే తను ముళ్ళదారిలో నడిచేవాడు. ఇతరుల మీద చూపించే కోపం తనమీదికి తిప్పుకున్నాడు. పరహింస స్వీయహింసగా పరివర్తన చెందింది. ఒకసారి అతను ఆ దేశ రాజధాని నగరానికి ప్రవచనాల కోసం వచ్చాడు. భక్తజనం బారులు తీరి ఆయన్ను సందర్శించుకున్నారు. తన అపూర్వ వాగ్ధాటితో శాంతినాథుడు జనాలకు బోధనలు చేశాడు.

ఆ నగరంలో శాంతినాథుని మిత్రుడొకడుండేవాడు. అతనికి శాంతినాథుని గత జీవితం గురించి బాగా తెలుసు. తన మిత్రుడు తనను గుర్తుపట్టాడని శాంతినాథుడికి తెలుసు. కానీ తన స్థాయివేరు. తక్కువ స్థాయిలోనే ఉండిపోయిన మిత్రుణ్ణి పలకరిస్తే తనకు పరువునష్టం. తను మహా గురువు. అతను సామాన్యమైన మనిషి. ఇది పూడ్చలేని అంతరం అనుకున్నాడు.

ఆ మిత్రుడు శాంతినాథుని దగ్గరకు వచ్చి "స్వామీ! తమరి పేరు చెబుతారా" అన్నాడు. ఆ మాటతో శాంతినాథుడి లోపల ఉన్న అహం తన్నుకొచ్చింది. కోపం ప్రదర్శిస్తూ "నా గురించి ఎప్పుడూ వినలేదా? ప్రపంచమంతా నా గురించి చెబుతుంది. సుప్రసిద్ధుడయిన నా పేరు తెలియదా?" అన్నాడు. మిత్రుడు శాంతినాథుడు చెప్పిన విధానాన్ని బట్టి అతన్లో అణువంత కూడా మార్పు రాలేదని గ్రహించాడు. సన్యాసి కాకముందు ఎలా ఉన్నాడో అలానే ఉన్నాడనీ, అయితే ఇప్పుడు ముసుగు వేసుకున్నాడని గ్రహించాడు. మిత్రుడు మళ్ళీ "స్వామీ! గుర్తు రావడం లేదు. దయచేసి మీ పేరు చెప్పండి" అన్నాడు. శాంతినాథుడు కోపంగా "నువ్వు అజ్ఞానివి. నా పేరు శాంతినాథుడు" అన్నాడు. మిత్రుడు రెచ్చగొట్టే ధోరణిలో "స్వామీ! వినిపించలేదు. కాస్త స్పష్టంగా





చెప్పండి" అన్నాడు. శాంతినాథుడు కోపం కట్టలు తెంచుకుంది. "ఒరే! బుద్ధిహీనుడా!నన్ను రెచ్చగొడుతున్నావు. నా పేరు శాంతినాథుడని, నీకు ఎన్నిసార్లు చెప్పాలి. అసలు నా గురించి తెలుసుకునే అర్హత నీకు లేదు. నీకు చెప్పాల్సిన అవసరమూ లేదు" అన్నాడు.

ఆ స్నేహితుడు "మిత్రమా! ఇప్పుడు నాకు అర్థమయింది. నువ్వు ఏమీ మారలేదు. సన్యాసివి కాక ముందు ఎలా ఉన్నావో, సన్యాసివి అయ్యాకా కూడా అలాగే ఉన్నావు. నీలో అణువంత కూడా పరివర్తన రాలేదు. ఆగ్రహం పోలేదు. స్వీయహింసవల్ల, పైపై మెరుగులవల్ల ఎప్పుడూ పరివర్తన రాదు. ఆత్మహింస వల్ల అభిప్రాయాల్ని అణచిపెడదాం. అవి ఎక్కడికీ పోవు. లోపలుంటాయి. ఎప్పుడో బయటపడతాయి" అన్నాడు.

## 116. వేర్లు

మనకు కనిపించేవన్నీ నిజాలనుకుంటాం. మనం సమస్యల్ని ఎదుర్కొంటాం. వాటి మూలాల్లోకి వెళ్ళం. తాత్కాలిక పరిష్కారాల్తో సంతృప్తి పడిపోతాం. దాటిపోయిన సమస్య మళ్ళీ రాదని అనుకుంటాం. అది దాగి ఉంటుంది. ఎప్పుడో మళ్ళీ ముందు కొస్తుంది. సమస్యల మూలాల్లోకి వెళ్ళాలి. సమూలంగా పరిష్కరించడానికి ప్రయత్నించాలి.

మనుషుల్లో వస్తున్న మార్పులన్నవి మనసులో జరుగుతాయి. అవి కంటికి కనిపించవు. శారీరక అవసరాలు తీరినంత మాత్రాన మనిషిలో సమగ్రతరాదు. మనసు అవసరాలుంటాయి. అవి స్వతంత్రంగా ఉంటాయి. స్వేచ్ఛగా ఎదుగుతాయి. అవి కుటుంబంలో వాళ్ళు సమాజం అదుపు చేస్తే అదుపుకు లొంగవు. స్వతంత్రమన్నది ఊహ తెలిసేనాటికి మనుషుల్లో పువ్వులా విచ్చుకుంటుంది. అందుకనే మనుషుల మూలాల్లోకి వెళ్ళాలి. మనసులోతుల్లోకి వెళ్ళాలి. అక్కడ నిజమైన మనిషి అవసరాలుంటాయి. వాటిని గ్రహించాలి. గౌరవించాలి.

మావో తన బాల్యంలో జరిగిన ఒక మనోహరమయిన సంఘటన గుర్తించి చెప్పేవాడు. అది అతని పసితనంలో జరిగిన విషయం. పసితనంలో నిష్కపటత్వం, నిర్మలత్వం, అమాయకత్వం ఉంటాయి. ఆ దశలో తల్లిదండ్రులు పిల్లలకు మార్గదర్శకంగా ఉండాలి. ఆ దశలో పిల్లలు తల్లిదండ్రుల మీదే ఆధారపడి ఉంటారు. అప్పుడు ప్రేమను అందుకున్న వాళ్ళు జీవితమంతా ఆనందంగా గడుపుతారు.

వాళ్ళకు ఒక పూలతోట ఉండేది. ఎంతో మనోహరంగా ఉండేది. ఎన్నెనో రకాలయిన పూలతో ఆ తోట ఎందరినో ఆర్షించేది. మావో తల్లి ఎంతో శ్రద్ధగా ఆ పూలతోటను పెంచింది. ఎంతో జాగ్రత్తగా ప్రతి మొక్కకు పాదుతీసి నీళ్ళు పోసి కంటికి

రెప్పలా కాపేడిది. ఆ పూలతోటను చూడ్డానికి చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కూడా జనం వచ్చేవాళ్ళు. ఆమె శ్రద్ధకు అమెను అభినందించేవాళ్ళు.

ఇట్లా వుంటే ఒకసారి ఆమెకు జబ్బు చేసింది. జ్వరంతో మంచం పట్టింది. పదిహేను రోజులపాటు మంచం దిగలేదు. ఆ పదిహేను రోజులూ ఆమె దిగులు జ్వరం గురించికాదు. తనతోట గురించే. ఆ పూలచెట్ల బాగోగులు ఎవరూ చూస్తారా అని బాధపడిపోతూ ఉండేది. అప్పటికి మావో మరీ చిన్నవాడు. నాలుగైదు ఏళ్ళు ఉంటాయేమో. అయినా తల్లితో "అమ్మా! నువ్వు దిగులు పడకు, తోటను నేను జాగ్రత్తగా చూసుకుంటాను" అని తల్లికి భరోసా ఇచ్చాడు. రోజూ తోటలోకి వెళ్ళేవాడు. మధ్యాహ్నం భోజనానికి వచ్చేవాడు. మళ్ళీ తోటలోకి వెళ్ళేవాడు.

ఇట్లా పదిహేను రోజులు గడిచాయి. మావో తల్లి కోలుకుంది. అమెకు నడవగలిగే ఓపిక వచ్చాకా మొదట తోటని చూడాలనిపించింది. తోటలోకి వచ్చి చూస్తే అంతా గందరగోళంగా ఉంది. పూలు వాడిపోయాయి. మొక్కలు కూడా వాడిపోయాయి. ఆకులు రాలిపోయాయి. రెండు, మూడు రోజులు ఆలస్యం చేస్తే పూల మొక్కలన్నీ చనిపోయేట్లున్నాయి. అమె మావోతో "నువ్వు రోజూ సాయంత్రం దాకా, తోటలోనే వున్నావు కదా! ఎం చేస్తున్నావు?" అని అడిగింది. మావో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అమ్మా! నువ్వు చెప్పినట్లే తోటలోకి వస్తున్నా, శ్రద్ధగానే అన్ని పనులు చేశా. ప్రతి ఆకుని తుడిచేవాణ్ణి. దుమ్ము దులిపేవాణ్ణి. ప్రతి పువ్వు మీద, నీళ్ళు చల్లి శుభ్రం చేసేవాణ్ణి. మొక్కల్ని ముద్దు పెట్టుకునేవాణ్ణి. కాని ఎందుకిట్లా జరిగిందో నాకు కూడా తెలీదు" అన్నాడు.

పసివాడయిన అతని అమాయకత్వానికి తల్లి కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి. బిడ్డను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టి "నాన్నా! పూలను ఆకుల్ని శ్రద్ధగా చూడడం మంచిదే. కానీ వేర్లపట్ల శ్రద్ధ వహించాలి. వీటి ప్రాణం వేర్లలో ఉంటుంది. వాటికి నీళ్ళు పెట్టాలి" అంది. పసివాడయిన మావో "వేర్లు ఎక్కుటుంటాయి?" అని అడిగాడు. తల్లి "నాన్నా! కనిపించవు. అవి నేలలో ఉంటాయి. నేలమీద నీళ్ళు పోస్తే వేర్లు పీల్చుకుంటాయి. అప్పుడే మొక్క పెరుగుతుంది. కొమ్మలొస్తాయి. పూలు పూస్తాయి". అని సర్ది చెప్పింది.

**మూలాలపై దృష్టి పెట్టినప్పుడే సమూలమైన మార్పు కలుగుతుంది.**

## 117. ఆడంబరం

వినయానికి, నమ్రతకు ఎక్కడా విలువుండదు. ప్రతిభకు రాణింపు ఉండదు. పేదవాళ్ళని ఎవరూ పట్టించుకోరు. పేదవాడు ఎప్పుడూ నిర్లక్ష్యానికే గురవుతాడు.





అధికారానికి అందరూ లొంగుతారు. ఆడంబరానికి లొంగిపోతారు. పైపై మెరుగులు చూసి భ్రమపడతారు. సహజత్వంతో మనుషుల్ని సమీపిస్తే వాళ్ళని లెక్కపెట్టరు.

గాలిబ్ మహాకవి. ఉర్దూ కవితా సామ్రాజ్యంలో ఆయనను మించిన వాడులేడు. గాలిబ్ బలమైన వ్యక్తిత్వమున్నవాడు. తన కవిత్వమే తన సామ్రాజ్యంగా వెలిగినవాడు. ప్రపంచంలోని గొప్ప కవుల్లో ఆయన ఒకడు. వైభవంగా జీవించే కళ్ళముందే అన్ని సంపదలూ కోల్పోయాడు. మామూలు మనుషులకున్నట్లు జీవితం గురించి ముందు జాగ్రత్తలు, వెనకాముందు ఆలోచించడాలు కవులకు ఉండవు. ఉంటే వాళ్ళు కవులు కారు. గాలిబ్ కూడా డబ్బుపట్ల నిర్లక్ష్యంగా ఉండేవాడు. దానివల్ల అనునిత్యం ఆర్థిక సమస్యల్లో కూరుకుపోయి ఉండేవాడు.

ఒకసారి ఢిల్లీ చక్రవర్తి బహదూర్‌షా జాఫర్ గాలిబ్‌ని భోజనానికి ఆహ్వానించాడు. గాలిబ్ పేదవాడయినా కవిరాజు. ఆయన కీర్తి సామ్రాజ్యంలో వ్యాపించింది. స్వయంగా కవి ఐన బహదూర్‌షా జాఫర్‌కు గాలిబ్ కవిత్వమంటే ఎంతో ఇష్టం. ఆ మహాకవితో ఒకపూట గడపాలని చక్రవర్తి గాలిబ్‌ని ఆహ్వానించాడు.

గాలిబ్ చక్రవర్తి ఇంటికి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. మిత్రులు గాలిబ్‌ని చూసి "నువ్వు ఈ వేషంతో వెళితే రాజుగారి భవనంలో అడుగుపెట్టడానికి నీకు అనుమతి దొరకుతుందనుకుంటున్నావా?" అన్నాడు. గాలిబ్ తనని తను చూసుకుని "ఏమైంది? బాగానే ఉన్నాను. బట్టలేసుకున్నాను. నేను మారువేషంలో వెళ్లడం లేదుకదా?" అన్నాడు. మిత్రులు "ఆ మాసిన బట్టలు వేసుకుని నువ్వు వెళితే ద్వారం దగ్గరే నీకు అవమానం జరుగుతుంది. శుభ్రంగా తయారుకా. మేము అద్దెకు బట్టలు తీసుకువస్తాం. షేర్వాణీ, తలపాగా తెస్తాం. అవి వేసుకుంటే నువ్వు దర్జాగా రాజుగారి భవనంలోకి వెళతావు. లేకుంటే నీకు అవమానం తప్పదు" అన్నారు. గాలిబ్ "నేను కవిని. నేను ఎట్లా ఉండాలో అట్లాగే ఉంటాను. అద్దె బట్టలు వేసుకునే ఖర్మ నాకు పట్టలేదు" అని రాజుగారి భవనం వద్దకు వెళ్ళాడు. ద్వారం దగ్గర ఉన్న భటులు ఆపి "ఎవరు నువ్వు?" అన్నారు. గాలిబ్ "నేను మహాకవి గాలిబ్‌ని. చక్రవర్తి నన్ను భోజనానికి ఆహ్వానించాడు" అన్నాడు. భటులు "ఏమిటి? ఈ పాతబట్టలు వేసుకున్న నువ్వు గాలిబ్‌వా? చక్రవర్తి నిన్ను భోజనానికి పిలిచాడా? నువ్వు చెబితే మేము నమ్మాలా? ప్రతివాడూ రావడం, నేను చక్రవర్తి స్నేహితుడనడం. అదేమీ కుదరదు. వెళ్ళు. వెళ్ళు. " అని వెళ్ళగొట్టారు. గాలిబ్ నిరాశగా తిరిగి ఇంటికి వచ్చి మిత్రుల్తో విషయం చెప్పాడు.

మిత్రులు "మరి మేము చెబితే నువ్వు నమ్మలేదు. ఈ బట్టల్తో వెళితే అనుమతించరని చెబితే నువ్వు విశ్వసించలేదు. లోకం అట్లా ఉంది. నీ వేషం మార్చి

చూడు. ఆడంబరంగా తయారుకా. అప్పుడు నీకు ఎంతో గౌరవం... మర్యాద దొరుకుతుందో తెలిస్తే నీకు ఆశ్చర్యమేస్తుంది" అన్నారు. మొత్తానికి బట్టల్ని అద్దెకు తెచ్చారు. గాలిబ్ శుభ్రంగా స్నానం చేసి, షేర్వాణి, కోటు, తలపాగా ధరించి ధగధగలాడాడు.

రాజసంగా బయల్దేరి రాజుగారి భవనానికి వెళ్ళాడు. అంతకుముందే అడ్డగించిన భటులు తలలు సలాము చేసి గౌరవంగా ఆహ్వానించారు. బట్టలకు మనుషులిచ్చే విలువ చూసి గాలిబ్ విస్తుపోయాడు. గాలిబ్‌ని చూసి చక్రవర్తి ఎంతో సంతోషంతో ఆహ్వానించి కౌగలించుకున్నాడు. ఉన్నతాసనంలో గాలిబ్ ఆసీనుడయ్యాడు. చక్రవర్తి భవనంలో కనిపించేవాళ్ళంతా ఖరీదయిన వస్త్రాల్ని ధరించి, ఆకర్షణీయంగా ఉన్నారు. భోజనాలు సిద్ధం చేశారు. రకరకాల వంటలు రాజుగారు స్వయంగా వడ్డించి గాలిబ్‌ని తినమన్నాడు. గాలిబ్ కొంత రొట్టె తుంచి, కూరలో ముంచి షేర్వాణికి, తలపాగాకి ఆనించి తినండి. తినండి" అన్నాడు. చక్రవర్తి గాలిబ్ ప్రవర్తనకు ఆశ్చర్యపోయి, "ఏం చేస్తున్నారు?" అన్నాడు. గాలిబ్ "ఏం లేదు. మీ ఆహ్వానానికి మనుషులు వస్తే ప్రవేశం దొరకలేదు. అదే ఈ షేర్వాణీకి, కోటుకి, తలపాగాకి ప్రవేశం దొరికింది. అందుకనే వాటిని తినమంటున్నాను" అన్నాడు.

## 118. దిష్టిబొమ్మ

ఆధ్యాత్మికత పేరుతో జనాల్ని మభ్యపెట్టేవాళ్ళు ప్రపంచంలో లెక్కలేనంతమంది ఉన్నారు. భక్తి పేరుతో మనుషుల్ని మోసగించే వాళ్ళు ఎక్కడ చూసినా ఉన్నారు. నిరాడంబర జీవితం గడుపుతూ సత్యాన్వేషణలో ఉండేవాళ్ళు మనకు కనిపించరు. వాళ్ళు ఉన్నారు. కానీ అజ్ఞాతంగా ఉన్నారు. కారణం వాళ్ళకు ప్రచారం ఉండదు. ఆర్భాటాలు ఉండవు. అనుచరణ గణం ఉండదు. కానీ మోసగాళ్ళే లోకంలో పేరు ప్రఖ్యాతలు సంపాదించు కుంటారు. వంచకులదే రాజ్యం. నిర్మల జీవితం గురించి చెబితే వినేవాళ్ళు విశ్వసించరు. **మనిషి సత్యాన్ని గ్రహించాలంటే ప్రపంచం నుంచి ఉపసంహరించుకుని లోపలికి మళ్ళాలి,** కళ్ళు ఎదుట కనిపించే ఆకర్షణలకు, మోసాలకు లొంగకూడదు. కానీ మనుషులు మోసపోవడానికే ఇష్టపడతారు. ఆత్మవిచారానికి అంగీకరించరు.

కపట వేషాలతో కళ్ళముందు కనిపించే వంచనలకు సులభంగా లొంగిపోతారు. మోసపూరితమైన నటనలకు నిరాలోచనలతో లొంగిపోతారు. అజ్ఞానమన్నది అంతర్జాతీయ విషయం. తాము మోసపోవడమే కాదు. ఇతరులని కూడా మోసపోవడానికి ప్రేరేపిస్తారు. తమ నమ్మకాలని వదిలిపెట్టరు. సందేహానికి ఆస్కారం లేని నిర్ణయాలకు వస్తారు. ఇతరులని కూడా తమ గాటనే కట్టేస్తారు.





ఒక రైతు పొలంలో దిష్టిబొమ్మను పెట్టాడు. గ్రామ సీమలకు వెళ్ళిన వాళ్ళకు, పొలాల్ని చూసిన వాళ్ళకు అది అనుభవానికి వస్తుంది. పంటతో పొలం కళకళలాడుతూ ఉంటే లెక్కలేనన్ని పక్షులు వస్తాయి. పొలానికి కాపలా లేకుంటే పంటంతా తినేసి వెళతాయి. అందుకని రైతులు దిష్టిబొమ్మని పెడతారు. ఒక కర్ర అడ్డంగా, ఒక కర్ర నిలువుగా పెట్టి అడ్డంగా ఉన్న కర్రకు చొక్కా తొడిగి, నిలువుగా ఉన్న కర్రపై కుండపెట్టి ఆ కుండకు కళ్ళు, ముక్కు, నోరు, చెవులు ఉన్నట్లు చుక్కలుపెట్టి, వీలయితే ఆ కుండపైన జుత్తులాగా కొంత గడ్డి కప్పుతారు. దూరం నుంచి చూస్తే పొలం మధ్యలో మనిషి ఉన్నట్లుంటుంది. అస్తమానమూ రైతు పొలానికి కాపలా కాయలేడు కదా! అందుకని మనిషిలాగా భ్రమకలిగించేలా దిష్టిబొమ్మను చేసి పెడతారు. దాన్ని చూసి పొలంలో మనిషి ఉన్నాడని పక్షులు భయంతో ఆ ఛాయలకు రావు.

ఆ విధంగా ఆ రైతు తన పొలంలో దిష్టబొమ్మను నిలిపాడు. ఒకరోజు ఒక సన్యాసి ఆ పొలం దగ్గర్లో వెళుతూ ఆ దిష్టిబొమ్మను చూసి "మిత్రమా! రాత్రనక, పగలనక, ఎండనక, వాననక ఇలా రోజుల తరబడి ఎట్లా నిల్చుని ఉంటావు?నీకు విసుగెయ్యదా? బాధ కలగదా? ఇక్కడ ఎందుకున్నాన్రా దేవుడా? ఎప్పుడు నాకు విముక్తి కలుగుతుంది? అని అనుకోవా?" అని అడిగాడు.

దానికి ఆ దిష్టిబొమ్మ నవ్వింది. సన్యాసి "చిత్రంగా ఉందే. నా మాటలకు ఎందుకు నవ్వావు?" అని అడిగాడు. దిష్టిబొమ్మ "నువ్వు నా పట్ల జాలిపడినందుకు నాకు నవ్వు వచ్చింది. ఎందుకంటే నువ్వనుకుంటున్నట్లు నేనేమీ బాధపడడం లేదు. నాకు విసుగు లేదు. పైగా నాకెంతో హాయిగా ఉంది. నా సామర్థ్యాన్ని తలచుకుంటే నేను గర్వపడుతున్నాను. నన్ను చూసి పక్షులు భయపడుతున్నాయి. జంతువులు నా ఛాయలకే రావు. వాటి కళ్ళకి నేను నిజమైన మనిషిలాగా కనిపిస్తున్నాను. ఇంతకన్నా సంతోషించాల్సిన విషయం ఏమైనా ఉంటుందా? తనను చూసి ఎదుటి మనిషి భయపడుతున్నాడంటే అది గర్వించాల్సిన విషయం. నేను ఎదుటివాళ్ళ కళ్ళల్లో భయాన్ని చూశాను. వాళ్ళ భయమే నా ఆనందం" అంది.

సన్యాసి "నీ మాటలు వింటే నాకు ఆశ్చర్యమేస్తుంది. ఒక రకంగా నా పరిస్థితీ నీలాంటిదే. నేను ఎదుటివారి కళ్ళల్లో ఆనందాన్ని చూస్తున్నాను. నీకూ నాకూ ఉన్న తేడా అదే. నీకు భయం కనిపిస్తే నాకు ఆనందం కనిపిస్తుంది." అన్నాడు. దిష్టిబొమ్మ "ఇక్కడ ఎలాంటి తేడా లేదు. నువ్వు కూడా దిష్టిబొమ్మవే" అంది.

సన్యాసి ఒక్కసారిగా నిశ్చేష్టుడయ్యాడు.

**వ్యక్తి తన లోపలికి చూసుకోడు. బయటికే చూస్తాడు.** ఎదుటివాళ్ళ కళ్ళల్లో తనెలా ఉన్నానన్న దానిమీదే అతని దృష్టి ఉంటుంది. అప్పుడు భయమయినా, ఆనందమయినా భ్రాంతే అవుతుంది.

## 119. బియ్యపు గింజ

**సృష్టిలో మనోహరమయినది త్యాగం. ఇవ్వడమన్నది ఉన్నతమయిన లక్షణం. హృదయపూర్వకంగా ఇవ్వడమన్నది ఉన్నతోన్నత లక్షణం. అది ప్రేమ ఉంటే ఉంటుంది. అట్లాంటి సంస్కారాన్ని మనుషుల్లో కలిగించాలి. ఏదో కోరని, పోగు చేసుకుని ఇవ్వడం తెలిసిన సంస్కృతిని సమాజానికి నేర్పాలి. అప్పుడు స్వర్గమన్నది ఎక్కడో ఆకాశంలో ఉండదు. మన కళ్ళముందే ఉంటుంది.**

ఒక పండుగరోజు ఒక బిచ్చగాడు జోలి తీసుకుని భిక్షానికి బయల్దేరాడు. పండుగరోజు అందరూ ఉత్సాహంగా ఉంటారు. ఆ రోజు రోజుకన్నా ఎక్కువ భిక్షం దొరుకుతుందని ఆశతో బయల్దేరాడు. తన సంచిలో పిడికెడు బియ్యం గింజలు వేసుకుని బయల్దేరాడు. ఎందుకంటే ఖాళీ జోలి చూస్తే జనం బియ్యం వెయ్యరు. దాంట్లో అప్పటికే ఏమైనా ఉంటే వేస్తారు. బిచ్చగాళ్ళు గొప్ప సైకాలజిస్టులు. ఆ బిచ్చగాడు అలా పొద్దున్న బయల్దేరాడు. సూర్యోదయవుతోంది. సూర్యుని బంగారు కిరణాలు లోకమంతా వ్యాపించాయి. వీథులు ఖాళీగానే ఉన్నాయి. అంతలో ఏదో శబ్దం వచ్చింది. చూస్తే ఎదురుగా ఆ దేశాన్ని పాలించే రాజు రథం. బిచ్చగాడు ఆశ్చర్యపోయాడు. ఆనందించాడు. "ఆహా! ఏమి నా అదృష్టం! ఇన్నాళ్ళకు రాజు నాకు ఎదురుపడ్డాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా రాజభవనంలోకి వెళ్లే అవకాశమే దొరకలేదు. ద్వారపాలకులు అడ్డగించేవాళ్ళు. పైగా తరిమేసేవాళ్ళు. ఒక్కసారి రాజుగారు దయతలిస్తే నా దరిద్రమంతా వదిలిపోతుంది. జీవితమంతా హాయిగా బతికేయవచ్చు. ఇతరులలాగా ఆయన చిల్లర ఇవ్వడు కదా! ఆయన దానం చేస్తే భారీగానే ఉంటుంది కదా! ఈ రోజు నా అదృష్టం కొద్దీ రాజు ఎదురుపడ్డాడు. దారికి అడ్డంగా నిలుచుని రాజుని దానం అడుగుతాను" అనుకున్నాడు.

అంతలో రాజుగారి రథమే వచ్చి బిచ్చగాడి ముందు ఆగింది. రాజుగారు రథం దిగి తన కండువాను బిచ్చగాడి ముందు పరచి మోకాళ్ళపై కూచుని చేతులు జోడించి "అయ్యా! ఏమైనా దానం చేయండి" అని అభ్యర్థించాడు. రాజుగారి నుంచి ఆశించిన బిచ్చగాడికి రాజుగారి చర్య అయోమయానికి గురిచేసింది. ఆలోచన స్తంబించింది. తేరుకుని "మహారాజా! ఈ బిచ్చగాడి నుండి మీరు భిక్షం ఆశిస్తున్నారా?" అన్నాడు. రాజు "అయ్యా!దేశం ప్రమాదంలో ఉంది. మా జ్యోతిష్కుడు ఈ ఉదయాన్నే





మీరు ఎవరు కనిపిస్తే వాళ్ళని భిక్షం అడగాలి. అతను బియ్యం వేస్తే దేశం రక్షింపబడుతుంది" అన్నాడు. కాబట్టి దయచేసి దానం చెయ్యండి" అని అభ్యర్థించాడు. పరిస్థితి తారుమారయినందుకు బిచ్చగాడు తల్లడిల్లిపోతూ జోలిలోకి చేయిపోనిచ్చి పిడికిలితో బియ్యం తీసుకున్నాడు. కానీ ఇవ్వడానికి ముందు వెనుకా తటపటాయించాడు. చివరకి ఒక బియ్యం గింజ తీసి రాజుగారి కండువాలో వేశాడు. రాజుగారు "మహా ప్రసాదం" అంటూ తీసుకుని రథమెక్కి వెళ్ళిపోయాడు. ఊహించని ఈ పరిణామం నించి బిచ్చగాడు చాలాసేపు తేరుకోలేదు. కాసేపటికి మామూలు స్థితికివచ్చి "అనుకున్న దొకటి, జరిగింది ఒకటి. అంతా కలలా ఉంది. అయినా నా దురదృష్టం ఇలా ఏడ్చింది. అని దిగులుపడి ఆ రోజంతా బిచ్చమెత్తుకొని సాయంత్రానికి ఇంటికి చేరాడు. ఆ రోజు పండుగ దినం కావడం వల్ల జనం బాగానే దానం చేశారు. అయినా ఒక బియ్యం గింజ కోల్పోయానన్న దిగులు అతని ముఖంలో కనిపించింది. భార్య ఎందుకలా ఉన్నావంది. ఎందుకంత దిగులు. ఒక్క బియ్యపుగింజే కదా!" అని ఆవిడ ఓదార్చింది. బిచ్చగాడు తన జోలిలోని వన్నీ కిందకు పోశాడు. కుప్పగా పడిన బియ్యంలో ఒక బంగారు బియ్యం గింజ కనిపించింది. అది చూస్తేనే అతను గుండెలు బాదుకున్నాడు. నేలమీద పడి దొర్లుతూ ఏడ్చాడు. భార్య "ఎందుకు అలా ఏడుస్తున్నావు? ఏమయింది" అని అడిగింది. బిచ్చగాడు బియ్యం గింజలు దానం చేసి ఉంటే నా సంచిలో పిడికెడు బంగారు బియ్యం గింజలుండేవి. దాంతో మన జీవితమంతా ఆనందంగా బతికేవాళ్ళం అంటూ మొత్తుకున్నాడు. అతని భార్య "జరిగిపోయిన దానికి విచారించి ప్రయోజన మేముంది? **హృదయపూర్వకంగా ఇచ్చినదేదీ వ్యర్థం కాదు. మొదట ఇవ్వడానికి మనసు రావాలి. ఇవ్వడం తెలిసినవాడికే అన్నీ సమకూరుతాయి"** అని బుద్ధి చెప్పింది.

## 120. ప్రేమ సందేశం

**ప్రేమ, సానుభూతి సహకారం ఎక్కడుంటాయో అక్కడ శాంతి ఉంటుంది.** బుద్ధుడు, క్రీస్తు వంటి ప్రవక్తలలో సౌమ్యత ఉంటుంది. నెమ్మదితనముంది. ఆగ్రహం లేదు. అధికారం లేదు.

జర్మన్ తాత్వికుడు నీషే తన జీవితంలో చూసిన ఒకే ఒక అద్భుతమయిన దృశ్యమంటూ ఒకదాన్ని గురించి చెప్పాడు. ప్రభాతవేళ, సూర్యకిరణాలు మెరుస్తున్నప్పుడు క్రమశిక్షణగా కదిలే సైన్యం, వాళ్ళ బూట్ల చప్పుడు, తళుకు మంటున్న వాళ్ళ తుపాకీ సన్నీలు, ఇంత గంభీరమయిన అద్భుతమయిన దృశ్యం నా జీవితంలో చూడలేదన్నాడు. ఆ మాటలు వింటే మనకు కంపరం కలుగుతుంది. క్రమశిక్షణలో సౌకుమార్యం ఉండదు. తుపాకుల్ని అందమైనవంటే... పూల సంగతేంటి? కవాతులో అందం చూస్తే పూల

సౌందర్యమేమవుతుంది? ప్రేమ ఉన్న చోట ఘర్షణ ఉండదు. బుద్ధుని దగ్గర పూర్ణుడు అన్న శిష్యుడు ఉండేవాడు.అతను బుద్ధుని బోధనల్ని శ్రద్ధగా ఆచరించేవాడు. దయ, ప్రేమ, అనురాగం మొదలయిన లక్షణాల్ని అలవరచుకున్నాడు. ఎంతోకాలం బుద్ధునికి శిష్యరికం చేశాకా ఒకరోజు అతన్ని బుద్ధుడు పిలిచాడు. అతను వచ్చి బుద్ధునికి నమస్కరించాడు. బుద్ధుడు అతన్ని చూసి "నీ శిక్షణ పూర్తయింది. ఇప్పుడు నువ్వు శాంతి సందేశాన్ని తీసుకుని ప్రపంచంలోకి వెళ్ళాలి. అహింసా సిద్ధాంతాన్ని అందరికీ అందించాలి. ఎందుకంటే ఇప్పటికే హింస అన్నది అన్నిచోట్లా అల్లుకుపోయింది. దౌర్జన్యం అన్ని దిక్కులా రాజ్యమేలుతోంది. నువ్వు అట్లాంటి క్రూరత్వం నిండిన ప్రపంచంలోకి వెళ్ళి శాంతి సందేశాల్ని జనాలకు బోధించాలి. నువ్వు ఎక్కడకు వెళ్ళాలో నిర్ణయించుకో. ఫలానా ప్రాంతానికి, ఫలానా ఊరికి వెళ్లాలంటే చెప్పు. ఎక్కడికి వెళతావో చెప్పు" అన్నాడు. పూర్ణుడు తను 'సుఖ' అన్న ఒక గ్రామానికి వెళ్ళి అహింసా సిద్ధాంతాన్ని బోధిస్తానన్నాడు. కానీ సుఖ అన్న గ్రామం గురించి అందరూ వేరుగా భావిస్తారు. అక్కడ ఆ గ్రామంలో ఉన్న వాళ్ళు క్రూరులని, దొంగలని, దోపిడీగాళ్ళని, హంతకులని అంటారు. ఆ గ్రామంలో అడుగుపెట్టాలంటే అందరికీ భయం. అట్లాంటి గ్రామానికి వెళతానని పూర్ణుడు నిర్ణయించుకోవడం బుద్ధుడికి ఆశ్చర్యం కలిగించింది. "ఆ గ్రామం చాలా ప్రమాదకరం. అక్కడి వాళ్ళు దుర్మార్గులంటారు" అన్నాడు బుద్ధుడు.

పూర్ణుడు "అయితే తప్పక నేను అక్కడికే వెళ్ళాలి. నిజానికి ప్రేమ విలువల్ని దుర్మార్గులనబడే వాళ్ళకే చెప్పాలి" అన్నాడు దృఢంగా.

అప్పుడు బుద్ధుడు "నిన్ను మూడు ప్రశ్నలడుగుతాను. వాటికి నువ్వు సమాధానం చెబితే వాటిని బట్టి నువ్వు అక్కడికి వెళ్ళడానికి అర్హుడవో కాదో నిర్ణయిస్తాను" అన్నాడు. పూర్ణుడు అడగమన్నాడు. బుద్ధుడు "నువ్వు అక్కడికి వెళ్ళావనుకో. వాళ్ళు నిన్ను దూషిస్తారు. అవమానిస్తారు. అప్పుడు నువ్వేమనుకుంటావు?" అన్నాడు. పూర్ణుడు "అప్పుడు ఈ గ్రామ ప్రజలు ఎంత మంచివాళ్ళు. వాళ్ళు ఇంతమంది ఉన్నారు. అనుకుంటే నాకు దేహశుద్ధి చెయ్యగలిగేవాళ్లు. కాలో చెయ్యో తీయగలిగేవాళ్ళు. కానీ అట్లాంటి పని చెయ్యలేదు. కేవలం తిట్టి పంపారు. అవమానం చేసి పంపారు అనుకుంటాను" అన్నాడు.

బుద్ధుడు "మంచిది. ఒకవేళ నువ్వు ప్రేమ సందేశాన్ని వినిపిస్తే వాళ్ళు తిట్టడం, అవమానించడంతో ఆగక నిన్ను కొట్టారనుకో. నీ కాలో, చెయ్యో విరిచేశారనుకో. అప్పుడేం చేస్తావు?" అన్నాడు. పూర్ణుడు "స్వామీ! ఆ గ్రామప్రజలు ఎంత మంచివాళ్ళు. నన్ను అవమానించారు. ఆగ్రహించి నన్ను కొట్టారు. కానీ నన్ను చంపకుండా వదిలి





పెట్టారు" అనుకుంటాను అన్నాడు. బుద్ధుడు "ఇంతవరకూ నీ సమర్ధన అంతా సరిగానే ఉన్నట్లుంది. వాళ్ళు నిన్ను తిట్టడంతో, కొట్టడంతో ఆపకుండా చంపారనుకో. నువ్వు చనిపోతున్నప్పుడు వాళ్ళ గురించి ఏమనుకుంటావు?" పూర్ణుడు "వాళ్ళు నన్ను చంపితే చనిపోయేముందు ఈ గ్రామప్రజలు ఎంత మంచివాళ్ళు. దుఃఖపూరితమైన జీవితం నుండి నాకు విముక్తి ప్రసాదిస్తున్నారు. నాలో ఆగ్రహం రేగి ప్రతీకారానికి నేను పాల్గొనకుండా నాకు మరణాన్ని ప్రసాదిస్తున్నారు. ఇంతకంటే ఇంకేం కావాలని భావిస్తాను" అన్నాడు. బుద్ధుడు అతని సమాధానాలతో సంతృప్తి చెంది "నువ్వు పూర్ణుడవు కాదు. పరిపూర్ణుడవి. పరిపూర్ణమయిన ప్రేమ గురించి తెలిసిన వాళ్ళే హింసను వ్యతిరేకిస్తారు" అన్నాడు.

## 121. చిత్రకారుడి భయం

**జీవితం ఎలా ఉంటే దాన్ని అలాగే స్వీకరించాలి.** ఉన్నవాటిని వద్దనుకోకూడదు. లేనివాటిని కావాలనుకోకూడదు. జీవితం మారుతూ ఉంటుంది. మరే జీవితంతో బాటు మనమూ మారాలి. జీవితంలో భయం, సంతోషం ఉంటాయి. నాకు సంతోషమే కావాలి. భయమొద్దు అనుకుంటే సంతోషం మాయమవుతుంది. కానీ భయమట్లా కాదు. **భయాన్ని మనం ఆమోదిస్తే అంగీకరిస్తే భయం అదృశ్యమవుతుంది.**

ఒక యువకుడయిన చిత్రకారుడుండేవాడు. అతను ఎంతో ప్రతిభావంతుడు. చిత్రకళలో ఎంతో ప్రావీణ్యాన్ని సంపాదించినవాడు. దేశవ్యాప్తంగా అతని చిత్రకళలకు గుర్తింపు వస్తోంది. అతని తల్లిదండ్రులు కూడా అతన్ని ఎంతగానో ప్రోత్సహిస్తున్నారు. ఇంతలో అతనికి ఓ సమస్య పట్టుకుంది. అతన్లో భయమన్నది ప్రవేశించింది. ఆ భయంవల్ల అతని ప్రతిభ దెబ్బతింది.

ఆ భయం ప్రాణభయమై కూచుంది. దాంతో ఏ పనీ చేయలేకపోతున్నాడు. అతని తల్లిదండ్రులు అతన్ని అమెరికాకు కూడా తీసుకెళ్ళారు. అక్కడ మనస్తత్వవేత్తలకు చూపించారు. అక్కడి సైక్రియాటిస్టులు అతన్ని పరిశీలించారు. పరిశోధించారు. వాళ్ళకు తోచినవేవో చెప్పారు. కానీ ఫలితం లేకపోయింది. సమస్య సమస్యగానే ఉంది. భయం భయంగానే మిగిలింది. అతని తల్లిదండ్రులు అతన్ని నా దగ్గరకు తీసుకొచ్చారు. 'ఎందరో డాక్టర్లకు చూపించాం. సైకాలజిస్టులకు చూపించాం. ఎందరి దగ్గరకు వెళ్లినా, ఏ చికిత్స చేయించినా సమస్య సమస్యగానే ఉంది. ఎప్పుడూ భయపడుతూనే ఉంటాడు" అన్నాడు.

నేను ఆ కుర్రాణ్ణి పరిశీలించి, "ఎందుకు భయపడుతున్నావు?" అని అడిగాను.

ఆ యువకుడు "నేను దారిలో వెళుతూ ఉంటే ఎవరయినా కుంటివాడు ఎదురుపడ్డాడనుకోండి. నేను కుంటివాణ్ణయిపోతానేమో అని భయమేస్తోంది. గుడ్డివాణ్ణి చూస్తే గుడ్డివాణ్ణయిపోతానేమో అని భయమేస్తోంది. ఎవరయినా చనిపోయిన వాళ్ళని చూస్తే వణికిపోతాను. చనిపోతానేమో అని భయమేస్తోంది" అన్నాడు. అతని తల్లిదండ్రులు "నువ్వు కుంటివాడవు కావు. గుడ్డివాడవు కావు. బతికే ఉన్నావు" అని మేము ఎంతగానో సర్దిచెప్పాం. మనస్తత్వవేత్తలూ అదే చెప్పారు. అయినా వీడు మారలేదు" అన్నారు.

నేను "అతని భయాన్ని మీరు అర్థం చేసుకోలేదు. ఇప్పుడు గుడ్డివాడు ఒకప్పుడు కళ్ళు ఉన్నవాడే కావచ్చు. ప్రమాదంలో ఒక కాలు పోయి ఉండవచ్చు. ఇప్పుడు మీ అబ్బాయి బాగానే ఉండవచ్చు. భవిష్యత్తులో కుంటివాడో, గుడ్డివాడో అవుతానని భయపడవచ్చు. కావని మనం గ్యారంటీ ఇవ్వలేం కదా! ఇతరులకు జరిగేవి మనకు జరగవని హామీ ఇవ్వగలమా? మీరు ఎంత చెప్పినా లాభం లేదు" అన్నాను. కుర్రాడు "నన్ను సరిగ్గా అర్థం చేసుకున్నారు" అన్నాడు.

నేను ఆ యువకుడితో "నిజమే నువ్వు కుంటివాడివో, గుడ్డివాడివో కావన్న గ్యారంటీ ఏమీ లేదు .ఏదయినా మంచి జరిగే వీలుంది అని పంపేశాను. మరుసటి రోజు రమ్మన్నాను".

ఆ కుర్రాడు ఉత్సాహంగా మరుసటి రోజు వచ్చి "మీ దయవల్ల ప్రశాంతంగా ఎన్నో ఏళ్ళ తరువాత నిద్రపోయాను" అన్నాడు. మన భయాన్ని మనం అంగీకరిస్తే మనకు సమస్య ఉండదు. నేను కుర్రాడితో "గుడ్డివాడివి అవుతానని ఎందుకు నీకు భయం?" అని అడిగాను. అతను "నేను గుడ్డివాడయితే బొమ్మలు గీయలేను కదా!" అన్నాడు.

నేను "ఇప్పటికయితే నువ్వు గుడ్డివాడవు కాలేదు కదా! గుడ్డివాడయ్యే దాకా బొమ్మలు గీయి. గుడ్డివాడవయితే ఎట్లాగూ బొమ్మలు గీయలేవు కదా! గుడ్డివాడయ్యాకా అప్పుడు చెయ్యదగిన పనులు అప్పుడుంటాయి. అప్పుడు అవి చెయ్యవచ్చు. జీవితం గురించిన భయం అర్థరహితం.

అనివార్యమయిన మార్పుని మనం అర్థం చేసుకుంటే ఆమోదిస్తే భయమన్నది ఎంత అర్థరహితమో తెలిసివస్తుంది. అప్పుడు మాత్రమే అనివార్యమయిన మరణాన్ని కూడా తలచుకుని మనం ఆహ్లాదంగా నవ్వుకోగలం" అన్నాను.

ఆ యువకుడు ఆనందంగా కదిలే కళ్ళతో సెలవు తీసుకున్నాడు.





## 122. రొట్టె అంటే ఏమిటి?

ఒక ఊళ్ళో ఒక సన్యాసి ఉండేవాడు. అతను దేవుడున్నాడా లేదా? అన్న విషయాన్ని పట్టించుకునేవాడు కాదు. భక్తి శ్రద్ధల గూర్చి చెప్పేవాడు కాదు. ఎంతసేపూ జనాలకు చైతన్యం గురించి చెప్పేవాడు. దాంతో యువకులు అతని బోధనలు విని చెడిపోతున్నారని పెద్దలకు అనిపించింది. అతన్ని హెచ్చరించినా లాభం లేకపోయింది. యువకలు పెడదారి పడుతున్నారని పెద్దలు రాజుగారితో ఆ సన్యాసిపై ఫిర్యాదు చేశారు. రాజుగారి ఆస్థానంలో ఎన్నో విద్యలు నేర్చిన గొప్ప పండితులు ఉండేవాళ్ళు. ఆ సన్యాసి విషయం ఆ పండితులదాకా కూడా వెళ్ళింది. ఉన్నవాటికి తోడు మరిన్ని కల్పించి వాళ్ళు ఆ సన్యాసిపై రాజుగారికి చెప్పారు.

రాజు విషయమేమిటో తెలుసుకోవాలని తన దగ్గరకు సన్యాసిని పిలిపించాడు. సన్యాసి వచ్చాడు. రాజు "నువ్వు సమాజంలో అల్లకల్లోలానికి కారణమవుతున్నావట. యువకుల్ని పెడద్రోవ పట్టిస్తున్నావట. మనుషులకు నాస్తికత్వాన్ని బోధిస్తున్నావట. నీపై ఆరోపించబడిన అభియోగాలకు నీ సమాధానమేమిటి?" అన్నాడు. సన్యాసి చిరునవ్వు నవ్వి "రాజా! నేను మనుషుల్ని చైతన్యవంతుల్ని చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాను. నిద్రలో ఉన్న వాళ్ళని మేల్కొలపడానికి ప్రయత్నిస్తున్నాను. అంతే! కానీ మీ ఆస్థానపండితులు నాపై లేనిపోని అభాండాలను ఆరోపిస్తున్నారు. మీరు అనుమతిస్తే నేను మీ పండితుల్ని పరీక్షిస్తాను. వాళ్ళు సత్యవాదులయతే అన్నిటిపట్లా వాళ్ళకి స్పష్టత ఉండే పక్షంలో మీరు నాకు ఏ శిక్ష విధించినా స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు. రాజు సరేనన్నాడు.

సన్యాసి, ఆస్థానపండితులందర్నీ సమావేశపరచి అందరికీ ఒక తెల్లకాగితాన్ని ఇచ్చాడు. అందరూ తీసుకున్నారు. సన్యాసి పండితుల్ని చూసి "రొట్టె అంటే ఏమిటి? ఈ ప్రశ్నకు నేనిచ్చిన ఆ కాగితంపై సమాధానం రాయండి" అన్నాడు. పండితులు వీడెవడు? పిచ్చివాడిలా ఉన్నాడే. జ్ఞానంతో నిండిన మాకు ఏదయినా క్లిష్టమయిన ప్రశ్న ఇస్తాడనుకున్నాం. కానీ ఇట్లాంటి సాదా సీదా ప్రశ్న వేశాడే" అనుకున్నారు.

పండితులు సమాధానాలు రాయడానికి ఉపక్రమించారు. ఒక పండితుడు ఇందులో రహస్యమేముంది? ఇది ఆహార వస్తువు. ఆ సంగతి రాస్తే చాలు అనుకుని 'రొట్టె అంటే. తినే పదార్థం' అని రాశాడు. రెండో పండితుడు 'ఇతను రొట్టె అంటే ఏమిటి?' అని అడిగాడు అంటే అది ఏ పదార్థంతో చేస్తారన్నది అతని ఉద్దేశ్యం కావచ్చు. అనుకుని "గోధుమల్తో చేస్తే గోధుమరొట్టె. జొన్నల్తో చేస్తే జొన్నరొట్టె" అన్నాడు.

మరో పండితుడు "అన్నం పరబ్రహ్మం అంటారు కదా! ఆ విధంగా రొట్టె కూడా పరబ్రహ్మమే" అని రాశాడు. ఇంకో పండితుడు "సృష్టిలో అన్నీ రహస్యాలే

కాబట్టి రొట్టె కూడా రహస్యమే" అని రాశాడు. ఇట్లా రకరకాలుగా సమాధానాలు రాసిన పండితుల దగ్గరున్న కాగితాలన్నింటినీ సేకరించి సన్యాసి రాజుగారికిచ్చాడు. ఆ సమాధానాలు చూసి రాజు విస్తుపోయాడు. వాళ్ళని చూసి "మీరేం పండితులయ్యా! ఆస్తికత్వం గురించి, నాస్తికత్వం గురించి అనర్గళంగా ఉపన్యాసాలు దంచుతారు. రొట్టె అంటే ఏమిటో మీకు తెలియదు. ధర్మాధర్మాల గురించి దడపుట్టేలా వాదిస్తారు. ఏది సన్మార్గమో, ఏది దుర్మార్గమో మాత్రం మీకు తప్ప ఎవరికీ తెలియదని చెప్తారు" అని ఆ పండితుల్ని తన ఆస్థానం నుంచి బహిష్కరించాడు. రాజు సన్యాసిని చూసి "అంతా బాగానే ఉంది కానీ. నాకూ అయోమయమే మిగిలింది" అన్నాడు.

సన్యాసి "రాజా! రొట్టె అన్నది ఒక సాధారణ విషయం గురించి కూడ వాళ్ళ అపారవిజ్ఞానం సరయిన వివరణ ఇవ్వలేకపోయిందని నిరూపించడమే నా ఉద్దేశ్యం. ఆ విషయంలోనే వాళ్ళకు అంగీకారం లేదు. జ్ఞానం పెరిగేకొద్దీ భారం పెరుగుతుంది. **అవగాహన వేరు. జ్ఞానం వేరు. నిత్యచైతన్యస్పృహ వల్లే అవగాహన పెరుగుతుంది. జ్ఞానమన్నది గతానికి సంబంధించిన అనుభవం. అవగాహన అన్నది ఏ క్షణానికాక్షణం కలిగేది. నిలువ ఉండేది జ్ఞానం. నీరులా ప్రవహించేది అవగాహన"** అన్నాడు.

రాజు తనకు గురువుగా ఉండమని సన్యాసిని అభ్యర్థించాడు.

## 123. కండువా

ఒక నదీతీరంలో ఒక గురువుతో ఒక స్త్రీ ఆత్మ, పరమాత్మ చర్చ చేస్తోంది. ఆమె ఏవో అడుగుతుంది. గురువు తనకు తోచిన సమాధానాలిస్తున్నాడు. మనుషుల ప్రవర్తన చిత్రంగా ఉంటుంది. వాళ్ళ ఆలోచనలు విచిత్రంగా ఉంటాయి? ఆమె ఆత్మ అంటే ఏమిటి? పరమాత్మ అంటే ఏమిటి? అన్న విషయాల్ని గూర్చి గురువుతో మాట్లాడుతుంది.

అంతలో ఒక్కసారిగా గాలి వీచింది. ఆ గాలిదెబ్బకు గురువుగారి భుజం మీద ఉన్న కండువా కదిలి ఆమెను తాకింది. ఆ స్పర్శతో ఆమె ఉలిక్కిపడింది. గురువు ఆశ్చర్యపడి "ఏమి? ఏమైంది? ఎందుకంత ఆందోళన పడ్డావు?" అన్నాడు. ఆమె తెగ బాధపడిపోతోంది?" ఇది పురుషుని కండువా. పర పురుషుని కండువా స్పర్శ పాపం కదా!" అంది.

ఆ మాటలకు గురువు నిశ్చేష్టుడయ్యాడు. "ఏమమ్మా! కండువాలో కూడా పురుషత్వం,స్త్రీత్వం ఉంటాయా? చాలా వింతగా ఉంది. ఇప్పటిదాకా నాకు తెలియదు.





ప్రాణం లేని దానికి నువ్వు ప్రాణం తెచ్చిపెట్టావు" అన్నాడు. ఆమె "మీరెన్నయినా చెప్పండి. ఇప్పుడు దీనికి పరిష్కారం వెతకాలి. ప్రాయశ్చిత్తం చెయ్యాలి. దీనికి ఉపవాసమొక్కటే మార్గం. అప్పుడు మాత్రమే స్వచ్ఛత సంప్రాప్తిస్తుంది" అంది.

గురువు "కండువాకు స్త్రీత్వం, పురుషత్వం ఉంటుందంటే గాలి కూడా జాగ్రత్త తీసుకుని ఉండేది. నువ్వయితే ఇంతసేపూ ఆత్మ పరమాత్మ చర్చ చేశావు. అతీతమయిన విషయాల గురించి ఆసక్తి ప్రదర్శించావు. కానీ అల్పమయిన విషయం గురించి సీరియస్‌గా తీసుకుంటున్నావు. బాహ్యమైన, అల్పమయిన విషయాలు గురించి ఇంత పట్టుదల, పట్టింపు ఉంటే నువ్వు ధర్మమంటే ఏమిటో తెలుసుకోలేవు. సత్యమంటే ఏమిటో గ్రహించలేవు. కాంక్షని, కామాన్ని హీనమయినవని నువ్వు తెలుసుకునేదాకా వీటినించి బయటపడలేవు" అంటూ ఒక చిన్న కథ చెప్పాడు. నలుగురు కుర్రాళ్ళు ఒక వేశ్యను సముద్రం దగ్గరకు తీసుకొచ్చారు. మద్యం సేవించారు. తెచ్చుకున్న తినుబండారాలు తిన్నారు. ఆమెను నాట్యం చెయ్యమన్నారు. ఆమె నాట్యం చేసింది. వాళ్ళకు మత్తు ఎక్కువయింది. ఆ మత్తులో వాళ్ళు ఎక్కడివాళ్ళక్కడ పడి నిద్రపోయారు. ఇదే అవకాశమనుకుని ఆ వేశ్య వాళ్ళ కన్నుగప్పి పారిపోయింది. కొన్ని గంటలు గడిచాక ఆ కుర్రాళ్ళు స్పృహలోకి వచ్చారు. ఇటు, అటు చూస్తే ఆ వేశ్య కనిపించలేదు. నలుగురూ ఆమెను వెతుక్కుంటూ బయల్దేరారు. దగ్గర్లో ఒక చెట్టు క్రింద ఒక సన్యాసి తపస్సు చేసుకుంటూ కనిపించాడు. ఆ నలుగురు కుర్రాళ్ళు ఆ సన్యాసి దగ్గరకు వచ్చి "స్వామీ! ఈ దారంటే ఎవరయిన స్త్రీ వెళ్ళడం చూశారా?" అని అడిగారు. దానికి ఆ సన్యాసి "ఈ దారంటే ఎవరో వెళ్ళడం మాత్రమే నాకు గుర్తుంది. అయితే ఆ వెళ్ళింది స్త్రీనా? పురుషుడా? అన్న విషయం గురించి నేను చెప్పలేను. నాకు ఆ తరతమ భేదం తెలియదు. ఎంతవరకు నాలో పురుషుడు మేలుకొని ఉండేవాడో అప్పుడు నేను స్త్రీని గుర్తుపట్టేవాణ్ణి. నాకు స్త్రీ కనిపించింది. ఎంత కనిపించేదంటే స్త్రీ వెంటపడేవాడిని. ఎప్పుడయితే పురుషుడు నన్ను వదిలిపెట్టి వెళ్ళాడో అప్పటినుండి నేను చాలా జాగ్రత్తగా చూస్తే తప్ప ఫలానా వ్యక్తి పురుషుడు, ఫలానా వ్యక్తి స్త్రీ అని గుర్తించలేకపోతున్నాను. అందుకని ఇటునుండి వెళ్ళింది ఎవరో నేను చెప్పలేకపోతున్నాను. అదే మీరు ముందుగా నాకు చెప్పి ఉంటే నేను గుర్తు పెట్టుకుని ఉండేవాణ్ణి. కాంక్ష ఉన్నంతవరకూ వ్యక్తుల శరీరాలపట్ల నాకు స్పృహ ఉండేది. కాంక్ష లేకపోవడంతో వాళ్ళ బాహ్య ఆకారాలపట్ల నాకు ఆసక్తి లేకుండా పోయింది. కాబట్టి మీరు చెప్పినట్లు ఇటువేపు ఎవరు వెళ్ళారో నేను చెప్పలేకపోతున్నాను" అన్నాడు.

ఆ సన్యాసి చెప్పినవి అర్థం కాక అతనికి మతి భ్రమించిందనుకుని కుర్రాళ్ళు వెళ్ళిపోయారు.

ఈ కథ చెప్పి గురువు ఆమెతో **"మనలో ఏం ఉంటుందో మనకు ఇతరుల్లోనూ అదే కనబడుతుంది.** నీలో పురుషుడున్నాడు. పురుషత్వంపట్ల నీలో స్పృహ ఉంది. ఆ కారణంగా కందువాలో కూడా నువ్వు పురుషస్పర్శని అనుభూతి చెందుతున్నావు.

ఆ స్త్రీ తనను మన్నించమని గురువుకు పాదాభివందనం చేసింది.

## 124. సహాయం

మనిషి సిద్ధాంతాన్ని, నమ్మకాల్ని వదిలిపెట్టాలి. ఆధారాల్ని వదిలిపెట్టాలి. దేన్నో నమ్ముకుంటే అది మనల్ని రక్షిస్తుందనుకోవడం భ్రమ. మతాలు రక్షిస్తాయని, ఆచార వ్యవహారాలు ఆదుకుంటాయని, మనుషులు వాటికి అంటుకుని ఉంటారు. మార్పుననుసరించి జీవితంలో జరిగే పరిణామాలన్నీ తమ నమ్మకాలను బట్టి జరుగుతున్నాయని అనుకుంటూ సంతృప్తి పడుతుంటారు. ఆ నమ్మకాలే తమకు సాయపడ్డాయని, సహకరించాయని విశ్వసిస్తూ ఉంటారు.

**మనిషి వేటిని ఆశ్రయించాడో, ఆధారం చేసుకున్నాడో వాటన్నింటినీ వదులుకున్నప్పుడే అతను దైవత్వానికి దగ్గరవుతాడు.** మన నిరాధారస్థితే మనల్ని దైవత్వానికి సన్నిహితులుగా చేస్తుంది. అన్ని వర్గాల్ని వదిలినప్పుడే అసలయిన మార్గం కనిపిస్తుంది. అది విశ్వాన్ని మనతో కలిపే అపూర్వమార్గం. మానవసంబంధాలకు, ప్రాపంచిక విషయాలకూ అది అందని మార్గం. అతీత మార్గం. అది అనుభవైకవేద్యం.

ఒకరోజు శ్రీకృష్ణుడు స్నానాదికాలు ముగించుకుని భోజనానికి కూర్చున్నాడు. ఒక ముద్ద తిన్నాడు. రుక్మిణి అతని దగ్గరే కూచుని విసనకర్రతో విసురుతుంది. ఇద్దరూ విశ్రాంతిగా కబుర్లు చెప్పుకుంటున్నారు. మాట్లాడుతూనే కృష్ణుడు భోంచేస్తున్నాడు. అంతలో కృష్ణుడు భోం చెయ్యడం ఆపి పైకి లేచాడు. రుక్మిణి ఏమయిందా? అని ఆదుర్దా పడింది. "ఎందుకు లేచారు?" అని అడిగింది. కృష్ణుడు సమాధానం చెప్పకుండా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఇంటి గుమ్మందాకా వెళ్ళాడు. బయటికి చూసి మళ్ళీ తిరిగి వచ్చాడు. కూచుని మళ్ళీ భోజనం చెయ్యడం ఆరంభించాడు.

కృష్ణుని ప్రవర్తన రుక్మిణికి ఆశ్చర్యం కలిగించింది. విచిత్రంగా అనిపించింది. తింటూ ఎందుకు ఆగిపోయాడో, ఎందుకు లేచాడో? ఎందుకు గుమ్మందాకా వెళ్ళాడో ఏమీ అంతుబట్టలేదు. "మీ ప్రవర్తన చిత్రంగా ఉంది. భోజనం మధ్యలో మానేసి ఎందుకు లేచారు? గుమ్మందాకా వెళ్ళారు? ఏమైంది? ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు" అంది.

కృష్ణుడు "లేదు. నా మిత్రుడొకడు ప్రమాదంలో పడ్డాడు. అతన్ని ఆదుకునే అవసరం ఏర్పడింది. అతను ఊరి దాటి వెళుతున్నాడు. జనం అతన్ని వెంబడించారు.





చుట్టుముట్టారు. అతన్ని కొట్టారు. అతనేమీ చెయ్యడం లేదు. వాళ్ళని ప్రతిఘటించడం లేదు. అతని బట్టలు చింపేశారు. అయినా అతను నిస్సహాయంగా ఉండిపోయాడు. అతనికి ఏమాత్రం కోపం రాలేదు. తప్పించుకు పారిపోదామని కూడా అతను ప్రయత్నించలేదు. వాళ్లు తిడుతున్నారు. అతను తిరిగి తిట్టడం లేదు. చివరికి రాళ్ళతో కొట్టారు. తలకు దెబ్బ తగిలి రక్తం కారింది. చివరికి అందరూ కలిసి అతన్ని చంపేట్టు ఉన్నారు. ఇక లాభం లేదు. నేను వెళ్ళాలి. రక్షించాలి. నేను వెళ్ళని పక్షంలో అతనికి ప్రాణాపాయం తప్పేట్టు లేదు అనుకుని బయల్దేరాను." అన్నాడు.

రుక్మిణి "మీరు అతనికి సాయపడాలనుకోవడం, అతన్ని రక్షించాలనుకోవడం అంతా బాగానే ఉంది కానీ, గుమ్మందాకా వెళ్లి ఆగి వెనక్కి తిరిగి వచ్చారు. అదే నాకు అంతుబట్టడం లేదు" అంది.

కృష్ణుడు "నిజంగానే నేను అతన్ని రక్షిద్దామన్న ఉద్దేశ్యంతోనే బయల్దేరాను. అందరూ అతనిపై రాళ్ళు విసురుతున్నారు. అతని తలనించి రక్తం కారుతోంది. అట్లాంటప్పుడు మిత్రుణ్ణి ఆదుకోవడం నా ధర్మం. అంతలో పరిస్థితి మారిపోయింది. అంతవరకూ నిస్సహాయంగా నిలబడిన నా మిత్రుడిలో చలనం కలిగింది. చైతన్యం వచ్చింది. తలనించి రక్తం కారడం చూశాక అతని ప్రవర్తన మారిపోయింది. తను కూడా రాళ్ళు తీసుకున్నాడు. నిజానికి అతను బలమైన వ్యక్తి. గొడవ ఎందుకులే అనుకున్నాడు. కానీ చివరకు వాళ్లు తననే మట్టుబెట్టే పరిస్థితి వచ్చేసరికి మేలుకున్నాడు. అంతవరకూ లేని శక్తి అతనికి వచ్చింది. తనపైన రాళ్ళు విసిరిన వాళ్ళకు రాళ్ళతో బదులు చెప్పడం ఆరంభించాడు. దాంతో జనం కాలికి బుద్ధి చెప్పడం ఆరంభించారు. అదంతా గమనించాక అతనికి నా సాయం అవసరం లేదని తేలిపోయింది. తనకు తాను సాయం చేసుకునే సామర్థ్యం అతనికి ఉందని తెలిసింది. అందుకని వెనక్కి తిరిగి వచ్చాను" అన్నాడు.

## 125. పుర్రె

ముప్పయ్యేళ్ళు, నలభై లేదా అరవై పోనీ వందేళ్ళు బతుకుతామనుకోండి. మనకు అరవై ఏళ్ళు ఉన్నాయనుకోండి. మనం వెనక్కి తిరిగి చూసుకుంటే ఎన్నో గుర్తుకువస్తాయి. గుర్తుకురానివి ఎన్నో ఉంటాయనుకోండి. గుర్తుకొచ్చిన వాటిలో ఎన్నో సంతోషకరమయిన సంఘటనలు, బాధాకరమయినవి ఉంటాయి. వాటిని మనం మననం చేసుకుంటాం. వాటితో నిమిత్తం లేకుండా శరీరం మారుతూ ఉంటుంది. మృత్యుతీరం కేసి సాగుతూ ఉంటుంది. కానీ మనకా స్పృహ ఉండదు.

ఒకసారి తావో గురువయిన చువాంగ్‌ట్జు ఒకరోజు శిష్యులతోబాటు వెళుతున్నాడు. చీకటి పడబోతోంది. ఊరిబయట శ్మశానం గుండా దారి ఉంది. ఆ దారంటే అందరూ వెళుతున్నారు. చువాంగ్‌ట్జు తన శిష్యులతో ఏదో విషయమై చర్చిస్తున్నాడు. నడుస్తూ ఉంటే చువాంగ్‌ట్జు కాలికేదో తగిలింది. వేరే మనిషైతే కాలికి తగిలిన దాన్ని కాలితోనే దూరంగా తన్నేసేవాడు. చువాంగ్‌ట్జు ఇతరులకన్నా భిన్నమయిన వాడు. ఆయన కాలికి తగిలింది ఒక మనిషి పుర్రె.

చువాంగ్‌ట్జు ఆ పుర్రెను చూస్తూనే ఎంతో పశ్చాత్తాపానికి లోనయ్యాడు. ఎంతో బాధపడ్డాడు. ఆ పుర్రెను తీసుకుని తలకు ఆనించుకుని "అయ్యా! నన్ను మన్నించాలి. నావల్ల అపచారం జరిగింది. కానీ అది నేను కావాలని చెయ్యలేదు. బాగా చీకటిగా ఉంది. పైగా దారిలో మీరు ఉంటారని నేను ఊహించలేదు. అందువల్ల నా కాలు మీకు తగిలింది. దయచేసి నన్ను క్షమించండి" అని ప్రార్థించాడు.

గురువుగారి చర్యకు శిష్యులు ఆశ్చర్యపోయారు. గురువుగారు ఎందుకింత వింతగా ప్రవర్తిస్తున్నారో వాళ్ళకు అర్థం కాలేదు. వాళ్ళు "గురువుగారూ! మీరు క్షమాపణలు చెబుతున్నది మనిషి పుర్రెకు. ఆ మనిషి ఇప్పుడు బతికిలేరు. అది అతని కపాలం. పుర్రెకు మీరు పశ్చాత్తాపం ప్రకటిస్తున్నారు. పైగా దారిలో యాదృచ్ఛికంగా అది మీ కాలికి తగిలింది. ఆ మాత్రానికే క్షమాపణలు కోరాలా?" అన్నారు.

చువాంగ్‌ట్జు "ఈ వ్యక్తి ఇప్పుడు బతికిలేడు. ఉంటే మరింత కష్టమయ్యేది. ఎందుకంటే ఇక్కడున్న ఈ శ్మశానం నీలాంటి, నాలాంటి వాళ్ళకు సంబంధించింది కాదు. ఇది సంపన్నులకు సంబంధించిన శ్మశానం. ఉన్నత వర్గాలకు సంబంధించిన వల్లకాడు. కాబట్టి ఇతను కూడా ఉన్నతవర్గాలకు చెందిన వ్యక్తే అయి ఉంటాడు. మనలాంటి సామాన్యుల పాదం ఇతనికి తగలడం అపచారం కదా! అందుకనే క్షమాపణలు చెబుతున్నాను" అన్నాడు.

శిష్యులు "గురువుగారూ! అయినా అతను బతికిలేడు కదా! అతనికి క్షమాపణలు అవసరమా?" అన్నారు. చువాంగ్‌ట్జు "అతను బతికి ఉన్నప్పుడు సంపన్నుడు. చనిపోయినా కూడా సంపన్నుడే. పేద వాళ్ళకొక శ్మశానం. సంపన్నులకొక శ్మశానమున్నా యంటే మరణానంతరం కూడా ఆ వ్యత్యాసమున్నట్లే కదా! ఈ పుర్రెను నాతోబాటు తెచ్చుకుంటాను. అనునిత్యం దీనికి క్షమాపణలు చెబుతాను" అని ఆ పుర్రెను తనతో తెచ్చుకున్నాడు.

చువాంగ్‌ట్జు చర్యకు శిష్యులు విస్తుపోయారు. చువాంగ్‌ట్జు ఉదయాన్నే నిద్రలేస్తూనే పుర్రెను ఎదురుగా పెట్టుకుని "మీరు దయచేసి నన్ను మన్నించాలి. నాకు





తెలియకుండా నా కాలు తగిలి మీకు అపచారం చేశాను" అనేవాడు. శిష్యులు "గురువుగారూ! ఈ పుర్రె మీతో ఉంటే మీకు పిచ్చెక్కేలా ఉంది. ఆ మనిషి బతికి లేడని మీకు చెప్పాము కదా!" అన్నారు.

చువాంగ్‌ట్జు "ఇది సంపన్న వంశస్థుని పుర్రె అని చెప్పాను కదా!" అన్నాడు. శిష్యులు "గురువుగారూ! మీకు తెలుసుకదా!" ఉన్నవాడయినా, లేనివాడయినా కన్నుమూస్తాడు. అందరూ మట్టిలో కలిసిపోతారు. మట్టి ఒక్కటే మనుషుల్ని ఒకటి చేసేది. ఈ సంగతులన్నీ మీరు మాకు చెప్పారు. మనిషి చనిపోయాకా, అస్థిపంజరంగా మారాకా సంపన్నుని పుర్రె, పేదవాడి పుర్రె అన్న తేడాలుంటాయా? అన్నీ కలలో కలిసిపోతే కాలంలో కరిగిపోతే తేడాలుంటాయి?" అన్నారు.

చువాంగ్‌ట్జు ఆ విధంగా ప్రవర్తించడం అర్థవంతమైందే. ఎందుకంటే మనుషులు బతికి ఉన్నప్పుడే కాదు మరణించాకా కూడా వాళ్లమధ్య అంతరాలను ప్రదర్శిస్తుంది. ఎక్కువలు, తక్కువలు చూపిస్తుంది. మరణమొక్కటే మహాపురుషులకు, మామూలు మనుషులకు సమానత్వమిస్తుంది.

## 126. మనమెంత?

మన తెలివితేటల్తో మనం అహంకరిస్తూ ఉంటాం. ఎప్పుడూ మనిషి విజయాల వేటలో ఉంటాడు. తన అల్పత్వం గురించి ఎప్పుడూ ఆలోచించడు. మహాతాత్వికుడు బెర్ట్రాండ్ రస్సెల్ ఒక కథ రాశాడు.

ఆ కథలో ఒక చర్చి ఫాదర్ ఉంటాడు. ఆయనకు ఒక కల వచ్చింది. ఆ కలలో ఆయన స్వర్గద్వారాల దగ్గర ఉంటాడు. తను స్వర్గద్వారాల దగ్గర ఉన్నందుకు ఎంతో సంతోషిస్తాడు. పరవశించిపోతాడు. "తను కాసేపట్లో దేవుణ్ణి చూడబోతున్నాను కదా! తనకంటే అదృష్టవంతుడు ఎవడుంటాడు" అన్న ఆనందంలో ఉన్నాడు.

గంట గడిచింది. రెండు గంటలు గడిచాయి. ఎవరూ రాలేదు. ఫాదర్‌పైకి చూశాడు. ఆ స్వర్గద్వారాలు ఎంత ఎత్తు ఉన్నాయంటే అవి అనంతంగా విస్తరించి ఉన్నాయి. వాటికి ఆద్యంతాలు కనిపించడంలేదు. ఎవర్ని పిలవాలో? ఏమని పిలవాలో అతనికి తోచలేదు. కొన్ని గంటలు గడిచాక ఇక లాభం లేదని 'దేవా! అని అరిచాడు. గొంతు చించుకుని అరిచాడు . అరచి, అరచి అలసిపోయాడు. చివరికి ఆ మహాద్వారాలలో ఉన్న ఒక కిటికీ తెరుచుకుంది. ఆ కిటికీలోంచి తలబైటికి వచ్చింది. ఆ తలకు లెక్కలేనన్ని కళ్ళున్నాయి. అవి కాంతివంతంగా ధగధగలాడుతూ ఉన్నాయి. ఫాదర్ ఇన్నాళ్ళకు తన జన్మ ధన్యమయిందని, భగవంతుడు తనకు దర్శనమిచ్చాడని

పట్టలేని పరవశంతో ప్రార్థన మొదలుపెట్టాడు. 'దేవా! ఈ పాపిని కరుణించడానికి వచ్చావా!? నేనెంత పుణ్యం చేసుకుంటే నాకు దర్శనమిచ్చావు" అంటూ కీర్తనలు మొదలుపెట్టాడు.

కిటికీలోంచి కనిపించిన వ్యక్తి "అయ్యా! ఆపు నేను దేవుణ్ణి కాను" అన్నాడు. ఫాదర్ ఆశ్చర్యపోయి "ఇతనే దేవుడనుకున్నాను. కానంటున్నాడు. ఇక దేవుడెంత గొప్పగా ఉంటాడో? అనుకుని "మీరెవరు?" అన్నాడు. "నేను ఈ ద్వారపాలకుణ్ణి. ఇంతకూ నీవెవరవు?" అనడిగాడు.

ఫాదర్ "నేను అనునిత్యం భగవంతుణ్ణి ప్రార్థించే వ్యక్తిని" అన్నాడు.

ద్వారపాలకుడు "నువ్వు ఎక్కడనుంచి వచ్చావు?" అన్నాడు. ఫాదర్ "నేను భూలోకం నుంచి వచ్చాను" అన్నాడు. "అదెక్కడుంది?" అన్నాడు ద్వారపాలకుడు.

ద్వారపాలకుని మాటల్తో ఫాదర్ ఆశ్చర్యపోయాడు. "భూలోకం తెలియదా? భూమి ఓ గ్రహం. నేను ఆ గ్రహం నుంచి వచ్చాను" అన్నాడు. ద్వారపాలకుడు లెక్కలేనన్ని భూగ్రహాలున్నాయి. నువ్వు ఏ కుటుంబానికి చెందిన భూమి గురించి చెబుతున్నావో? దాని వివరాలు కావాలి. లేకుంటే నేను తెలుసుకోలేను" అన్నాడు. ఫాదర్ పెద్ద చిక్కు వచ్చిందే అన్న ఆలోచనలోపడి "నేను సౌరకుటుంబానికి చెందిన వాణ్ణి. సూర్యుడు అన్న నక్షత్రం చుట్టూ భూమి, గురుడు, అంగారకుడు వగైరా నవగ్రహాలు తిరుగుతూ ఉంటాయి. వాటిల్లో భూమి కూడా ఒక గ్రహం. ఆ గ్రహం నుంచి వచ్చిన ప్రాణిని" అని చెప్పి ఊపిరి పీల్చుకున్నాడు.

ద్వారపాలకుడు ఒక్క నిమిషమాగు. ఇప్పుడే వస్తానని లోపలకి వెళ్ళాడు. కాసేపటికి మళ్ళీ వచ్చి "మా కంప్యూటర్లలో ఈ అనంత విశ్వానికి సంబంధించిన సమాచారమంతా ఉంది. కోటానుకోట్ల నక్షత్రాల సమాచారం ఉంది. కానీ నువ్వు చెప్పిన, సూర్యుడు, నవగ్రహాలు వీటి వివరాలకు సంబంధించిన ఇన్ఫర్మేషన్ లేనేలేదు. మేము గుర్తుపట్టడానికి నువ్వు సాధికారక సమాచారాన్ని ఇవ్వాలి. లేకుంటే గుర్తుపట్టడం కష్టం" అని కిటికీ తలుపు మూసుకున్నాడు. ఫాదర్‌కి మెలకువ వచ్చింది.

మొదటిసారి ఫాదర్‌కు మన అల్పత్వం అవగాహన అయింది. అనంత విశ్వనిర్మాణం అవగాహన చేసుకుంటే మనమే కాదు, మన అహంకారం కూడా కరిగిపోతుంది. మన భూమి ఎంతో విశాలమైందనుకుంటాం. మన భూమికంటే సూర్యుడు 60వేల రెట్లు పెద్దవాడు. కానీ ఈ అనంతవిశ్వంలో మన సూర్యుడు అతి చిన్న నక్షత్రం. సూర్యునికన్నా ఎన్నోరెట్లు పెద్ద నక్షత్రాలున్నాయి. మనకు వేల, లక్షల, కోట్ల సంవత్సరాలు పట్టేంత దూరంలోనూ నక్షత్రాలున్నాయి. ఈ అనంత విశ్వంలో మనమెంత? ఏదో





సాధించాలని అల్లాడుతున్నాం. కాని కాంక్షల్ని, ఆరాటాల్ని పక్కనపెట్టినప్పుడే సత్య సందర్శనమవుతుంది.

## 127. రెండు కలలు

ఒక చిన్నదేశానికి ఒక రాజు ఉండేవాడు. చాలాకాలం ఆయనకు సంతానం లేదు. ఆ రాజు రాణితో కలిసి ఎన్నో గుళ్ళు, గోపురాలు తిరిగాడు. వ్రతాలు ఆచరించాడు. యజ్ఞాలు చేశాడు. ఎందరు దేవుళ్ళకు మొక్కుకున్నా వాళ్ళకు సంతానం కలగలేదు. తన అనంతరం రాజ్యానికి వారసుడు లేకుండా పోతాడే అని ఆయన దిగులుపడ్డాడు.

ఇక సంతానం కలగదు. దైవం ఎట్లా సంకల్పిస్తే అట్లా కానీ అని రాజు నిర్ణయించుకుని ఆ ఆలోచన మానుకున్నాడు. అయితే తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుందన్నట్లు రాణి గర్భవతి అయింది. పండంటి కొడుక్కి జన్మనిచ్చింది. రాజు సంతోషానికి పట్టపగ్గాల్లేవు. దేశమంతా ఉత్సవాలు జరుపుకున్నారు. రాజు, రాణి కొడుకును అల్లారుముద్దుగా పెంచుకున్నారు. కొడుక్కి పదేళ్ళు వచ్చాయి. ఆనందంగా, ఉల్లాసంగా పెరిగిన రాజకుమారుడికి హఠాత్తుగా తీవ్ర అనారోగ్యం వచ్చింది. ఎంతమంది వైద్యుల్ని దేశదేశాలనుంచి రప్పించినా ఆ జబ్బేమిటో అంతు చిక్కలేదు. రాజకుమారుడు రోజురోజుకీ కృంగి కృశించి మంచం పట్టాడు. రాజు, రాణి దిగులు పడిపోయారు. కళ్ళల్లో వత్తులు వేసుకుని రాజకుమారుడి పడక దగ్గరే నిద్రాహారాలు మాని కావలి కాస్తుండేవాళ్ళు. ఒకరోజు రాజు పడకమీద ఉన్న కొడుకును చూస్తూ చూస్తూ నిద్రలోకి జారుకున్నాడు. ఆ నిద్రలో ఒక అద్భుతమైన కల వచ్చింది. ఆ కలలో ఇదే రాజు. కానీ అతను సమస్త ప్రపంచానికి చక్రవర్తి అయ్యాడు. అన్ని దేశాలు ఆయన పాదాక్రాంత మయ్యాయి. దేశదేశాల రాజులు చక్రవర్తికి అడుగులు మడుగులొత్తేవాళ్ళు. చక్రవర్తి వైభవం చెప్పనలవి కానిది. భూమండలంలో అతనికి తిరుగులేదు. ఇన్ని అదృష్టాలతోబాటు అతనికి పన్నెండుమంది కొడుకులు. ప్రపంచాన్ని వాళ్ళకు పంచి ఇచ్చినా కావలసినంత భూమి, పన్నెండు మంది కొడుకులతో రాజు, రాణి ఎంతో హాయిగా, ఆనందంగా గడిపేవారు. చక్రవర్తి అన్నా, రాణిగారన్నా ఆ పన్నెండుమంది కొడుకులకు ఎంతో ప్రేమ. బిడ్డల అనురాగంతో చక్రవర్తి దంపతులు స్వర్గమే భూమండలానికి దిగివచ్చినంత సంతోషంగా జీవిస్తున్నారు.

ఇంతలో ఎవరో సన్నగా రోదిస్తున్నట్లు వినిపించింది. కలమాయమైంది. రాజు కళ్ళు తెరిచి చూశాడు. పడకపై నీరసించి ఉన్న ఒక్కగానొక్క కొడుకు చనిపోయి ఉన్నాడు. రాణి తన కళ్ళముందే తన బిడ్డ కళ్ళు మూయడం చూసి కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. రాజుకు మెలకువ వచ్చింది. కమ్మని కల మాయమైంది. కలలో తన చక్రవర్తిత్వం,

బంగారు భవనం, వజ్రాల్లాంటి తన పన్నెండుమంది కొడుకులు, అన్నీ క్షణంలో అదృశ్యమయిపోయాయి. కళ్ళు తెరిస్తే నిర్జీవంగా పడి ఉన్న కొడుకు, విలపిస్తున్న భార్య కనిపించారు.

ఈ దృశ్యం చూసి రాజు ఫక్కున నవ్వాడు. అక్కడున్న మంత్రులు, సేవకులు అందరూ అవాక్కయ్యారు. ఇట్లాంటి సందర్భంలో ఏడవాల్సిందిపోయి రాజుగారు నవ్వుతున్నారంటే మతి భ్రమించిందేమో అనుకున్నారు. భర్త నవ్వడంతో ఏడుస్తున్న భార్య విస్తుపోయింది. రాజును చూసి "ఏమిటి మీరు చేస్తున్నది? మన ఒక్కగానొక్క కొడుకు కన్ను మూస్తే దుఃఖించాల్సింది పోయి నవ్వుతున్నారే? ఏమయింది మీకు? పీడకల వచ్చిందా?" అనడిగింది.

రాజు "నేను మామూలుగానే ఉన్నాను. నేను ఒక సందేశం కలిగి ఉన్నాను. ఇంతకు క్రితమే నాకు అద్భుతమైన స్వప్నం వచ్చింది. దాంట్లో నేను స్వర్గతుల్యమయిన సామ్రాజ్యానికి చక్రవర్తిని. నాకు పన్నెండుమంది కొడుకులు. నీ ఏడుపుతో ఆ స్వప్నం క్షణంలో అదృశ్యమయింది. కళ్ళు తెరిస్తే చనిపోయిన ఈ కొడుకు కనిపించాడు. రోదిస్తున్న నువ్వు కనిపించావు. నాకొక ధర్మసందేహం కలిగింది. ఇప్పుడు నేను దేనికోసం ఏడవాలి? అదృశ్యమయిన ఆ పన్నెండుమంది కొడుకుల కోసం ఏడవాలా? చనిపోయిన ఈ ఒక్కగానొక్క కొడుకు కోసం దుఃఖించాలా? ఆ ఆలోచన కలగగానే నాకు ఆపుకోలేని నవ్వు వచ్చింది" అన్నాడు. రాణి "అది స్వప్నం కదా!" అన్నది. రాజు ఈ రెండూ స్వప్నాలే. ఒకటి కళ్ళు మూసి ఉన్నప్పుడు స్వప్నం. రెండోది కళ్ళు తెరిచినప్పటి స్వప్నం. కళ్ళు మూసుకుని ఉన్నప్పుడు బయట ఉన్న స్వప్నాన్ని మరచిపోయాను. అది కనిపించకుండా పోయింది. కళ్ళు తెరుస్తూనే కళ్ళు మూసుకుని ఉన్నప్పుడు కలిగిన స్వప్నం అదృశ్యమయింది. రెండూ కలలే" అన్నాడు.

## 128. అతి వినయం

మన ప్రాచీనులు 'అతివినయం ధూర్తలక్షణం' అన్నారు. అతివినయమన్నది అహంకార లక్షణం. వినయాన్ని నటించడమన్న దాంట్లో ఆధిపత్యం వహించాలన్న కోరిక దాగి ఉంటుంది. నిజమైన విధేయత ఆధిపత్యాన్ని కోరుకోదు. నిజమైన వినయంలో ఆత్మాభిమానముంది. ఆత్మగౌరవముంటుంది. వాటికి మరొకదానితో పోల్చుకోవడమన్నది ఉండదు. ఇతరులతో పోల్చుకోవడంలో ఇతరులకన్నా తను ఉన్నతుడని అనుకోవడంలో అహంకారముంది. ఇతరులని తక్కువ చేయడం ఉండదు. తన లక్షణాల్ని తను గౌరవించుకోవడముంటుంది. దాంట్లో ఇతరులని తక్కువ చేయడముండదు. అది తనని ఇతరులు తక్కువ చెయ్యడాన్ని అనుమతించదు.





మనపట్ల మనం గౌరవంగా ఉండడమంటే ప్రకృతి మనకిచ్చిన తత్వంపట్ల తలవంచడం. వినయంలో అంతర్గతంగా విధేయత ఉంటుంది. అది పసివాళ్ళల్లో చూడవచ్చు. పసివాళ్ళకు ప్రతీదీ పరమాద్భుతమే. ప్రతిదాంట్లో పసివాడు అద్భుతాన్ని , ఆశ్చర్యాన్ని, రహస్యాన్ని చూస్తాడు.

నేలనుంచి అందమైన రంగురంగుల పూలు వస్తాయి. తీగలు వస్తాయి. ఫలాలు వస్తాయి. ఎలా వస్తాయి? పసిపాపకి అది అద్భుతం. ఆ అద్భుతం పట్ల పసివాడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడు. ఆ ఆశ్చర్యంలో వినయముంది. విధేయత ఉంది.

అతివినయం వేరు. అది అహంకారపూరితం.

ఒక కొండమీద మూడు ఆశ్రమాలు ఉండేవి. ఒక ఆశ్రమం తరువాత ఇంకొకటి ఉండేది. మూడో ఆశ్రమానికి వెళ్ళాలంటే మొదటిదాన్ని దాటి, రెండో ఆశ్రమం ముందుగా సాగి వెళ్ళాలి. ఆ ఆశ్రమాల్లో నివసించే సన్యాసులు ఎవరికివాళ్ళు గొప్పవాళ్ళనుకునే వాళ్ళు. లోకంలో ఆధ్యాత్మిక విషయాల్లో తమకున్నంత జ్ఞానం ఎవరికి లేదనుకునే వాళ్ళు. సర్వసంగపరిత్యాగంలో తమతోపాటు సాటివచ్చే వాళ్ళు ఎవరూ లేరని భావించేవాళ్ళు. ఆ కారణంగా వాళ్ళందరిలో తమ ఔన్నత్యం గురించి అహంకారం ఉండేది. దానివల్ల ఒక ఆశ్రమం వాళ్ళు ఇంకో ఆశ్రమంపట్ల తక్కువ భావం కలిగి ఉండేవాళ్ళు. వ్యాపారాల్లోనే పోటీ ఉంటుందనుకుంటాం. ఆధ్యాత్మిక వ్యాపారంలోనూ ఉంటుంది. ఒకరోజు మూడు ఆశ్రమాలకు చెందిన ముగ్గురు సన్యాసులు పనిమీద కొండదిగి పనులు ముగించుకుని తిరుగు ప్రయాణమయ్యారు. కొండ ఎక్కడం మొదలుపెట్టారు. ఎండ తీక్షణంగా ఉంది. అందుకని దగ్గరే ఉన్న ఒక చెట్టు క్రింద విశ్రాంతికోసం ఆగారు. ఒక దగ్గర కూర్చుని మాటల్లో దిగారు. మాటల్లో మెల్లగా వినయం ప్రసక్తి వచ్చింది. దానికి ముందు పవిత్రత, దానితోబాటు జ్ఞానం ప్రసక్తి కూడా వచ్చింది.

మొదటి ఆశ్రమ సన్యాసి తక్కిన ఇద్దర్నీ చూసి "మీ ఆశ్రమాలు గొప్పవయితే కావచ్చు. కానీ జ్ఞానం విషయంలో, పాండిత్యం విషయంలో మీ రెండు ఆశ్రమాలూ మా ఆశ్రమంతో సరిపోలవు. సకల శాస్త్రాల్ని కూలంకషంగా చదువుకున్న గొప్పవాళ్ళు మా ఆశ్రమంలో ఉన్నారు. సత్యం గురించి మా వాళ్ళంత సాధికారంగా మీ వాళ్ళు మాట్లాడలేరు" అన్నాడు.

రెండో ఆశ్రమ సన్యాసి "సందర్భం వచ్చింది. కాబట్టి చెప్పాల్సి వస్తోంది. జ్ఞానం, పాండిత్యం తక్కిన ఎన్నయినా మీ దగ్గర ఉండవచ్చు. కానీ నియమనిష్టల్లో, ఆచారవ్యవహారాల్లో మా ఆశ్రమం ముందు మీ రెండు ఆశ్రమాలూ దిగదుడుపే. శుచీ,

శుభ్రంలో, పూజా పునస్కారాల్లో దేశంలోనే మా ఆశ్రమం పేరుపొందింది అన్నాడు. మూడవ ఆశ్రమ సన్యాసి ఇద్దరు చెప్పినవి విన్నాడు. నవ్వాడు. తన ఆశ్రమ గొప్పతనం గురించి ఆరంభించాడు. "అతనేమో పాండిత్యం గురించి, నీవో పూజా పునస్కారాల గురించి చెప్పావు. జ్ఞానాన్ని నేను కాదనడం లేదు. పరిశుభ్రతని తక్కువ చెయ్యడం లేదు. పూజలు పునస్కారాల్ని కించపరచడం లేదు. కానీ వీటిన్నింటి కన్నా వినయం అపూర్వమైంది. అసాధారణమయింది. అద్వితీయమైంది. వినయం విషయంలో మా ఆశ్రమంతో ప్రపంచంలో ఏ ఆశ్రమాన్ని పోల్చలేం. ఇక మీ రెండు ఆశ్రమాలూ లెక్కలోకి రావు. మా దగ్గరున్నంత వినయం ఎవరి దగ్గరయినా ఉంటే చూపించండి. ఈ విషయంలో నేను సవాలు చేస్తున్నా" అన్నాడు.

**అహంకారం దాల్చే అనేకానేక రూపాల్లో ఈ అతివినయం కూడా ఒకటి.**

## 129. సృజన

**సృజనాత్మకంగా ఉండడమంటే మనం ఏ పని చేసినా దాన్ని ప్రేమగా చెయ్యడం.** ఆనందిస్తూ చెయ్యడం కావచ్చు. దైవమిచ్చిన పనిని వరంలా భావించడం. మనం చేసే పనిలో పేరు వస్తేనే మనం గొప్ప సృజనాత్మకత ఉన్నవాళ్ళమనుకుంటాం. అది పొరపాటు. పేరు వచ్చినా, రాకున్నా మనం ఆనందంగా మనపని చేస్తున్నామా లేదా అన్నదే ముఖ్యం. అత్యాశాపరుడు ప్రేమించలేడు. అతని పనులు ప్రయోజనాల్ని ఉద్దేశించి ఉంటాయి.

మనుషుల అభిప్రాయాలు డబ్బుతో ముడిపడి ఉంటాయి. డబ్బన్నది అత్యల్పమయిన యాంత్రికమయిన విషయం. డబ్బులో సృజన లేదు. మనుషులు అధికారం పట్ల ఆకర్షితులౌతారు. అధికారం అన్నది ఆధిపత్యానికి సంబంధించింది. దాంట్లో సృజన లేదు. సౌందర్యం లేదు. అధికారం తీసుకోండి. ఇతరులకి మనం లొంగి ఉండేలా చేసుకోవడమే అధికారం. వీటిల్లో సృజన ఉంటుందా?

పేరు ప్రతిష్టలు కావాలంటే సృజన గురించి ఆలోచించకూడదు. సృజనాత్మక వ్యక్తులకు పేరు రాదని కాదు. సృజనలో కాంక్ష ప్రవేశిస్తే సృజన మాయమవుతుంది. ఆనందంగా ఉండడానికి ఆశతో సంబంధం లేదు. ఆనందంలో సృజన ఉంది. సృజనలో ఆనందముంది. రాళ్ళల్లో, చెట్లలో, పిట్టల్లో, పూలల్లో అన్నింటిలో సృజన ఉంది. వాటిన్నింటికి స్వయం వ్యక్తిత్వముంది. వాటి ప్రత్యేకత వాటికుంది.

ఒక జెన్ గురువు ఉండేవాడు. ఆయన చాలా బక్కగా, బలహీనంగా ఉండేవాడు. కానీ ఆయన చాలా పెద్దపెద్ద బండల్ని సులభంగా కదిలించేవాడు. లాగేవాడు. అది అందరికీ ఎంతో ఆశ్చర్యంగా ఉండేది. ఎందుకంటే పెద్ద వస్తాదులు కూడా కదిలించలేని





రాళ్ళని అతి సులభంగా కదిలించేవాడు. అతనికి అంత శక్తి ఎలా వచ్చిందో అందరికీ ఆశ్చర్యమే. అతని దగ్గర అద్భుతశక్తులేవో ఉన్నాయని అనుకునేవాళ్ళు. కానీ అతను ఎట్లాంటి అద్భుతాలు, మంత్రాలు, మాయలు ప్రదర్శించేవాడు కాదు.

జనం ఆయన్ని "ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. నువ్వు చూస్తే ఇంత బలహీనంగా ఉన్నావు? కానీ పెద్ద రాళ్ళని అంత సులభంగా ఎలా కదిలించగలుగుతున్నావు?" అన్నారు.

దానికాయన "ఇందులో అద్భుతమేమీ లేదు. రహస్యమేమీ లేదు. నేను ఏ రాయిని కదిలించాలనుకుంటానో దాన్ని ప్రేమిస్తాను. దాంతో స్నేహం చేస్తాను. దగ్గరికి వెళతాను. దాంతో మాట్లాడతాను. దాన్ని కదిలించాల్సి వచ్చినప్పుడు 'ఇప్పుడు పరిస్థితి గమనించావు కదా! నేను నిన్ను కదలించాలి. కదిలించలేనని జనం అనుకుంటున్నారు. అందరూ నా ఓటమి కోసం ఆనందంగా ఎదురుచూస్తున్నారు. నేను నీకు ఆత్మీయుణ్ణి కదా! నీకు స్నేహితుణ్ణి కదా! నీ సన్నిహితుణ్ణి కదా! ఇది నా పరువుకి సంబంధించిన విషయం. మనమధ్య వైరుధ్యం లేదని, సమన్వయముందని అందరికీ తెలియాలి. అంటాను. దాన్ని ప్రేమగా తాకుతాను. ఏమంటుందో అని కాపు కాస్తాను. అది నావైపు అనురాగం ప్రదర్శిస్తుంది. ఆమోదం తెలుపుతుంది. సరే అంటుంది. ఆ సంగతి నాకు తెలుస్తుంది. అప్పుడు దాన్ని కదిలిస్తాను" అన్నాడు. ఇంకా "అప్పుడు కదిలిన రాయితో కలిసి నేనూ కదుల్తాను. ప్రవాహంలా సాగుతాను. నిజానికి నేను రాయిని కదిలించలేదు. అక్కడ ఉన్నాను. కదిలిన రాయితో కలిసి కదిలాను" అన్నాడు.

సృజన అంటే అది పెద్దపనా? చిన్నపనా? అన్నదాంతో నిమిత్తం లేదు. దానిపట్ల మనకు అనురాగం ఉందా? ప్రేమగా ఆ పనిని నిర్వర్తిస్తున్నామా? లేదా అన్నదాని మీద అది ఆధారపడి ఉంది.

## 130. కళ

ప్రతిపనిలో కళ ఉంది. ఆ పనిని మనం ప్రేమగా నిర్వహించడంలో అది బహిర్గతమవుతుంది. నువ్వొక చిత్రాన్ని గీయాలనుకుంటే నువ్వు దాంట్లో లీనం కావాలి. అక్కడ నువ్వు ఉండకూడదు. అక్కడ చిత్రమే ఉండాలి. నువ్వొక కవిత రాస్తే ఆ కవిత తన గమనాన్ని నీకు చెబుతుంది. నాట్యమయినా, సంగీతమైనా అంతే.

కారణం కళకు ప్రేమ పునాది. ప్రేమలో ఘర్షణ ఉండదు. సమన్వయముంటుంది. సామరస్యం ఉంటుంది. అంగీకారం ఉంటుంది. అర్థం చేసుకోవడమే ఉంది. అక్కడ ప్రాణం లేనిదని, ప్రాణం ఉన్నదని విభజన ఉండదు. అన్నీ ప్రాణవంతంగా

ఉంటాయి. ప్రతిస్పందిస్తూ ఉంటాయి. మనతో రాళ్ళు సంభాషిస్తాయి. చెట్లు మాట్లాడతాయి. కళావిష్కారంలో అది అనివార్యం. అది లేకుంటే అది కళ కాదు.

కళలో శక్తి ఉంటుంది. ప్రవాహముంటుంది. కళాకారుడికి ఆ సంగతి తెలుసు. సృజనకు అది అనివార్య అంశం. అతను ప్రతిదాన్ని పరవశంగా చూస్తాడు. కళాకారుడు ప్రతిదాన్నీ తన్మయంగా దర్శిస్తాడు. పువ్వుని ప్రేమగా చూడకుంటే నిర్లక్ష్యంగా చూస్తే పువ్వులో సౌందర్యం కనిపించదు. లెక్కపెట్టకుంటే ప్రతిదీ ఆకర్షణ కోల్పోతుంది. ఒక వ్యక్తి వీథులు శుభ్రపరుస్తూ ఉంటాడు. అతను శ్రద్ధగా ఆ పని చేస్తూ ఉంటే అందులో గొప్ప కళని మనం దర్శించగలం. అతని చేతిలోని చీపురు, రోడ్డు, అతని కదలిక అన్నీ గొప్ప సౌందర్యభరితంగా ఉంటాయి. రోడ్డునీ, చీపుర్ని, అతన్ని అప్పుడు విడివిడిగా చూడలేం.

ఒక వడ్రంగి ఉండేవాడు. అతను తయారుచేసే కుర్చీలు, బల్లలు ఎంతో అందముగా ఉండేవి. వాటిల్లో ఎంతో పనితనముండేది. పనితనంతోబాటు వాటిల్లో ప్రాణమున్నట్లనిపించేది. జనాలకి అదెంతో ఆశ్చర్యంగా ఉండేది. జనం అతన్ని 'ఎందుకని నువ్వు చేస్తే బల్లల్లో, కుర్చీల్లో ఆకర్షణ కనిపిస్తుంది. దీంట్లో ఏమిటి రహస్యం" అన్నారు. ఆ వడ్రంగి "ఎందుకంటే నేను వాటిని చెయ్యలేదు". అన్నాడు. జనం నువ్వు తయారుచేసిన వాటిని నువ్వు తయారుచెయ్యలేదంటున్నావే" అన్నారు. అతను "నా ఉద్దేశ్యం అది కాదు. నేను వాటికి ఇష్టం లేకుండా చెట్లని కొట్టి బలవంతంగా కుర్చీలు, బల్లలు చెయ్యను. నేను అడవికి వెళతాను. అక్కడున్న చెట్లతో మాట్లాడతాను. వాటిని తాకుతాను. ఏ చెట్టు కుర్చీ కావడానికి సిద్ధంగా ఉందో తెలుసుకుంటాను. దాని ఇష్టాన్నిబట్టి దాన్ని కుర్చీగా మారుస్తాను. బల్లగా చెక్కుతాను. ఇష్టం లేదనుకోండి. ఆ పని చెయ్యను. అందువల్ల అవి సజీవంగా ఉంటాయి" అన్నాడు.

ఈ విషయం అంతా అర్థం లేని వ్యవహారంగా మనకు కనిపించవచ్చు. కారణం మనం చెట్టుతో మాట్లాడడం, చెట్లని ప్రేమించడం. అతను చెట్లని ప్రేమిస్తాడు. చెట్లతో మాట్లాడతాడు. అతను అడవిలోకి వెళ్ళిపోయేవాడు. మూడు నాలుగురోజులు అడవిలోనే ఉండిపోయేవాడు. తను చెయ్యాలనుకున్న పనికి ఏ చెట్టు సిద్ధంగా ఉన్నాయో తెలుసుకునేవాడు. వాటితో సంప్రదింపులు జరిపేవాడు. సిద్ధంగా ఉన్న వృక్షాన్ని స్వీకరించేవాడు. అక్కడ నిర్బంధం లేదు. దౌర్జన్యం లేదు. ఆ వడ్రంగి చెక్కిన కుర్చీలు, బల్లల ఇప్పటికీ కొన్ని చైనాలో ఉన్నాయంటారు. ఎంతో సౌందర్యభరితంగా ఉన్నాయంటారు. అతను తన అనుభవాన్ని వివరిస్తూ "నేను అడవిలోకి వెళతాను. కుర్చీగా మారడానికి నీకు ఇష్టమేనా?" అని చెట్టును అడుగుతాను. అంతేకాదు "నాతో





రావడానికి నీకు అభ్యంతరం లేదు కదా! అంటాను. అప్పటికీ ఏ చెట్టు కుర్చీగా మారడానికి సిద్ధంగా లేకుంటే నాతో రావడానికి ఇష్టంగా లేకుంటే నేను వట్టి చేతుల్తో తిరిగి వచ్చేవాణ్ణి" అనేవాడు. ఒకసారి చైనా చక్రవర్తి అతన్ని పిలిపించి "నాకు పుస్తకాలు పెట్టుకునే స్టాండు కావాలి చేసి ఇవ్వు అన్నాడు. ఆ వడ్రంగి అడవికి వెళ్లి మూడురోజులు ఉన్నాడు. మూడురోజుల తరువాత తిరిగి వచ్చి "రాజుగారూ! కొన్నాళ్ళు ఆగాలి. అడవిలో ఏ చెట్టూ ప్రస్తుతానికి అంతఃపురానికి రావడానికి సిద్ధంగా లేదు" అన్నాడు. మళ్ళీ కొన్నాళ్ళకి వడ్రంగి అడవికి వెళ్ళి ఆ చెట్టుతో "ఇప్పుడు సమస్త కళ నీ కోసం ఆహ్వానం పలుకుతోంది" అన్నాడు. ఆ చెట్టు ఆమోదం తెలిపి అతని చేతుల్లో వాలింది. **మనం ప్రేమమయంగా చేస్తే వెన్నలా కరిగి మన దగ్గరకు వస్తుంది. అనురాగంతో, ఆనందంతో అన్నీ మనల్ని అల్లుకుంటాయి.**

## 131. భిక్షాపాత్ర

**జీవితం మనకు అవసరమయింది ఇస్తుంది.** అవసరాన్ని మించి మనం అడుగుతూ ఉంటాం. ఆశిస్తూ ఉంటాం. అప్పుడు అవసరమన్నది మరుగున పడుతుంది. ఆశ అన్నది ముంచుకొస్తుంది. ఆశకు అంతం లేదు కదా! **మనకు జీవితమిచ్చిన దానిపట్ల స్పృహతో ఉంటే మన ఆనందం అక్కడే ఉంటుంది.**

ఒక సూఫీ కథ. ఒకరోజు ఉదయాన్నే రాజు తన ఉద్యానవనంలో వాహ్యాళికి వచ్చాడు. ఉదయం ఉల్లాసంగా ఉంది. గాలి స్వచ్ఛంగా ఉంది. వాతావరణం ఆహ్లాదంగా ఉంది. ఆ ఉద్యానవనం రాజుది. అందుకని మందీ మార్బలం లేకుండా ఒంటరిగా వాహ్యాళికి వచ్చాడు.

ఎప్పటినుంచో ఒక బిచ్చగాడు రాజుగారిని దర్శించాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అతనికి రాజుగార్ని కలిసే అవకాశమే రాలేదు. బిచ్చగాడు రాజుగారు రోజూ ఎక్కడికి వెళతాడు? ఏం చేస్తాడు? మొదలయిన విషయాలు ఆరా తీశాడు. రాజుగారు ఉదయాన్నే తన ఉద్యానవనానికి వస్తారని తెలుసుకున్నాడు. మొత్తానికి చీకట్లో తోటలోనికి వచ్చి ఉదయమయ్యేదాకా వేచి రాజుగారు వచ్చే దారిలో కాచుకున్నాడు. రాజుగారు విలాసంగా నడుచుకుంటూ వస్తూ ఉంటే బిచ్చగాడు ఎదురువెళ్ళాడు. రాజుగారు బిచ్చగాడిని చూసి "ఎవరు నువ్వు? ఎందుకిక్కడ ఉన్నావు? నీకేం కావాలి? అని అడిగాడు. బిచ్చగాడు "మహారాజా! ఎన్నాళ్ళనించో మీ దర్శనం కోసం ప్రయత్నించి విఫలం చెందాను. మిమ్మల్ని కలుసుకునేమార్గం ఇంతకు మించి నాకు దొరకలేదు. మిమ్మల్ని భిక్ష అడగాలన్నది నా కోరిక" అన్నాడు.

రాజు చిరునవ్వు నవ్వి "ఈ మాత్రానికే ఇంత శ్రమ పడ్డావా? నీకేం కావాలి?" అన్నాడు. బిచ్చగాడు "రాజా! నాకు కావలసిందల్లా ఈ భిక్షాపాత్ర నిండుగా మీరు దానం చేయాలి. దీన్ని ధాన్యంతో నింపుతారో? నగలు, నట్రా, వజ్రవైఢూర్యాలతో నింపుతారో మీ ఇష్టం. కానీ ఒక షరతు. ఈ పాత్రను నింపాలి. మీరు ఇచ్చే దానంతో ఇది నిండాలి" అన్నాడు. ఆ మాటలకు రాజుకు ఆగ్రహం కలిగింది.

"నువ్వు నా గురించి ఏమనుకుంటున్నావు? నేను నీలాగా బిచ్చగాడిని కాను. ఈ బొచ్చెను నింపేంత సంపద నాదగ్గర లేదని నీ అభిప్రాయమా?" అన్నాడు.

బిచ్చగాడు "మహారాజా! నేనా మాట అనలేదు. అయితే మీరిచ్చేదేదయినా ఈ పాత్రని నింపాలని అన్నానంతే" అన్నాడు. మహారాజు చప్పట్లు కొట్టి మహామంత్రిని పిలిపించి తన తాహతుకు తగినట్లు ప్రదర్శించుకోవాలని "ఈ బిచ్చగాడి పాత్రను వజ్రాలతో నింపండి" అని ఆజ్ఞ జారీ చేశాడు. మంత్రి వెళ్ళాడు. బిచ్చగాడు "బిచ్చగాడి నుంచి బిచ్చగాడు!" అన్నాడు. రాజు "ఏమంటున్నావు? ఆ మాటలకర్థమేమిటి?" అన్నాడు.

బిచ్చగాడు "మంత్రిని రానివ్వండి తెలుస్తుంది" అన్నాడు. మంత్రి వజ్రాలు తీసుకుని భిక్షాపాత్రలో వేశాడు. అవి అదృశ్యమయ్యాయి. మంత్రి ఆశ్చర్యపోయి బస్తాడు వజ్రాలు ఆ బొచ్చెలో కుమ్మరించాడు. అవీ అదృశ్యమయ్యాయి. రాజు కూడా ఆశ్చర్యపోయాడు. కానీ రాజు అహంకారం అంతులేనిది. తనకే విజయం దక్కాలి అని తన ధనాగారాన్ని తరలించమన్నాడు. ధనాగారమంతా ఆ భిక్షాపాత్రలో పోయించాడు. సమస్త సంపద ఆ భిక్షాపాత్రలో పోయించాడు. సమస్త సంపద ఆ భిక్షాపాత్రలో పడి మాయమైపోయింది.

రాజు అదిరిపోయాడు. "నువ్వు బిచ్చగాడివా? గారడీ వాడివా?" అన్నాడు. బిచ్చగాడు "రాజా! నేను మామూలు బిచ్చగాణ్ణే" అన్నాడు. రాజు "మరయితే ఇదంతా ఏమిటి? అందుకు రాజా ఇది భిక్షాపాత్రే. అయితే దీన్ని నేనే కనిపెట్టాను. నేను ఎంత పేదవాడినంటే బొచ్చెకూడా కొనుక్కోలేనంత దరిద్రుణ్ణి. ఒక రోజు శ్మశానం గుండా వెళుతూ ఉంటే నా కాలికి ఒక మనిషి పుర్రె తగిలింది. దాన్ని తీసుకెళ్ళి శుభ్రం చేసి మెరుగుపెట్టి, చక్కటి భిక్షాపాత్రగా తయారుచేశాను. దాంతో బిచ్చమెత్తుకునే వాణ్ణి. కానీ ఇది మనిషి పుర్రె కదా! అదెప్పుడూ సంతృప్తి పడలేదు.

ఎవరు ఎంత భిక్షవేసినా దానికి సరిపోదు. అది నిండదు. అది తృప్తిపడదు. నన్ను తృప్తి పడనివ్వదు. ఇక లాభం లేదని మీ దగ్గరకి వచ్చాను. ఫలితమిది" అన్నాడు. **మనిషి మనసుకు సంతృప్తి ఉండదు.**





## 132. అసంపూర్ణం

అసంపూర్ణతలో ఆకర్షణ ఉంది. సమగ్రతలో ఆకర్షణ లేదు. జీవితం అసమగ్రమయింది. అసంపూర్ణమైంది. మనం చేసే ప్రతిచర్యలో అసంపూర్ణత ఉంది. అందుకే జీవితంలో అంత ఆకర్షణ ఉంది. రహస్యం ఉంది. రహస్యాన్ని ఛేదించే ప్రయత్నంలో మన జీవితం గడిచిపోతుంది. రహస్యం రహస్యంగానే మిగిలిపోతుంది. జీవితంలో ఆనందం అక్కడే ఉంది.

జీవితం గురించి, ప్రపంచం గురించి, అనంత విశ్వం గురించి మనకు అంతా తెలిసి పోయిందనుకోండి. అప్పుడు మజా ఉండదు. మాధుర్యముండదు. రేపు గురించి మనకు ఏమీ తెలియదు. ఆ తెలియకపోవడంలో ఆసక్తి ఉంది.

ఆరువేల పాటలు రాసిన రవీంద్రనాథ్ టాగూర్ తన చివరిక్షణంలో కన్నీళ్ళు పెట్టుకుని "నా లోపల ఒక పాట ఉంది. ఇప్పటిదాకా దాన్ని పాడలేకపోయాను" అని పరితపించారు. నిజానికి అట్లా బయటకి రాలేని పాట అందరి మనసుల్లో ఉంటుంది. దాన్ని వాళ్ళు ఎప్పటికీ పాడలేరు. సమగ్రత, సంపూర్ణత కొంతమంది సత్యాన్వేషణలకు కలుగుతుంది. వాళ్ళు ఆనందంగా అనంతంలో కలుస్తారు. తిరిగి ఈ భూమికి రారు. బుద్ధుడు ప్రతి గ్రామానికీ వెళ్ళినప్పుడు తన దగ్గరకి వచ్చిన వాళ్ళతో 'ఆ పదకొండు ప్రశ్నలు గురించి మాత్రం అడక్కండి' అనేవాడు. ఆ పదకొండు ప్రశ్నలు – అవన్నీ రహస్యాల్లో భాగాలు. అవగతాలు. వాటి గురించి ఎంతసేపు చర్చించినా, వాదించినా మనకు ఏమీ సమాధానం దొరకదు. అందుకని ఆయన వాటి గురించి అదేగా వద్దనేవాడు. నిజమే. ఆత్మ గురించి, జనన మరణాలు గురించి ఏమని చర్చిస్తాం? ఏమని వాదిస్తాం? ఎట్లాంటి నిర్ణయాలకు వస్తాం? వాటి గురించి చెబుతూ బుద్ధుడు వాటికి సంబంధించి నాకు తెలుసు. కానీ వాటిని మాటల్లో చెప్పడం అసాధ్యం అనేవాడు.

ఒక గ్రామం బయట ఒక గోడ ఉండేది. దాని వెనక ఏదో రహస్యముండేది. ఎవరయినా ఆ గోడ ఎక్కితే వెంటనే నవ్వడం మొదలుపెట్టేవారు. నవ్వుతూ తిరిగి వెనక్కి చూసేవాళ్ళు కారు. గోడదిగి తిరిగివచ్చి తమ అనుభవాన్ని జనాలతో పంచుకునే వాళ్ళు కారు. ఎప్పుడు దిగివస్తాడా? తను చూసింది ఎప్పుడు చెబుతాడా? అని జనం ఎంతో ఆత్రంగా ఎదురుచూసేవాళ్ళు. కానీ ఆ వ్యక్తి గోడమీద నిలబడి పగలబడి నవ్వుతూ ఆ గోడ వెనక్కి దూకేసేవాడు. మళ్ళీ తిరిగివచ్చి మనుషుల్లో కలిసేవాడు కాదు. ఆ గోడ వెనక లోయ ఉందో? వేరే లోకముందో ఎవరికి తెలియదు. ఎవరయినా తెలుసుకోవా లనుకున్న వాళ్ళు ఆ గోడ ఎక్కాలి. ఆ గోడ ఎక్కిన వాళ్ళు ఎవరూ ఇప్పటిదాకా తిరిగివచ్చినవాళ్ళు లేరు.

ఎప్పటికయినా జనం ఆ రహస్యాన్ని తెలుసుకోవాలని ఎంతో ఆతృతగా ఎదురుచూస్తున్నారు. గోడ ఎక్కిన వ్యక్తి తిరిగి దిగి రావడమంటూ జరగలేదు. కాబట్టి చాలాకాలం ఎవరూ ఆ గోడ ఎక్కడానికి సాహసించలేదు. కొన్నేళ్ళు గడిచిపోయాయి. రహస్యం పట్ల ఆసక్తి మనుషుల్ని రెచ్చగొడుతుంది. గోడ వెనుక ఏముందో తెలుసుకోవాలని ఒక వ్యక్తికి ఉత్సాహం కలిగింది. ఎంతమంది వద్దన్నా అతను వినలేదు. మొత్తానికి ఇన్నేళ్ళకి ఒక వ్యక్తి ముందుకొచ్చినందుకు కొంతమందికి సంతోషం కలిగింది.

గ్రామస్తులందరికీ అటువేపు ఏముందో తెలుసుకోవాలన్న కోరిక ఎప్పట్నించో ఉంది. అందరూ ఈసారయినా ఈ రహస్యాన్ని ఛేదించాలన్న నిర్ణయానికి వచ్చి అందరూ కూచుని ఆలోచించారు. ఎట్లా చెయ్యాలి? ఆ వ్యక్తి గోడనుంచి దూకకుండా ఇటు వేపే వచ్చేట్లు ఎలా చెయ్యాలి? అని తర్జనభర్జనలు పడి చివరకు అతనికి ఒక తాడు కడదాం. అతను గోడ పైకి ఎక్కి అటువేపు చూసి నవ్వడం మొదలుపెట్టగానే అతన్ని ఇటువేపు పడేలా లాగుదాం" అని ఒక వ్యక్తి చెప్పాడు. అతని సలహా అందరికీ బాగా నచ్చింది. గోడ ఎక్కాలని నిర్ణయించుకున్న వ్యక్తికి తాడు కట్టారు. అతను గోడ ఎక్కి అటువేపు చూసి నవ్వడం మొదలుపెట్టాడు. అతను చూసిన అద్భుతం తమకు తెలిసిపోతుంది కదా అని జనం ఉత్సాహంతో అతను గోడకు అటువేపు దూకకముందే ఇటువేపు లాగారు. ఆ వ్యక్తి ఇటువేపు పడగానే అందరూ అతన్ని చుట్టుముట్టి అటువేపు ఏం చూశావు?" అని అడిగారు.

కానీ అతనికి మాట పడిపోయింది. అప్పట్నించీ మూగవాడయిపోయాడు.

## 133. త్యాగం

**వదులుకున్న వాటిపట్ల స్పృహతో ఉంటే ఏదీ వదులుకున్నట్లు కాదు.** మనకున్న జ్ఞానాన్ని మనం ప్రదర్శించుకుంటే మనం జ్ఞానులం కాము. సన్యాసి సన్యాసిలా ఉండాలి. తాను ప్రాపంచికమయిన భోగ భాగ్యాలన్నింటినీ తృణప్రాయంగా వదులుకున్నానని అతడంటే అవన్నీ అతని మనసు నిండుగా ఉన్నాయని, అతను వాటిని వేటినీ వదులుకోలేదని గ్రహించాలి. ప్రపంచాన్ని వదిలి హిమాలయాలకు వెళ్తే ప్రశాంతత దొరుకుతుందని కొందరు భ్రమపడతారు. తమతోబాటు ప్రపంచాన్ని అక్కడికి తీసుకెళుతున్న సంగతి మరచిపోతారు.

**వ్యతిరేకతల్లో, అనుకూలాల్లో సత్యం ఆవిష్కారం కాదు.** ఒక సంపన్నుడి యింటికి వెడతాం. అతను తన సంపదను ప్రదర్శించుకోవడంలో సంతృప్తి పడతాడు. ఈ సోఫా పారిస్‌లో కొన్నానని, ఆ బీరువా జర్మనీదని, ఈ కారు జపాన్‌దని





చెప్పుకుంటాడు. తన పిల్లలు ఎట్లా విదేశాల్లో స్థిరపడ్డారో తన వ్యాపారం ఎట్లా మూడు పువ్వులు, ఆఱుకాయలుగా ఉందో చెబుతాడు. అతను వాటినుంచి బయటపడే అవకాశమే లేదు. వాటిలో ఏది వదిలినా అతను ఆందోళనకు లోనవుతాడు. అతని యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా అతను ఎప్పుడో ఆందోళనకు గురవుతాడు. అది వేరే సంగతి.

ఇంకో విద్యావేత్తను కలుస్తాం. తనకు ఎన్ని డిగ్రీలున్నాయో, పిహెచ్.డి లున్నాయో ఏకరువు పెడతాడు. ఇంకో పండితుడు తన బహుభాషాపాండిత్యాన్ని ఏకరువు పెడతాడు. ఒక కవి తను ఎన్ని పుస్తకాలు అచ్చేశానో, ఎన్ని అవార్డులు అందుకున్నానో, ఎన్ని సన్మానాలు పొందానో వివరిస్తాడు. ఎవరికి వారు వాళ్ళ వాళ్ళ రంగాలలో ఎక్కడికాదా వెళ్ళారో చెబుతారు. ఏమీలోని ఏమి సాధించలేని జనాల్ని కలవండి. ఉన్నవాళ్ళ దగ్గర ఏమున్నాయో అవన్నీ తమదగ్గర లేవని అంటారు. మనుషులు భౌతిక విషయాలకు, వస్తువులకు బద్ధులయి ఉంటారు. వాటికి త్యాగం, ప్రేమ వంటి పేర్లు పెడతారు. అన్నీ వదులుకునేవాళ్ళు, నిజమైన పరిత్యాగ గుణమున్నవాళ్ళు కొద్దిమందే ఉంటారు. వాళ్ళ పరిత్యాగం ప్రచారానికి సంబంధించింది కాదు. అది ఆదర్శం కిందకు రాదు.

ఒక ఊళ్ళో ధనవంతుడు ఉండేవాడు. అతను గొప్ప ధర్మకర్తగా పేరుపొందాడు. అందరూ ఆయన గొప్పదాత అని కీర్తించేవాళ్ళు. ఒక సందర్భంలో ఆయన ఒక అనాథ శరణాలయానికి లక్ష రూపాయల విరాళం ఇచ్చాడు. మంత్రిగారి చేతుల ద్వారా షీల్డు అందుకున్నాడు. పత్రికలన్నీ పతాక శీర్షికల్లో ప్రచురించాయి. మీడియా కోడై కూసింది. మంత్రిగారి చేతులమీదుగా అందుకున్న షీల్డులో ఆ ధనవంతుడు ఉదారంగా అనాథ శరణాలయానికి లక్ష రూపాయలిచ్చినట్లు రాశారు.ఆ షీల్డును తన ఇంట్లో హాల్లో భద్రపరిచాడు. ఎవరయినా ఇంట్లో అడుగుపెడుతూనే ఆ షీల్డు వాళ్ళ కంట్లో పడేట్లు పెట్టాడు. ఆయన దానగుణం దేశానికంతా తెలిసేట్లు ఎంతో ప్రచారం చేయించాడు. లక్ష రూపాయలు దానం చేస్తే దాని ప్రచారానికి దాదాపు పదిలక్షల ఖర్చయింది. ఇదంతా జరిగి ఇరవయ్యేళ్ళయింది.

ఆ దానానికి సంబంధించి పేపర్లలో ఇచ్చిన వార్తలు కటింగ్‌లకు భద్రంగా ఫైల్‌చేసి పెట్టాడు. ఎవరు ఇంటికి వచ్చినా ఆ ఫైళ్ళు చూపేవాడు. తమాషా ఏమిటంటే అంతకుముందు అతను దానం చేసి ఎరగడు. తరువాత దానం చేసి ఎరగడు. కానీ ఇరవయ్యేళ్ళు క్రితం అతను చేసిన దానం అతనికే ఒక గొప్ప అద్భుతంగా మిగిలిపోయింది.

అహంకారం ఎన్నో రూపాల్ని ధరిస్తుంది. భగవంతుడు ఎన్ని అవతారాలు ఎత్తుతాడో అది అన్ని అవతారాల్ని దాలుస్తుంది. అది వినయంగా, దానంగా, త్యాగంగా,

ఎన్నెన్ని రూపాల్లో ఎత్తుతుంది. అవి నిజానికి దాని లక్షణాలు కావు. అవి ఎప్పుడూ రూపాంతరం చెందవు. కానీ అహంకారం తన రంగుల్ని మార్చుకుంటుంది. దాన్ని అణచిపెడితే అది సూక్ష్మరూపం దాల్చి మనసు పొరల్లో దాక్కుంటుంది. అవసరాల్ని బట్టి ఆకారం దాలుస్తుంది. వినయంగా ఉన్నవాడికి తను వినయంగా ఉన్నానన్న సంగతి తెలియదు. త్యాగశీలికి తను త్యాగం చేశానన్న స్పృహ ఉండదు. దానం చేసినవాడు దానం చేశాడని చెప్పుకోడు. తన త్యాగాన్ని ప్రదర్శించుకునేవాడు కాంక్ష ఉన్నవాడు తప్పక త్యాగి కాడు.

## 134. బరువు

మనందరం బరువులు మోస్తూ ఉన్నాం. మనకా సంగతి తెలియదు. మనం మందిలో భాగంగా ఉన్నంతవరకూ మనకా స్పృహ ఉండదు. వ్యక్తి మంది నించి వేరు కావాలి. దూరంగా చూడాలి. దూరం నుంచి చూడాలి. అప్పుడే అసలు సంగతి తెలిసి వస్తుంది. ఆ మెలకువ, స్పృహ కలిగి మనం చూడగలిగితే ఆశ్చర్యానికి లోనవుతాం.

స్వతహాగా మనం బరువులు మోయం. కానీ అభిప్రాయాల భారం, ఆదర్శాల భారం, మతాల భారం మన తలపై ఉంటుంది. దాన్ని మోస్తూ తిరుగుతూ ఉంటాం. ఎవరికీ ఎవరిమీదా కూచునే హక్కులేదు. కానీ కూచుంటారు. రాజకీయ అధికారం లాంటిది. ఆత్మ ప్రపంచంలోనూ ఉంది. యధార్థానికి అది అసంగతం. అట్లా ఉండకూడదు. మనిషి ఇది గుర్తించాలి. తన భావాన్ని దించుకోవాలి. వదిలించుకోవాలి. మనుషులు సంతోషంగా మోస్తున్నామని మనం తెలుసుకోవాలి. ఆ స్పృహ, చైతన్యం మనకు కలగాలి. మెలకువ రావాలి. అప్పుడు బరువులు వదిలించుకుంటాం. విదిలించుకుంటాం. తెలివి తెచ్చుకుంటాం. తేలిక పడతాం.

దేవుడికోసం అనునిత్యం అన్ని మతాలవాళ్ళు ఆలయాలు నిర్మించుకుంటూ పోతున్నారు. లెక్కలేనన్ని గుడులు, లెక్కలేనన్ని దేవతలు, పేదవాడికి ఉండడానికి గుడిసె ఉండదు కానీ కనిపించని దేవుడికి ఖరీదయిన ఆలయాలు నిర్మిస్తూ పోతున్నారు. దాన్ని సంపన్నులు, పేదవాళ్ళు ఎవరూ వ్యతిరేకించరు. ఒక ఊళ్ళో దేవుడికి ఆలయం నిర్మిస్తున్నారు. దానికోసం దూరప్రాంతాల నుంచి శిల్పుల్ని పిలిపించారు. ఎందరో నిపుణులు రాత్రింబవళ్ళు నిర్మాణంలో మునిగి చేస్తున్నారు. రాజస్థాన్ నుండి పాలరాతి బండలు తెప్పించారు. ప్రవీణులయిన శిల్పులు ఆ రాళ్ళను గొప్ప శిల్పాలుగా చెక్కుతున్నారు. వీటన్నింటి పైన ఆజమాయిషీ చెలాయించే వృద్ధుడు ఒకడున్నాడు. అతను ఆ చుట్టుపట్ల ప్రాంతాల్లో ఎక్కడ ఆలయం కట్టినా అతని ఆజమాయిషీ కిందనే జరిగేది. అట్లాగే ఈ ఆలయ నిర్మాణాన్ని కూడా అతనే పర్యవేక్షిస్తున్నాడు.





ఆ ప్రాంతంలో అందరికీ ఆమోదయోగ్యుడు, వివేకవంతుడు అయిన ఒక తాత్వికుడు అక్కడ ఆలయం నిర్మించడం చూసి చూసిపోదామని వచ్చాడు. ఆ ఆలయ పర్యవేక్షకుడయిన వృద్ధుడికి ఈ తాత్వికుని గురించి తెలుసు. తాత్వికుడు వృద్ధుణ్ణి పలకరించి మన ఊళ్ళో వీధికి ఒక ఆలయముంది. కొన్ని వీధుల్లో అయితే రెండు ఉన్నాయి. మళ్ళీ ఇంకో ఆలయం కడుతున్నారు. దేవుడు ఈ ఆలయాల్లో ఉంటాడో లేదో తెలియదు కానీ ఆలయాలయితే లెక్కలేనన్ని పెరిగిపోతున్నాయి అన్నాడు.

వృద్ధుడు "మీకో సంగతి తెలియదేమో. ఆలయాలు దేవుడి కోసం కాదు. పైగా అవి భూమికి భారం" అన్నాడు. తాత్వికుడు విస్తుపోయాడు. "ఏమిటి మీరంటున్నది? గత యాభై, అరవై సంవత్సరాలుగా మీరు ఆలయాల్ని కడుతూ ఉన్నారు. మీరు నాస్తికుల్లా కనిపిస్తున్నారు. ఆలయాలు దేవుడి కోసం కాకుంటే ఎవరికోసం కడుతున్నట్లు" అన్నాడు.

వృద్ధుడు ఏమీ మాట్లాడకుండా తాత్వికుణ్ణి లోపలికి తీసుకెళ్ళాడు. అందరూ బండలు చెక్కే పనిలో సానపెట్టే పనిలో శిల్పాలు చెక్కే పనిలో మునిగిపోయారు. వృద్ధుడు తాత్వికుణ్ణి దూరంగా ఒక శిలాఫలకాన్ని చెక్కుతున్న స్థలానికి తీసుకెళ్ళాడు. ఆ శిలాఫలకంపై దేవుడికోసం లక్షలు వెచ్చించే భక్తిభావంతో ఈ ఆలయాన్ని నిర్మిస్తున్న గొప్ప దాత, భక్తుడి పేరు చెక్కుతున్నారు.

వృద్ధుడు "ఈ ఆలయం ఇతనికోసం, ఈ శిలాఫలకం కోసం నిర్మించబడు తోంది. ఇదే కాదు ఎక్కడ ఏ ఆలయమయినా ఇట్లాంటి వాళ్ళకోసమే నిర్మిస్తారు. ఇట్లాంటి ఆలయాలు అన్నిచోట్లా ఉంటాయి. అన్ని మతాలకూ ఉంటాయి. కానీ వాటిల్లో దేవుడు ఉండడు" అన్నాడు.

ఆ వృద్ధుడి తీక్షణదృష్టికి తాత్వికుడు ఆశ్చర్యపోయాడు. **ఆలయాల్లో దేవుడు ఉండడు. దేవుడు మన అంతరంగంలో ఉంటాడు. మన హృదయమే ఆలయం. మనం బయటకి చూడడం మానేసి బరువులు దించేసి మనసులోకి చూస్తూ మందహాసం చేస్తే దేవుడు మనల్ని చూస్తాడు. అప్పుడు తేలికపడతాం. ఎండమావులు వెంట పరిగెట్టం.**

## 135. స్పృహ

స్పృహతో ఉండడం, మెలకువగా ఉండడం జాగృతిలో ఉండడం అవసరం. ఆ చైతన్యంతో ఉండడం వల్ల మనం మన ఉద్వేగాల్ని చూడగలం. వాటిని మనపై అధికారం చెలాయించకుండా ఎక్కడ పెట్టాలో అక్కడ ఉంచగలం. మనం ఎప్పుడూ మన ఉద్వేగాలతో, ఉద్రేకాలతో ఘర్షించకూడదు. వాటిని అదుపు చెయ్యడానికి, అణచి వెయ్యడానికి ప్రయత్నించకూడదు. ఎందుకంటే వాటిని ఎంత బలంగా అణగదొక్కితే

అంతే బలంతో అవి బయటకు వస్తాయి. వాటి పట్ల స్పృహతో ఉండాలి. అప్పుడేవీ హద్దు మీరవు.

ఒకసారి బుద్ధుడు ఒక గ్రామం గుండా వెళుతూ ఉంటే ఆ గ్రామస్థులు బుద్ధుణ్ణి నిలదీశారు. తమ నమ్మకాలని, విశ్వాసాలని దెబ్బ తీస్తున్నాడని, వాళ్ళకు బుద్ధుడి మీద ఆగ్రహం. ప్రత్యక్షంగా బుద్ధుడు వాళ్ళకు ఎట్లాంటి అపకారం తలపెట్టకపోయినా వాళ్ళు తిట్లు లంకించుకున్నారు. అసభ్యపదజాలంతో బుద్ధుణ్ణి దూషించారు. బుద్ధుడు వాళ్ళ తిట్లన్నీ విన్నాక "మీరు తిట్టడం ముగిసిందా? ఇక నన్ను వెళ్ళనిస్తారా?" అన్నాడు. ఆ ఊరిజనం "మేము ఇంత దారుణంగా తిడుతూ ఉంటే మీకు కోపం రాలేదా?" అనడిగారు. దానికి బుద్ధుడు "మీరు తిట్లు వర్షిస్తున్నారు. అంటే తిట్లు యిస్తున్నారు. కానీ ఎప్పుడో నేను తిట్లు తీసుకోవడం మానేశాను. ఎందుకంటే ఎప్పుడయితే నాకు మెలకువ, స్పృహ కలిగిందో అప్పటినుండి తిట్లు స్వీకరించడం మానేశాను. మీరు పదేళ్ళ క్రితం నన్ను చూసి ఉంటే మీకు ప్రతిఫలం దక్కేది. ఇప్పుడు లాభం లేదు. నేను వెళతాను" అన్నాడు. గ్రామస్థులు ఆశ్చర్యపోయారు. బుద్ధుడిపై వాళ్ళకు గౌరవభావం పెరిగింది. వాళ్ళల్లో పరివర్తన చూసి బుద్ధుడు "మీకు కొన్ని విషయాలు వివరించి వెళ్ళాలనిపిస్తోంది" అంటూ తన అనుభవాన్ని వివరించాడు. "మీరు నన్ను తిట్టారు. అట్లాగే ఒక గ్రామం గుండా వెళుతూ ఉంటే ఆ గ్రామస్థులు నాపట్ల అభిమానంతో తినుబండారాలు తీసుకొచ్చారు. కానీ అంతకుముందే నేను కడుపు నిండుగా భోజనం చేసి బయల్దేరాను. వాళ్ళు నన్ను బలవంతం చేశారు. కానీ నేను తినలేదు. కారణం కడుపు నిండిందన్న స్పృహ నాకుంది. ఆ స్పృహలో లేని మనిషి రుచికరమయిన పదార్థాలు ఉచితంగా వస్తే వదిలిపెట్టడ మెందుకని ఆవురావురుమని తినేసేవాడు. తిన్న తరువాత ఇబ్బంది ఎలాగూ ఉంటుంది. తన కడుపు నిండిందన్న స్పృహ అతనికి ఉంటే అవి ఎంత రుచికరమయిన వంటకాలయినా అతను వాటిని ముట్టడు. ఆ స్పృహ లేకుంటే తింటాడు. కాబట్టి నేను తిననన్న తినుబండారాలు ఏమయి ఉంటాయి?" అన్నాడు.

ఆ గ్రామస్థులు "ఏమయి ఉంటాయి? వాటిని తీసుకెళ్ళి తమ ఇంట్లో వాళ్ళకి ఇచ్చి ఉంటారు" అన్నారు. బుద్ధుడు మీరు తినుబండారాలు తీసుకురాలేదు. తిట్లు తీసుకొచ్చారు. తినుబండారాల్ని ఎట్లా వద్దన్నానో, అట్లాగే తిట్లని కూడా నేను తీసుకోలేదు" అన్నాడు. గ్రామస్థుల్లో పరివర్తన, పశ్చాత్తాపం కలిగాయి. బుద్ధుడు "ఒకవ్యక్తి నా దగ్గరికి వచ్చాడు. అతను నాకు పట్టలేని ఆగ్రహం వస్తుందని దాన్ని ఎట్లా అదుపు చేసుకోవాలని" అడిగాడు. నేను అతనికి "ఒక కాగితంపైన ఒక విషయం రాసిచ్చాను. దీన్ని నువ్వు జేబులో పెట్టుకో. నీకు ఎప్పుడు కోపం వస్తుందో అప్పుడు ఈ కాగితం తీసి చదువు.





నీ కోపం మాయమవుతుందని" అన్నాను. ఆ వ్యక్తి పదిహేను రోజుల అనంతరం నా దగ్గరికి వచ్చి "స్వామీ! మీరు ఆ కాగితం తీసుకోవడానికి జేబులో చెయ్యి పెట్టబోయేంతలో నా కోపం మాయమయ్యేది" అంటూ మనిషికి కొద్దిపాటి మెలకువ, స్పృహ ఉంటే చాలు. అతను ఎప్పటికప్పుడు యథాస్థితికి వస్తాడు" అన్నాడు.

భ్రమలో ఉన్న మనిషి భ్రమణంలో ఉంటాడు. వలయంలో తిరుగుతూ ఉంటాడు. భ్రమల్లో లేని మనిషి భ్రమణంలో ఉండడు. బయట ఉంటాడు. అతణ్ణి స్పృహతో ఉన్న మనిషిని ఎట్లాంటి భ్రమలూ లొంగదీసుకోలేవు. చైతన్యమే అతని చేతిలోని దీపం.

ధర్మమంటే మేలుకునే ప్రయత్నమే. యోగమంటే మేలుకునే మార్గమే. ప్రార్థన అన్నా మనల్ని మేలుకునేలా చేసేదే. మనం మేలుకుంటే మనలోని మాలిన్యం మన నుంచి దూరంగా వెళ్ళిపోతుంది. మనల్ని స్వచ్ఛ స్ఫటికంగా నిలుపుతుంది. ఆంతర్యం పరిశుభ్రమయ్యేదాకా బాహ్యం నుంచీ వచ్చే ఎట్లాంటి భ్రాంతులు మనల్ని తాకవు.

## 136. పశ్చాత్తాపం

మనందరం జ్ఞానులమే. **పుట్టుకతోనే ప్రతి మనిషీ జ్ఞానిగా ఉంటాడు.** కానీ అతను సమాజంలో పడతాడు. స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడు. రకరకాల అభిప్రాయాలు, మతాలు మనిషి మనసుని ఆక్రమిస్తాయి. వాటిల్లో బలమైంది మనిషిని పట్టుకుంటుంది. దానికి లొంగిపోతాడు. దాన్నే నమ్ముకుంటాడు. అదే సత్యమనుకుంటాడు. తను సర్వ స్వతంత్రుడని, ప్రతిదాన్ని పరిశీలించే, పరిశోధించే, ప్రశ్నించే శక్తి తనకుందని మరచిపోతాడు. ఆలోచనలకు, అనుబంధాలకు బందీ అవుతాడు. పసితనం నుంచే పెద్దలు మనల్ని ప్రశ్నించకుండా నిరోధిస్తారు. విశ్వసించడానికి ఒత్తిడి చేస్తారు.

ఈ విధంగా మనసుపై ఎన్నో పొరలు పేరుకుంటాయి. వాటికింద సత్యం దాగి ఉంటుంది. వ్యక్తి జీవితంలో చెయ్యాల్సింది పోగు చేసుకోవడం కాదు, వదిలించుకోవాలి. ఎంత ఎక్కువ తెలుసుకుంటే అంతగా మనం వివేకవంతుల మవుతామని అనుకుంటాం. అది పొరపాటు ఎంత ఎక్కువగా వదిలించుకుంటే అంతగా మనం సత్యానికి సన్నిహితులమవుతాం. మనమెవరో మనం తెలుసుకుంటాం.

కానీ మానవజాతి పరుగులు పెడుతూ ఉంటుంది. మరింత జ్ఞానం కోసం మరింత సంపాదన కోసం ఉరుకులు పరుగులు పెడుతూ ఉంటారు. ఇంకా ఇంకా సంపాదించాలనే వాళ్ళే ఎక్కడ చూసినా కనిపిస్తారు. అవసరాల్ని దాటి ఆవురావురుమని సంపాదించడంలో మునిగిపోయి ఉంటారు. 'ఎందుకని అడగకండి'. నీకేమయినా పిచ్చా

సంపాదించడం ఎందుకంటావేమిటి? అని ఎదురుప్రశ్న వేస్తారు. ఎవడికయితే తిండి, బట్ట ఉండదో వాడు ప్రపంచంలో గొప్ప సంపన్నుడన్నాడు ఓ జెన్ గురువు. కానీ ఆ మాటల్ని ఎవరు పట్టించుకుంటారు. పోటీ ప్రపంచంలో మరింత మరింతగా సంపాదిచడంలో మునిగిపోతారు. లక్ష్యాల్ని అందుకోవడంలో అవిశ్రాంతంగా ఉంటారు. మనం సంపాదించడం వల్ల మనకు ప్రశాంతి దొరుకుతోందా? విశ్రాంతి దొరుకుతోందా? అని ఆలోచించరు.

**ఆనందం మనలో ఉంది. మన లోతుల్లో ఉంది. అంతులేని భౌతిక సంపదలో ఆనందం లేదు.** హెన్రీఫోర్డు మొదట చాలా పేదవాడు. ఎంతో కష్టపడి పైకి వచ్చాడు. ఫోర్డుకార్ల కంపెనీ పెట్టి ప్రపంచంలో అందరికన్నా సంపన్నుడిగా ఎదిగాడు. అందరూ అతన్ని చూసి ఈర్ష్యపడేవాళ్ళు. అందరూ అతన్ని ఆదర్శంగా తీసుకోవాలనుకునేవాళ్ళు. ఒకసారి ఎవరో, "మీరు ఇంత గొప్పవాళ్ళు కదా! ఇంకో జన్మంటూ ఉంటే మీరు ఎవరుగా పుట్టాలనుకుంటున్నారు? ఏం కావాలనుకుంటున్నారు?" అని అడిగాడు.

దానికి ఆయన "మళ్ళీ జన్మంటూ ఉంటే నేను సంపన్నుడిగా పుట్టాలని మాత్రం కోరుకోను. ఎందుకంటే బతుకంతా అవిశ్రాంతంగా గడిపాను. ఇంకా ఇంకా పైకి రావాలని నన్ను నేను హింసించుకున్నాను. నా బతుకు నేను బతకలేకపోయాను. నేను నా ఫ్యాక్టరీకి అందరికన్నా ముందు వెళ్ళేవాణ్ణి. పనివాళ్ళు ఎనిమిది గంటలకు, క్లర్కులు తొమ్మిది గంటలకు వచ్చేవాళ్ళు. సాయంత్రం ఐదు గంటలకు వెళ్ళిపోయేవాళ్ళు. నేను మాత్రం అర్ధరాత్రి దాకా ఉండి అన్నీ చూసుకొని వెళ్ళేవాణ్ణి. కొన్నిసార్లు నిద్ర కూడా ఉండేది కాదు. సంపన్నుడు కావాలని శ్రమించాను. ప్రపంచంలో అందరికన్నా ధనవంతుణ్ణయ్యాను. కానీ నాకు ఆనందం లేదు. నేను నిశ్చింతగా జీవించలేదు. పనిచేసే వాళ్ళకు సెలవులుండేవి. కానీ నాకు సెలవులు కూడా ఉండేవి కావు. సెలవు రోజుల్లో కూడా ఫ్యాక్టరీకి వచ్చేవాణ్ణి. రేపు ఏం చేయాలి? అన్నదాన్ని గురించి ఆలోచించేవాణ్ణి. ఆ రకంగా నేను జీవితాన్ని కోల్పోయాను. ఆనందాన్ని కోల్పోయాను. కాబట్టి వచ్చే జన్మలో విశ్రాంతిని అనుభవించే సాధారణ వ్యక్తిగా పుట్టాలనుకుంటాను" అన్నాడు.

సంపాదించడం సులభం. పట్టుదల ఉంటే సంపాదించవచ్చు. కానీ ఆ పట్టుదల మనల్ని పట్టుకుంటుంది. ఆ పట్టుదల పట్టునుంచి బయటపడడం కష్టం. మనిషి జీవితంలో తన మార్గం సరైందో కాదో గ్రహించాలి. జీవితమంటే వీలయినంత ఆనందంగా గడపాలి. ఉద్వేగాలు లేకుండా విరామంగా, విశ్రాంతిగా ఉండాలి. అట్లా ఉన్న జీవితమే అర్థవంతమైన జీవితం. సత్యమన్నది అట్లాంటి జీవితానికే తెలుస్తుంది. మనిషి ఆగాలి. బయట చూడాలి. తనలోకి చూడాలి. జీవితానికి అర్థాన్ని గ్రహించాలి.





## 137. కవి

కవులు చిత్రమైన మనుషులు. వాళ్ళు భావనా లోకంలో ఉంటారు. కల్పనల్లో మునిగి తేలుతూ ఉంటారు. వాళ్ళకు వాళ్ళ ఊహలే వాస్తవాలు. వాళ్ళు ప్రపంచంలోనే ఉంటారు. కానీ వాళ్ళ ప్రపంచం వేరు. మనసు సృష్టించిన మధురలోకంలో ఉంటారు. సౌందర్యం వాళ్ళ జీవధాతువు. సౌందర్యం లేనిదే కవి లేదు. కవిత్వం లేదు.

ఒక ఊళ్ళో ఒక కవి ఉండేవాడు. అతనికి ప్రకృతి అంటే ప్రాణం. ఒక కొమ్మ కదిలినా అతడు చలించేవాడు. ఒక పువ్వును చూస్తే పలకరించేవాడు. చల్లగాలి తాకితే అతని గుండె ఝల్లుమనేది. అతనికి ఈ అనంతప్రకృతి ఆనందంతో నిండినట్లు అనిపించేది. అడగడుగునా అందం, ఆనందం నిండిన ఈ ప్రపంచంలో జన్మించడం తన అదృష్టంగా భావించేవాడు.

కవులయినా మనుషులే. రాగద్వేషాలు మామూలు మనుషులకన్నా వాళ్ళకు మరింత గాఢంగా ఉంటాయి. అతను ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళిద్దరూ జంటకవుల్లా అంటుకు తిరిగేవాళ్ళు. ఒకసారి అతని భార్యకు అనారోగ్యం చేసింది. ఆమె లేవలేని స్థితిలో పడకమీద ఉంది. కవి అల్లాడిపోయాడు. వైద్యం చేయించాడు. ఆమె కొద్దిగా కోలుకుంది. కానీ కదలలేని స్థితిలో నీరసించి ఉంది. డాక్టర్ పదిరోజులు విశ్రాంతి అవసరమన్నాడు.

కవి ఊరికి దగ్గరగా సముద్రముంది. అన్నాళ్ళూ భార్యను అంటిపెట్టుకుని బయటి ప్రపంచంతో ఏ మాత్రం సంబంధం లేకుండా ఉన్న కవి ఒకరోజు ఉదయాన్నే సముద్రతీరంకేసి వచ్చాడు. అక్కడి వాతావరణం అతనికి అద్భుతంగా అనిపించింది. స్వర్గమే తనముందు నిల్చినట్లనిపించింది. అప్పుడే అలలపై నుండి సూర్యుడు ఉదయిస్తున్నాడు. లేత కిరణాలు సముద్రమంతా వ్యాపించి తీరంమీద పడుతున్నాయి. చెట్లలో పక్షులు కిలకిలరావాలు వినిపిస్తున్నాయి. తీగలు వొళ్ళు విరుచుకున్న పువ్వుల్తో వయ్యారంగా ఉన్నాయి. పూల పరిమళం గాఢంగా ఉంది. ఆ వాతావరణంతో అతను కదిలిపోయాడు. అతని కళ్ళల్లో ఆనందబాష్పాలు కదిలాయి. కవికి అతని భార్య గుర్తుకువచ్చింది. నీరసంగా పరుపు మీద పడుకుని ఉన్న ఆమె గుర్తుకు వచ్చింది. తను ఎంతో ఆనందంగా ఉన్నాడు. తనభార్య అక్కడ ఎంతో నీరసంగా ఉంది. ఆమె కోసం తను ఏమైనా చెయ్యాలి. ఈ ప్రకృతి నాకు అందించిన అందాన్ని, ఆనందాన్ని తీసుకెళ్ళి నేను ఆమెకు ఎందుకివ్వకూడదు? ఇస్తే ఆమె ఎంతో సంతోషిస్తుంది కదా! ఈ పూలు సీతాకోక చిలుకలు, ఈ చల్లగాలి, ఈ లేత కిరణాలు ఆమెకు ఉల్లాసాన్నిస్తాయి. ఉత్సాహాన్నిస్తాయి. అనుకుని వెళ్ళి ఒకపెట్టెను తీసుకొచ్చాడు. ఆ పెట్టె ఎంతో అందంగా

ఉంది. సముద్రం నుంచి వీచే చల్లగాలిని దోసిలిలో పట్టి పెట్టెలో పెట్టాడు. కొన్ని లేత సూర్య కిరణాల్ని తుంచి పెట్టెలో పెట్టాడు. పూల పరిమళాల్ని గుప్పెట్లో పెట్టెలో నింపాడు. ఉల్లాసంగా వ్యాపించిన ఉదయం నుంచి కొంత తీసి పెట్టెలో పెట్టాడు. మూత పెట్టి తాళం వేశాడు. తనని చైతన్యవంతంగా నిలిపిన ఈ సౌందర్యం తప్పక తన భార్యకు గొప్ప ఓదార్పునిస్తాయని భావించి ఒక కుర్రాడి దగ్గర ఆ పెట్టెనిచ్చి తన భార్యకిమ్మని పంపాడు. తను కాసేపయ్యాక వస్తానని చెప్పి పంపాడు.

ఆ కుర్రాడు వెళ్ళి విషయం చెప్పి ఆ పెట్టెను కవి భార్యకిచ్చి వెళ్ళిపోయాడు. ఆమె ఆ పెట్టెను తెరిచి చూసింది. అందులో ఏమీ లేవు! కవి ఊహలు కవివి. అవి అతని భార్యకెలా అందుతాయి? తన మనసులో ఉన్న వాటితో అతను ఆమెను ఆనందపెట్టాలనుకున్నాడు. ఎవరి జీవితమయినా అంతే.

**జీవితసత్యాల్ని మనం తెలుసుకున్నామనుకోండి. అవి మనం ఇతరులకి అందించాలనుకుంటాం. కానీ అందించలేం.** కారణం మనకు తెలిసిన సత్యం మాటల్లో అందించలేం. మన అనుభవం మనది. సత్యానికి సంబంధించిన అనుభవానికి ఇతరులతో పంచుకోవడానికి వీలుపడదు. కారణం సత్యమన్నది మాటలకు ఒదగదు. కవి అనుభవం, ఆనందం మనోహరమైంది. అతని ఉద్దేశ్యం కూడా మంచిదే. కానీ దాన్ని అతను భార్యకు అందించలేకపోయాడు. సత్యమన్నది వ్యక్తి వ్యక్తికీ భిన్నంగా ఉంటుంది. భిన్నంగా అంటే వైరుధ్యంగా అని కాదు. అది అతని అనుభవం. ఆ అనుభవం ఇతురులతో పంచుకోలేము. **సత్యానుభవ మన్నది మాటలకు లొంగదు.** మాటలకు లొంగని దాన్ని మాటల్లో ఒదిగించాలనుకోవడం వ్యర్థ ప్రయత్నం.

## 138. దేవతా వస్త్రాలు

అన్ని దేశాల్ని జయించిన ఒక చక్రవర్తి సాటిలేని అహంకారంతో విర్రవీగుతూ ఉండేవాడు. తన సంపదని, తన సామ్రాజ్యాన్ని చూసి విర్రవీగేవాడు. ఒకరోజు ఒకవ్యక్తి చక్రవర్తి దగ్గరకు వచ్చిన "మహారాజా! మీకు మహారాజ్యముంది. గొప్ప ఐశ్వర్యముంది. కానీ ఒక్కటే మీకు తక్కువగా ఉంది" అన్నాడు. ఆ మాటలతో చక్రవర్తికి ఆగ్రహం వచ్చింది. "నాకు అన్నీ ఉన్నాయి. నాకేమిటి తక్కువ?" అన్నాడు. ఆ వ్యక్తి "మీకు అన్నీ ఉన్నాయి కానీ వాటికి తోడు మీకు దేవతావస్త్రాలు ఉంటే మీరు పరిపూర్ణులవుతారు" అన్నాడు. చక్రవర్తి ఆశ్చర్యం "దేవతా వస్త్రాలా? అవెక్కడ ఉంటాయి? అన్నాడు. ఆ వ్యక్తి "అవి స్వర్గంలో ఉంటాయి. వాటిని తీసుకురావడానికి కొద్దిగా ఖర్చవుతుంది" అన్నాడు.





చక్రవర్తి "నేను చక్రవర్తిని. నువ్వు ఖర్చు గురించి వెనక్కు చూడకు. ఎంత ఖర్చయినా నేను భరిస్తాను. కానీ నన్ను మోసం చేస్తే మటుకు నీ తల ఎగిరిపోతుంది. జాగ్రత్త" అన్నాడు. ఆ వ్యక్తి "మహారాజా! నేను మిమ్మల్ని మోసం చెయ్యను.కావాలంటే నన్ను ఒక గదిలో బంధించండి. ఆరునెలలు సమయమివ్వండి. నేను స్వర్గయాత్ర చేసి అక్కడనుండి మీకు దేవతావస్త్రాలు తీసుకొస్తాను. అవి ధరిస్తే మీరు పరిపూర్ణులవుతారు. ముల్లోకాలలో మీకు తిరుగు ఉండదు. దీనికి కోటిరూపాయలు ఖర్చవుతాయి. దేవతావస్త్రాలు తీసుకురావాలంటే అంత సమయం పడుతుంది. అంత ఖర్చవుతుంది" అన్నాడు. చక్రవర్తి అతనికి కోటిరూపాయలిచ్చాడు. ఆ వ్యక్తి ఆరు నెలల తరువాత మెరిసిపోతున్న ఒక పెట్టె తీసుకువచ్చి రాజు గారి దగ్గరకు వచ్చాడు. సభలో మంత్రులు, సేనాపతులూ అందరూ ఉన్నారు. ఆ వ్యక్తి పెట్టెను సభకంతా చూపించి "ఈ పెట్టెలో దేవతా వస్త్రాలు ఉన్నాయి. కానీ ఒక షరతు. ఎవరయితే తన తండ్రికే జన్మించాడో అతనికే వస్త్రాలు కనిపిస్తాయి. తక్కిన ఇతరులకు ఇవి కనిపించవు" అని పెట్టె తెరిచాడు. పెట్టె ఖాళీగా ఉంది. అందులో ఏమీ లేదు. కానీ సభలో ఉన్న మంత్రులు, సేనాధిపతులు, సామంతులు అందరూ "అబ్బా! ఎంత గొప్ప వస్త్రాలు? ఎంత ధగధగలాడుతున్నాయి" అన్నారు.చక్రవర్తికి ఏమీ కనిపించలేదు. మనసులో తన తండ్రి ఎంత మోసగాడు. తన తల్లి తనను ఎంత వంచించింది" అనుకుని పైకి "అద్భుతంగా ఉన్నాయి. ఇంత గొప్ప వస్త్రాలు తెచ్చినందుకు ఈ వజ్రాల హారం నీకు బహుమతిగా ఇస్తున్నా" అని ఆ వ్యక్తి మెడలో హారం వేశాడు.

ఆ వ్యక్తి "మహారాజా! మీరు వేసుకున్న బట్టలు విప్పి వీటిని ధరించండి" అన్నాడు. చక్రవర్తి నీళ్ళుమింగుతూ తప్పనిసరై బట్టలు విప్పి లేని దేవతావస్త్రాల్ని ధరించినట్లు నటించాడు. సభంతా హర్షధ్వానాలతో మారుమోగిపోయింది. ఆ వ్యక్తి "మహారాజా! దేవతలు మీరు ఈ వస్త్రాలు ధరించిన వెంటనే నగరమంతా ఊరేగింపుగా వెళ్ళాలని షరతు పెట్టారు" అన్నాడు. చక్రవర్తి మింగలేక, కక్కలేక సరేనన్నాడు. రథం సిద్ధమైంది. నగర వీథుల్లో సాగింది. అందరూ వినేట్టు ఆ వ్యక్తి "చక్రవర్తి దేవతావస్త్రాలు ధరించారు. ఎవరయితే తమ తండ్రికే జన్మించారో వారికి మాత్రమే ఈ వస్త్రాలు కనిపిస్తాయి" అని చాటింపు వేశాడు.

వచ్చిన జనమంతా "ఎంత అద్భుతమయిన వస్త్రాలు. మా జన్మ ధన్యమైంది" అన్నారు. చక్రవర్తికి, మంత్రులకు, సేనాపతులకు, సాధారణ ప్రజానీకానికి ఎవరికీ దేవతావస్త్రాలు కనిపించలేదు. కానీ ఆ వ్యక్తి పెట్టిన షరతువల్ల అందరూ భయపడి అబద్ధమే చెపుతున్నారు. అంతలో ఒక వ్యక్తి తన భుజాలమీద తన కొడుకుని

కూచోబెట్టుకుని చక్రవర్తి దేవతావస్త్రాల్ని చూడడానికి వచ్చాడు. తండ్రి భుజాలపైన ఉన్న కుర్రాడు "నాన్నా! రాజుకు బట్టలు లేవు" అన్నాడు. తండ్రి కొడుకును ఒక దెబ్బకొట్టి గుంపులో కలిసిపోయాడు. భయపడిన వాళ్ళకు, అభిప్రాయాలకు అతుక్కుపోయినవాళ్ళకు సత్యం కనిపించదు. సత్యానికి వయసుతో సంబంధం లేదు. స్వచ్ఛంగా ఉన్నవాళ్ళకి సత్యం తెలుస్తుంది. సత్యం గురించి తెలిసిన దాన్ని గురించి ధైర్యంగా చెప్పగలిగే సాహసం అందరూ చేయలేరు. ఎవరూ చెప్పలేని నిజాన్ని కళ్ళముందు ఉన్నా, కనబడుతున్నా నిజాన్ని ఆ పసివాడు చెప్పాడు.

## 139. నమ్మకం

ఎవరినో మనం గొప్పవాడని ఆరాధిస్తాం. అంతకంటే గొప్పవాడెవడో మన ముందుకొస్తే అతన్ని వదిలి ఇతన్ని ఆరాధిస్తాం. అసలు ఆరాధనలోనే లోపముంది. మనిషికి అవసరమయింది, అర్థం చేసుకోవడం. ఆరాధనలో, ఆలోచన ఉండదు. అది సంఘర్షణకు దారితీసే వీలుంది.

నమ్మకం, విశ్వాసం అన్నవి మనిషి మనసుని ఎదగనియ్యవు. విభిన్న అభిప్రాయాలని అవి మనసులోకి రానియ్యవు. అర్థం చేసుకోవడానికి అనుమతించవు. బంధుత్వాల వల్ల, బంధనాలవల్ల, విశ్వాసాలవల్ల మనసు ఎదగదు. మనిషిలో వివేకమన్నది వికసించదు.

ఒక రామభక్తుడు ఉండేవాడు. నిత్యం పూజా పునస్కారాలతో, జపతపాలతో కాలం గడిపేవాడు. చుట్టుపట్ల జనం అతన్ని గొప్ప భక్తుడు కింద జమకట్టారు. నిత్యం రామాలయాన్ని సందర్శించేవాడు. భజనలు చేసేవాడు. పురాణ కాలక్షేపాల్లో విరివిగా పాల్గొనేవాడు.

అందరూ అతన్ని గౌరవించేవాళ్ళు. అతనికి ఒక మిత్రుడు ఉండేవాడు. అతను బాగా చదువుకున్నవాడు మాత్రమే కాదు. వాటి సారాంశం తెలిసినవాడు. విచక్షణ ఉన్నవాడు ఈ రామభక్తుడికి అతనికి ఎప్పుడూ వాదోపవాదాలు జరిగేవి. అన్నింటికీ పరిష్కారం రామభజనే. రామనామ సంస్మరణే అని ఇతను అనేవాడు. పెద్దలు తారకమంత్రమని ఊరికే అన్నారా? అనేవాడు. మిత్రుడు "ఉట్టినే రామనామ స్మరణ చేస్తే ఉట్టికీ, స్వర్గానికీ ఎక్కరు, రాముడిది ఆదర్శ జీవితం. ఆ జీవితాన్ని మనం అర్థం చేసుకోవాలి. అంతవరకే. మన జీవితం మనది. మన అనుభవాలు మనవి. మన సమస్యల్ని మనం ఎదుర్కోవాలి. వాటిపట్ల వివేకంతో మనం ప్రవర్తించాలి. గుడ్డిగా ఎవర్నో ఆదర్శంగా తీసుకోకూడదు" అని చెప్పేవాడు.





భక్తుడు ఒప్పుకునేవాడు కాదు. వాళ్ళమధ్య స్నేహానికి వాళ్ళ అభిప్రాయాలు అడ్డురాలేదు.

ఒకరోజు మిత్రుడు రామభక్తుణ్ణి చూడ్డానికి వచ్చాడు. కబుర్లు చెప్పుకున్నాక భక్తుడు "మిత్రమా ఇప్పుడు నేను మారిపోయాను. వెనకటిలా గుళ్ళూ గోపురాలు తిరగడం, రామనామ జపం అన్నీ వదిలేశాను. కారణం నాకు జ్ఞానోదయమైంది.

జ్ఞానోదయం కలిగిన తరువాత వెనకటిలా పూజలూ, మంత్రాలూ అన్నీ చెయ్యడమన్నది అనవసరమనిపించింది. నాకు పరమాత్మ దర్శనమయింది" అన్నాడు.

కొన్నాళ్ళు గడిచాయి. రామభక్తుడికి గుండెపోటు వచ్చినట్లు మిత్రుడికి తెలిసింది. హడావుడిగా స్నేహితుణ్ణి చూడడానికి వాళ్లింటికి వెళ్ళాడు. ఇంట్లోకి అడుగుపెడుతూ పడకమీద ఉన రామభక్తుణ్ణి చూశాడు. అతడు వణుకుతూ "రామ, రామ, రామ, రామ" అంటూ రామనామ జపం చేస్తున్నాడు. మిత్రుడు దగ్గరికి వెళ్ళి 'నువ్వు' ఏం చేస్తున్నావో గమనించావా? ఇక ఇట్లాంటి నామజపాలు, పూజలు చెయ్యనని అన్నావు" అన్నాడు.

భక్తుడు "మిత్రమా! నిజంగా నేను రామనామ స్మరణ చెయ్యాలనుకోలేదు. కానీ నాకు గుండెపోటు వచ్చిన వెంటనే నాకు తెలియకుండా మనసునుంచి రామనామం మొదలై పెదాలపైకి వచ్చింది" అన్నాడు. మిత్రుడు "అందుకే అప్పుడే నేను అన్నాను. నువ్వు దేన్నయినా అర్థం చేసుకునే దాకా అది నిన్ను వదిలిపెట్టదు. నువ్వు రామనామం జపించేవాడివి. అర్థం చేసుకోకుండానే మాటలు వల్లించేవాడివి. తరువాత జ్ఞానోదయమన్న భ్రాంతి ముందుకొచ్చింది. రామనామం మనసు లోపలి పొరలోకి వెళ్ళింది. గుండెనొప్పి వచ్చింది దాంతోబాటు రామనామం కూడా బయటకి వచ్చింది. మన మనసులో మన నమ్మకాలు గూడుకట్టుకుని ఉంటాయి. మన సంతోషంలో, మన దుఃఖంలో అవే ముందుకొస్తాయి" అన్నాడు.

## 140. ధర్మ సందేహం

మనకు ఏదో సందర్భంలో 'ఏది సత్యం? ఏదసత్యం?' అన్న ధర్మ సందేహం కలుగుతుంది. ప్రతి మనిషికీ అట్లాంటి సమస్య వస్తుంది. ఆ సమస్య సమస్యగానే మిగిలిపోతుంది. విస్మృతిలో కలిసిపోతుంది. అట్లాంటి అనుభవం వల్లే జీవితం ఒక స్వప్నం. ఒక భ్రాంతి, ఒక మాయ అని తెలిసివస్తుంది. సాధారణ జనం దాన్ని మరిచిపోతారు. కానీ సత్యాన్వేషకులు ఆ సందేహం దగ్గర ఆగుతారు. దాన్ని పట్టుకుంటారు.

చైనాలో తావో మతం సుప్రసిద్ధం. తావో అంటే మార్గం. అది జీవన మార్గం. సహజంగా అన్నింటికీ ఆమోదం తెలిపే ప్రకృతి మార్గం. లావోత్స దాని ప్రవక్త. చువాంగ్‌ట్జు ఆయన శిష్యుడు. తావో మార్గాన్ని ప్రచారం చేసేవాడు. చువాంగ్‌ట్జు ఎప్పుడూ నవ్వుతూ ఉండేవాడు. ఆయన దిగులుగా ఉండేవాడు కాడు. ఆయనకు విషాదమంటే ఏమిటో తెలియదు. ఆయన్ని బాధపడుతుండగా ఎవరూ ఎప్పుడూ చూడలేదు.

ఒకరోజు ఆయన తన ఇంటిముందు దిగులుగా, నిర్లిప్తంగా కూచుని ఉండడం కనిపించింది. ఆయన్ని ఇష్టపడేవాళ్ళు, ఆయన స్నేహితులు ఆయన్ని చూసి ఆశ్చర్య పోయారు. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండే మనిషి ఎందుకిట్లా నీరసంగా, దిగులుగా ఉన్నాడో వాళ్ళకు అర్థం కాలేదు. అంతుబట్టలేదు. పైగా ఆయన ఎప్పుడూ అట్లా లేడు. గతంలో ఎప్పుడయినా ఆయన ఆ రకంగా కనిపించి ఉంటే సరేలే అని వాళ్ళు సర్దుకుపోయేవాళ్ళు. ఎప్పుడూ సంతోషంగా, ఆనందంగా, ఉల్లాసంగా ఉండే మనిషి ఒక్కసారిగా దిగులుగా కనిపిస్తే వాళ్ళకు దిక్కుతోచలేదు. అందరూ ఆయన్ని చుట్టూ చేరారు. ఆందోళనతో ఆయన్ని చూశారు. మిత్రుల్లో ఒకతను "ఎందుకిలా ఉన్నావు? ఎప్పుడూ ఇలా లేవు. దిగులన్నది నిన్ను తాకడం మేము చూడనే లేదు. ఎప్పుడూ గలగలలాడుతూ, నవ్వుతూ ...నవ్విస్తూ ఉండేవాడివి. హఠాత్తుగా ఎందుకింత మౌనంగా, ఉదాసీనంగా, గంభీరంగా మారిపోయావు? ఏం జరిగింది? మాకు చెప్పు. చెప్పనిదే మాకు తెలిసే అవకాశం లేదుకదా!" అన్నాడు. ఏం చెబుతాడో అని అందరూ ఆసక్తిగా చూశారు.

చువాంగ్‌ట్జు అందర్నీ చూసి "ఆందోళన పడకండి. అందరూ కూచోండి. జరిగింది వివరిస్తాను. అంతా చెబుతాను. నాకో పెద్ద సమస్య వచ్చి పడింది. అది పెద్ద ధర్మ సందేహం. నేనెంతగా జుత్తు పీక్కున్నా నాకు దానికి సమాధానం దొరకలేదు. అందుకే దిగులుగా ఉన్నాను. ఒకవేళ మీకెవరికయినా దానికి సమాధానం దొరికి చెప్పారంటే మీకు రుణపడి ఉంటాను" అన్నాడు. మిత్రులు "సరే! ప్రయత్నిస్తాం. మొదట సమస్య ఏమిటో చెప్పు" అన్నారు. "రాత్రి నాకొక కలవచ్చింది. ఆ కలలో నేనొక సీతాకోకచిలుకపై తోటలో తిరుగుతూ ఉన్నాను. ఆ తోటలో అందమయిన పూల చెట్లున్నాయి. నేను ఒక్కో పువ్వుమీదా వాలుతూ ఉల్లాసంగా తిరుగుతూ వెళుతున్నాను" అన్నాడు.

మిత్రులు "ఇక్కడ సమస్య ఏముంది? నీకు కల వచ్చింది. కలలో నువ్వు సీతాకోక చిలుకవయ్యావు. పూలమీద తిరుగుతున్నావు. కల రావడం ఎవరికయినా





సహజం. ఇక్కడ అంతగా ఆందోళన పడవలసిన విషయమేముంది? అన్నారు. చువాంగ్‌ట్జు "నాకు మెలకువ వచ్చిందో అప్పుడు సమస్య మొదలయింది. నాకు మెలకువ వస్తూనే నాకో సందేహం కలిగింది. నేను నిద్రపోతున్నప్పుడు కలలో నేను సీతాకోకచిలుక నయ్యాను. అంటే అప్పుడు నేను లేను. ఇప్పుడు మేలుకొన్నాను. ఇప్పుడు సీతాకోకచిలుక లేదు. నేనున్నాను. నేను సీతాకోకచిలుకగా కలలో మారాను. ఇప్పుడు మనిషిని. దీనివల్ల సందేహం కలిగింది. నేను సీతాకోకచిలుకను కలగన్నప్పుడు మనిషినా? లేదా ఇప్పుడు మనిషినా? కలగన్న సీతాకోకచిలుకనా? అంతుబట్టక దిగులుగా ఉన్నాను" అన్నాడు. చువాంగ్‌ట్జు చెప్పింది నిజం. కళ్ళు మూసుకుంటే బయట ఉన్నది అదృశ్యమవుతుంది. కళ్ళు తెరిస్తే లోపల ఉన్నది కనిపించదు. ఏది స్వప్నమో, ఏది వాస్తవమో చెబుతాం? స్వప్నం వాస్తవంలో లీనమవుతుంది. వాస్తవం స్వప్నంలో కరిగిపోతుంది. ఏది యథార్థమంటాం? ఏది సత్యమంటాం? దీన్ని ఎవరు నిర్ణయిస్తారు? రహస్యానికి తలవంచడం తప్ప చెయ్యగలిగింది లేదు.

## 141. మరణం

మరణం అనివార్యం. కానీ మనుషులు దాన్ని జీర్ణించుకోలేరు. మరణమంటే భయపడతారు. మరణమన్నది జీవితంలో భాగంగా స్వీకరించలేరు. అర్థం చేసుకోరు. మనం జన్మించింది మరణించడానికే, మరణమన్నది భూతం కాదు. జీవితంలో జరిగే ఒక సహజ ప్రక్రియ. అనుబంధాలకు అంటుకున్నవాడు మరణాన్ని చూసి కంపిస్తాడు. అర్థం చేసుకున్నవాడు దాని అనివార్యతను ఆమోదిస్తాడు. సూర్యుడు ఉదయిస్తాడు. అస్తమిస్తాడు. పగలు వెళుతుంది. రాత్రి వస్తుంది. జీవితమయినా అంతే.. పుడతాం. గిడతాం. కానీ దాన్ని మనుషులు జీర్ణించుకోలేరు. అనివార్యమని ఆమోదించడంలో ఆనందముంది. ఆహ్లాదముంది. జీవితమప్పుడే అర్థవంతమవుతుంది.

ఒక సందర్భంలో మహావిష్ణువు శివుణ్ణి కలవాలని వెళ్ళాడు. తన వాహనమయిన గరుత్మంతుడిపై ఎక్కి వెళ్లాడు. కైలాస పర్వతం ముందు గరుత్మంతుడు వాలాడు. మహావిష్ణువు వాహనం దిగి శివుడి నిలయానికి వెళ్ళాడు. గరుత్మంతుడు వెలుపలే ఉన్నాడు. గరుత్మంతుడు ఇటు అటూ చూస్తూ ఉంటే ఏదో శబ్దం వినిపించింది. పిట్ట గోడమీద ఒక పావురం కనిపించింది. అది భయంతో వణికిపోతోంది. నిస్సహాయంగా నీరుగారి పోతున్నట్లనిపించింది. గరుత్మంతుడికి దాన్ని చూసి జాలేసింది. "ఏమిటి? ఏమయింది? ఎందుకంతలా వణికిపోతున్నావు? ఎందుకంత భయపడిపోతున్నావు? నేనున్నాను. నువ్వు భయపడాల్సిన పనిలేదు" అన్నాడు.

పావురానికి భయం తగ్గలేదు. వణుకు తగ్గలేదు. అది గరుత్మంతుణ్ణి చూసి, "పక్షిరాజా! నువ్వు గొప్ప వాడివి. మహావిష్ణువు అండదండలు నీకున్నాయి. నీకు ఎప్పుడూ ఎట్లాంటి ప్రమాదము, భయము ఉండదు. నేను సామాన్య పక్షిని. నన్నెవరు రక్షిస్తారు?" అంది.

గరుత్మంతుడు "ఎందుకు అంతగా భయపడుతున్నావు? నేను నీకు అభయమిస్తున్నాను. నిన్ను రక్షిస్తాను. ఇంతకూ నీకు వచ్చిన ప్రమాదమేమిటి?" అన్నాడు.

పావురం "స్వామీ! ఇంతకు ముందే మీరు రావడానికి ఐదు నిమిషాల ముందే యమధర్మరాజు శివుడు దర్శనానికి లోపలికి వెళ్ళాడు. వెళుతూ నన్ను చూసి నవ్వాడు. ఈ రోజు మృత్యువు నిన్ను సమీపించబోతోంది" అన్నాడు. అప్పటినించీ నా చావు తలుచుకుని నేను వణికిపోతున్నాను. యముడే చెబితే ఇక నన్నెవరు రక్షిస్తారు? అంది.

గరుత్మంతుడు· నువ్వు ఆరోగ్యంగా ఉన్నావు. నీకు అప్పుడే మృత్యువేమిటి? నేను నిన్ను రక్షిస్తాను. ఇక్కడికి వేలమైళ్ళ దూరంలో ఉన్న 'లోకాలోక' పర్వతం పైన నిన్ను వదుల్తాను. అక్కడ నీకు ప్రాణభయముండదు అని, పావురాన్ని తన రెక్కలమీద ఎక్కించుకుని వేలమైళ్ళ వేగంతో, మనోవేగాలతో వెళ్ళి కొన్ని క్షణాల్లో దాన్ని అక్కడ వదలి తిరిగి కైలాసపర్వతం చేరాడు. కాసేపటికి శివుణ్ణి దర్శించిన యముడు బయటకి వచ్చాడు. పిట్టగోడపై పావురం లేదు. యముడు "ఇక్కడొక పావురం ఉండాలి. ఏమైంది?" అన్నాడు.

"అది ప్రాణభయంతో ఉంటే తీసుకెళ్ళి లోకాలోకపర్వతం పైన వదిలాను" అన్నాడు గరుత్మంతుడు. యమధర్మరాజు "మంచి పనిచేశావు. నేను పావురాన్ని ఇక్కడ చూసి ఆశ్చర్యపోయాను. వేలమైళ్ళ దూరంలో ఉన్న లోకాలోకపర్వతంలో మృత్యువు దీనికోసం ఎదురు చూస్తుంటే ఇక్కడ ఏం చేస్తోందబ్బా! అని ఆశ్చర్యపోయాను" అన్నాడు.

**మరణాన్ని ఎవ్వరూ తప్పించుకోలేరు.**

## 142. ఈ క్షణం జీవించడం

జీవితం గురించి అతిగా, అనవసరంగా ఆలోచించడం వ్యర్థం. అది ఉంది. దాన్ని గురించి ఆలోచించడమెందుకు? అసలు ఆలోచన అన్నది విషంతో సమానమయింది. జీవితమున్నది జీవించడానికి. ఆలోచించడానికి కాదు. అన్నం తినడానికి ఆలోచిస్తామా? గాలి పీల్చడానికి ఆలోచిస్తామా? అలాగే జీవితం దానంతట అది సాగనీ. అది సాగుతుంది. దాన్ని గురించి ఆలోచించడమెందుకు? ఆరాట మెందుకు? ఆలోచన అన్నది గతానికో, భవిష్యత్తుకు సంబంధించి ఉంటుంది. వర్తమానానికి కాదు.





ఈ క్షణంలో మనిషి బతకాలి, రేపు కాదు. నిన్న జీవించలేం. రేపు జీవించలేం. ఇప్పుడు ఇక్కడ బతకాలి.

ఒక గ్రామంలో ఒక పేదరైతు ఉండేవాడు. అతను చాలా అమాయకుడు. అతనికి కొద్దిగా పొలం ఉండేది. పొలం పని చేసుకుంటూ జీవితం వెళ్ళదీసేవాడు. పొలం పని చేసేటప్పుడు ఎదురుగా ఉన్న కొండల్ని చూసేవాడు. అవి ఎంతో గంభీరంగా, పచ్చగా కనిపించేవి. అవి అతని పొలానికి దగ్గర్లోనే ఉండేవి. ఆ రైతుకు ఆ పర్వతాలపైకి వెళ్ళాలని ఎప్పటినుంచో కోరిక. ఇతరులని వాకబు చేస్తే తెల్లవారుజామునే లాంతరు తీసుకుని బయల్దేరితే సూర్యోదయం అయ్యేలోపున పర్వతంపైకి చేరుకోవచ్చు. అదేమంత కష్టం కాదు. మరీ ఉదయం బయల్దేరితే కొండపైకి వెళ్ళేసరికి ఎండ బాగా వేడెక్కుతుంది. అప్పుడు ఇబ్బంది అవుతుంది" అని చెప్పారు.

ఆ రైతు ఒక రోజు పర్వతం ఎక్కాలని నిర్ణయించుకున్నాడు. ఒక లాంతరు సంపాదించాడు. పర్వత సౌందర్యాన్ని ఊహించుకుంటూ, ప్రయాణాన్ని తలచుకుంటూ పడుకున్నాడు. ఉన్నట్లుండి మెలకువ వచ్చింది. అప్పటికి రాత్రి ఒంటిగంట అయింది. నిజానికి రాత్రి నాలుగు గంటలకు బయలుదేరితే చాలు. కానీ రైతుకు నిద్రరాలేదు. ఒంటిగంట అయితే ఏమి?మెల్లమెల్లగా నడుద్దాం" అనుకుని లాంతరు వెలిగించి కొండ దగ్గరకు వెళ్ళాడు.

అంతలో అతనికి ఒక సందేహం పట్టుకుంది. కొండను చూశాడు. వేల అడుగుల ఎత్తు ఉంది. గాఢాంధకారంలో ఉంది. లాంతరు చూశాడు. దాని కాంతి కేవలం పది అడుగులు మాత్రమే పడుతోంది. తక్కిన స్థలమంతా చీకటిగానే ఉంది. దాంతో దిగులు పడిపోయాడు. పది అడుగులు దూరం పడే కాంతితో వేల అడుగుల పర్వతాన్ని ఎలా ఎక్కాలి? అని దిగులు పడిపోయాడు. పర్వతం అంచులో దిగాలుగా కూచుని ఆలోచనలో మునిగిపోయాడు.

ఇంతలో ఒక వృద్ధుడు ఒక లాంతరు పట్టుకుని పర్వతం ఎక్కుతూ కనిపించాడు. అతన్ని చూసి రైతు ఆశ్చర్యపోయాడు. పరిగెత్తుకుంటూ వృద్ధుని దగ్గరకు వెళ్ళి ఇంత చిన్న లాంతరు పట్టుకుని అంత పెద్ద పర్వతాన్ని నువ్వు ఎలా ఎక్కుతావు. ఈ లాంతరు కాంతి పది అడుగుల మేర మాత్రమే పడుతుంది కదా!" అని సందేహం వ్యక్తపరిచాడు.

వృద్ధుడు ఆ రైతు అమాయకత్వానికి విస్తుపోయాడు. అతన్ని తేరిపారజూసి ·నువ్వు అమాయకుడిలా ఉన్నావు. లాంతరు కాంతి పది అడుగుల మేర మాత్రమే పడుతుంది. నాకూ తెలుసు. పర్వతం గాఢాంధకారంలో మునిగి ఉంది. ఆ సంగతి కూడా నాకు తెలుసు. కానీ నువ్వు తెలుసుకోవాల్సిన సంగతి ఒకటుంది. నేను లాంతరు

పట్టుకుని నడుస్తున్నాను. నడిచినంత మేరా కాంతి పడుతూనే ఉంటుంది. దారి కనిపిస్తూనే ఉంటుంది. కదలకుండా ఒకచోట ఆగిపోతే అంతా చీకటిగానే ఉంటుంది. కాంతితోబాటు నడిస్తే కాంతి కూడా మనతోబాటు నడుస్తుంది. దారి మనకు కనిపిస్తుంది" అన్నాడు. రైతుకు రహస్యం బోధపడింది.

## 143. చిత్రం

మనకు వినోదయం, జ్ఞానోదయం కలిగినప్పుడు మనం పరవశిస్తాం. ఆనందానికి, ఆశ్చర్యానికి లోనవుతాం. వేల సంవత్సరాల మానవ చరిత్రలో జ్ఞానోదయం పొందినవాళ్ళు ఎందరో ఉన్నారు. వాళ్లల్లో అందరికీ తెలిసివాళ్ళు కొందరే ఉంటారు. తమకు జ్ఞానోదయం కలిగినా అజ్ఞాతంగా ఉండిపోయిన వాళ్ళు ఎందరో ఉంటారు. సాధారణంగా వివేకవంతుల జ్ఞానమన్నది పరిమళాల్ని వెదజుల్లుతుంది.

వేల సంవత్సరాలలో జ్ఞానోదయం పొందని వాళ్ళు వివిధ కాలాలలో ఉంటారు. ఐదువేల సంవత్సరాల క్రిందటే కృష్ణుడు, జొరాష్టర్, మోసెస్ వంటి వాళ్ళు, రెండు వేల ఐదు వందల సంవత్సరాల నాడు జీసస్ ఇలా ఎందరో ఎన్నెన్ని కాలాల్లోనో జ్ఞానం పొందారు. కానీ కాలాతీతంగా వాళ్ళందరకూ సమాన ధర్మాలుంటాయి. అట్లాగే మనం జ్ఞానోదయం కలిగినా, మనకు సత్య సందర్శన అయినా మనకొక అనుభవం కలుగుతుంది. గతంలో వచ్చిన ఆ వ్యక్తులకు ఇప్పటి మనకు మధ్య కాలం అదృశ్యమవుతుంది. ఆ విషయం తెలుసుకుని మనం ఆశ్చర్యపోతాం. మనం వాళ్ళకి సమకాలికులమవుతాం. వాళ్లు మన సమకాలీకులవుతారు.

ఒక కేంద్ర బిందువుంటుంది. దాని చుట్టూ వలయాలుంటాయి. ఆ వలయాలు చిన్నవవుతూ వచ్చి కేంద్రంలో లీనమవుతాయి. సత్యమే కేంద్రం. జ్ఞానమే కేంద్రం. నా దగ్గరికి ఒక వ్యక్తి వచ్చి "జీసస్ గురించి మీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు. నేను "నా గురించి అభిప్రాయం చెప్పమంటే నేను ఎలా చెబుతాను?" అన్నాను. ఆ వ్యక్తి "అడిగింది మీ గురించి కాదు. జీసస్ గురించి" అన్నాడు. నేను మళ్ళీ "నా గురించి నేను అభిప్రాయం చెప్పడం బాగుండదు" అన్నాను. అతను వింతగా చూస్తూ వెళ్ళిపోయాడు. మనకు ఎవరి గురించి స్పష్టంగా తెలుసో అప్పుడు మనకూ వాళ్ళకూ మధ్య భేదముండదు. వ్యవధానముండదు.

రామకృష్ణ పరమహంస భారతదేశంలో జన్మించిన మహాపురుషుల్లో ఒకడు. నిత్య నిరంతర ప్రేమలో, తన్మయంలో పరవశంలో మునిగిన మహాపురుషుడు. ఆయన్ని సందర్శించడానికి ఎందరో వస్తూ ఉండేవాళ్ళు. ఆయనంటే గౌరవమున్న ఒక చిత్రకారుడు



ఎంతో శ్రద్ధతో ఆయన చిత్రం ఒకటి గీసుకుని ఆయన దగ్గరకు వచ్చాడు. ఆ చిత్రకారుడు తను వేసిన రామకృష్ణ పరమహంస చిత్రాన్ని చూపించి ఎలా ఉందని రామకృష్ణ పరమహంస అభిప్రాయమడిగాడు.

రామకృష్ణ పరమహంస ఆ చిత్రాన్ని చూశాడు. కాసేపు చూసి తనని తాను మరచిపోయి ఆ చిత్రంలో లీనమయిపోయాడు. ఆ చిత్రంలోని రామకృష్ణ పరమహంస పాదాలకు నమస్కరించాడు. కళ్ళు అద్దుకున్నాడు. అందతా చూస్తున్న జనం, చిత్రకారుడు ఆశ్చర్యపోయారు. రామకృష్ణులు ఆ చిత్రం ఎవరిదో అని పొరపాటుపడి ఉండవచ్చు అనుకున్నారు. ఆ చిత్రకారుడు "స్వామీ! ఆ చిత్రం మీదే!" అన్నాడు.

ఆ మాటకు రామకృష్ణ పరమహంస ఈ లోకంలోకి వచ్చాడు. చుట్టూ చూశాడు. చిత్రకారుడు, జనం వింతగా పరమహంసనే చూస్తున్నారు. ఏమిటీయన చిత్రంగా ప్రవర్తిస్తున్నాడే అనుకున్నారు.

అప్పుడు రామకృష్ణ పరమహంస "నిజమా! ఆ విషయమే మరచిపోయాను. ఆ విషయానికి వస్తే సంబంధించిన స్పృహే నాకు లేదు. ఎందుకంటే ఆ చిత్రంలో నన్ను నేను చూడలేదు. ఆ చిత్రం ఎంతో గాఢంగా, గంభీరంగా ఉంది. అందులో ఎంతో లోతు ఉంది. అజ్ఞాతమయిన సమాధి స్థితి ఉంది. సమాధి స్థితిని చిత్రకారుడు అపూర్వంగా ఆవిష్కరించాడు. అక్కడ చిత్రకారుడైన నువ్వు, రామకృష్ణుడి నేను లేము. అక్కడ ఒక సమాధి స్థితి మాత్రమే ఉంది. అట్లాంటి సమాధి స్థితిలో నువ్వూ, నేనూ అన్న తేడా ఉండదు. నేను ఆ సమాధి స్థితికి అభివాదం చేశాను. అక్కడ ఉన్నది నా చిత్రమని నాకు తెలీదు. అందుకనే నేను ఆ చిత్రానికి శిరసువంచి నమస్కరించాను. సమయానికి ఆ చిత్రం నాదని గుర్తు చేశావు. లేకుంటే జనం నవ్వేవాళ్ళు" అన్నాడు. నిజానికి అప్పటికే ఆ చర్యకు జనం నవ్వారు కూడా! కాబట్టి జ్ఞానస్పృహకి కాలతీత శక్తి ఉంటుంది. భౌతిక పరిధుల్ని అధిగమించడం ఉంటుంది. సమస్త పరిసరాల్ని విస్మరించడం ఉంటుంది. రామకృష్ణ పరమహంస అనుభవమదే.

---